# లోవెలుగులు

( "కృష్ణాపత్రిక" నుంచి పునర్ముద్రితం )

ముట్నూరి కృష్ణరావు

కృష్ణాపత్రికా ప్రచురణలు
మార్కెట్ స్క్వేరు - హైదరాబాద్-1

# సమర్పణ

శ్రీముట్నూరి కృష్ణరావుగారు రచించిన ఈ అమూల్య వ్యాససంపుటిని ఆంధ్ర ప్రజలకు గ్రంథరూపంలో అందజెయ్యగలగడం మా భాగ్య విశేషం. 1940-45 సంవత్సరముల మధ్య వారు తమ "కృష్ణాపత్రిక"లో "వెలుగు జిలుగులు", "లోవెలుగులు" అనే శీర్షికలకింద రచించిన వ్యాసములన్నీ యిందు చేర్చబడినవి. అయితే గ్రంథ ప్రచురణోద్దేశంతో వారీ వ్యాసరచన సాగించలేదు. పత్రికాముఖతః వీటిని వెలువరించినందువల్ల ఏ వ్యాసానికి ఆ వ్యాసమే ఒక స్వతంత్ర ప్రకరణంగా వుండాలని వారు భావించారు. ఒక్కొక్క వ్యాసంలో తాము ఉల్లేఖించదలచిన విషయాన్ని పాఠకులకు వారు సుబోధకం చేసేయత్నంలో మూలసిద్ధాంతానికి సంబంధించిన కొన్ని అంశాలను పునఃపునః ఉద్ఘాటించడం అవసరమౌతూ వచ్చింది. ఆ వ్యాసాలు యథాతథంగా ప్రచురించబడిన ఈ గ్రంథంలో అక్కడక్కడ కొన్ని అంశాలు పునరుక్తములైనట్టు తోచవచ్చు. కాని చదివిన కొద్దీ, చదవాలనిపించే ఈ అపూర్వగ్రంథంలో నిజానికి పునరుక్తి దోషమనేది లేదని పాఠకమహాశయులకు మా మనవి. శ్రీ కృష్ణరావు గారి రచనలను, కొన్ని గ్రంథముల రూపంలో వెలువరించాలనే మా పూనికను ఆంధ్రప్రజలు ప్రోత్సహించగలరని ఆశిస్తున్నాము.

— ప్రకాశకులు

# వెలుగుదారులు....

అత్యుత్ప్రేరణ

సాధనమర్మం

వ్యక్తిగత విశిష్టత

వ్యక్తి ప్రాముఖ్యం

నానాత్వంలోని మాధుర్యం

జ్ఞానం – ప్రత్యక్షం, పరోక్షం

అవాఙ్మానసం

పార్థక్యం, ఐక్యం

సాంతంలో అనంతం

సంశయ విచ్ఛిత్తి

ఊర్ధ్వగతి

ఆత్మప్రతిబింబం

క్షరాక్షరములు

అనుష్ఠానం

ఆత్మపరీక్ష

తత్త్వజ్ఞానం

# దివ్యస్మృతి

ఆత్మవిస్మృతి చెంది అస్వతంత్రమై పడియున్న భారతజాతి, తిరిగి ఆత్మావబోధము నొంది స్వతంత్రతకై విజృంభించిన ఘట్టం, ఇటీవలి భారతేతిహాసంలో అత్యంత రమణీయమైనది. ఎందరెందరో మహాపురుషులు, కారణ జన్ములై అవతరించి, వివిధ రంగాలలో, పైన పేర్కొన్న మహోద్యమంలో నిమగ్నులై దీపించిన ఆ ఘట్టాన్ని తలచుకొన్నకొలదీ నిజంగా ఒడలు పులకరిస్తుంది. కేవలం ఆ మహాపురుష శ్రేణిలోనివారే శ్రీ ముట్నూరి కృష్ణరావుగారు.

కావాలనుకుంటే అఖిలభారత నాయకస్థానాన్ని అవలీలగా అందుకొని యుండెడివారే కృష్ణరావుగారు. అందుకు గావలసిన సాధన సంపత్తి అంతా ఆయనకుంది. వందేమాతరం మహోద్యమకాలంలో ప్రముఖ నాయకుడైన బిపినచంద్రపాల్ గారికి అత్యంత ప్రియ శిష్యులు. ఆంగ్లభాషలో అద్భుతమైన వాగ్ధాటి కలిగినవారు. శ్రోతల మత్తేజితుల నొనర్చి ఉర్రూత లూగించగల ప్రజ్ఞాధురీణులు. గాంధి మహాత్ముని అసహాయోద్యమ కాలంలో, "అతని కంటిలో ఆత్మతేజం నాకు గోచరిస్తున్నది"—అనేటట్లుగా మహాత్ముని దృష్టి నాకర్షించిన తేజస్వి.—"అతడు సామాన్యంగా బయటపడే వ్యక్తి కాదు, నీవే అతన్ని చేదుకోవాలి"—అని మహాత్ముడు తన ఆంతరంగిక కార్యదర్శితో వీరిని గూర్చి అన్నట్లు చెపుతారు. కృష్ణరావుగారు ఏమాత్రం అవకాశమిచ్చినా మహాత్ము డాయనను అలా చేదుకొనియుండెడివాడే. కార్యక్షేత్రంలో ఆయన ప్రముఖపాత్ర వహిస్తే బాగుండునని, మిత్రులు డాక్టరు పట్టాభి ప్రభృతులెంతో ఆశించారు. కాని, కృష్ణరావుగారి తత్త్వమే వేరైపోయింది. కృష్ణాపత్రికలో లీనమై, తాను చేయ దలచుకొన్నదేదో కృష్ణాపత్రిక ద్వారానే చెయ్యాలనుకున్నారు. ఇందువలన ఆంధ్రులకు మాత్రమే కృష్ణరావుగారు దక్కారు. ఆంధ్రభాష అదృష్టం పండింది.

ఒక విశిష్టమైన భాషాశైలిని వారు కృష్ణాపత్రికలో రూపొందించారు. వారి వయస్సునుబట్టి అదికూడా పరిణతి చెందుతూ వచ్చింది. సంస్కృతపదభూయిష్ఠమైన గ్రాంథికం మొదలుకొని, తెలుగు జాతీయత ఉట్టిపడే వ్యావహారికంవరకూ ఈ క్రమ పరిణామాన్ని మనం చక్కగా కనుపెట్టవచ్చును. శైలి యెలాంటిదైనా అందలి భావ విజృంభణమునుబట్టి ఎప్పుడూ అది ఒక మహాప్రవాహమే. గాంభీర్య స్ఫూర్తితో వ్రాయనిండు, హాస్య ధోరణిలో వ్రాయనిండు, అనవరతమూ అది ఒక రసోల్బణమే. విజ్ఞానబోధలు రసోదంచితములుగా చెయ్యడం కృష్ణరావుగారి లేఖిని కలవాటు. కనుకనే పాఠక లోకపు హృదయాలను వారి వ్రాత లంతగా ఉర్రూతలూగించాయి; మరల మరల అధ్యయనం చేయించి అనుకరింప జేశాయి. ఆ రోజుల్లో వెంకటశాస్త్రిలుగారి కవిత్వం ప్రతివారినీ పద్యరచనకెలా ప్రోత్సహించిందో కృష్ణరావుగారి సంపాదకీయాలు అలా గద్యరచనకు ప్రేరేపించాయి. ఆంధ్ర సారస్వతానికి వారు చేసిన విశిష్ట సేవ యిది.

దీనినిబట్టి, కృష్ణరావుగారిని కేవల మొక గద్యశైలీనిర్మాతగా మాత్రమే అర్థంచేసికొంటే ఆవగింజలో అరభాగం మాత్రమే వారిని అర్థం చేసుకున్నట్లవుతుంది. వారి భాష కా పుష్టి భావాన్ని బట్టి చేకూరింది. వారి భావాని కా శబలత వారిసంస్కారం, వారిచింతనా, వారిసాధన గరిమను బట్టి లభించింది. ఇవన్నీ అర్థమైతే గాని వారి వ్యక్తిత్వం కొంచమైనా అర్థం గాదు. కృష్ణరావుగారి వ్యక్తిత్వం లోతు లందుకోరానిది. సముద్రుని వలె పరమ గంభీరులాయన. ఒడ్డున విరిగి చిద్రుపలై నురుగులు తేరి గలగలలాడే అలలతో మీ రాటలాడుకోవచ్చును. అల్లంత దూరాన ఉవ్వెత్తున లేచి ఊయల లూగుకుంటూ వస్తున్న కెరటాలకు తలయొగ్గుతూ జలకము లాడవచ్చును. కాని, ఈ చిట్టి చిట్టి అలలకూ, ఆ పెద్ద పెద్ద కెరటాలకూ వెనుక వీటి కాధారభూతమై వున్న ఆ అనంత గంభీర మహాసాగర స్వరూపం ఇంత మాత్రాన మనకేమి తెలిసినట్లు ? కృష్ణరావుగారి వ్యక్తిత్వం కూడా అలా అనంత గంభీరం. ఆంధ్రదేశంలో వారి సమకాలికులై

వివిధ రంగాలలో అసాధారణ ప్రజ్ఞతో తేజరిల్లిన మహనీయు లనేకమంది ఉండవచ్చును. కాని వారిలో అత్యధిక సంఖ్యాకుల మహాత్వానికి, కృష్ణారావుగారి మహాత్వానికి విశేషాంతర మున్నది. అసలా పడికట్టే వేరు, ఆ యంతస్థే వేరు. ఇంచుమించు అలాంటి అంతస్థే కలిగినవా రొక రిద్ద రున్నా, కృష్ణరావుగారి అంతస్థునం దొక వైశిష్ట్య ముంది. అది కేవలం ఆయనదే.

మొదట వేంకటరత్నం నాయుడుగారి శిష్యరికం, పిమ్మట బిపిన చంద్రపాలుగారి సాహచర్యం, అనంతరం అరవిందయోగి వ్యాసాధ్యయనం. ఈ మూడింటి ప్రభావము ఆయన జీవితంలోని నిర్మాణ దశలో మనకు స్పష్టంగా కనిపిస్తుంది. కాని, ఈ మూడింటినీ ఆయన ఉపయోగించుకొన్న విధం వేరు. అందులోనే ఆయన వ్యక్తిత్వం ప్రస్ఫుట మౌతుంది. స్వతస్సిద్ధంగా గొప్ప భావుకుడు - భావనా జగత్తున నిత్యమూ విహరించగోరే పరమోత్సాహి. కావుననే, లెక్కల క్లాసులోకూడా చాటుగా కార్లయిలూ, ఎమర్సనూ చదువుటలో శ్రద్ధవహించి, క్లాసు పాఠ్య పుస్తకాల వ్యాసంగం నిర్లక్ష్యం చేసి, యఫ్. ఏ. తరగతిలో దండయాత్రలు చేశారు. నాయుడుగారూ, వీరూ ఎప్పుడు కలుసుకున్నా, వర్డ్సువర్త్‌లో ఆ పద ప్రయోగానికిది అర్థ మనీ, భాగవతంలో ఈ భావం ఇలా చిత్రించ బడిందనీ, ఇలాంటి గోష్ఠే తప్ప ఇతర ముండేదికాదు. నాయుడుగారికి ఇంకేశిష్యునితోనూ ఇలాంటి అనుబంధ మున్నట్లు లేదు. కాని, కృష్ణరావుగారి శీలసంపద నాయుడుగారిని బట్టి రూపొందించబడ్డ దైవా, నాయుడుగారి బ్రహ్మ సామాజికులలో నొకడుగా వారిని లోకం భావించినా, వా రెన్నడూ అనుష్ఠానిక బ్రహ్మ మతావలంబి కాలేదు ; బ్రహ్మసమాజమతం ఆర్య మత వైభవాన్ని సంకుచిత పరుస్తుందనే స్ఫురణ ఆయనకు మొదటి నుంచీ ఉంది. అయినా అది వారి నాయుడుగారి శిష్యరికానికిగాని పాల్ గారి సాహచర్యానికిగాని అడ్డం రాలేదు. జాతీయభావం, దేశ స్వాతంత్ర్యకాంక్షా పాల్ గారిలో ఉద్దీప్తమై గోచరించడంచేత, పాల్ గారి యెడ వా రాకర్షితులైనారు. కాని, నాయుడుగారి ముందు జాతీయతా వ్యతిరేక భావాల కెదురు తిరిగినట్లే, తూర్పుబంగాళంలో

పాల్ గారితో సంచరిస్తూ వారుపన్యసించిన వేదిక మీదనే వారి బ్రహ్మసమాజాన్ని అధిక్షేపించిన సందర్భాలున్నాయి. అటు నాయుడు గారి శిష్యులకుగాని, ఇటు పాల్ గారి అనుయాయులకు గాని ఇది చాలా వెగటుగా ఉండేది. చాల కోపగించుకొనేవారు. కాని, నాయుడుగారికీ, పాల్ గారికీ మాత్రం ఇందువలన వీరియెడ వాత్సల్యం లేశమైనా కొరవడేది కాదు. అది వారి అల్పత్వదోష వివర్జితమైన ఔదార్య గుణానికీ, వీరి అవినయదోషరహితమైన స్వతంత్ర ప్రవృత్తికీ నిదర్శనం.

ప్రథమ మహాసంగ్రామ కాలంలో అరవిందుడు పుదుచ్చేరి నుండి "ఆర్య" మాసపత్రిక ద్వారా వెలువరించిన వ్యాసపరంపర వీరి చింతనను మరింతగా ఉద్దీప్త మొనర్చింది. అరవిందుని తత్వదర్శనం వీరి విజ్ఞాన సంపదను ఇతోధికంగా సుసంపన్న మొనర్చింది. భావమును చిత్రించడంలో అరవిందునికి గల అద్వితీయకౌశలం వీరిని ముగ్ధుల నొనర్చింది. అయితే ఈ అరవింద భావచింతన గూడా వీరు తమ జీవితయాత్రకు ఉపాథేయంగా ఉపయోగించు కొన్నది మాత్రమే. యాత్రలో వీరి లక్ష్యం, గమ్యం వీరిదే. వీరి సమన్వయ పద్ధతి వీరిదే. అందుచేతనే వీరు కొన్నిటా అరవిందుని భావాలలో ఏకీభవించని సందర్భాలు కూడ ఉన్నాయి. ఆ స్వంత సమన్వయ పటిమతోనే గాంధి మహాత్ముని అహింసా సిద్ధాంతాన్ని, అసహాయ యోగాన్ని సమర్థిస్తూ భాష్య సదృశమైన రచనలు కొనసాగించారు. అద్వైతదర్శనమం దత్యంతాభినివేశం కలవారయ్యూ ఆ అద్వైత దర్శనమం దంతర్భాగ ముగనే భావించి గాంధి మహాత్ముని నైతిక సాధనమును కీర్తించారు. సృష్టివిధానంలో హింసకూ ప్రళయానికీగల ప్రాముఖ్యాన్ని గ్రహించియే నైతికమైన అహింసా సాధన వైశిష్ట్యానికి గూడ జయగీతాలు పాడారు. పత్రికా సంపాదకులుగా కాలగతికి వ్యాఖ్యానం చెప్పడం వారి వంతు అయింది. ఆ పనినే వారు అమోఘంగా నిర్వర్తించారు. ఏ జనన్మాంతర సంస్కార ఫలితమో, సమస్తమునూ సాక్షిగా తిలకించే కౌశలం వీరికి సహజంగా అలవడింది. ఆ సాక్షిత్వం కేవలం అంటని ముట్టనితనం కాదు. త్యాగంతోపాటు భోగం కలిపిఉన్నదా సాక్షిత్వంలో.

"తేనత్యక్తేన భుంజీథాః"-అనేది వారి సాధన ప్రణాళిక. "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్"—అనేది ఈ సాధన కాధారభూతమైన విజ్ఞానం. ఈ విజ్ఞానం కృష్ణరావుగారు బుద్ధితో అవగాహన చేసుకున్నది మాత్రమే కాదు. హృదయంతో ఆలింగనం చేసుకొని అంతర్లీన మొనర్చుకున్నట్టిది. అందువల్లనే వారి విజ్ఞానం తేజోవంత మగుటతోపాటు రసవంతంకూడా అయింది. భక్తి జ్ఞాన ములు వారిలో సమ్మేళనం చెందాయి. ఛందోబంధములతో కవిత్వం వ్రాయక పోయినా, నిజమైన కవిపదవాచ్యులు వారు. కవికి "క్రాంత దర్శిత్వం" ఉండాలి. "రస సిద్ధత్వమూ" ఉండాలి. ఈ రెండూ కృష్ణరావుగారిలో పుష్కలింతలై కనుపించేవి. కవులకూ, శిల్పులకూ ఉండవలసిన రసదర్శనమూ రూపకల్పనా సామర్థ్యమూ వారిలో అపారంగా ఉండేవి. ఉండికూడా వారు కావ్యాలు వ్రాయక పోవడానికీ, శిల్పాలు మలచకపోవడానికీ వా రా సాధన సామగ్రి యందు పరిశ్రమ చెయ్యక పోవడమే కారణ మనుకోవాలి. మహా సాగర తీరమున గులకరాళ్ళేరి ఆడుకొని పారవేస్తూ ఉండే బాలకుల వలె వా రీ రూపకల్పనలతో ఆడుకుంటూ ఉండేవారు. సాగర గర్భ మున మునిగి వెలికి దీసిన ముత్యములను గూడా వా రీ గులకరాళ్ళ వలెనే కొంచెముసే పాడుకొని విరజిమ్మి వేస్తూండేవారు. ఎంతసేపూ ఆడుకోడమే వారికి ప్రధానం. సముద్రతరంగాలు లేచి పడుతూ ఉండడానికి ఎలా అంతులేదో వారి ఆటకూ అలాగే అంతు లేదు. "కృష్ణాపత్రిక" ద్వారా ప్రకటిత మయ్యేది అందులో శతాంశమూ, సహస్రాంశమూ మాత్రమే. వారి సన్నిధియం దుండి వారి ప్రసంగాలను విన్నవారికి ఈ క్రీడా విభూతి మరింత విశేషంగా ప్రత్యక్షమైనా, ప్రత్యక్షం కాని దింకా ఎంతగానో ఉండనే ఉండేది. అది వారిలో వారికే అనుభూతం. ఆయన దృష్టి కిరణ సంస్పర్శకు తలిరాకు దొన్నెపై పవళించిన పూవు కిలకిల నవ్వుతూ వారితో ఏమేమో మాట్లాడేది. ఆ మాట్లాడుట కంతులేదు. ఏమి మాట్లాడినదో వారు గంటల తరబడిగ ఉపన్యసింపగలరు. అది ఉపన్యాస మనుట కంటె ప్రదర్శన మనుట సముచితం. తనకు గలిగిన సాక్షాత్కారం

ఎదిరికికూడా సాక్షాత్కారం కావాలి. ఆ వాక్కులో ఒక ఊపు వుండేది. ఆ చూపులో ఒక వెలుగు ప్రసరించేది. ఆ కరచాలనంలో ఒక విస్ఫూర్తి ప్రకటిత మయ్యేది. ఆ శరీరమంతా ఒక అభినయ ముద్రలో ఉన్నట్లుండేది. రూపంలేని భావం ఇక రూపం ధరించి శ్రోత యెదుట తాండవించి తీరవలసినదే. కావుననే, వారు గహన మైన వేదాంతం మాట్లాడినా అది ఒక రసవత్ప్రబంధం ప్రపంచిస్తు న్నట్లుండేది. విన్నకొద్దీ వినాలనిపించేది వారి వాగ్ధోరణి. ఏది మాట్లాడినా ఎప్పటికప్పుడు క్రొత్తగా ఉన్నట్లే ఉండేది. ఆయనది సచేతనమైన, సజీవమైన దర్శనం కావడమే ఇందుకు కారణం. ఇది వారి నిరంతర సాధన.

ఈ సాధనాభినివేశంలోనే వారు మౌనముద్రాలంకారులు గూడ అయ్యారు. అయ్యది ఆత్మరతితో కూడిన మౌనముద్ర. కుచ్చు జార విడచిన కోరపాగాతో, మోకాళ్లవరకూ జీరాడే కద్దరు లాల్చీతో, కాళ్లకు బందరు నాటుచెప్పులజోడు, చేత సింహతలాటపు పొన్ను కర్రతో ఇంటినుండి కృష్ణా పత్రికాఫీసుకూ, కృష్ణా పత్రికాఫీసునుండి ఇంటికీ ఈ మౌన ముద్రాలంకారులు నడచి పోతూంటే,బందరు పౌరుల కదియొక కన్నుల పండువుగా ఉండేది. ఇంటివద్దగాని, ఆఫీసువద్దగాని అత్యంతాప్తులవద్ద మాత్రమే ఆ మౌనముద్ర విడేది. ఇక అది కట్టలు తెగిన ప్రవాహమే. ఆ హాస్యప్రీతి అపారం.

కృష్ణరావుగారి సాధన ఫక్కీలోని మరొక ముఖ్యాంశాన్ని గూర్చి కూడా ప్రస్తావిస్తే తప్ప, వారి వ్యక్తిత్వాన్ని సరిగా వర్ణించినట్లు కానేరదు.వేంకటరత్నం నాయుడుగారి ఉపాస్యదైవం "పతితపావను" డైతే, కృష్ణరావుగారి ఉపాస్యదైవం "నిఖిల రసామృతమూర్తి". ఈ పేరును వారు ఉచ్చరిస్తూ ఉంటే, వారి సకలేంద్రియములూ విచ్చుకున్నట్లుండేది.

'చెలికాడ రమ్మని చీరు నన్నొకవేళ
మన్నించు నొకవేళ మరదియనుచు
బంధు భావంబున భావించు నొకవేళ
దాతయై యొకవేళ ధనము లిచ్చు
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు
బోధియై యొకవేళ బుద్ధి సెప్పు
సారథ్య మొనరించు జనవిచ్చి యొకవేళ
గ్రీడించు నొకవేళ గేలిసేయు

నొక్క వయ్యాసనంబున నుండు, కన్న
తండ్రి కైవడి చేసిన తప్పుగాచు
హస్తములు పట్టి పొత్తున నారగించు
మనుజవల్లభ మాధవు మరవురాదు.'

పోతన నిఖిల రసామృతమూర్తిని ఈ పద్యంలో చాల చక్కగా వర్ణించాడు. దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర, మహాభావాలలోని దివ్యత్వాన్ని, కృష్ణరావుగారు వర్ణిస్తూంటే పరమధామంలో విహరిస్తున్నట్లే ఉండేది. వైష్ణవభక్తిలో ఈ భావాలన్నీ, ప్రపంచించబడిన మాట నిజం. కాని, ఎక్కడో వైకుంఠమో, గోలోకమో వున్నదనీ, ఈ భావాలన్నిటినీ ఇముడ్చుకొన్న నిత్య లీల అచట జరుగుతూ ఉంటుందనీ, దాని దృష్ట్యా ఈ జగత్తు త్యాజ్యమనీ అంటే వారి మనస్సుకు తృప్తి ఉండేదికాదు. ఆ భావాల దివ్యత్వాన్ని ఈ జగత్తులోనే దర్శించాలనేవారు. సమస్త నరనారులలోనూ ఆ రాధాకృష్ణులే కనిపించా లనేవారు. విశ్వమం దణువణువునా గోచరించేది ఆ రాధాకృష్ణ విలాసమే ననేవారు. జగత్తును మిథ్యయని త్రోసిపుచ్చే ఏ ఉపాసనా వారికి గిట్టదు. జన్మపరంపర అంటే వారికి భయం లేదు. పనికిరాని దేహాన్ని ఊడ్చివైచి క్రొత్తదేహాన్ని ఇచ్చేది మాత్రమే మృత్యువు. సృష్టికోసమే ప్రళయం. ఈ నిశ్చితజ్ఞానంతోనే వారు మృత్యువును రసార్ద్రమైన ధీర ప్రవృత్తితో ఎదుర్కొన్నారు.

ప్రారబ్ధం వారికి భరింపరాని బాధలతో గూడిన జలోదర వ్యాధిని తెచ్చిపెట్టింది. అద్భుతమైన వారి నిగ్రహాశక్తినిగూడ తూలించే యమయాతన అది. క్రమేణా మృత్యుచ్ఛాయలు ప్రసరింపసాగాయి. అయినా చివరివరకు వారు హాస్యోక్తులు మాన లేదు. పుట్టినింటినివదిలి అత్తింటికి పయనమయ్యే ఆడబడుచులాగ ప్రపంచాన్ని అశ్రుపూరిత నయనాలతో వీడ్కొన్నారు. "తండ్రీ, తండ్రీ ఏల నన్నిట్లు జారవిడిచినావు ?" అని ఆక్రందించాడు అలనాడు ఏసుక్రీస్తు, శిలువపై అమిత బాధ లనుభవిస్తూ. అలాగే కృష్ణరావుగారు కూడా ఆక్రందించారు— "నేను దైవంతో కలియబడుతున్నాను. దైవాన్ని వెరపిస్తున్నాను" అనిన మాటలకిదే అర్థం. భగవంతునికి అనుగ్రహం కలిగింది. ఆయనను తన చేతులలోకి తీసుకొన్నాడు. శరీరబాధలు తెలియకుండా బాహ్యస్మృతిని తప్పించాడు. శరీరంలో జలప్రళయం చెలరేగుతూనే వున్నది. కాని ఆ ప్రళయాంబోధి మధ్యంలో వటపత్రశాయియై శయనించారు కృష్ణరావుగారు. చివరకు ప్రళయంకూడ శాంతించింది. అజరామరమైన వారి "లోవెలుగులు" మాత్రమే చిరస్థాయిగా మిగిలినవి.

— కమలాకర వెంకటరావు

# అన్వేషణ

సోదరా, వాద ప్రతివాదాలనేవి ఏ విషయాన్ని గూర్చి అయినా, ఎవరితోనైనా పెట్టుకోవచ్చుగాని, పరతత్వాన్ని గూర్చి పరమ నాస్తికులతో మాత్రం సుతరాం పెట్టుకోకూడదు.

వాక్కులకందని తత్వాన్ని, వాక్కులతో, వైముఖ్యమే ప్రధానంగా పెట్టుకున్న వారికి బోధించ బూనుకోడం - శుద్ధ తెలివి తక్కువ కాదూ?

•

వాగతీత విషయాన్ని జ్ఞాపకం చెయ్యడానికి తగిన చిహ్నాలుగా-గుర్తులుగా-మాత్రమే ఉపయోగిస్తవి వాక్కులు. ఇంద్రియగోచరమైన ఆ వాక్కులలోంచి దూరి, అతీంద్రియ మైన అనుభవ వీధుల్లో విహరించగలిగినవారికే ఆ వాక్కుల ప్రయోజనంగాని, తక్కినవారి ముందు వాటిచేత ఎన్ని విలా సాలు ప్రదర్శించి, ఎంత నృత్యం చేయిస్తే మాత్రం ఏమి ప్రయోజనం? "బుద్ధిగ్రాహ్య మతీంద్రియం" అన్నాడు గీతా కారుడు.

ఏ విషయాన్నయినా గ్రహించాలంటే, దాన్ని గ్రహించగలిగే యింద్రియం వుంటేనే కాని అది గ్రాహ్యం కాదు. ఎంత భాషాజాలం క్రుమ్మరించినా, కన్నులేనివానికి నెమలిఫించపు రంగుల జిలుగులు కనపరచలేము. చెవిలేని వానికి ఆనందభైరవి మురిపెంపు సుద్దులు వినిపించలేము. ముక్కులేనివానికి మల్లెపూల వసంత సౌరభం గ్రహింపజేయ లేము. నాలుకలేనివానికి తేనె చినుకుల తీయదనం రుచిచూప లేము. ఇక, ఇట్టి, లుప్తేంద్రియులతో ఆయా విషయ ప్రాశ స్త్యాన్ని గూర్చి వాదప్రతివాదాలకు దిగడం-ఎంత అవ్యక్త మంటావు?

అతీంద్రియమైన పరతత్వ విషయంకూడ ఇంతే. అతీంద్రి యాన్ని గ్రహించగలిగే బుద్ధి-విజ్ఞానం-మానవునిలో వికసించ నంతవరకూ, దాన్నిగూర్చి ఇతరులు ఎంత మొత్తుకున్నా, వట్టిగోడు!

తల్లి చేతుల్లోని నెలగుడ్డు కళ్లువిప్పి చూస్తూనే వుంటుంది కాని, చూచేది మాత్రం కేవలం శూన్యం. శ్రోత్రేంద్రియంలో ఎట్టి లోపమూ వుండదు. కాని వేసిన చిటికెలు చెవిలో దూర కుండా అంతరాళంలోనే లీనమై పోతాయి. అమేధ్యంలో పొరలాడుతున్నా, అత్తరువులలో పొదవబడినా, ఆ ఘ్రాణేం ద్రియానికి సంకోచ వ్యాకోచాలుండవు. వయస్సుతోపాటుగా ఆ యింద్రియాలుకూడా ఎదిగి స్ఫుటపడినప్పుడుకదా, యింద్రి

యార్థాల నవి గోచరింప జేసుకొనగల్గిడం. ఆ యెదుగుదల రానంతవరకూ, ఇంద్రియాలకూ ఇంద్రియార్థాలకూ బొత్తుగా నగ మెరుక!

అదేవిధంగా, అతీంద్రియానికి అభిముఖంకాగల అంత రింద్రియం మానవునిలో సుప్తమై వున్నంతవరకూ, అతడా పరతత్వాన్ని అనుభూతం చేసుకోలేడు-అంగీకరించనూలేడు. కాని, కాలగర్భంలో ఎప్పటికో ఒకప్పటికి, ఆ సుప్తేంద్రియం మేల్కొని తీరుతుంది. మానవుని అనుభవం అపూర్వ పరిణామం పొందుతుంది. పూర్వం అతని నాస్తికత్వాన్ని చలింప జేయలేని హేతువాదం ఇప్పుడతని ఆస్తికత్వాన్ని చలింపజేయ లేక పోతుంది. హేతువాదానికి అప్పుడూ ఇప్పుడూకూడా తప్పదు పరాభవం!

కాలగతిలో పక్వమై, దానంతటది పండగల కాయను పచ్చిలోనే తీసుకు వచ్చి. అనవసరంగా హేతువాదాలతో కావు పెట్టి పండించడానికి యత్నించడం యత్నించేవానికీ శ్రమే, పాపం ఆ కాయకూ శ్రమే. అంతకంటె పచ్చి కాయను పచ్చి కాయగానే ఎదగనివ్వడం మంచిది కాదా?

ఇంతకీ నాస్తికత్వంలోనైనా, మహా మించుకుపోయిన వైపరీత్యం ఏమున్నది చెప్పు. ఉన్నదనే భావంతో ఆస్తికుడు దేనికోసం ప్రాకులాడుతున్నాడో, లేదనే భావంతో నాస్తికుడు కూడా దానికోసమే వెదుకులాడుతున్నాడు. ఒకటి అన్వయ

మార్గం, రెండు వ్యతిరేక మార్గం. నాస్తికుకు 'లేద్దులేద'ని గోల చెయ్యడమంతా ఆ ఉన్నదేమిటో తనకు తెలియలేదనే దుగ్ధ తప్ప మరేమిటని నీ అభిప్రాయం?

ఏమీలేదనే విషయం నాస్తికునికి దృఢంగానే తెలిసి వుంటే, ఉన్నదనుకున్న ఆస్తికులందరూ నిజంగా పిచ్చివాళ్ళనే అతని అభిప్రాయమైతే, కనపడ్డ ప్రతి పిచ్చివానితోనూ ఎందుకు చెప్పు అతనికి తకరరు? పిచ్చివాళ్ళతో ఎవరైనా వాదం పెట్టుకుంటారూ, తాముకూడ పిచ్చివాళ్ళు కాకపోతే!

అసలు సంగతి ఏమిటంటే: సర్వగతమైన ఏ జ్ఞానతేజస్సు నాస్తికునిలోకూడ ఇన్నాళ్ళూ మరుగై వున్నదో అది వెలికి రావడానికి ప్రారంభమై అతని హృదయ కుహరంలోని గాఢాంధకారంలో కలవరం పుట్టించింది. అదీ ఆ కలవరపాటు. కాయ ఎదుగుతోందన్న మాట. విజ్ఞాన నేత్రం వికసించ వేగిరపడుతోందన్న మాట.

చూచేవాణ్ణి తనను తాను మరిచిపోతాడు నాస్తికుడు. తనచే చూడబడేదే సర్వస్వమనుకుంటాడు. దానికంతకీ ఏదో జడ 'స్వభావం' కారణంగా పేర్కొంటాడు. దృశ్యమైన ఆ జడస్వభావంలోంచి దర్శియైన తాను పుట్టానని భ్రమిస్తాడు. చేతనానికి జడం కారణం కావడం యుక్తమో, జడానికి చేతనం కారణం కావడం యుక్తమో తెలుసుకోలేక ఉక్కిరిబిక్కిరౌతాడు. ఎదుట ప్రదర్శించబడే దృశ్యంకంటే, ఆ

దృశ్యాన్ని దర్శించే తాను స్థిరమని గ్రహించేకన్ను తెరవబడ నంతవరకూ ఈ భ్రమవిభ్రమాలు తప్పవు.

జాగ్రత్తలో ఏ కొద్ది భాగాన్ని మాత్రమో దర్శించ గలుగుతూ ఇతర వేళల్లో మరుగున పడిపోయే తన మామూలు 'తాను'కంటె, తన స్వప్నావస్థలోనూ ఇంకా తన సుషుప్త్యవస్థ లోనూ కూడ సాక్షీ భూతంగా నిలిచివుండే వేరొక 'తాను' వున్నదని అనుభవమయ్యేవరకూ, ఇలా తన్ను తాను నిరాక రించుకోక తప్పదు.

తన సాక్షిత్వంలో తెంపులేకుండా జాగ్రత్తనుండి స్వప్నంలోకీ, స్వప్నంనుంచి జాగ్రత్తలోకి స్వేచ్ఛగా తిరిగిరా గల నేర్పు కుదురుతుం దొక్కొక్కనికి. ఎవరా స్వప్నంలో సాక్షి? కన్ను లేక పోయినా చూచే-చెవి లేకపోయినా వినే- ఆ ఇంద్రియం ఎట్టిది?

"సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం" అని గీతలు సూచించిన అతీంద్రియేంద్రియమది. ఏ నాటికైనా మానవునిలో ప్రబుద్ధం కావలసివున్న విశిష్టేంద్రియం అదే! పరమ నాస్తికుని నిరంతరం వ్యతిరేక మార్గంలో కలవర పెడుతూ, అతనియందు ఆవిష్కరించటానికి వేగిరపడుతున్న ఇంద్రియం అదే!

# భౌతిక జగత్తులోని రసజగత్తు

సోదరా, సూక్ష్మంగా పరికించి చూడు- రెండద్భుత విషయాలు కనబడతాయి. ఈ రెండూ తప్పితే, ఇంకో అద్భుతవిషయం యేమున్నది?

ఆ రెండూ యేమిటంటావా? నా బయటనున్న ఈ వస్తుజాతం. దానినిజూచి ఆనందించే నా కన్నూ, ఈ రెంటిని మినహాయిస్తే, మిగిలినదేమిటో చెప్పు. అందుకనే కన్ను లేక పోతే జగత్తే లేదన్నారు.

ఆకుపచ్చని కాడలోనుండి, అతి విచిత్రంగా సారం తీసిన గులాబీ రంగుల రేకుల సొబగుకు ఎక్కడనుండో తెచ్చు కొనిన పరిమళాన్ని మేళవించుకొని, అతి సుకుమారంగా, అతి వయ్యారంగా క్రొంజిగురాకు పాన్పుపై శయనించి, ఉల్లాస పడుతున్న ఆ గులాబీ పూవు ఎంత అద్భుతమైన సృష్టి! కాని ఆ పూవునుజూచి, స్పృశించి మూర్కొని, ఆస్వాదించి, ఆనం దించే నా చూపో, నా ఘ్రాణేంద్రియమో, నా స్పర్శ జ్ఞానమో-అంతకంటె ఎక్కువ అద్భుతమైనది కాదూ? నాలో

నుండి వచ్చే చూపుకూ-నాచూపుకు అనే ఆ వస్తువుకూ మధ్యా జరిగే ఈ సరస సల్లాపమే, ఈ కేళీవిశేషమే ఈ జగల్లీల అంతాను. అందుకనే గౌరాంగ ప్రభువు నేను భోక్తను, ఈ ప్రకృతి నా భోగ్యమూ అన్నాడు. వర్డ్స్‌వర్తు కవీశ్వరుడు కూడా నాకూ ఈ జగత్తుకూ నిత్యం కల్యాణం జరుగుతోంది అని పొంగి పోయాడు.

చూపు అంటే నిర్మలమైన చూపే చూపు. గుడ్డి కన్ను తెరచేం తెరవకేం? ప్రకృతి శాస్త్రజ్ఞుని చూపు మన స్థూలమైన చూపుకంటె ఎక్కువ చురుకైన చూపు. మనచూపుకు వస్తువుల పైపొరలే కనబడతాయి. వైజ్ఞానికుడో ఆ పైపొరలను దూసుకుంటూ లోపలకు గూడ పోతాడు. కవీశ్వరుని చూపు ఇంకా వస్తువుల లోతుపాతులలో దూరి, గర్భంలోవుండే మకరందాన్నిగూడా ఆస్వాదిస్తుంది. ప్రకృతిలో అంతర్వాహినిగ ప్రవహిస్తూండే మధుస్రవంతిని ఆస్వాదించేవారు రసభోగులు వస్తువుల రసగర్భంలో తొలుచుకొనిపోయి చూచే చూపే చూపు. ఆ చూపుకు జగత్తు యొక్క కళారహస్యమంతా గోచరిస్తుంది. భ్రమరం పుష్పం బయట ఎంతసేపు భ్రమణం చేస్తే ఏమి? తిరిగి తిరిగి, పువ్వు బొడ్డులోని మధుపాత్రలో ప్రవేశించినప్పుడే, దాని శ్రమ, రొద-ఫలించి, ఆనందంలో సొక్కిపోతుంది.

సృష్టిలోని ప్రతి వస్తువు తనభోక్తను వెతుకుతోంది,

పిలుస్తోంది-వచ్చి తనను 'ఆస్వాదించండోయి అని! మన చూపు 'కూడా వెదుకుతోంది ఎక్కడ భోగ్యం దొరుకుతుందా' అని. ఆ భోగ్యం భుక్తం కాకపోవడంచేతనే మన యింద్రియాలు అతిచంచలంగా పరుగెత్తుతున్నాయి. ఎందుకీ చంచలం? అన్వేషణార్థం, పిపాసను తృప్తిపరచుకోడానికి. ఎప్పుడు మన కన్ను పై పొరలు విడిపోయి, రాగరంజితమగుతుందో, అప్పుడు వస్తువుల బయటి పొరలుకూడా విచ్చుకొని, వాని అంతరంగంలోని సౌందర్య రసాన్ని అందిస్తాయి. విచ్చుకొన్న కంటికీ, విచ్చుకొన్న వస్తువుకూ జరిగే అంతరంగ లీలే నిత్యనూతనమైన మనోహరలీల. ఆ లీలలో అంతరంగ బహిరంగము లొక్కటై పోతాయి. "లీనా విలీనానుకిం?" అని కవివలె కీర్తిస్తాం. నిజమే—ఆ వస్తువు నాలో లీనమైపోయిందో, నేను ఆ వస్తువులో లీనమై పోయినానో ఎవరు చెప్పగలరు? భోక్త—భోగ్యం—వీని మధ్య ఎడమెక్కడ? రెండూ ఒక్కటే. ఈ భావాన్నే శాంతి రామమూర్తిగారు 'థింగ్స్ అండ్ థాట్స్ ఆర్ వన్' అన్నారు ఇంగ్లీషులో. ఈ అనుసంధానంలోనే ఉన్నది సృష్టి రహస్యమంతా. రతి స్థాయి భావమని ఆలంకారికులు చెప్పారంటే-ఈ విశ్వరతినిగూర్చే-ప్రకృతి పురుషుల సంయోగక్రీడ-తాదాత్మ్యం-సంభోగం.

నాకూ, ఈ జగత్తుకూ మధ్య వుండే ఎడబాటును సహిస్తున్నానంటే, ఈ జగత్తు నా ప్రేయసి అనే రహస్యాన్నింకా గుర్తించ లేదు కనుక. ప్రతి వస్తువు క్షణక్షణం నా హృద

యాన్ని తట్టుతోంది-ప్రణయ లేఖల నందియ్యడానికి. కాని నా హృదయ కవాటాన్ని తెరవక, మన ఇంద్రియాలను శుష్కింపజేసుకొంటున్నాము. ఈ కవాటాన్ని తెరిచామా, బాహ్య వస్తువులు తెచ్చే ప్రణయ నీరాజనాలను స్వీకరించి, వాని సౌందర్యాన్ని ఉపభోగిస్తాము. "నీ నామరూపములకు నిత్య జయమంగళం" అని త్యాగరాజార్యుడు కీర్తించాడంటే, వాని యాంతరంగిక లీలామృతాన్ని స్వీకరించడంవల్లనే.

దృక్కులో అంత మహత్తు ఉన్నది-దృశ్యాన్ని తనలో గలుపుకొని భోగించగల శక్తి. అప్పుడు మన మాంసనయనం జ్ఞాన నేత్రంగా, భక్తి చక్షువుగా వికసిస్తుంది. ఇంద్రియాలన్ని నిర్మలములై, ప్రపుల్లములవుతాయి. గోపీ సుందరులవలె-ప్రతి వృక్షం, ప్రతి మార్గం, ప్రతి శబ్దం, ప్రతినదీ-బృందావనమవుతుంది. అమృత యాత్ర అవుతుంది. మురళిగాన మవుతుంది. యమునాతరంగిణి అవుతుంది. నిజం—నాలోని వెలుగే ఈ విచిత్రములైన రంగులను, రాగాలను, సౌందర్యాలను విరజిమ్ముతున్నదనే జ్ఞానం కలిగిన తర్వాత ముగ్ధులమై పోతాము-నాలోని వెలుగు ఎంత చక్కని, చిక్కని, చల్లని చవులూరే వెలుగో!-బంగారు వెలుగది. దానిని దాచిపెట్టడమెందుకు? ఆ వెలుగును బయటకు రానిస్తే, ఈ లోకం ఆనందధామముగ మారిపోదూ? ఓ హృదయ భృంగమా, ఈ సృష్టిలోని మధుపాత్రనుగైకొని రసోన్మత్తుడవుకమ్ము!

# నిత్య కేళీవిలాసం

సోదరా, ఇంకా ఎంతసేపీ నిద్రమత్తు? లెమ్మ! నిన్ను ఆవరించిన చీకటి ముసుగులను విదల్చుకొని వేగిరపడు! చుట్టూ నీకోసం ఎట్టి విందు-ఎట్టి వేడుక—ఎట్టి ప్రదర్శనము-ఎట్టి క్రీడ-ఆయత్తపరచబడివున్నదో ఒక్కసారి కొంచెం నిదానించి చూచుకో! బద్ధకించి నీవింకా చీకటిలోనే ముసుగుదన్ని గుర్రుపెడితే, ఈ అమృతప్రదానమహోత్సవమంతా అడవిని గాచిన వెన్నెల!

ఈ విందు ఒక్క నీ రసనేంద్రియానికే కాదు—నీ కనులకు, నీ వీనులకు, నీ ఘ్రాణానికి, నీ స్పర్శకు, నీ మనస్సుకు నీ బుద్ధికి, నీ హృదయానికి, నీ సర్వస్వానికీ విందు! వీటన్నిటినీ మించి నీకు విందు!

కాని, సూదిబోళ్ళూ, బానకడుపులతో కుదిరేది కాదు ఈ రసభోగం. మేనంతా కన్నుచేసుకుని చూడాలి. శరీరములో అణువణువూ చెవి చేసుకుని వినాలి. నీ స్పర్శ, నీ ఘ్రాణం, నీ జిహ్వా—నీ ఇంద్రియద్వారాలన్నీ సుతీక్ష్ణములై

తెలుసుకోవాలి. మనస్సును మేల్కొలుపు. బుద్ధిని ప్రజ్వలింపజేయి. హృదయాన్ని ఆర్ద్రీభూతం చేయి. రససామ్రాజ్యానికి రాచబాటలు వేయి. ఎల్లలులేని ఆ రాజవీధులలో క్రిక్కిరిసే భోగవైభవమిక అనంతం!

బాహాటంగా తెరచివుంచిన నీ యింద్రియద్వారముల గుండా, ఎదుటనున్న యీ అనంతమైన జగత్ప్రవాహం అనుక్షణమూ నీ అనంతజీవనంలోనికి ఎలా దారులుచేసుకుని ప్రవహిస్తున్నదో గమనించు. ఇంద్రధనస్సుగా విభిన్నమైన సూర్యకిరణంలాగా, ఈ ప్రవాహం అయిదుపాయలుగా చీలి నీలోనికి ప్రవహించి, నీ హృదయసాగరంలో ఎలా సంగమిస్తున్నదో పరికించు. ఈ అయిదుపాయలనడుమా ఏర్పడిన డెల్టా ప్రదేశంలో పండే పంటలు రసభోగాలు!

అత్యద్భుతమైన యీ జీవనదీ జలాలలో ఎట్టి మహాత్తువున్నదో కాని, ఒకపాయలో కనుపించిన మాధుర్యం యింకొక పాయలోలేదు. రూపురేఖల విలాసాలతో నేత్రోత్సవం చేస్తుంది ఒక చోట. కంటికి కనిపించకుండా దాగి శృతిలయ విభ్రమాలతో శ్రవణానందాన్ని కల్పిస్తుంది వేరొకచోట. కంటికీ చెవికీకూడ అగోచరమై వివిధవాసనలను విరజిమ్ముతూ, ఘ్రాణతృప్తిని కలిగిస్తుం దింకొకచోట. ఇంకా అంతకంటె అదృశ్యమై పలురకములైన రుచులను పచరింపజేస్తూ జిహ్వకు తుష్టువదిలిస్తుంది మరొక్కచోట. గాలిలో లీనమైవచ్చి గిలిగిం

తలుపెట్టుతూ, స్పర్శసుఖాన్ని కలిగిస్తుంది వేరొక దిక్కున. ఈ పంచవేణీ సంగమంలో లీలా విహారి కాగలిగినవా డెంత ధన్యుడు!

అదిగో! ఆ రూపవాహికను తిలకించు! ఏమి ఆ రూపు రేఖాతరంగపంక్తుల వయ్యారపునడకలు! ఏమి ఆ చిత్రవిచిత్ర మైన రంగుల మిలమిలలు! ఒకదానినొకటి పోలని రూపసుంద రుల అనంతమైన మండల నృత్యసంరంభమది. నీలి సొగసుల ఆకాశసుందరులు మరుత్కుమారికలకు చేతులందిచ్చినారు. మరుత్కన్యల కరపల్లవములను తేజోయువతీబృంద మందిపుచ్చు కొన్నది. తేజోయువతుల రుచిరహస్తపద్మములను జలకన్యలు గ్రహించినారు. జలకన్యల శీతలస్పర్శను పృథ్వీదేవతలు స్వీక రించినవి. కన్నులు మిరుమిట్లు గొలిపే అపూర్వదృశ్యం!

నృత్యమండల మింతటితో పూర్తి కాలేదు. ఈ గొలుసు నింకా ఎక్కడికి అందివ్వాలనో, అచేతన గర్భంలోనుంచి వృక్ష జాలం పొటమరించుకొని బయటికి వస్తున్నది. లతాపంక్తులు సాగిసాగి ప్రాకులాడుతున్నవి. ఖగసంతానం రెక్కలుకట్టు కొని ఎగురుతున్నవి. జంతుసముదాయం నాలుగుకాళ్ళ స్వారీచేస్తున్నవి. కడకు మానవులు-స్త్రీ పురుషులు-కలిసినారు ఈ సంరంభంలో శతసహస్రముఖములై.

దిఙ్మాత్రంగా వర్గీకరణంచేసి గుర్తుచూపడం మట్టుకే కాని, ఆ రూపురేఖావిన్యాసాల నన్నింటినీ వర్ణించడం ఎవరి

తరహ? ఏ వర్గానికా వర్గంలోనే అనంతమైన భేదాలు. రూపును పోలిన రూపులేదు. రేఖనుపోలిన రేఖలేదు. లెక్కకు ఏడురంగులైనా, ఆ రంగుల లోంచి బైలుదేరే వింతవింత ఛాయలకు లెక్క లేదు. ఎట్టి మహాద్భుతదృశ్యమిది. అనంతకాలం కూడా దీని అంతును చేరలేదు.

ఈ అనంతత్వం నీవు చూచే రూపాల్లోనే కాదు. నీవు వినే శబ్దాల్లో, నీవు గ్రహించే స్పర్శలో, నీవుచూచే రుచుల్లో, నీవు ఆస్వాదించే తావుల్లో-ఎక్కడ చూచినా ఈ అనంతత్వమే నీకు ప్రత్యక్షం. సప్తస్వరాల్లోంచీ అనంతరాగాలు తరంగితమౌతున్నవి. షడ్రుచులలోంచి అనంతరుచులు ఉత్పన్నమౌతున్నవి. మృదువుకానీ, కఠినంకానీ, స్పర్శనుబోలిన స్పర్శ లేదు. ఆమోదకరం కానీ, కాకపోనీ, సౌరభాన్నిపోలిన సౌరభంలేదు. దేనికి దానికే ప్రత్యేకత; అసంఖ్యాకమైన "ఒకటి"-అది "సింగిల్ వేరియబుల్."

ఈ అనంతత్వం ఒక్క నీ ఇంద్రియగోచర విషయాల్లోనే కాదు. నిన్ను చిత్రవిచిత్రాలుగా ప్రేరేపించే నీ కోరికల్లో, నీ ఆవేశాల్లో, నీ ఆలోచనల్లో, నీ భావస్వప్నాల్లో-ఈసూక్ష్మ జగత్తు లన్నింటిలోనూ కూడ విస్తరించుకునేవున్నది ఈ అనంతత్వం. నీ కామక్రోధాల్లో ఎన్ని జిలుగులు, నీ నవరసప్రవృత్తులలో ఎన్ని తళుకులు, నీ భావసామ్రాజ్యవీధులలో ఎన్నివంపులు వున్నాయంటావు నిజంగా!

చూచే కన్నొకటి నిండుగా విచ్చుకొనిచూస్తే, అనంత మైన యీ మహాప్రదర్శనమంతా ఎదుట తన అనంతలీలలతో సాక్షాత్కరిస్తుంది. ఆ లీలలు సృష్టి విలసనాలు కావచ్చును. విలయతాండవాలు కావచ్చును. ఏమైనా చూచేచూపుకు అల సటలేదు. చూడబడే ప్రదర్శనానికి ముగింపులేదు తుదిఅంక మెరుగని నాటకఖేలనమిది!

రాధాకృష్ణులమధ్య జరిగే ఈ దివ్య ప్రణయలీలకు అం తెక్కడ? రాధ ఎన్నివిలాసాలు ప్రదర్శించినా కృష్ణునికి తృప్తి లేదు. రాధ ముహుర్ముహుర్నూత్న విలాసాలను, అపూర్వ హావ భావాలను నిరంతరం అవిచ్ఛిన్నధారగ ప్రదర్శించు తున్నా, ఆ రసికశేఖరుని పిపాస తృప్తి కాదయ్యె. ఆ హ్లాదినీ శక్తికిని అంతులేదా? లోతులలోపల లోతులు, లోకాలపై లోకాలు, వెలుగుల వెనుక వెలుగులు-ఏమి యీ యథాతము! యుగయుగాంతరాల నుండి ఈ రాధాకృష్ణుల లీల ఒకరిని మించి ఒకరు ప్రదర్శించుకొనుచున్నను ఉభయులకు తనివి తీఱటలేదే-భోక్తనుమించిన భోగ్యము, భోగ్యమును మించిన భోగము-ఈ చిద్రహస్యమును గుర్తెరుగు టెట్లు?

రాధాకృష్ణు లీ క్రీడారంగమున మైమరచి పెరుగుతు న్నారు. ఇంకను పెరుగుతున్నారు-ఈ పెరుగుదలకు అంతె క్కడ? అమేయము! అక్షయము! అపారము! అనంతము! ఇది "క్రియేటివ్ ఎవల్యూషన్."

# అరిష్టమైన ఆత్మవంచన

సోదరా, నీ విప్పుడు నవనాగరకుడవు కాదూ? అవును. చదు వులురాని అడవిజాతి వాడెక్కడ? విజ్ఞానధనుడవైన నీ వెక్కడ? వాని శరీరం నీ శరీరంకంటె తక్కువది కాకపోవచ్చు. విగ్రహ పుష్టిలో, కండ బలంలో, ఆజానుబాహువులలో, అవ యవసౌష్ఠవంలో, రూపసంపదలో, వాడు నీతో సరిసమానుడే అందాము. వాని పొట్టకూడా నీ పొట్టవలె జానెడే.

కాని ఈమోటు మానసికి నాగరకత ఏది? వానికి సైన్సు తెలియదే. యంత్రాలు నడుపలేడే. తోళ్లు కప్పుకొం టాడు. గుహల్లో కాపుర ముంటాడు. అడవుల్లో తిరుగుతాడు. పట్టణాలు కట్టలేడు. కోటలను నిర్మించలేడు. కేవలం స్వశక్తి మీదనే ఆధారపడతాడు. ప్రకృతి అంటే వానికి భయం. ప్రకృతికి మొక్కుకొంటాడు. రాళ్లను రప్పలను పూజిస్తాడు. ఏదో తనకంటె మించిన శక్తి తనను కనుపెట్టుతున్నట్లు ఊహిస్తాడు. ఎంత బుద్ధివిహీనుడు?

నీ వట్లాకాదే. నీవు నవనాగరకుడవు. సైన్టిస్టువు. యంత్రాలు నీకు ధగధగ మెరిసే బట్టలు నేసిపెట్టుతాయి. భూతద్దాలు సూక్ష్మలోకాలను, దూరలోకాలను నీ కంటిముందు తెచ్చిపెట్టుతాయి. ఆవిరిశక్తి నిన్ను గంటకు నూరుమైళ్ళు మోసుకొని దౌడు తీస్తుంది. విమానాలు నీకు రెక్కలిచ్చి పక్షులెగరలేని ఆకాశ పథాలలో ఊరేగించుతాయి. చేపలుకూడ ఈదలేని సాగర గర్భాలలో విహరించగలవు. నీవు గొట్టంలో ఊదావా అంటే, నీ వాణి ఒక క్షణంలో భూవలయమంతా చుట్టివస్తుంది. ఒక బాంబు విసిరావంటే పట్టణాలను ఒక్క ముహూర్తంలో భస్మీపటలం చేయగలవు. ప్రకృతే నిన్ను పూజిస్తుంది. నీకు వేరే పూజార్హమైనదేది?

నీవు ప్రభువువు, రాజువు, చక్రవర్తివి, శాసనకర్తవు. నిన్నుజూచి ప్రకృతి ఎట్లా భయకంపిత యగుతోందో! పృథివి తన రత్న గర్భంలోని ధనరాసులను తెచ్చి నీ వాణిజ్యశాలలను నింపుతోంది. నీ సైన్సు నీ కియ్యని వరమేది; నీ రెండు చేతులను సహస్రహస్తాలుగ మార్చింది. నీ తలను దశకంఠాలనుగ నొనర్చింది నీ శక్తి ప్రాభవం అద్వితీయం. నిజంగా నీవు విరాట్పురుషుడవై పోలేదూ-సహస్ర శీర్షుడవు. సహస్రాక్షుడవు. సహస్రపాదుడవు.

నిజంకాదూ? ఎందుకట్లా వెర్రిచూపులు చూస్తావు? నీ సైన్సు నీకు కల్పవృక్షమై ఉండగా, నీ కెందుకీ వ్యసనం? సైన్సు నీకు "సివిలిజేషను" ఇచ్చింది. నీకు "ప్రొగ్రెసు"

కల్పించింది. నీకు "కల్చరు" ప్రసాదించింది. నిన్ను ప్రపంచానికి సార్వభౌమునిగ జేసింది. ఎందుకిప్పుడు దీనావలోకనాలు, ఈ నిట్టూర్పులు, ఈ హాహాకారాలు? దేనికీ దైన్యం?

"నేను సైన్సు మూలంగా సర్వశక్తిమంతుడనైన మాట నిజమే. అసలు నా దేహం చిన్నదైనా, వామనుని దేహంవలె విపులమై, పెరిగి, విజృంభించి ప్రపంచాన్నంతా ఆక్రమించుకొన్న మాట నిజమే. ప్రపంచముయొక్క అంచులదాకా వ్యాపించాను. ఆకాశం కొనలుదాకా ఎక్కాను. పాతాళలోకందాకా దిగాను. ఇదంతా నిజమే. కాని నేడు నా తల దిమ్మెక్కింది. నా సైన్సే పాలుపోసి పెంచిన పామువలె నన్నే కాటువేస్తోంది. నేను గాజు గొట్టాలలో పరీక్షించి కనుపెట్టిన రసాయనిక ద్రవ్యాలు నా పట్టణాలను, నా సౌధాలను తగుల బెడుతున్నవి. నా యంత్రాగారాలలో పోతపోసిన గుండె ప్రేలి నా ముసలి తల్లిదండ్రులను, నా భార్యా బిడ్డలను, నా బంధుమిత్రాములను మట్టిపాలు చేస్తున్నాయి. నా దర్పం, నా అధికారం, నా ధనం నాయిరుగు పొరుగువారిలో క్రోధోన్మాదాలను ప్రజ్వలింపజేసి, ప్రపంచాన్నంతా నాపై తిరుగుబాటు చేయిస్తున్నాయి.

"నేడు నేనీ సైన్సుదావానలంలో జిక్కుకొని అల్లల్లాడుతున్నాను. నా అహంకారమంతా నేడెందుకూ పనికిరాకున్నది. నారాజ్యోన్మాదము నన్ను శత్రుమధ్యమున బడవేసి

నదినాకు నేడు నిలుచుటకు నీడలేక, అడవిమానిసివలె భూగ ర్భంలో దాగుకొనవలసి వచ్చింది. నే పేర్చిన ధనరాసులన్నీ నాకు రక్షణ, భద్రత ఇయ్యలేకున్నవి. ఈ రైళ్ళు, ఈ స్టీమర్లు, ఈ కార్లు, ఈ ఏరోప్లేన్లు, ఈ ఎలక్ట్రిక్ కరెంట్లు. ఈ రేడియోలు నా పాలిటి యమదూతలై నన్నుతీసుకొనిపోయి నరక కూపంలో బడవేస్తున్నాయి. నాలోనేదో పెనుచీకటి ఆవరించి మృత్యుచ్ఛాయవలె నన్ను మింగజూస్తున్నది. నేను కట్టితెచ్చి, నా బంధిఖానాలో బడవేసి, నాకు చాకిరీ చేయించు కొంటున్న ఈ సైన్సు, ఈ కెమిస్ట్రీ, నా రాజ్యం, నా అహంకారం, నా విజయాలు—అన్నీ, నన్నుజూసి అట్టహాసం చేస్తున్నవి. నేను నిర్మించిన ఆర్మర్డుకార్లు, టాంకులు నా కళేబరం మీదుగ బరుగులెత్తి నన్ను తుత్తునియలు జేసివేస్తున్నవి. భూమి యొక్క ఆకర్షణశక్తిని పరిహసించే నా విమానాలు నాపై నిప్పులను గురిపించి భస్మీపటలము జేయుచున్నవి. నాకు శాంతిలేదు. భద్రతలేదు. పరివారముండియు ఏకాకినైనాను. ధనముండియు తిండికై పెనుగులాడుతున్నాను. కర్మాగారాలుండియు నేను పరాఙ్ముఖుడనగుతున్నాను. ఇక నాకు దిక్కేది? శరణ్యమెక్కడ?"

ఓ నవనాగరికుడా, దిగులు చెందకు. సైన్సు నీకు ద్రోహంచేయుటలేదు. నీవే సైన్సుకు ద్రోహంచేసి, లోకాన్ని నరక కూపంగా జేసుకొన్నావు. ప్రకృతి నిట్లా పరిభవించిన వానికి బ్రతుకుతెరువు వుండదు. రుద్రుని ఉపాసించి, వరాలు

తెచ్చుకొనిన భస్మాసురుని గతి ఏమి? ఏ హస్తాలతో లోకాన్ని దగ్ధపటలం చేయచూచాడో, ఆ హస్తాలే తన నెత్తిపై బడి తననే భస్మంచేసివైచాయి. శివుని నిందించిన దక్షప్రజాపతి గతి ఏమైనది? తాను కల్పించిన హోమగుండమే తనను ప్రేల్చివైచినది. శివశాపం అప్రతిహతం సుమా!

నీ తల్లి అయిన ప్రకృతిని నీబానిసగా జేసికొని, ఆమెనిట్లు పరిభవించడంవల్లనే, నీ కిట్టి చేటు మూడింది. ప్రకృతి నీ బానిసా? నిన్ను మోసి, కని, పెంచి పెద్దచేసిన అమ్మకాదూ ఈ ప్రకృతి? నీ తల్లి ముఖమండలమునుండి ఎట్టి దయారసం, ఎట్టి ప్రేమామృతం ఎట్టి సేవానిరతి, ఒలుకుతున్నవో ఒకమారు కన్నెత్తి చూడు. తాను ఎండలో మాడి, పగిలి, విరిగి, పంకిలమై, నీ కెట్టి ఫలభక్ష్యాలను వండి పెట్టుచున్నదో నీకు తెలియదూ? అవి నోరులేని పశువులే, చతుష్పాదులే, నీ కున్న బుద్ధి, నీకు గలిగిన సభ్యత వానికిలేదే. అయినా అవి నీ బిడ్డలకు ఎట్టి అమృతోపమైన క్షీరముల నిచ్చుచున్నవో ఒకమారైన ఆలోచించుకొంటివా? జంతువులదాకా ఎందుకు? నీకంటె వృక్షలతాదులెంత తక్కువ సృష్టి? అవి వేసినచోట్నే వుంటాయే. కదలలేవే! వాటికి నోరులేదు, చెవిలేదు. చేతులు కాళ్లూ లేవు. అవి ఎండల్లో మాడుతూ నీకు చల్లని నీడ ఇయ్యడమే కాకుండా, తన పుష్పదళాల సౌకుమార్యాన్ని, సౌందర్యాన్ని రాల్చుకొని నీ కెట్టి స్వాదువైన ఫలరసములను నీ జిహ్వాగ్రముపై గురిపించుచున్నవో మరచితివా? ప్రకృతియొక్క ఆత్మ ప్రదానాన్ని

గూర్చి నీకు సైన్సు బోధించియుండలేదా? ఎట్టి ఆత్మ వంచకుడవై పోతివి?

ఓ మాతృద్రోహి! ప్రకృతి నీకు బానిసా? ఈ భూదేవి నీ పుట్టుకకొఱకు, ఎన్ని యుగాంతరాలనుండి ఎన్ని కఠోర వ్రతాలు ఎన్ని అగ్నిహోమాలు, ఎన్ని నోములు, ఎన్ని మొక్కుబళ్ళు ఆచరించి తుదకు నిన్ను కని, నీ విహారమునకై ఎట్టి పచ్చిక బయళ్లను, ఉద్యానవనాలను, కాసారాలను, జీవ నదులను గల్పించి, నీ సుఖ సంపదలకు దోడ్పడుచున్నదో నీ భూతత్వ శాస్త్రం నీకు శ్రుతపరచడం లేదా? చూడు ఆ అచేతనములైన నదీనదాలు ఎట్లు కొండలలో పుట్టి, శిలాఘాతాల కోర్చి, నిబిడారణ్యములను ఛేదించుకొని, నీ కేదారఖండములను సస్యవంతముగ జేయుచు, నీకు జీవముబోయుచున్నవో నీ భూగోళ శాస్త్రము బోధించడములేదా? సూర్యుడు వెలిగితే నీకుపంట. మేఘం వర్షిస్తే నీకు తోట. గాలివీస్తే నీకు పాట. నిప్పుమండితే నీకు వంట. పంచభూతములూ నిన్ను తమ ఒడిలో బెట్టుకొని, వాయువు తన మృదుహస్తాలతో నిన్ను కౌగిలించి, దివారాత్రములు నిన్ను కంటి రెప్పలవలె గాచుచు నీకు హాయిని గూర్చుచున్నవని నీకు ప్రకృతి శాస్త్రము విశదపరచడం లేదా? సైన్సును ఎందుకు నిందించెదవు?

నీకు ప్రకృతి బానిస అని ఇక విర్రవీగకుము. ప్రకృతి నీ మాత-కరుణామయి, ప్రేమమయి, ప్రాణదాయిని, ముక్తి

ప్రదాయిని. ఆత్మప్రదానము సృష్టియొక్క మూలము-సృష్టి నంతను బోషించుచున్న ఆధారము-నిన్ను, నీ జగత్తును శాంతి సుఖ డోలికలలో ఊపుచున్న రససర్వస్వము. ఓ మానవుడా, నీ నాగరకత నిన్ను మోసగించి విపథములలో బెట్టినది. జడ శక్తి నుపాసించి దురహంకారివైతివి. ఇనుమును ఆరాధించి, నీ హృదయాన్ని అయోమయంగా జేసుకొంటివి. సంగ్రహం కాదు మానవధర్మము. మైత్రి, దానము, త్యాగము, బలి, సమర్పణము నీకు శాంతి సౌఖ్యముల నొసగి నీ జీవనమును మంగళప్రదముగ జేయును.

సృష్టి తన భక్తులద్వారా తన రహస్యము నెట్లు ముఖరితమొనర్చెనో ఇతిహాస బోధలను మరచితివా? గౌతమ శాక్య ముని రాజ్యమును వదలి, లోకదుఃఖ నివృత్తికొరకు బిచ్చకుడయ్యెను. ఏసునాథుడు మానవుల పాపవిమోచనముకొరకు రాజ్యం నిరాకరించి శిలువపై తన రక్తధారల నొడ్డెను. మైత్రి, ప్రేమ, కరుణ, త్యాగము, ఆత్మ సమర్పణము నీలోని పరితాపాగ్నులను జల్లార్చి, నిన్ను ఆనందధామమును జేర్పగలవు. యుద్ధ భూమినుండి మరలుము. అస్త్రములను విసర్జింపుము. యంత్రములకు దోసిలొగ్గకుము. సైన్నులలోకెల్ల సైన్నైన అయిన ఆత్మవిద్య నభ్యసింపుము. అప్పుడు నీలో ఆవరించిన చీకట్లు తొలగి, నీయందు అమరజ్యోతి వెలుగును. నీవు అమృత పుత్రుడవయ్యెదవు. నీవు స్వతంత్రుడవై, లోకమునంతను స్వాధీనతా రసమున ముంచి లేవనెత్తెదవు. ఈ జగత్తు క్షీర

ఖండమువలె నీ ప్రేమామృతమున గరగి, కరుణారస తరంగిణిగ మారిపోవును.

తేన త్యక్తేన భుంజీథాః,
మా గృధః కస్యస్విత్ ధనం.

# స్వయం నిర్ణయం

సోదరా, నీకు జ్ఞానం ఎట్లా కలుగుతున్నదో నీ వెప్పుడైనా నెమ్మదిగ ఆలోచించి చూచుకొన్నావా? తరచిచూచు కొంటే నీలోపల "బుద్ధి" అనే దీపం ఒకటి వెలుగుతున్నదని గ్రహించి ఉంటావు.

నీ ఇంద్రియములద్వారా తెలుసుకొనే బాహ్యజగత్తు గాని, లేక నీలోపల కలవరపడుతూండే మానసిక ప్రపంచంగాని- వీనిని నీకు గోచరింపజేసేది నీ స్వబుద్ధే అని ఎందుకు తెలుసు కోవు? తెలుసుకొనే ఉంటావు.

ఆ దీపం నీలో చాలాక్షీణంగా వెలుగుతూ ఉండ వచ్చుకొడిగట్టుతూ. లేదా మహోజ్జ్వలంగా ప్రకాశిస్తూఉండవచ్చు నిర్ధూమంగా. ఎట్లావెలిగినా, అది నీ బుద్ధియొక్క వెలుగేసుమా.

అది నిన్నెప్పుడూ అంటే ఉంటున్నది కొద్దిగానో, గొప్ప గానో వెలుగుతూ. ఒక క్షణంకూడా అది నిన్ను బాసిలేదు. నీ నిద్రలోగూడా అది వెలుగుతూనే ఉన్నది. లేకపోతే నీవు

రాత్రిపూట కనేకలలను ఎట్లా తెలుసుకొంటున్నావు? కలలు లేకుండా గాఢంగా నిద్రించావా, నేను గతరాత్రి హాయిగా నిద్రపోయినాను అని ఎట్లా తెలుసుకొన్నావు?

నీవు అనవరతం ఆదీపం వెలుగులోనే తెలుసుకొంటున్నావు. అదే నీ మార్గాన్ని చూపుతున్నది. అదే నీకు దృశ్యాలను ఎరుక పరుస్తున్నది. వద్దన్నా నీవు దానిని బూర్తిగ మూసిపెట్టలేవు.

నీ బుద్ధి మందగించిఉన్నదా, నీ త్రోవ సరిగ గనపడక పోవడంవల్ల తొట్రుపడుతూ నడుస్తావు. నీ బుద్ధి చురుకుగ ప్రకాశించిందా, నీ బాట స్పష్టంగా కనపడి, నీ నడక బాగా సాగుతుంది. తుదకు నీ బుద్ధే నిన్ను పెడత్రోవలో బెట్టినా, ఋజుపథంలో బెట్టినా అని తెలుసుకో.

అయితే పరప్రత్యయనేయబుద్ధులు-అనగా స్వబుద్ధిచేత విచారణచేయకుండా, ఇతరుల అభిప్రాయాలను అంధప్రాయంగా స్వీకరించేవారు లేరా అని ప్రశ్నించవచ్చును. స్వబుద్ధిని ఉపయోగించని మంధబుద్ధులు ఉన్నమాట సత్యమే.

కాని వారైనా ఇతరుల అభిప్రాయాలను అవిచారితంగా స్వీకరించాలన్నా, స్వల్పంగానైనా తమ బుద్ధులను ఉపయోగించక తప్పదు. ఆ యభిప్రాయాలను వారికి ఎరుకపరిచేది వారి స్వబుద్ధి కాదూ?

వేదప్రమాణాన్ని స్వీకరించే ఆస్తికులు సహితము స్వబుద్ధిని విడనాడటంలేదని తెలుసుకో. మతకర్తలు వేదాలకు భాష్యాలు వ్రాశారంటే-ఎట్లా వ్రాశారు? స్వబుద్ధిసహాయం చేతనే కాదా? వారు ఎన్ని నిఘంటువులను పారజూచినా, పరంపరానుగతమైన సంప్రదాయాల ననుసరించినా, వానిని గ్రహించి అన్వయించేది తుదకు వారి బుద్ధే.

ఆ వ్యాఖ్యానాలను చదువుకొని ఆనందించే నీవో? నీవు కూడా నీ బుద్ధిచేతనే ఆ టీకలను బోధపరచుకో గలుగుతున్నావు. నీకు వెలుగు ఎన్నివైపులనుండి, ఏమార్గములగుండా వచ్చినా, తుదకు నీ బుద్ధి తన ద్వారం తెరుస్తేనే, ఆ వెలుగు నీ లోపలకువచ్చి, నీకు బోధను గలిగిస్తుంది

సూర్యుడు ఎంతదీప్తితో వెలిగినా, నీకు కన్ను లేకపోతే జగత్తంతా ఎంతచీకటిగా ఉంటుందో, అట్లాగే నువ్వు ఎన్ని ప్రమాణ గ్రంథాలను చుట్టూపేర్చుకొన్నా, ఎంతమంది గురువుల శుశ్రూష చేసినా, తుట్టతుదకు నీకు గురువైనది నీ స్వబుద్ధే.

ఇతరులు నీ బుద్ధిని వక్రంగాచేయవచ్చు. లేకపోతే సక్రమంగా చేయవచ్చు. దానిని మందగింప జేయవచ్చు. లేకపోతే ప్రజ్వలింపజేయవచ్చు. కాని నిన్ను వశపరుచుకోవాలంటే, నీ బుద్ధిని స్పృశించడంకంటె ఇతరులకు వేరుమార్గంలేదు.

నీ జీవితమంతా నీ బుద్ధిమీద ఆధారపడిఉన్నదని తెలుసుకో. వాఙ్మయము, పాఠశాలలు, గురుబోధ-ఇవన్నీకూడా నీ బుద్ధిని మేల్కొల్పడానికి ఏర్పడ్డ ఉపాయాలేకాని, అవి స్వతంత్రంగా నిరర్థకాలు.

నీ చుట్టూ, నీ లోపలా విస్తరించి ఉన్న జ్ఞానం అపారం కాని ఆ జ్ఞానమంతా నీలో చేరలేకున్నది. ఎందుచేత? నీ పాత్ర చిన్నదైతే, దానిని సముద్రంలో ముంచితేమాత్రం ఏమిలాభం? ఆ సముద్రంలోని ఏ కొలది బిందువులో నీ పాత్రలో బడినంత వరకే నీకు చెందుతాయి. మిగిలినదంతా ఉండినా నీకు లేనట్లే.

నీ బుద్ధే నీవు జ్ఞానాన్ని చేది నీలో పోసుకోగలిగే చేద. ఆకాస్త చేదకు చిల్లులుకూడా ఉన్నాయా-చేదడంలోనే జ్ఞానమంతా వ్యర్థమైపోతుంది.

కాబట్టి నీ బుద్ధి అనే చేదలో రంధ్రాలు లేకుండా చేస్తుకో-దానిని నీవు ఎంత పెద్దదిగ చేసుకొంటే, నీలో చేర్చుకొనే జ్ఞానం అంత విశాలం గంభీరం అగుతుంది.

ఫలానివాడు బుద్ధివిహీనుడు అని అంటాము. కాని బుద్ధి విహీనుడంటే, బుద్ధి ఎవనిలో సక్రమంగా నిర్మలంగా వెలగదో వాడు బుద్ధివిహీనుడన్నమాట. అంతేనేకాని అసలే మాత్రం బుద్ధి లేనివాడనికాదు.

అడవిమనిషిలో గూడ బుద్ధి ఉన్నది. ఆ బుద్ధిననుసరించే వాడు తన జీవయాత్రను నడుపుకొంటున్నాడు. వాడు వేటా

డినా, పంటలను పండించుకొన్నా, ఆత్మరక్షణ చేసుకొన్నా, రాళ్లను రప్పలను బూజించినా—అంతా వాని స్వబుద్ధిచేతనే. కాని వానికి "విద్య" అని మనం చెప్పుకొనేది లేకపోవడంచేత, వాని దంతా ఇంగిత జ్ఞానం. సహజజ్ఞానం-ఇన్‌స్టింక్ట్—అని అంటాము.

ఇంగితజ్ఞానమైనా జ్ఞానమే. జ్ఞానాన్ని స్వీకరించే శక్తి ప్రతి మానవునిలోను సహజంగా గర్భితంగా ఉన్నది. విద్యచేత కల్పితమైనది కాదది.

నీలో బుద్ధిఅనే జ్ఞానకణమే లేకపోయియుంటే—ఈ వేదాలెందుకు? ఈ భాష్యాలతో పనియేమి? ఈ గురువులు, ఈ పాఠశాలలు ఇక సెలవు పుచ్చుకోవచ్చు. నీ ఇంద్రియాలను జ్ఞానేంద్రియాలని పిలుచుకోవడం వ్యర్థం. అవి వట్టి కంతలు, చీకటి కన్నాలు.

నీలో ఏదైనా సత్యముంటే, నీ యునికి యథార్థమైతే—అదంతా నీ జ్ఞానం మూలంగా కాదూ? ఆ జ్ఞానం ఒకఅంశమే కానీ, ఒకబిందువే కానీ, ఒక కిరణమే కానీ, అదే నీ కాధారం. అదే నిన్ని చీకటులలోనుండి అమరధామం జేర్చేది.

సోదరా. పో లోపలకు, ఆ గర్భగుడిలోకి, లోనివెలుగు లోకి, ఆ దీపారాధనకొరకు, దీనికంటే నీకున్నతిని గలిగించే మార్గం మరియొకటిలేదు. నీలోని ఆ వెలుగే ఈ జగత్తునంతా ప్రకాశవంతంగా జేసే పరంజ్యోతి.

"తస్యభాసా సర్వమిదం విభాతి."

# వివేకసాధన

సోదరా, నీలో వెలుగుతూండే జ్ఞానదీపం నీకు సూక్ష్మమైన బాటను జూపుతున్నదీ లేనిదీ ఎప్పుడైన, నెమ్మదిగ ఆలోచించుకొని చూచుకొన్నావా?

కొన్ని వెలుగులు—చూచావో లేదో—చాలా దీప్తివంతంగా వుంటాయి. వాటిని చూచేటప్పటికి కండ్లు బయర్లు కమ్ముతాయి. ఎంతసేపూ తన ప్రభాపటలిని ప్రదర్శించుకొనడమే కాని, ప్రక్కనున్న వస్తువులను గూడ వెలుగులోకి దెచ్చి, వాని స్వరూపాన్ని ప్రకాశవంతంగా జేయవు.

నీ బుద్ధి ప్రభావంకూడ అట్టిదేమో యించుక యోచించుకో. నీ వెలుగు నీలో దాగివున్న లోతుపాతులను వెలికిదీసి, నీ జీవనమును ప్రకాశవంతముగ జేస్తున్నదో, లేక నీ చుట్టునున్న వారిని దిగ్భ్రమచేసి వారిని వంచింపజేయ జూచుచున్నదో తెలుసుకోకపోతివా, నీవు తుదకు ఆత్మవంచకుడవు, పరవంచకుడవు అయిపోతావుసుమా!

కొందరి బుద్ధి పాదరసంవలె ప్రవహిస్తూ ఉంటుంది. ఎట్టి గహన విషయాలైనా అవలీలగ బోధపరచుకోగలదు. వాద

ప్రతివాదాలు చేయడంలో అతిచతురత జూపుతుంది. వారెంత తెలివి తేటలు గలవారు, ఎట్టి ప్రజ్ఞావంతులు అనిఆశ్చర్యం కలిగేటట్లు చేస్తుంది. నీ బుద్ధికూడా అట్టిదేనా?

వారి బుద్ధిపటిమ అంతా, తమ ప్రజ్ఞాతిశయాన్ని ప్రదర్శించుకోవడంకోసం ఉపయోగపడేదే కాని, లోనిచీకట్లను పారద్రోలి ఆత్మోన్నతికి తోడ్పడే వెలుగు కాదది. అట్టి బుద్ధిబలం నీకు పరమశత్రువు అని తెలుసుకో. ఇప్పుడు కాకపోయినా, కొంత కాలానికైనా తెలుసుకోకపోవు.

ఎందుకంటూవా? అట్టి బుద్ధిబలం నీ స్వాతిశయాన్ని, అహంకారాన్ని వృద్ధిపరుస్తుంది. ఆత్మపరీక్ష చేసుకోనీయదు. నీ దోషాలను సమర్థించి. వానిని గుణాలనుగ ప్రదర్శిస్తుంది. నీ బుద్ధే నీ పక్షం ప్లీడరువలె వాదించి నిన్ను ప్రమత్తునిగ జేసి వేస్తుంది. వాదబలంచే నీ విమర్శకులను పట్టికొట్టిస్తుంది. యుక్తులపై యుక్తులను పుంఖాను పుంఖంగా వదిలి నిన్నాక్షేపించువారిని ఓడిస్తుంది. ఎన్ని ప్రమాణాలనో సమయోచితంగా ఏకరువుపెట్టి, ధర్మసంరక్షణకు బూనినట్లు నటిస్తుంది. బుద్ధిప్రభావముయొక్క మహేంద్రజాలమునకు మోసపోనివారరుదు—జాగ్రత్త.

నీ బుద్ధి ప్రభావము సత్యమును, ధర్మమును ద్యోతకము చేయుటలో తోడ్పడుటకు బదులు, నీ యధికారాన్ని, నీ ప్రాబ

నిల్వాన్ని, నీ వంచకత్వాన్ని స్థిరపరచుకొనే ఉపాయమైనదా నీ పతనము ప్రారంభమైనట్లు ఎంచుకో. అట్టి బుద్ధిబలము నిజముగ నిన్నధోగతికి కూలద్రోసే మాట సత్యం. అది ఆత్మ నాశనకరమైన బుద్ధి.

బాహుబలముకంటె గూడ, బుద్ధిబలము కొన్ని వేళల మహోపద్రకరము. ఎందుకు?-ఒక నిదర్శనము—నేటి పాశ్చాత్యుల బుద్ధిబలము సాధింపలేనిదేది? ప్రకృతి రహస్యము లన్నిటినీ ఉద్ఘాటిస్తున్నది. నేటి మారణ యంత్ర నిర్మాణములో వ్యక్తమగుచున్న కల్పనా శక్తికి మనమచ్చెరువు చెందుటలేదా?

బాహుబలముతో సాధించలేని దిగ్విజయములెన్నో నేడు బుద్ధిబలముతో నవీనమానవుడు సాధింపగలుగుతున్నాడు.

రాజనీతి చమత్కృతియందు వ్యక్తమగుచున్న బుద్ధి పటిమ సామాన్యమైనదా? రాజ్యతంత్రజ్ఞులు, రాజనీతి విశారదులు, డిప్లమాట్సు, స్టేట్సుమెన్ జిస్టులు, వర్తకసామ్రాట్లు, బ్యాంకర్లు, గూఢచార్లు, శాసన కర్తలు—ఒహోహో! వీరి బుద్ధి ప్రభావము వర్ణింపనేరి తరము? కాని ఈ బుద్ధిబలమంతా ఈ జ్ఞానపటిమ యావత్తూ, ఈ శేముషీ దౌరంధర్యం-సాధించేదేది? దుర్బల జాతులహింస, దరిద్రదేశాల దోపిడి, అమాయకపు గుంపులను లోబరచుకొనుట, అధికారాలకు కోటలను కట్టుట, ప్రజాపీడనను ధర్మసమ్మతమైన దానివలె, సామ్రాజ్య కాంక్షను సివిలిజేషను యొక్క పురోగమనముగ ప్రదర్శించుట, విషయలంపటత్వ

మును సభ్యతాగరిమగ భావించుట, విశృంఖలతను ధీస్వానత్గా నిరూపించుట-ఎన్ని ఆకార్యము లీ కుహనా"జ్ఞానయుగము"న వర్థిల్లుట లేదు?

ఇట్టి జ్ఞానపటిమయేనా నీ బుద్ధియందు ప్రకాశించు చున్నది? అట్లయినచో నిది రాక్షసబుద్ధి, ప్రళయాంతక బుద్ధి యనితెలసికో. పౌలస్త్యుడుకూడ సర్వశాస్త్రపారంగతుడే సుమీ. ఘోరములైన యజ్ఞయాగాది క్రతువులను గావించిన కర్మిష్ఠి. లంకలో ఎట్టి నాగరకతా సౌధములను నిర్మించి యుండలేదు? లంకను ఆ దశకంఠుడెన్ని అస్త్రాగారములతో నింపి శత్రుదుర్భేద్యము జేసియుండలేదు? ఆ రాక్షసత్వమంతయు నెట్లు పరిణమించినదీ వాల్మీకి మహాముని నీకు గనులకు గట్టినట్లు చిత్రించియుండలేదా?

బుద్ధి వక్రించిన, లోకమున కెట్టి మహానర్థము వాటిల్లునో ఇంతకంటె వేరు నిదర్శన మేమికావలె? ప్రాచీన కాలమునకు బోవడమెందుకందువా? నేటి ప్రపంచయుద్ధమే దానికి ప్రబల నిదర్శనము. బుద్ధిబలము వ్యష్టిలో స్వాతిశయాన్ని పెంచి, ఆత్మవంచనను బలపరుస్తుంది. సమష్టిలో జాతీయదురహంకారాన్ని పురికొల్పి, లోక నాశనహేతువు అగుతుంది.

బుద్ధి తర్కించగలదు, యుక్తులను బన్నగలదు. మోసగించగలదు. ధనాన్ని దోచిపెట్టగలదు. అమాయకులను వంచించ గలదు. దుర్బలులను హింసించగలదు; సభ్యతపేరున

కపటనాటక మాడగలదు, అధికారానికి కోటలను కట్టగలదు, ప్రాకృతశక్తులను వశపరచుకొని పరరాజ్యాలను లోబరచుకొనగలదు. బాహుబలం సాధించలేని విశాలసామ్రాజ్యాలను బుద్ధిబలం ఆక్రమించి, చండ ప్రచండంగా శాసించగలదు. ఇట్టి బుద్ధినే మనవాళ్లు రాక్షసబుద్ధి, ప్రళయాంతకబుద్ధి అని చెప్పారు. కాబట్టి నీ బుద్ధి ప్రభావం యొక్క గతులను బహు జాగరూకతతో గనుపెట్టుచూడవలయు సుమా!

బుద్ధియొక్క ప్రధానలక్షణం వివేకమని తెలుసుకో. వివేకం మంచి చెడుగులను, ధర్మాధర్మములను, సత్యాసత్యములను వివేచించి, నీ ఆత్మోన్నతికి సాధనభూతమైన ఋజుపథాన్ని చూపుతూ ఉంటుంది. వివేకం ఒక్కమారుగ ఉదయించదు. నీలో సత్య జిజ్ఞాస ఎక్కువైనకొద్దీ ధర్మనిరతి తీక్ష్ణమైనకొద్దీ, ఆత్మపరీక్షను గావించుకొన్నకొద్దీ, పూర్వవాసనలనతిక్రమించినకొద్దీ, బుద్ధిలో దాగియున్న వివేకం ప్రజ్వలించి, నిన్ను ఊర్ధ్వముఖమునకు గొని పోతుంది. వివేకరహితమైన బుద్ధి ఆత్మనాశనకరం.

వివేకసాధన కత్తిసామువంటిది-దీనినే మన పెద్దలు అసి ధారావ్రతమన్నారు. తీక్ష్ణమైన కత్తి అంచుమీద నడక వంటి దీ సాధన. నిన్ను భ్రమప్రమాదాలు, స్వాతిశయాలు, అహంకారాలు, కామక్రోధాలు ఆవరించియుండడంవల్ల, బుద్ధి తనలోని వివేకాన్ని బహిర్గతంకాకుండాచేస్తుంది. శ్రుతిజ్ఞానం

కలవానిచెవి ఎంత సునిశితంగా ఉంటుందో ఎప్పుడైన చూచావా? శ్రుతి ఏ కొంచెం తప్పినా, అతడు తన చెవులను మూసుకొంటాడు. అట్లాగే వివేక దృష్టికి ఏ స్వల్పదోషం అడ్డు వచ్చినా, పరితాపంతో తన దృష్టిని మరల్చుకొంటాడు. ధర్మాధర్మముల మధ్యఉండే తారతమ్యం బహుసూక్ష్మం. ఒక అవస్థలో ధర్మంగాకనబడేది ఇంకో అవస్థలో అధర్మంగా కనబడుతుంది. ఒకరికి దోషంగా తోచనిది ఇంకోరికి మహాదోషంగా తోస్తుంది. ఈ వివేకం నీ చిత్తసంస్కారాన్ని, నీ సాధనాధికారాన్ని బట్టి భేదిస్తూవుంటుంది.

నీకు మురికి బట్టను కట్టుకొనే అలవాటుంటే. శుభ్రత అనేది నీకు గోచరించదు. ఆ బట్టపై ఎన్నిమరకలుపడ్డా, అవి మురికిలో గలసి పోతాయి. నీ నాసికాపుటములు కూడ ఆ దుర్గంధానికి అలవాటయి పోతాయి, నీవు శుభ్రతకు అలవాటు పడ్డావా, నీబట్ట కొంచెం మురికి అయినా, నీకు కష్టంగా తోస్తుంది. ఆ బట్టను విడిచే వరకు నీకు తోచదు. నీ ఘ్రాణేంద్రియంకూడా బహుతీక్ష్ణమై పని పట్టుతుంది. దుర్గంధాన్ని దగ్గరకు రానీయదు. నీ దృష్టి బహునిర్మలమై, ఎప్పుడూ శుచిగా ఉండేవస్తువులనే చూడగోరుతుంది.

చూడు గొప్ప గొప్ప సాధకులు ఎట్టి పరితాపమును వెలిపుచ్చుతూ ఉంటారో? ఎందుచేత? వారు మనకంటె పాప కృత్యములను జేసినవారనా? కాదు. మన దోషాలను మ్రింగి వేసుకొంటాము. పాపభీతి అనేది మనకు లేదు. ఆత్మపరీక్ష చేసు

కోము. కొండలంత తప్పులున్నా, అవి మనకు రవ్వంతలుగ గనపడుతాయి. మన యుక్తిచమత్కృతిచే, వాదకౌశలంచే వానిని మంచిగ భ్రమింపజేసుకొంటాము - ఆత్మవంచకులం మనము.

కాని సాధకు డట్లాకాదు, ఎప్పుడూ ఆత్మస్థుడై ఉంటాడు. వానిలో ధర్మభావం మహోజ్వలంగా ప్రకాశిస్తూ ఉంటుంది. నిష్ఠలో ఏ స్వల్పదోషం, ఏ కించిత్తు స్ఖాలిత్యం కనబడ్డా సహించడు. ఏ సందర్భంలోనైనా, కొంచెం కోపమో, ఏ చిత్తవికారమో కలిగినా, ఏదో హింసచేసినవానివలె దూషించుకొంటాడు. ప్రాయశ్చిత్తంకోసం ఉపవసిస్తాడు, నీ సంధ్యావందనంలో నీవు ధ్యానంచేసేదేమిటి? "ధియోయోనః ప్రచోదయాత్"-మా బుద్ధులను ధర్మాభిముఖంగా త్రిప్పుము అనే ఆవేదనే గాయత్రిలో తీక్ష్ణమగుతూ ఉంటుంది. ఆత్మజ్యోతి దరిని జేర్చే, సర్వమును మంగళప్రదంగా జేసే బుద్ధిని అలవరచుకో.

"తమసో మా జ్యోతి ర్గమయ"

# జ్ఞాత - జ్ఞేయం - జ్ఞానం

సోదరా, ఏమంటున్నావు? - వర్తమానకాలం జ్ఞానయుగం - Rationalisticage - బుద్ధిప్రభావం సర్వవిధాల ప్రదర్శింపబడుతోంది—అంధ విశ్వాసాలు, మూఢ నమ్మికలు వెలుగు ముందు చీకట్లవలె పారిపోతున్నాయి-ప్రత్యక్ష ప్రమాణంచేత రుజువుచేస్తేనే కాని, హేతువాదంచేత సమర్థిస్తేనేకాని, దేనినీ అంగీకరింపము-అంటూ నీలోని జ్ఞానమహిమను ప్రశంసించుకొంటున్నావు.

సంతోషమే-నీ జ్ఞానాన్ని నీవు మెచ్చుకోకపోతే, దాని ప్రయోజనమేమున్నది? నీలో వెలిగే జ్ఞానతేజంయొక్క మూల్యాన్ని నీవు గ్రహింపగలుగుతున్నందుకు నిన్నభినందిస్తున్నాను. వేదం "అపౌరుషేయ"మన్నా, బైబిలు "డివైన్ రెవలేషను" అన్నా, కొరాను ఈశ్వరదత్త గ్రంథమన్నా-నీవు నవ్వుతావు. ఈ నవ్వడంలో నీవు చేస్తున్నదేమిటి? నీ స్వబుద్ధికి పట్టంకట్టుతున్నట్లుకాదూ? నీ జ్ఞానానికి గురుపీఠం ఏర్పరుస్తున్నావన్నమాట. సంతోషమే. ఈ జ్ఞానరస్తాలోనే నడుస్తాండు. తొట్రుపాటులేకుండా ఇట్లా నడవగా, నడవగా, నీలో వెలిగే జ్ఞానకళ ఎక్కడిదో, ఎంత అపారమైనదో, అది

నిన్నెట్టి ఊర్ధ్వలోకములకు దీసికొనిపోగలదో నీవే తెలును కొంటావు.

అయితే, నీలో నీ కీ మార్పు కలగడానికి కారణమేమిటి? ఈ కాలపు "సైన్సు" మూలంగాకాదూ? "సైన్సు" అంటే, ప్రకృతిశాస్త్రంకాదూ? "సైన్టిస్టు" ప్రకృతిని పరిశోధనచేసి చాటుతున్న దేమిటి? మనచుట్టూ ఆవరించి, విస్తరించిఉన్న ప్రకృతి మూడంతస్థులు మేడవలెఉన్నది. మొదటి అంతస్థు అచేతమైనజడ జగత్తు-Inorganic; రెండో అంతస్థు సచేతనమైన ఉద్భిజ్జములు-Plant life; మూడో అంతస్థు చరజగత్తు-Biological. ఈ మూడంతస్థులు ఒకదానిపై నొకటి క్రమానుగతంగా ఉన్నా, వీని విశిష్టలక్షణాలు వేరువేరుగ గన్పడ్డా, మొత్తంమీద ఈ త్రిభువనాలలోను "లా" అనేది సర్వత్రా వ్యాపించిఉన్నది. ఈ జగత్తులోపల ఎన్ని అసంఖ్యాకములైన వస్తువులున్నా, ఇవన్నీ "లా"కు లోబడే ప్రవర్తిస్తున్నా యని కాదూ నీ "సైన్సు" బోధిస్తున్నది?

అయితే ఈ "లా" ఏమిటో ఆలోచించి చూసుకొన్నావా? ఈ పదం యేకాక్షరమైనా, దీని అంతర్యం గ్రహించావంటే, ఈ క్షరజగత్తుయొక్క ఆంతర్యం, స్వరూపం బోధపడుతుంది. కాబట్టి ఆలోచించుకో. నీవు "లా" అంటున్నావే-అది ఒక స్వతంత్రమైన వస్తువా? కాదు. వస్తువే అంటావా? "లా" ఈజగత్తును శాసిస్తూంటే, ఆ "లా"ను శాసించే దేమిటి? ఇది అసంగతంకాదూ? "లా" అంటే,

సైంటిస్టు అభిప్రాయంలో-ఒక పద్ధతి. ఒకనియతి, ఒక ప్లాను, ఒక విధానం అనేగా-దీనినేగా లాటిను భాషలో Modus operandi అంటారు? ప్రకృతి పని చేస్తున్నదంటే-విశృంఖలంగా, ఒక నీతి నియమము లేకుండా, అరాజకంగా చేయటం లేదు. అది ఒక నిర్ణీత పథంలో నడుస్తున్నది. సర్వత్రా పూర్వాపరాలకు కారణ కార్యం అనే నైమిత్తిక సంబంధమున్నదీ-అని సైంటిస్టు ప్రత్యక్షంగా రుజువు చేసి చూపు తున్నాడు. కాదూ?

ఈ ప్రపంచాన్ని సైంటిస్టు చూస్తున్నాడంటే-దేశం, కాలం, నైమిత్తికం అనే మూడు సంబంధాల సమ్మేళనంగా చూస్తున్నా డన్నమాట. అంతేనా? దేశం వినా, యే మార్పునూ నిర్ణయించలేడు. నైమిత్తికం వినా, వస్తువుల పరస్పర సంబంధాన్ని గ్రహించలేడు. ఈ త్రిత్వంతో కూడివున్న దన్నమాట ఈ జగత్తును గూర్చిన జ్ఞానం. కాబట్టి జగత్తు అంటే Bundle of relations కాదూ?

అట్లాఅయితే, సైంటిస్టు పరిశోధనఅంతా, అతడు కనిపెట్టే 'లా' అంతా, దేశకాల నైమిత్తికములకు అనువర్తించే సంబంధము లని ఒప్పుకోవలసివస్తుంది. ఈ మూడు సంబంధములను లోపింపజేస్తే జగత్తు ఏమవుతుంది? యేమవుతుందో కాని. నీ బుద్ధికి మాత్రం గోచరంకాదు-అది అయోమయం.

దేశ, కాల, నైమిత్తిక సంబంధములంటే యేమిటో యోచించావా? ఈ త్రివేణి-ఈత్రిపుటి-ఈ మూటిని అన్వయపరచే సూత్రమనేగా నీవు "లా"ను నిర్వచించేది? కాబట్టి

జగత్తు అన్వయమగుతున్నది నీకు ఈ త్రిపుటినిబట్టే అయితే, నీ జ్ఞానమే ఈ మూడుపాయలుగ చీలి తిరిగి ఒకటవుతున్న దేమో నీవు ఆలోచించుకొన్నావూ? చూడు నీ జ్ఞానం ఈ జగత్తును ఈ మూడు "మోల్డ్స్"లోను ఎట్లా కరగించి పోస్తోందో? కాబట్టి ఈ మోల్డ్స్ నీ జ్ఞానం యొక్క మూడు గతులు, మూడు సందర్భాలు, మూడు పరిచ్ఛేదాలు-యేమైనా అను-ఈ మాట నంగీకరిస్తావా? ఏమని? ఒక్కటిగా ఉండే జగత్తును మూడుగానో, నాలుగుగానో, పరిచ్ఛేదంచేసి చూస్తున్నావని?

దీనినేకాదూ మీ ఇంగ్లీషు ఫిలాసఫర్లు—దేశకాల నైమిత్తికములు-Conditions of thought అని చెప్పేది? నీబుద్ధి ఈ మూడుకొలతబద్దలను కల్పించుకొని, వీనిచేత జగత్తును బరిశీలించి. విభజించి. వర్గీకరించి, కొలిచి, తూచి, పేర్లుపెట్టి, పరస్పర సంబంధాలను, సాదృశ్యాలను, తారతమ్యాలను నిర్ణయించి, ఇదంతా ఒక ప్లాను, ఒకప్లాటు. ఒక సంఘటన, ఒక చరిత్ర, ఒక బ్రహ్మాండం -Universe అని అన్వయపరచుకొంటున్నదన్న మాట.

అయితే, "సైన్సు" చేస్తున్నపని ఏమిటి? ఈ జగత్తును నీ జ్ఞానపరంగా అన్వయపరుచుకోవడమేగా? ఇంతేనా? నీవు ఒక కావ్యాన్నర్థంచేసికొంటున్నావంటే ఏమిటి? ఆ కావ్యంలో కవి ఏ భావనలను, ఏ అనుభవాలను, ఏ సంఘటనలను కూర్చి ఒక ప్లాటుగ అల్లాడో, ఆ భావనలను, ఆ అనుభవాలను ఆ

ప్లాటుకు నీ బుద్ధిలోకి సమన్వయించుకొంటున్నావన్న మాట కాదూ? కవియొక్క జ్ఞానం, నీ యొక్కజ్ఞానం-వీనిమధ్య ఎంత అంతరమున్నా-ఏకజాతీయం కాకపోతే, అంటే కవి మనస్సుకూడా కొంతవరకైనా నీ మనస్సు మాదిరిదే కాక పోతే, ఆ కవిహృదయం నీ కెట్లా గోచరమగుతుంది? కవి రస సిద్ధుడు, నీవు రసజ్ఞుడవు-కాబట్టే కావ్యపఠనంతే, ఒక రసవిదు నకు ఇంకో రసవిదునకు మధ్య జరిగే సంవాదమన్నమాట. అట్లాగే కాదూ, సైంటిస్టుకూ ఈ జగత్తుకూ గల సంబంధం?

"సైంటిస్టు" ఈ జగత్తులో ఒకపద్ధతి, ఒక సామరస్యం ఒక డిజైన్, ఒకవిధానం, ఒక పర్పస్, ఒక క్రమోన్నతి-కను పెట్టుతున్నాడంటే-తన జ్ఞానంయొక్క లక్షణాలూ, విశ్వ జ్ఞానం యొక్క విలక్షణాలూ ఒకటైయుండాలి. లేకపోతే, ఈ ప్రకృతి సైన్సుకు ఎట్లా అవగాహనమగుతుంది? ఏ జ్ఞానం లక్షణాలతో నీలో వెలుగుతున్నదో, అట్టి జ్ఞానమే అట్టి లక్షణా లతోనేవిశ్వంలో వ్యాప్తమైన జ్ఞానం కూడా—ఈ రెంటిమధ్య అంతరం ఎంతైనా ఉండనీ—ప్రకాశిస్తూ ఉండిఉండాలి. సైంటిస్టు తనజ్ఞానంతో విశ్వంలో నిహితమైన జ్ఞానాన్ని పరిశీలిస్తున్నాడు, తెలుసుకొంటున్నాడు — నీ లోని జ్ఞానమూ, విశ్వంలోని జ్ఞానమూ ఏకజాతికి చెంది ఉండబట్టే నీవు జ్ఞాతవుకాగల్గు చున్నదీ, జగత్తు నీకు జ్ఞేయము కాగలుగుతున్నదీ — ఇంతే కాదూ?

నీ జ్ఞానం స్వల్పమగుగాక, విశ్వజ్ఞానం అపారమగుగాక. ఈ రెంటియొక్క సంయోగమే నీ "సైన్సు." అవునా కాదా? నీ జ్ఞానమనే చిన్నపాయనుండి బయలుదేరి పోగా పోగా, విశ్వతో ముఖమైన జ్ఞాన మహాసాగరంలో జేరగలుగుతున్నావు. కాబట్టి నీవుజ్ఞానయోగివి కాదూ? సైంటిస్టు నిజంగా జ్ఞానయోగి. ఎప్పుడు సైంటిస్టు తన జ్ఞానంతో పరిశోధన ప్రారంభించాడో, అప్పుడే తాను జ్ఞాని అని విశ్వసిస్తున్నాడు. ఎప్పుడు విశ్వాన్ని జ్ఞేయంగా పరిశీలిస్తున్నాడో—అప్పుడు జగత్తునుగూడా జ్ఞాన ప్రకాశంగా విశ్వసిస్తున్నాడు. జ్ఞాత—జ్ఞేయం-జ్ఞానం ఒక్కటి కావటంలేదూ నీ సైన్సులో? కాబట్టి సైన్సుకూడా నిన్నూ, నీజగత్తునూ ఒక్క జ్ఞాన సమ్మేళనంలో అనుసంధానం చేస్తున్నది. ఎంత గంభీరమైన విశ్వాసం!

# అతీంద్రియ దృష్టి

సోదరా, నీబుద్ధే సర్వమూ అని భ్రమపడేవుసుమీ. నీ బుద్ధి నీ యింద్రియాలవలెనే అతి చంచలము. ఇప్పుడు పుట్టిన తలంపు మరుపటిక్షణము ఉండదు. నీవీ రోజున సత్యమనుకొన్నది, రేపు అసత్యమగుతుంది. పుర్రెకొక బుద్ధి అన్నారు. ఒకరికి తోచి నట్లు యింకొకరికి తోచదు. నిన్నది సతతమూ క్రిందికి పైకి, అటు ప్రక్కకు ఇటుప్రక్కకు ఈడుస్తూ పెడమార్గాల పెట్టు తూంటుంది.

అయితే నీ బుద్ధిని వదలివేయమని అంటున్నాననని అను కుంటావేమో! కాదు, నీ బుద్ధిని వదలివేసుకుంటే, వెంటనే నీవీ ప్రపంచములో నిలుచోడానికి తావే ఉండదు. నీ యునికే భ్రష్టమై పోతుంది. బుద్ధి నీ యంతఃకరణము-అనగా లోపలి పనిముట్టు, బాహ్యాకరణములు లేకపోతే, నీవు వట్టి వికలాంగివై పోతావు. అట్లాగే ఈ యంతఃకరణము లేకపోతే, నిరాధారు డవై చీకటి కూపంలో బడిపోతావు. నీ బుద్ధి నీకు అంతఃకర ణం గనుక, దానిని నీవు సరిగ ఉపయోగించుకొంటే. నీవు సరి యైన మార్గాన నడచి, ముందుకు పోగలవు.

బుద్ధి నీ సర్వస్వము అని భ్రమపడి పోతావేమోనని, బుద్ధి నీ లోపలి పనిముట్టు మాత్రమేసుమా, అని చెప్పుతున్నాను. బుద్ధికి సహజమైన వెలుగు లేదు. చూడు సూర్య చంద్రాదులను. సూర్యుడు స్వయంప్రకాశకుడు. చంద్రుని ప్రకాశము నిజముగ చంద్రునిది కాదు. సూర్యుని వెలుగే చంద్రుని మీద ప్రతిఫలించి, దానికిగూడ వెలుగున్నట్లు నీకు భ్రమ కలిగిస్తున్నది. బుద్ధియొక్క వెలుగుకూడా స్వయం ప్రకాశము కాదు. బుద్ధిలో దాగియున్న విశ్వవ్యాప్తమైన జ్ఞానము స్వయం ప్రకాశమైనది. దాని వెలుగు యొక్క ఆభాస కొంచెము నీ బుద్ధిని ప్రకాశింప జేస్తున్నది. నీ బుద్ధి యెంతవరకు విశ్వప్రకాశమైన జగజ్జ్యోతిని సమీపించగలదో అంతవరకే నీ బుద్ధి ప్రకాశవంతమై నీ ఆత్మోన్నతికి దోడ్పడగలదు.

నీ బుద్ధి వెలుగు పగటిపూట వెలుగువంటిది. అది నీకు సన్నిహితములైన పరిసరములను మాత్రమే చూపగలుగుతుంది. నీకు దూరంగా ఉన్నట్లు ఉండే ఆకాశాంతములను ప్రకాశింపజేయు లేదు. రాత్రిపూట చీకటైటువంటివో ఒకమారు యోచించుకో. నీ వెప్పుడైనా, నీ గ్రామము వెలుపల, నిర్జనంగా ఉండే, పచ్చిక బయలులో రాత్రిపూట వెల్లకిలా పండుకొని, నీ దృష్టిని నలువైపుల బ్రసరింపజేస్తే, నీ కెట్టి అనుభవము కలుగుతుందో, ఆలోచించుకొన్నావా?

రాత్రి, అమవసనిశి, అంధకారబంధురమని కాదూ నీ భయము? కాని ఆనిర్జన ప్రదేశంలో, ఆ చిక్కని చీకటి మధ్య

ఒంటరిగ్గా బరుండి, కనుల పైకెత్తి చూచినప్పుడు, నీ యిల్లు, నీ కుటుంబము, నీ బంధు మిత్రులు, నీ గ్రామము, నీ చెట్లు, చేమలు, నీ పొలాలు-నిన్నావరించియుండు, నేలనాశ్రయించి యుండు, వస్తువు లేవియు నీకు గనబడని మాట నిజము. సకలాకృతులు ఆ చీకటిరాసులలో మునిగిపోయి, నీ కంటికి మరుగై పోయినవి కాని నీపైన ఆకాశము నీలవితానమువలె, తారాగణముల కాంతులతో నెట్లు విస్తరిల్లి వ్యాపించి కనుల పండువకుచున్నదో తిలకింపుము. నీవు పరుండిన తావెక్కడ? నీ కనుల మేరలెంత? కానీ నీ చూపులు ఎట్లు నేలను విడిచి, ఉరుకు లెత్తుతూ, మేఘమండలముదాటి, అంబరచుంబితము లైన వాయు సౌధములను గూడ నతిక్రమించి, ఇంకను పైకి, ఆ పైకి పోయి, పోయి, తారాగణముల మధ్యనుండి దూసుకొని, ఇంకను దవ్వుల కెగురుచు ఆకాశగంగలో బడి ఆశాంతముల వర కెట్లు తానమాడుచుండునో - ఒక్కమారు జ్ఞప్తికి దెచ్చుకో.

ఎంత అద్భుతమైన ఆకాశయాత్ర! నీ చూపులు, నీ మానసమును నీ దేహ బంధనములనుండి విడిపించి ఎల్లలు లేని, పారమెరుగని, ఆశాంతముల అంచులవరకు తీసుకొనిపోయి, విశ్వ వ్యాప్తి యొక్క గభీరతను జూపుచు, లోకాలపై లోకాల గుండా, ఊరేగించి, నిరతిశయానందమున మైమరచునట్లు చేయగల్గు చున్నవి. ఆ లోకాంతములను నీకు వెల్లడిపరచుచు

న్నది పగటి సూర్యుని వెలుగా, లేక అమావాస్య రాత్రినాటి చీకట్లా?

ఈ పగటి వెలుతురుకంటె, రాత్రి చీకట్లే నిన్ను ఊర్ధ్వ లోకములకు తీసుకొనిపోగలుగుచుండ, రాత్రని, చీకట్లని ఎందుకు భయపడెదవు? ఈ వెలుగులు నిజమైన వెలుగులు కావు. ఈ చీకట్లు నిజమైన చీకట్లు కావు.

అట్లే నీ బుద్ధి నతిక్రమించిన, చీకట్లావరించి నిన్ను అజ్ఞానతిమిరములలో బడవేయునని జడియుచున్నావు. కాని నీ బుద్ధి వెలుగు పగటిపూట వెలుగుసుమా. అది నీ వ్యవహార జగత్తుకు గొంచెముగ నుపయోగించునుగాని అది నిజముగ జగత్ప్రకాశమైనది కాదు. నీ బుద్ధి నతిక్రమించినప్పుడే, రాత్రి చీకట్లలో నీ చూపులు తారాపథములలోనికి విలసిల్లునట్లు, నీకిప్పుడు మరుగై యున్న ఊర్ధ్వ లోకములు, చిదాకాశము, సత్య ధర్మములు, నీకు దృగ్గోచరములగును. నీ బుద్ధికి ఆవల ఈ సూర్యుడు భాసించడు. ఈ చంద్రతారలు ప్రకాశించవు. విద్యుల్లతలు మెరువవు. ఈ క్షణికములైన వెలుగుజిలుగు లన్నియు నంతర్ధానములగును. ఏ జ్ఞాన జ్యోతియొక్క ఆభాస నీ బుద్ధియో, ఏ వెలుగు మూలమున ఈ సూర్య చంద్రాదులు నీ కంటబడుతున్నారో. ఏ వెలుగు స్థిరసౌదామినివలె జగత్సౌందర్యము నీ యంతరంగమున తాండవింపజేయునో, ఆ జగజ్జ్యోతి నీకు ప్రత్యక్షమగును.

నీ చిత్త విక్షేపముల మూలమున, నీ బుద్ధిలోని జ్ఞాన దీపము నిలచి వెలుగక, గాలిలోని దీపమువలె ఇటు అటు కొట్టుకొను చున్నది. నీ బుద్ధి నరికట్టుము. చిత్తైకాగ్రతతో నీ బుద్ధి లోపల ప్రవేశింపుము. కాని నీ బుద్దే నిన్ను లోపలకు పోనీయక అవరోధము గల్పించును, జాగ్రత్త. బుద్ధియను ముసుగుపైని నగిషీపని నీ కనులకు మిరుమిట్లు గొలుపుచు, తన బాహ్య సౌందర్యముచే నిన్ను మోహావేశమున బడవేయజూచును. కాని ఎంత శిల్పినైపుణ్యముండిననేమి, ఈ ముసుగు, ఈ మూత-ముసుగే మూతే. ఇందలి కళాశోభ నిజముగ నీ మూతదికాదు. అందు దాగియున్న జ్ఞాన తేజము ఈ మూత నింత శోభాయమానముగ జేయుచున్నది. ఈ బంగారు శోభకు మూలమైన ఆ స్వచ్ఛ కాంతి ఆ జ్ఞానతేజము, ఆ దివ్య జ్యోతి ఎన్నిరెట్లు సుందరమైనదో నీవు చూడగోరుట లేదా? సోదరా, రా. రమ్ము, బుద్ధిద్వారములను తెరచి, గర్భ గుడిలో నిండువెలుగున ప్రకాశించుచున్న జగజ్జననిని మన దివ్య నయనాంచలముల నీరాజనములతో నారాధించి ఆనందమయుల మయ్యెదము-రమ్ము.

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖ్యం."

# ఖండా ఖండం

సోదరా, నీ బుద్ధి అతి విచిత్రమైనది. నీ బుద్ధే నిన్ని సృష్టిలో కెల్ల పెద్దనుగ జేసినది. నీ బుద్ధే నిన్ను జిజ్ఞాసువునిగా నొనర్చి ప్రకృతి అంచులవరకు బోవునట్లు ప్రోత్సాహపరచు చున్నది, నీ వెన్ని చదువులు చదివినను, నీవెంత జ్ఞాన మార్జించినను, నీ బుద్ధి సంతుష్టి చెందక నిరంతరము నిన్ను సంశయాత్మునిగ జేయుచున్నది. నీ బుద్ధి నిన్నెందుకు ఇట్లు విశ్రాంతి నియ్యకుండ, శ్రమను గల్పిస్తున్నదీ ఒకించుక యోచించుకో.

నీ బుద్ధి పూర్తిగ శుద్ధిదై యుంటే, నీకిట్టి శ్రమ కలిగెడిది కాదు. నీకింకా తెలుసుకోవలననెడి కోరిక తనివితీరకుండా ఉండబట్టేకదా, నీకింత ప్రయాస కలుగుచున్నది! నీ బుద్ధిలోని వెల్గు పూర్తిగ ప్రకాశించి, సర్వమును నీకెరుక పరప గలిగియుండిన యెడల, సంశయములు నిన్ను బాధించక. సర్వజ్ఞుడవై, శాంతి నొందెడివాడవు. కాని నీ బుద్ధి పూర్తిగా శుద్ధిదీ కాదు, సంపూర్ణమైన చూపుగలదీ కాదు.

పశువులకు లేని బుద్ధి విశేషము నీలో వికసించినందుకు, నీవు పరిశోధకుడవై, శాస్త్రజ్ఞుడవై, నీ యాధిక్యమును జాటు

కొనుచున్నావు. సరే. కాని ఆ బుద్ధే నీకు తీరని జ్ఞాన పిపాసను కల్పించి, ఎండమావులను వెంబడించే కృష్ణమృగాన్నిగ జేస్తున్నది. ఎందుచేత నీ బుద్ధి నీలో నిట్టి తీరని దాహం తుష్టిలేని క్షుత్తు సఫలం కాని కోరిక కలిగిస్తున్నదో ఎప్పుడైనా ఆలోచించుకొన్నావా? నీవు నిజంగా స్వతంత్రుడవూకావు. పరతంత్రుడవూ కావు. మానవుడా, నీ స్థితి, బహు సందిగ్ధము సుమీ.

ఎంత సేపూ నీవు దేశకాలాలగిరిలో జిక్కుకొనియు, వాని ఎల్లలను దాటిపోవాలని పెనగులాడుచున్నావు. కాని ఆ ఎల్లలను దాటగలుగుతున్నావా? నీ ఊహ రెక్కలు కట్టుకొని ఎగరనీ-ఎన్ని ఆకాశాలను దాటితేమటుకు, ఇంకా నీవు చేరలేని ఆకాశాలు నీముందు లేవా? కాలగర్భంలో దూరి ఎంత ముందుకు దూసుకొనిపోతే మాత్రం ఇంకా ఎన్ని యుగాలు, ఎన్ని కల్పాలు, ఎన్ని ప్రళయాలు తెరలపై తెరలవలె అంతు లేకుండా అడ్డుతగులుట లేదు? దేశంయొక్క అంచులనా చేరలేకున్నావు. కాలంయొక్క కొసలునా పట్టుకోలేకుండా వున్నావు. అయినా ఎందుకు ఆ అందుకోలేని, నీ దృష్టి ప్రసరించలేని, నీ అంకగణితము లెక్కించలేని, నీ యూహాలకు చిక్కని ఆవలి వెలుగులకు పరుగులిడుతున్నావు?

నీ హస్తాలు పొట్టివైనా, నీ ఆశమాత్రం ప్రపంచాన్నంతా కౌగలించుకోడానికి సాగుతోంది. కాని ఏమి లాభం! నీ బుద్ధి ప్రపంచాన్నంతా ఒక కౌగిలిలో ఇముడ్చుకోగలుగు

తున్నావా? లేదు, ప్రపంచాన్ని ముక్కలు ముక్కలు చేసి, తునకలు తునకలుగ విడదీసి, తిరిగి కట్టలు కట్టి, ఒకదానిపై నొకటి చేర్చి, సమూహపరచడమే కాని, విభాగాలు, పరిచ్ఛేదాలు లేని ఒక్కటిగ భావించలేకున్నది. పాపం, అంతులేని శ్రమగా వున్నది నీ పరిశీలన అంతా.

చూడు నీ భాషే నీ బుద్ధియొనర్చే విశ్లేషాన్ని సూచించడం లేదా? నీనోటనుండి నిరంతరం వెలువడే మాట లేవి? ఇక్కడ అక్కడ ఎక్కడ—ఇప్పుడు, అప్పుడు, ఎప్పుడు-ఇట్లు, అట్లు, ఎట్లు—ఇంత, అంత, ఎంత-ఇది, అది, ఏది—నేను, నీవు, వాడు ఎవడు—ఇవన్నీ ముక్కలూ. తునకలూ కావూ? ఈ తునకల నతిక్రమించి మాట్లాడగలవేమో ఒకమారు చూచుకో. చిన్న పిల్లవాడు ఒక్కొక్క అక్షరాన్నే విడివిడిగ వర్ణక్రమం చెప్పి వానిని పదాలుగ కూడపలుక్కొని తర్వాత వాక్యంలో అన్వయపరచుకొని చూచుకొన్నట్లే ఈ జగత్తునంతా నీ బుద్ధి ముక్కలు ముక్కలుగ చీల్చి వానిని తిరిగి కలిపి తెలుసుకోగలుగుతున్నదే కాని, అన్నిటిని ఒకమారుగ గ్రహించగల జ్ఞానం నీ బుద్ధికే లేదు. నిజమగునా కాదా? అందుకనే కాదూ, ఎమర్సన్ కవీశ్వరుడు We live in parts, we live in divisions—అన్నాడు. మానవుడెంతవరకూ విభాగాలమధ్య, భేదాలలోపల తిరుగాడుతూ వుంటాడని ఎమర్సన్ చెప్పిన మాటనే మన పూర్వులు మానవుని బుద్ధి భేదబుద్ధి, ద్వంద్వభూయిష్ఠమైన బుద్ధి, పరిచ్ఛేదక బుద్ధి అని పెద్దపెద్ద మాట

లతో జెప్పారు. ప్రత్యక్షమైన విషయాని కింత తర్క మెందుకు ?

ప్రపంచాన్నంతా ఇట్లా ముక్కలుచేసి చూడడం మాత్రం సాధ్యమా ? న్యూటను పండితుడు గొప్ప వైజ్ఞానికుడు కాదా ! అతడేమన్నాడు తుదకు ? "జ్ఞానమనేది పారం లేని మహాసాగరం. దాని ఒడ్డున ఏకొ లది గులకరాళ్ళనో ఏరుకోగలిగాను." అని అన్నాడు. కాబట్టి మన భేదజ్ఞానం కూడా సాంతమైనది కాదన్నమాట. ప్రపంచంలో ఒక్క శబ్ద ప్రపంచం అయిదోవంతుదికదా. ఆ శబ్ద ప్రపంచంలో మన చెవికి గోచరించేది ఎన్నోవంతు ? సంగీత విద్యావిశారదులు నాదోపాసకులుకదా. వాళ్ళైనా నాద ప్రపంచాన్నంతా అనుభవం చేసుకోగలిగారా ? ఆ నాద ప్రపంచంలో ఎన్ని స్వరాలు, ఎన్ని రాగాలు, ఎన్ని కూర్పులు-వానికి అంతెక్కడ ? దేనికదే అనంతంవలె కనబడుతోంది. అనంతాన్ని ముక్కలు చేస్తే మాత్రం-ఏ ముక్క కాముక్క తిరిగి అనంతం కాదూ ? సున్నాలో సగం ఎంత ? తిరిగి దానిలో సగమెంత ? ఎన్ని సగాలుచేసినా, అవన్నీ చివరకు సున్నాలే అగుతాయి కాదూ? మన బుద్ధి పరిచ్ఛేదంచేసి చూచుకునే ముక్కలు వేనికవి తిరిగి ప్రపంచాలే. నీ కంటికి కనబడే రూపాలను లెక్కపెట్టు చూద్దాము. నీ శ్రుతికి గోచరించే శబ్దాలను గుణించి, మొత్తం చెప్పు ఎన్నో? ఎందుకందాకా ? నీ ఘ్రాణేంద్రియానికి సోకే వాసనా పరంపరలకు అంతున్నదీ ? అఖండమైన దానిని ఖండ

ఖండాలుగ జీల్చినా, తుదకు ప్రతి ఖండమూ అఖండమయ్యే ట్టున్న దేమిటి? నీ బుద్ధి అఖండాన్ని ఖండాలు చేయడమేమి? చివరకు వానిలో ఒక ఖండం లోతుకూడా పూర్తిగ తెలుసుకో లేక పోవడమేమిటి ?

పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణముదుచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమే వావశిష్యతే.

# ఏకానేకం

సోదరా, మానవుని బుద్ధి యెప్పుడును భేదముల మధ్యనే తిరుగుచుండునని నీవు తెలుసుకొని యుంటివి కదా. "ఒకటి"లో నుండి "పదు" లెట్లు పుట్టినవో నీవు తెలుసుకోలేక పోవచ్చును. అభేదము నుండి భేదములు కల్గు విధము నీకగ్రాహ్యామే అగుగాక. నీ బుద్ధి ఈ రెంటిమధ్య చిక్కుకొని సామంజస్యమును గనుపెట్టలేక తత్తరపాటు చెందుచున్నది కాదూ ?

నీబుద్ధి ఒకమారు ఒకకంటితో "ఒకటిని" చూచును. ఇంకొకమారు రెండో కంటితో నానాత్వమును చూచును. నీ బుద్ధి యీ విభేదమును గాంచి, తర్కింప నారంభించును: ఆ ఏకమునకును, ఈ అనేకమునకును గల సంబంధ మేమిటనే ప్రశ్నకు నీ బుద్ధి తగిన సమాధాన మియ్యగల్గుతున్నదా ?

ఇది విచిత్రంకాదూ? నిన్ను పృచ్ఛింపజేసేది నీ బుద్ధే. నీ సంశయాన్ని తృప్తిపరుపలేనిదీ నీ బుద్ధే. ఈ ప్రశ్న వేయడ మెందుకు ? సమాధానము కుదరటంలేదని అసంతృప్తి చెందుటెందుకు ?

ఏకం—అనేకం-ఈ మాటలలోనే ఉన్నది - అది కానిది ఇది, ఇదికానిది అది అని. ఇవి పరస్పరంగా వ్యతిరేక పదాలు కావూ? వ్యతిరేకమని తెలుసుకొంటూ కూడ సమన్వయ పరచ డానికి ప్రయత్నించడం వ్యర్థప్రయాసంటావా ?

ఇది వ్యర్థప్రయాసమని నీ మనస్సు ఊరుకొంటున్నదా, "ఒకటి" అనేది నీ జ్ఞానంలో లేకపోతే, ఈ సర్వాన్ని "అనే కం" అని ఎట్లా అనగలుగుతున్నావు? నీకు సర్వం ప్రత్యక్షముగ గనబడుతున్నా, నీకు కనబడని "ఏకం" కొరకు నీబుద్ధి ఎందుకు అన్వేషిస్తున్నది ? ఈ రెండూ అవినాభావ సంబంధము కలిగి సాపేక్షికంగా ఉండబట్టి కాదూ, ఏకం—అనేకం అంటూ రెండు స్తంభాల ఆటవలె ఇటు అటు నీబుద్ధి ఆడుతున్నది !

నీ బుద్ధికి, అనగా నీ జ్ఞానంలో ఏకం — అనేకం అనేవి ఛాయాతపన్యాయంగా ఒకదానివెంట ఒకటి అంటుకొనే ఉన్నాయన్నమాట. ఒకటి ప్రత్యక్షమను, ఇంకొకటి పరోక్ష మను. ప్రత్యక్షజ్ఞానం, అపరోక్ష జ్ఞానం - ఈ రెండూ సమంగా నీజ్ఞానమేగా.

నీవు "అవు"నని అనగలిగినప్పుడే "కాదు" అనికూడ అనగలుగుతున్నావు. నీవు అవును అని అనలేకపోతే, కాదు అని అనగలవా ? అట్లాగే ఏకం అని చెప్పలేకపోతే, అనేకం అని మాత్రం ఎట్లా చెప్పుతావు ? అనేకమని ఎప్పుడు అంటు న్నావో, ఏకమని ఆ మాటలోనే ప్రతిపాదిస్తున్నావన్నమాట. ఆ చీలికా, ఈ ఐక్యమూ — నీ జ్ఞానంలో సమంగా ఇమిడి

ఉన్నాయి. నీ వెంత పైకెగిరినా, నీ నీడ నిన్ను వెంబడిస్తు న్నట్లు, నీవెంత తర్కించుకొని, ఆలోచించుకొన్నా ఏకం - అనేకం అనే సాపేక్షిక జ్ఞానం నీ బుద్ధిని వెంటాడుతూనే ఉన్నది.

నీకు "అనేకం" అనే జ్ఞానం ఎట్లా కలుగుతున్నది? అదంతా ప్రత్యక్ష విషయమే అందాము. నీ ముందు పరుచు కొనివున్న జగత్తంతా "అనేకంగా" ఉన్నదికాదూ ? మట్టి, నీళ్ళు, నిప్పు, గాలి, రాళ్ళు, చెట్లు, జంతువులు, మనుష్యులు, జాతులు, భాషలు—అసంఖ్యాకంగా, నానారూపాలతో, అనేక రంగులతో, అనేక విధాలుగ ఉండడం నీకు ప్రతిక్షణం ప్రత్యక్ష మైన విషయం కావడంవల్ల, ఈ సర్వాన్ని స్థూలంగానే తెలుసుకోగల్గుచున్నావు ఎట్టి సంశయం లేకుండా.

కాని నీకు "ఏకం" అనే జ్ఞానం ఎట్లా కలుగుతున్నదో కొంచెం తరచి చూచుకోవు? నీ చుట్టూ ఆవరించిన వస్తుజాలం నిరంతరం ప్రత్యక్షమగుతున్న విషయం. ఎవరికి? నీకేకాద్పూ ? 'నేను' అని అంటున్నావే అది ఒకటా, రెండా? నిన్న చూచా నంటావు. ఇవాళ చూస్తున్నా నంటున్నావు, రేపు చూస్తా నంటావు. నిన్న, ఇవాళ, రేపు - నీలో ఉన్నది ఒకటే కాక పోతే, చూచాను, చూస్తున్నాను. చూస్తాను అని ఉత్తమ పురుషలో ఎట్లా మాట్లాడగల్గుతున్నావు ? నీలోని 'నేను' అని విషయిగ, జ్ఞాతగ, కర్తగ, ద్రష్టగ, భోక్తగ నీ సర్వకర్మ కలాపంలో చెప్పుకొంటున్నావే — నీవు నిద్రలో ఉన్నా,

స్వప్నంలో ఉన్నా, మేలుకొని ఉన్నా అన్ని అవస్థలలోనూ నీలో సూత్రంగా ఉన్నది, 'నేను'అనేది ఒకటే కాదూ? అవునా, కాదా, ఒకమారు గట్టిగ యోచించుకో.

కాబట్టి, ఒకటి అనే జ్ఞానం నీలో కలుగుతున్నదంటే — 'నేను' అనే జ్ఞానం మూలంగానే. అవునా, కాదా? అన్నిటిని చూచే "నేను" ఒకటే అని వేరే చెప్పవలెనా? "నేను" అనే జ్ఞానంకంటె నీకు సన్నిహితమైన జ్ఞానం వేరే ఏమున్నది? "నేను" అనే ఐక్యజ్ఞానాన్ని ఆశ్రయించుకొనే "అనేక"మనే జ్ఞానం కలుగుతోంది-అవునంటావా, కాదంటావా?

నీ బుద్ధి ఒకవైపున "నేను" అనే దారపుకొసను, ఇంకో ప్రక్కను "సర్వం" అనే ఆ దారముయొక్క రెండోకొసను పట్టుకొని ఉంచుకోవడంవల్లనే, నీ జ్ఞానం పరిపూర్తికాగలుగుతోంది. ఎప్పుడు నీకు "నేను" అనే జ్ఞానం లేదో-దానిని ఆశ్రయించుకొన్న "సర్వం" అనే జ్ఞానమూలేదు. కాబట్టి "నేను" అనే ఐక్యజ్ఞానంలో నుండే "సర్వం" అనే భేదజ్ఞానం కూడా కలుగుతోందని కొంచెం యోచించుకో - అప్పుడు నీ జ్ఞానం యొక్క వైచిత్ర్యం ఎట్టిదో తెలుసుకొని విస్మయం చెందుతావు. "నేను" అనే జ్ఞాన కిరణమే "సర్వం" అనే మరీచీ జాలంగా నానావర్ణాలుగ చీలి ప్రకాశిస్తున్నదని తెలుసుకొంటే, నీవు చకితుడవుకావా? మానవుని బుద్ధి స్ఫటికము వంటిది. స్ఫటికము సూర్యకిరణాన్ని ఏమిచేస్తుంది? రంగురంగుల కిరణాలుగ చీల్చి, ఒక జ్యోతిని వేయిరంగుల జ్యోతులనుగ గనబరుస్తుంది. నీ బుద్ధి చేస్తున్న పనికూడా అట్టిదేకాదూ?

"సర్వాణి భూతాని ఆత్మైవాభూత్"

సోదరా, నీ బుద్ధి నిలకడ లేకుండా మారిపోతూ ఉండబట్టి - నిలకడగా ఉండే, మార్పుచెందని సత్యాన్ని తెలుసుకోలేక పోవడంలో ఆశ్చర్యమేమున్నది ?

ఏది మారుతూ ఉంటుందో, దానిని సత్యమంటావా ? సత్యమనేది ఎల్ల కాలాల్లోనూ, ఎల్ల దేశాల్లోనూ, ఒక్కటే విధంగా ఉండాలి కాని, నిన్నసత్యమైనే డసత్యమయ్యేదానిని సత్యమంటావా? నేడూ రేపూ ఏది ఒకటిగా మార్పులేకుండా ఉంటుందో అదే సత్యం. అవునా? కాదా ? సత్యాన్ని గూర్చిన నీ సిద్ధాంతాలు మారినా, అసలు సత్యం ఎట్లా మారుతుంది ?

నీ ఇంద్రియాలకు గోచరించే బాహ్య వస్తువుల యథార్థ రూపాన్నిగూడ నీవు తెలుసుకోలేక, తంటాలు పడుతున్న ప్పుడు మార్పులేని సత్యాన్ని తెలుసుకోలేక పోతున్నానని అసంతుష్టి చెందడ మెందుకు ? ఎట్లా నీ బుద్ధి అడుగడుగు తప్పులుచేస్తూ ఆ తప్పులను దిద్దుకొంటూ యథార్థాన్ని తెలుసు కోడానికి పరిశీలన చేస్తున్నదో నీ కనుభవమేగా ? భూమి నీకెట్లా కనబడుతున్నది? సమతలంగా కనబడటం లేదూ? కాని

వైజ్ఞానికులేమి చెప్తున్నారు? భూమి గోళాకృతిగనున్నదని. నీ కన్నులకు సూర్యుడే భూమిచుట్టు తిరుగుచున్నట్లు గోచరించటం లేదూ ? కాని వైజ్ఞానికులు చెప్పేదేమిటి ? భూమి సూర్యునిచుట్టూ తిరుగుచున్నదని కాదు ?

దీనినిబట్టి ఏమి తెలుస్తున్నది ? బుద్ధి మొట్ట మొదట స్థూలంగా తెలుసుకొనేదానికిని, పరిశీలన మీదట సూక్ష్మంగా తెలుసుకొనేదానికిని భేదం వుందని. నీ దూరపు చూపుకు, దగ్గర చూపుకు వ్యత్యాసం లేదూ ? వుయ్యూరు దగ్గరవుండి చూస్తే, కొండ ఎట్లా కనబడుతుంది ? నీలమేఘంవలె కనుల కింపుగా కనబడుతుంది. దానినే బెజవాడ వెళ్ళి చూస్తే, అ కొండ పెద్ద రాళ్ళగుట్టగా కర్కశంగా ఎగుడుదిగుడుగా కనబడుతుంది. కొండ ఏమైనా మారిందా ? లేదు. వుయ్యూరు దగ్గరనుండి చూచిందీ బెజవాడకు బోయి చూచిందీ ఒకటే - కాని దూరాన్నుండి చూస్తే ఆ కొండ ఒకవిధంగా కనబడుతుంది. దగ్గరనుండి చూస్తే ఆ కొండే ఇంకో విధముగా కనబడుతుంది. నీ చూపులోనే వున్నది ఆ భేదమంతా, అంతేనేకాని, దృశ్యం మాత్రం ఒక్కటే.

చూడు, మనకు నక్షత్రాలెట్లా కనబడుతాయి ? మినుకు మినుకుమంటూ చిన్న చుక్కలుగ కనబడతాయి. కాని జ్యోతిష శాస్త్రజ్ఞులు దూరదర్శిని యంత్రంబెట్టి చూచి, అవి జ్యోతిర్మయ గోళాలు, మన భూమికంటె ఎన్నోరెట్లు పెద్దవి.

అని చెప్పుతారు. వట్టి కండ్లతో చూచేదానికి, దూరదర్శిని యంత్రంలో చూచేదానికీ అంత భేదమున్నదన్నమాట. కాని ఆ నక్షత్రాల్లో మార్పు వుందా ? లేదు. మన చూపునుబట్టే వస్తువుల రూపాలుకూడ భిన్నంగా గోచరిస్తాయి. పంచాంగాలు తప్పితే, నక్షత్రాలు తప్పుతాయా అనే సామెత వినలేదూ ?

నీ బుద్ధి సహజంగా భ్రమ ప్రమాదాలకు లోబడే, సత్యాన్ని తెలుసుకోడానికి కోరుతూంటుంది. తప్పులు చేయడం, దిద్దుకుంటూండడం - బుద్ధియొక్క క్రమ. ప్రత్యక్ష ప్రమాణంమీద ఆధారపడే వైజ్ఞానికులు తాము కనిపెట్టిందంతా చెప్పగలుగుతున్నారా? లేదు ? వాళ్ళ సిద్ధాంతాలెన్ని మారలేదు? సైన్సు నేడొక "థియరీ" చెప్పుతుంది. రేపు దానిని రద్దుపరచి, ఇంకో "థియరీ" ప్రతిపాదిస్తుంది. ఇవ్వాళ కట్టిన సౌధం రేపు కూలిపోవచ్చు. ఇట్లా సిద్ధాంతాలను మార్చుకొంటూనే సైన్సు క్రమవికాసం పొందుతోంది. మన థియరీసు మారుతున్నాయేకాని, థియరీసుతోబాటు జగత్స్వరూపం మారుతోందా? లేదూ.

బుద్ధియొక్క నడక గడియారం పెండ్యులం వలె ఎప్పుడూ ఇటూఅటూ ఆడుతూంటుంది. ముందు సంగతి, అనంతరం సంశయం, తర్వాత విరోధం, పిమ్మట అన్వయం Thesis-Doubt Antithesis-Synthesis ఈ విధంగా ఊగిసలాడుతూంటుంది. నీబుద్ధి ఒక్కవస్తువును స్థూలంగా స్పృశిస్తుంది-ఆ

అంటుకోవడం పేరే-సంగతి-తర్వాత దానినిగూర్చి అనుమానం కలుగుతుంది. ఆ అనుమానించడమే సంశయం. సంశయ మెందుకు కలుగుతుంది? పూర్వపరాలకు అన్వయం కుదరదు. దీనిపేరే విరోధం-బుద్ధి ఈ విరోధంలో ఉండలేదు. విరోధం ఉన్నంత కాలం నీ బుద్ధి ఆందోళన పడుతూనే ఉంటుంది. పూర్వ పరాలకు సామంజస్యం కుదిరినప్పుడే, బుద్ధి శ్రమ తీరుతుంది. శాంతి అనుభవిస్తుంది-దీనిపేరే అన్వయం.

నీబుద్ధి సత్యాన్వేషణంకొరకు పడేశ్రమలో ఇవి నాలుగు మెట్లు - మొదటిది సంగతి Thesis; రెండవది సంశయం Doubt మూడవదివిరోధం Antithesis; నాల్గవది అన్వయం Synthesis. బుద్ధిచేసే మీమాంసలో ఈ నాలుగవస్థలు తప్పవు. సంశయం కలిగితేనేగాని, అసలు జిజ్ఞాస బైలుదేరదు. సంశయం నివారణ అయ్యేవరకు నీ బుద్ధి శాంతించదు. నీ జ్ఞానం నీ అనుభవాన్ని సరిగ అన్వయించుకో గలుగుతున్నదని గ్రహించినప్పుడే నీకు ఆనందం గల్గుతూంది. సంశయంలోనే పడి ఉంటావా? నీకు శాంతిలేదు. ప్రాణి మృత్యువు నొక సంకటంగా చూచుకొన్నట్లే బుద్ధికూడా సంశయాన్ని ఒక మరణబాధగ ఎంచుతుంది. కాలుకు ముల్లు గ్రుచ్చుకొంటే ఎంత బాధో, బుద్ధి విరోధం మధ్య చిక్కుకొంటె అంతకంటె ఎక్కువ బాధ. సంశయంతీరి, విరోధం సమన్వయంగా పరిణమిస్తేనేకాని, నీ మనస్సుకు స్థిమితం చిక్కదు.

చూడు, సంశయాత్ములైనవారు సత్యోపలబ్ధిని పొందే వరకు ఎట్టి ఘోరారణ్యములలోబడి, తప మాచరించారో ? గౌతమశాక్యముని సంశయపీడితుడై కుటుంబాన్ని, రాజ్యాన్ని వదిలివేసి "ఇహాసనే శుష్యతు మే శరీరం" - సత్యం గోచర మయ్యేవరకు నేను తపస్సును వదలనని శపథం పట్టాడు. ఏసునాథుడు సత్యలాభం కొరకు గెత్సనీ కొండమీద నలుబది రోజులు ఘోరోపవాసం చేశాడు. ఆధునిక వైజ్ఞానికులుగూడ చూడండి-ఏండ్ల తరబడి తమ జీవితాలను ప్రయోగశాలలలో ఎట్లా గడిపేస్తూ ఉంటారో. సంశయ నివృత్తికోసం మానవుడు చేసే తపస్సు అత్యద్భుతం! ఎందుకని ?

"సంశయాత్మా వినశ్యతి."

## వాదభేదాలు

సోదరా, నీకెందు కింకా అహంకారము, నీకు తెలిసిందే సత్య మనీ, నీతో ఏకీభవించనివారి అభిప్రాయాలన్నీ అసత్యము లనీ! నీబుద్ధి పరమసత్యాన్ని సమగ్రంగా తెలుసుకోలేదని తెలిసికొని కూడా, ఇట్లా స్వమతావేశంలో జిక్కుకోవడం నీకు తగదుసుమీ.

నీ బుద్ధా, నిరంతరం మారేది; సత్యమా, ఎప్పటికీ మారనిది. నీబుద్ధా, కొంచెం కొంచెం తెలుసుకొంటూ, ఇదికాదు, అది అవును అంటూ క్రమంగా ఎగ బ్రాకుతుందాయె - సత్యమా, చీలికలుకానిదీ, సర్వాన్నీ ఇముడ్చుకొని, సర్వాన్నీ అతిక్రమించేదాయె. కాబట్టి నీ బుద్ధికి గోచరించేదంతా సత్య మనీ, తదితరమైనదంతా అసత్యమనీ వాదించడం ఆత్మవంచనం కాదూ?

సత్యాన్ని తెలుసుకోడానికి నీబుద్ధి నిరుపయోగకరమని నేను చెప్పటంలేదు సుమా. నీబుద్ధి వెలుగును ఆర్పివేశావంటే, అంతా చీకటి అయిపోతుంది. నీబుద్ధి దీపాన్ని పుచ్చుకొనే, నీ మార్గాన్ని వెదుక్కోక తప్పదు. ఇది నిజం. కాని నీబుద్ధి ఇచ్చే వెలుగు పూర్తి అయిన వెలుగుకాదనీ, సత్యంలో ఏ కొంచెం భాగాన్నో మాత్రం చూపగలుగుతుందనీ తెలుసు

కొన్నావా, నీ అసహనంపోయి, ఇతరుల అభిప్రాయాలను ఉదారంగా ఆదరిస్తావు.

శ్వేతకిరణాన్ని రంగులు రంగులుగజీల్చే స్ఫటికమణి వంటిది నీబుద్ధి అని నీవు వెనుకనే గ్రహింపగలిగియుండినప్పుడు అందరకూ అన్నిరంగులూ సమానంగా గోచరించవని కూడ తెలిసికొనే వుంటావు. నీబుద్ధి నైశిత్యాన్ని, నిర్మలత్వాన్నిబట్టి, నీకు కొన్ని రంగులు కనబడుతాయి. ఇతరులకు వారి వారి బుద్ధి విశేషాన్నిబట్టి మరికొన్ని రంగులు గోచరిస్తాయి. ఎవరి కేరంగు గోచరించినా, అది సత్యంయొక్క వెలుగు జిలుగే కాదూ? సత్యమంతా నీకు గోచరించే ఏ నాలుగు రంగుల్లోనో ఇమిడి ఉన్నదంటావా ?

వెనుక నలుగురు గ్రుడ్డివాళ్ళుచేరి ఏనుగ ఎట్లాఉంటుంది అని వారిలో వారు వాదించుకోవడం మొదలు పెట్టారట. ఒకడన్నాడట, ఏనుగు చీపురువలె వుంటుందని. ఇంకొకడు రోకలివలె ఉందనీ, మూడోవాడు రోలువలె ఉందనీ, నాలుగో వాడు చేటవలె ఉన్నదనీ, ఇంత భిన్నంగా వాదించేవారికి కలి యిక ఎట్లా కుదురుతుంది ?

తమకు తెలిసిందే సర్వమూ అనుకోవడంవల్ల ఈవివాదం తెగక తుదకు కొట్లాటలోకి దిగింది. గజాన్ని పూర్తిగ చూడ గల్గిన కన్నులుగల వాడొకడువచ్చి, ఈ వివాదాన్ని చూచి, "ఓ అంధులారా! ఎందుకు మీ రిట్లా కొట్లాడుకొంటారు?మీలో ఒక్కొక్కరు చెప్పేదీ నిజమే. కాని ఏ ఒక్కరు చెప్పేదీ పూర్త

మైన సత్యంకాదు. మీలో మొదటివాడు ఏనుగతోకనుమాత్రం ముట్టుకొని, గజమంతా చీపురుకట్టవలె వుంటుందనుకొన్నాడు. రెండవవాడు తొండాన్ని మాత్రం స్పృశించి, గజమంతా రోకలంటున్నాడు. మూడోవాడు కాళ్ళను అంటుకొని, గజం రోలు వలె ఉందంటున్నాడు. నాలుగవవాడు ఏనుగ చెవిని మాత్రం స్పృశించి, గజమంతా చేటవలె వుంటుందంటున్నాడు. ఏనుగయొక్క భాగాలను విడివిడిగ చూచి, తానుచూచిందే సర్వం అనుకోవడంవల్ల, మీ వివాదం తెగకుండా పోతున్నది." అని తీర్పు చెప్పేసరికి, ఆ గ్రుడ్డివాళ్లు తమ బుద్ధివిహీనతకు నవ్వుకొన్నారు. ఇట్లాగే వివిధ మతాలవారు తమ మతమే సంపూర్ణ సత్యమని భ్రమించి, అసహనాలు పెంచుకొంటున్నారు

నీబుద్ధి అనంతమైన సత్యాన్ని ఒక్కమారుగ గ్రహించలేక, దానిని ముక్కలు ముక్కలుచేసి, ఒక్కొక ముక్కనూ పరిశీలిస్తూ జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొంటుంది. కాబట్టి బుద్ధియొక్క జ్ఞానం ఖండజ్ఞానమని తెలుసుకో. ఒక్కఖండాన్నే సర్వమనుకోవడం దోషం. అందుకనే పెద్దలేమి చెప్పారు? సత్యాన్ని నీ మనస్సు తెలుసుకోలేదుసుమా - సత్యం అనిర్వచనీయం అని చెప్పుతూంటే. బుద్ధిచేసే నిర్వచనాలను, నిరూపణాలను, సిద్ధాంతాలను పరమసత్యంగా తలపోయడం దోషం కాదూ?

వేదాలకు భాష్యాలు వ్రాసినవారు కూడా - "సత్యం అనిర్దేశ్యం" అని చెప్పుకొంటూ కూడా, అద్వైతమే సత్యమని

కొందరూ, ద్వైతమే సత్యమని కొందరూ, విశిష్టాద్వైతమే సత్యమని మరికొందరూ, తగాదాలు పడడం ఎందుకూ? ప్రతి మతమూ సత్యంలో ఒక అంశాన్ని మాత్రమే చూపగలుగుతుందనీ, ఏమతమూ పూర్ణసత్యాన్ని తెలుపలేదనీ, మనంచేసే నిర్వచనాలన్నీ సత్యంయొక్క భిన్నదిక్కులను మాత్రం సూచింపగలుగుతాయనీ తెలుసుకొంటే, ఈ మతకలహాలు, ఈ విచిత్ర వాక్యార్థాలు, ఈ అసహనాలు ఉండవుగా! నీబుద్ధియొక్క స్వరూపం తెలుసుకోలేక పోవడంవల్ల వచ్చిన చిక్కు ఇది.

సత్యంయొక్క ఏ యంశాన్ని తెలుసుకోవాలన్నా నీ బుద్ధిమీద ఆధారపడక తప్పనిమాట నిజమే. ఏదో ఆలంబనం లేనిదీ, నీవు గాలిలోకి ఎట్లా ఎగరగలవు? నీవు ఒక గృహాన్నో, గోపురాన్నో కట్టాలంటే ఏమి చేస్తావు? ముందు చుట్టూ పరంజాలు కట్టుతావు. ఆ పరంజాలమీద నుంచుని, ఒక్కొక్క రాయే పేర్చి, సౌధాన్ని నిర్మిస్తావు. అంతేకాని ఆ పరంజాలే సౌధమనుకొనే వాడెవడైనావుంటే, వానిని నీవేమంటావు? పిచ్చివాడంటావు.

అట్లాగే మన నిర్వచనాలూ, సిద్ధాంతాలూ, మతాలూను. ఇవి పరంజాలవంటివి. పరంజాలకు ఉపయోగము లేదూ? ఉన్నది. కాని పరంజాలు మాత్రం సౌధం కాదు. సౌధం పూర్తిఅయిన తర్వాత, ఈ పరంజాలను విప్పివేయక తప్పదు. లేకపోతే నీ సౌధానికివి అడ్డం వస్తాయి. మొదట

ఆరంభంలో ఉపయోగపడ్డ పరంజాలే, చివరకు అడ్డంకులవు తాయి. అవి సౌధాన్ని మరుగు పరుస్తాయి. నీ సిద్ధాంతాలు కూడా సత్యానికి సహాయకారులే కాని, అసలు సత్యంమాత్రం కావు. సత్యోపలబ్ధి పొందినవారికీ మతాలు అవరోధాలు సుమీ.

నీ బుద్ధి సత్యాన్ని నిర్వచనం చేయడానికి చూస్తుంది. అది బుద్ధియొక్క సహజ లోపం. అనిర్వచనీయమైన దానిని నిర్వచనం చేయడం లోపం కాదూ ? కాని ఈ నిర్వచనాలు ప్రారంభంలో వుపయోగకరములవుతాయి. అందుకు సందేహం లేదు. కాని ఈనిర్వచనాలు సత్యాన్వేషణ మార్గంలో సాధకుడు విడిదిచేసే తాత్కాలికపు ఆశ్రయాలేకాని, అసలు సత్యం మాత్రంకాదని తెలుసుకోగలిగావా - తోడి యాత్రికులు వారి వారి యిచ్ఛానుసారం ఏర్పాటుచేసుకొనే ఆశ్రయాలను నీవు నిరసించవు. అన్నిటిని నిచ్చెనలోని మెట్లలాగ వుపకారకరములే అని ఆదరిస్తావు. హెచ్చుతగ్గులు కూడా నిన్ను బాధించవు. ఒకరికి హెచ్చుది ఒకరికి తగ్గు, ఒకరికి తగ్గుది ఒకరికి హెచ్చు. వారివారి అభినివేశం, సంస్కారం ప్రకారం మెట్ల నేర్పాటు చేసుకోక తప్పదు. బుద్ధిమీద ఆధారపడి వున్నంతకాలం ఈ సోపానక్రమం ఎవరికివారు ఆత్మపరీక్ష చేసుకొంటూ, పైకి ఎక్కి పోగా, పోగా, సత్యోపలబ్ధి అయిన తర్వాత. పైన, క్రిందా అనే భేదజ్ఞానం పోయి ఇట్లా తెలుసుకొంటావు.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

## ధీశక్తి

సోదరా, నీ మనస్సు నీ కమూల్యమైన ఉపకరణమని నీవు తెలుసుకొన్నావు. నిన్ను పైకితెచ్చినా అదే – నిన్ను క్రిందకు బడవేసినా అదే. బహుజాగ్రత్త. నీకండ్లను, నీకాళ్ళను నీ చేతులను నీ స్వాధీనంలో ఉంచుకోగలవేమో కాని, మనస్సును మాత్రం నీ స్వాధీనంలో ఉంచుకోవడం బహు దుర్లభం. అది నీ లోపలజేరి, నిన్నెట్టి తిప్పలనైనా పెట్టుతూ ఉంటుంది. దానిని నీ వెట్లా వుపయోగించు కొంటావో !

నీ బుద్ధి నీకు వెలుతురియ్యగలదు. వెలుతురును మూసి పెట్టాగలదు. సత్యాన్ని అసత్యంగాను గనబరచ గలదు. అసత్యాన్ని సత్యంవలె తోచేటట్టు చేయగలదు. నీ కదీ ఇదీ తెలియకుండా, సంశయంలో బడవేసి వేధించనూ గలదు. దాని పని అంతా కత్తిమీద సాముమోస్తరు. ఉపాయంగా వున్నట్టే వుండి అపాయంగా మారుతుంది. నీ బుద్ధి భ్రమణాన్ని గూర్చి నేను వేరుగ జెప్పడమెందుకు ? నీ కదంతా అనుభవ వేద్యమేగా ?

కాని ఒక్క విషయం మాత్రం ఆలోచించుకో. నీకు బయటనున్న విషయాలను చాలా తేలికగా బరిశీలింపగలవు. భౌతిక పదార్థాలను, రాసాయనిక ద్రవ్యాలను, జీవకణాలను- ఎన్నివిధాలో పరీక్షించి, ప్రయోగించి, వాని లక్షణాలను ధర్మాలను నిర్ణయిస్తావు, అవన్నీ నీకు బయట, దూరంగా వున్న సంగతులు. కాని మనస్సు నీ లోపలది. దానికంటె నీకు సన్ని హితమైనది మరొకటి లేదు. నీ శరీరంకంటెగూడ నీకు చాలా సన్నిహితమది. నిన్నది త్రికాలాల్లోను వెంటాడే వుంటున్నది. నిన్ను నిద్రడోలికలో జోకొట్టి నీకు విశ్రాంతీ సౌఖ్యం ఇస్తుంది. చక్కటి బంగారు కలలను కనిపెట్టుతుంది. నీకది సకల వ్యవహారాలను నిర్వహించి పెట్టుతూ నీకు తోడునీడగా వుంటుంది.

ఇంతగా నీ కోసం పడగాపులు పడుతూవుంటే, దాని లోతుపాతులను, దాని వివిధగతులను దాని స్వభావ స్వశక్తులను తెలుసుకోడానికి ఎందుకు ప్రయత్నించవు? నీకు దూరంగా వుండేవాళ్ళంతా దగ్గర చుట్టాలైనారూ ? నీ ఇంటిలో వుండి, నిన్నెప్పుడూ కనుపెట్టుకొని వున్న నీ బుద్ధి నీకు దూరపు చుట్ట మైందీ? ఎందుకింత మైమరపు సోదరా ?

కర్మకారులు చూడు, వారి పనిముట్ల నెంత జాగ్రత్తగా కాపాడుకొంటూ వుంటారో! పనిముట్లు చెడిపోతే, వాళ్ళపని ఏమవుతుంది? నిర్వ్యాపారులై పోరూ? వడ్రంగిని చూడు, తన వులిని ఎప్పుడూ నూరుతూనే వుంటాడు-అది పదునెక్కడానికి. రంపాన్ని ఆకురాతితో తోముతూనే వుంటాడు - అది చురు

కుగా కోత కోయడానికి. వ్రాయసగాండ్రు చూడు, కలా న్నెట్లా చెక్కుకుంటూ భద్రంగా వాడుకొంటూ వుంటారో? జంత్ర పాటకులను జూడు, వారి వాయిద్యపు పనిముట్లు తీగెలు వదులియ్యకుండా, ఎట్లా బిగువులో వుంచి శ్రుతిలో బెట్టి పలుకు లను పలికిస్తారో! బయటి పనిముట్లనే, అంత శ్రద్ధగ పదిల పరచి వాడుకొంటూ వుంటే. వానికంటె ఎన్నోరెట్లు అమూల్యమైన నీ లోపలి పనిముట్టును అజాగ్రత్తగ వాడు కొంటే, నీ వ్యవహార మెట్లా సాగుతుంది, చెప్పు?

అది నీకు బంగారుగనికాదూ, దాని రహస్యం తెలుసు కొంటే? నీ కది సర్వశాస్త్రాలను నీ కనులముందు విప్పిపెట్టి, నిన్ను సర్వశాస్త్ర పారంగతునిగ జేసుందే. నీ కది తన ఊహా గానం వినిపించి, కావ్యకళావిశారదునిగ జేయగల్గుతుందే. దాని సమస్త శక్తిని నీకు ధారపోసి, నిన్ను మహాకర్మవీరునిగ జేస్తుందే. నీలో నది అపారమైన వెలుగును కలిగించి, అఖండ జ్ఞానినిగ జేసివేస్తుందే. ఇన్ని విధాలుగ వరమియ్యగల, నీకు నిరంతరం సన్నిహితంగా వుండి నీకు సమస్తోపచారాలను జేయు డానికి సిద్ధంగావుండే, నీ బుద్ధిని వదిలివేసి, బయటి పనిముట్ల కోసం పరుగెత్తడం వెర్రి కాదూ?

నిజమే - అది నీకు ఎప్పుడూ స్వాధీనంగా వుండనిమాట నిజమే. కాని ఆ దోషం నీదికాని, దానిది కాదు. బయటి పని ముట్లు మాత్రం కొన్నివేళల్లో నీ కపాయకరంకావు? సూదిని సరిగా వుపయోగించే విధం తెలుసుకోకపోతే, కుట్టేటప్పుడది

నీ వేలికే గ్రుచ్చుకొని నెత్తురు వస్తుంది. చాకుతో చేతులు కోసుకొన్న వాళ్ళెందరు లేరు? భద్రంగా వాడుకోవడంలో వున్నది పనిముట్ల ఉపయోగమంతా. వీని అన్నిటికంటె ఎక్కువ పదునైనది, ఎక్కువ పనులను జేయగల్గేది నీ బుద్ధి – దానినింకా ఎక్కువ భద్రంగా వాడుకోవద్దూ మరి?

బయటి పనిముట్లను సులువుగా వాడుకోవాలంటే, ఆ పనిముట్లను వాడడంలో నేర్పరులైన వాళ్ళదగ్గర ఎన్నాళ్లో శుశ్రూష చేస్తేనేకాని, ఆ కర్మవిద్య రాదే. యంత్ర విద్యలో ఆరితేరడానికి ఎన్ని పరీక్షలలో తర్ఫీయతు కావాలి చెప్పు. పుట్టడంతోటే, నీకు కర్మవిద్య లబ్బుతాయా? నూలు వడకాలంటే, ప్రత్తినుండి విత్తులు తీయాలి, దూదినేకి ఏకులు చేసుకోవాలి, రాట్నాన్ని గట్టిగ అమర్చి, కదురును సరిగ యేర్పాటు చేసి, నీ చేతినెంతో నిపుణతతో చాచుతూ వుంటేగాని, ఒక నూలుపోగు సరిగ్గా రాదే! పింజకంటె తేలిక, వజ్రంకంటె కఠినం అయిన నీ మనస్సులో నుండి వెలుగు జిలుగులను, రంగురంగుల రాగాలను, అతి సున్నితములైన భావాలను, మర్మ భేదకమూలైన యుక్తులను, చిత్తరంజకములైన రసాలను, అతీతములైన తత్వాలను లాగాలంటే—ఎంత శ్రమపడితే అది సాధ్యం?

బయటి పనిముట్లయితే, అవి నీ చేతికి ఇమిడివున్నట్లు వుంటాయి. వానిని నీవు చూడగలవు. చేతిలో ముట్టగలవు. వాని గుణదోషాలను తేలికగా పరీక్షించగలవు. కాని నీమనస్సు

నిల్లో పలవున్నా. అది నీకు గోచరంకానిదీ, అందినట్లుండి అందకుండా వుండేదీ, ఎక్కడ, ఎప్పుడు, ఎట్లా పట్టితే, ఎట్టి - ఎంత ఫలితం ఇస్తుందో అనుభవంవల్లగాని తెలుసుకోరానిదీ, బయటనుండి ఇతరులెంత సహాయం చేసినా నీ స్వీయానుభవం వల్లనే దాని ఉపయోగాన్ని అలవరచుకో గల్గినదీ - నీ మనస్సాయే. దాని సద్వినియోగం సులభసాధ్యం కాకపోవడంలో ఆశ్చర్యమేమున్నది ? నీ వెన్ని గ్రంథాలైనా చదువు, ఎంత మంది పండితుల దగ్గర శుశ్రూషైనా చేయి, నీ అంతట నీవు, స్వయంగా, స్వతంత్రంగా, స్వావలంబనంవల్ల, నీ మనస్సును బట్టుకొని, దానిని వ్యవసాయం చేయడానికి పూనుకొంటేనే కాని అది ఫలవంతం కాజాలదు.

బుద్ధిని వ్యవసాయం చేయడంలో ఎన్ని మెలకువలున్నాయో, ఆలోచించుకొని చూడు. బుద్ధి వ్యవసాయంలో సుస్థిరుడవుకా. నీ పొలాలు నీకు తగినంత పంట ఇయ్యలేకపోవచ్చును గాని, నీ మనఃక్షేత్రం మాత్రం - వ్యవసాయం చేసినకొద్దీ పుష్కలమైన పంట పండుతుంది. అన్నిరకాల ధాన్యాలు పండుతాయి. అన్ని ఫలజాతులూ పెరుగుతాయి. నీ యిష్టం - కష్టే ఫలే అన్నారు పెద్దలు. నీ మనస్సును శృంగార విహారంకోసం రమ్యోద్యానంగా చేసుకొంటావో, లేక ఫల పుష్పాలను పండించిపెట్టి నిన్ను భాగ్యశాలినిగా జేసే తోటగా చేసుకొంటావో, లేక శాంత్యానందాలను సమకూర్చే తపోవనంగా చేసుకొంటావో - చింతామణి ద్వీపంలోని కల్ప

తరువు మో_స్తరు నీ మనస్సు, నీకు సమ_స్త వరములనిచ్చి బ్రోవగలదు. అది నీ పాలిటి కామేశ్వరి, త్రిపురసుందరి, సౌందర్యలక్ష్మి - దానిని పనిముట్టు అంటావా? కాదు, అది పరుసవేది - బంగారంచేసే దివ్యమణి అది.

వెలుగులోనుండి వెలుగులోకి, రసమునుండి రసమునకు, శ_క్తినుండి శ_క్తిలోకి — అంతెక్కడ అది మహా దివ్యయాత్ర. అన్ని పుణ్యతీర్థాలను సేవించేటట్టు చేయగలదు. కైలాసానికి దీసుకొనిపోయి, పార్వతీ పరమేశ్వరుల ప్రణయ మహిమను వెల్లడింపగలదు. బృందావనమునకు గొంపోయి—రాధా మాధవుల అనంత లీలా విలాసములను ప్రదర్శింపగలదు. బ్రహ్మకపాలమున కెత్తుకొనిపోయి అమరనాథుని అమృత స్వరూపమును జూపింపగలదు. ఎక్కడనుండి బయలుదేరి ఎక్కడకు రాగల్గితివో చూడు — కిరణము జ్యోతిలో లీనమై పోయినది. తరంగమ్ము మహాసాగరమున గలసినది. సర్వం చిన్మయము - నీ దేహం, నీ ప్రాణం, నీ మనస్సు, నీ జగత్తు - సర్వం చిన్మయము.

"సర్వాణి భూతాని ప్రజ్ఞానస్య నామధేయాని."

# చిత్తశుద్ధి

సోదరా, నీ యున్నతి అంతా, నీ అంతఃకరణను అనగా నీ లోపలి పనిముట్టును ఉపయోగించుకోవడంలో వున్న దని నీవు సరిగ గ్రహించివుంటే, నీ విన్ని కష్టాల పాలయ్యేడి వాడవు కావు. నీ మనస్సును దారం తెగిన గాలిపటంవలె వదలివేయడంవల్ల, ఒక దారీతెన్నూ లేకుండా, ఏ కంచెల్లోనో, ఏ అపథాల్లోనోపడి తికమకలు పడుతున్నావు.

తుదకు నీ శరీరం ఆరోగ్యంగా, బలంగా వుండాలన్నా ముందుగ నీ మనస్సునే బలపరచుకోవాలె సుమా. ఎందుకంటె నీ శరీరంలో కనబడే రుగ్మతలన్నీ శారీరకమే అని భ్రమపడుతున్నావు. కాదు. రోగాలన్నీ ముందుగా నీ మనస్సులో అంకురించి క్రమంగా నీ స్థూల శరీరాన్ని దెబ్బకొట్టుతున్నాయి. ఇందాకా ఎందుకు? నీ శరీరారోగ్యం చాలవరకు నీ అభ్యాసాలనుబట్టేగా వుండేది? కొంచెము ఆలోచించుకో.

నీ కజీర్ణబాధ వచ్చిందంటే, ఎందుకని? మితాహారం అభ్యసించక పోవడంవల్ల. నీ జిహ్వామీదే నీ యధికారాన్ని వదులుకొన్నావు. జిహ్వాచాపల్యం మూలంగా. తినరాని

తిండ్లన్ని తింటున్నావు. త్రాగరాని పానీయాలన్నీ త్రాగుతున్నావు. నీ జిహ్వను కట్టుబాటులో ఉంచే నిగ్రహాన్ని అలవరచుకొని ఉంటే, నీ శరీరమిట్లా రోగపంజర మయ్యేదా?

మనవైద్యులు రోగం వచ్చిందంటే, చేతినాడి చూస్తారు. చంకలో గాజుపుల్ల పెట్టి ఉష్ణం కొలుస్తారు. గుండెలు పరీక్ష చేస్తారు. ఊపిరితిత్తులను కొట్టి చూస్తారు. అంతేనే కాని, నీ మనస్తత్వాన్ని, నీ అభ్యాసాలను, నీ యభిరుచులను, నీ వ్యసనాలను బరిశోధించరు. నీ మనస్సుకు, నీ శరీరానికి సంబంధం లేదని వాళ్ళ అభిప్రాయము. రోగాలన్నీ ముందు నీ సూక్ష్మ శరీరంలో బుట్టి, క్రమంగా నీ స్థూలశరీరంలోకి ఉబుకుతాయని వాళ్ళకు తెలియదు.

జ్ఞానంగల వైద్యుడైతే ముందుగ నీ మనస్సును, నీ తత్వాన్ని బరీక్షచేసికాని, రోగనిదానం చేయడు. పూర్వ కాలంలో మన జ్ఞాను లేమి చేసేవారు ? వారి శరీరాన్ని శుద్ధి చేసి వజ్రకాయంగా చేసుకొనేవారు. శరీరం మనస్సుకు బాహ్యోపకరణం. నీ మనస్సెంత పదునుగా ఉంటేనేమి, నీ బాహ్యోపకరణం బండబారి వుంటే ! అందుకని శరీరాన్ని ఆరోగ్యవంతంగా, సాత్వికంగా చేసుకొనేవారు. ఎట్లా?

మందులుతినా వారు జవసత్వాలను సంపాదించింది ? కాదు. యోగాభ్యాసంవల్ల. యోగం రెండు విధాలు. మనస్సును పైకి, ఊర్ధ్వలోకాలకు తీసుకొనిపోయేది రాజయోగం

మనోబలంచేత శరీరాన్ని కాయకల్పం చేసేది హఠయోగం. హఠయోగం అంటే, ఏమిటో అని భయపడకు. కారణ శరీరంద్వారా, నీ స్థూల శరీరాన్ని స్వాధీనం చేసుకొని, దానిని శక్తివంతంగా చేసుకొనే విధానమే హఠయోగం. మనస్సుకు శరీరానికిగల అన్యోన్య సంబంధం వారికి తెలిసినట్లుగ ఇంకొకరికి తెలియదు. నీ శరీరం యొక్క పునాది నీ మనస్సులో ఉన్నదని గ్రహించావా. నీ శరీరాన్ని ప్రబలాయుధంగా చేసుకొనే రహస్యం అవగతమవుతుంది.

నీ శరీరంలోని ప్రధాన భాగాలేమిటి ? రక్తంతో గూడిన మాంసం, ఎముకలు, నరాలు. నీ నరాలు సరిగ్గా ఉన్నాయా, నీ శరీరమంతా బాగుంటుంది. నీ నరాలు నీ మనస్సుకు లోకువ. నీవేదిచేయాలన్నా, ముందు నీమనస్సులో ఒక సంకల్పం బయలు దేరుతుంది. ఆ సంకల్పం నీ నరాల్ని కదిలిస్తుంది. నీ నరాలు నీ అవయవాలను ఇంద్రియాలను ఆడిస్తాయి. కాబట్టి నీ మనస్సుకు నీ శరీరానికి సంబంధం కలిపేది ఏది ? నరం. అది ఎలెక్ట్రిక్కు తీగవంటిది. మనస్సును "స్విచ్" చేశావా, వెంటనే ఒక కరెంటు నరాలద్వారా శరీరాన్నంతా క్రమ్మివేస్తుంది. నీ నరాలు సరిగ్గా ఉండవా, నీ మనస్సును నీవెంత స్విచ్ చేస్తే ఏమి ? నీ మనస్సులోని వెలుగునుగాని, వేడిమినిగాని నీనరాలు శరీరంలోకి తీసుకొని పోలేవు. అప్పుడు నీ శరీరం ప్రాణంలేని గుడ్డపీలికవలె వ్రేలాడుతూ ఉంటుంది. హఠయోగం చేసేదేమిటి ? నీ మనస్సుకు నీ నరాలకుగల

సంబంధాన్ని బలపరుస్తుంది, సున్నిత పరుస్తుంది. వీణెమీది తీగెలను వైణికుడెట్లా శ్రుతిపెట్టి ఉంచుతాడో, యోగికూడా తన మనోబలంచేత తన నరాలను సున్నితంగా బిగువులో ఉంచి, తద్వారా శరీరాన్ని తేజోవంతంగా చేసుకొంటాడు.

నీ మనస్సు ఎప్పుడైనా ఊరుకొని ఉంటుందా? నీటిలో నుండి బుడగలు బయలుదేరు నట్లుగా, నీ మనస్సులోనుండి ఎన్ని తలంపులు, ఎన్ని భావనలు, ఎన్ని వికారాలు, ఎన్ని ఆవేశాలు విచ్చలవిడిగ చెలరేగుతూ ఉంటాయి! ఇవన్నీ నిరంతరం నీ నరాలద్వారా, నీ శరీరంమీద దెబ్బలు కొట్టుతూనే ఉంటాయి. నీ మనస్సులో కలవరం ఉన్నదా, నీ ముఖంకూడా ఎఱ్ఱబారి, ముడతలుపడి, చెమర్చి, సుళ్ళుపడుతూ వికారంగా ఉంటుంది. నీ మనస్సు నిర్మలంగా, శాంతంగా ఉంటుందా, నీ ముఖమండలం కూడా ఉదయభానునివలె ప్రకాశవంతంగా శోభాయమానంగా ఉంటుంది. నీ ముఖంచూస్తే తెలుస్తుంది నీ మనస్సెట్లా ఉన్నదీ. కాబట్టి నీ శరీరం ఆరోగ్యవంతంగా, తేజోవంతంగా, సౌందర్యవంతంగా ఉండాలంటే, ముందు నీ మనస్సును నిర్మలంగా, శాంతంగా, రసవంతంగా, జ్ఞానవంతంగా, మంగళమయంగా చేసుకో.

అంతేనేకాని, ముఖాన్ని ఎన్నిమార్లు సబ్బుపెట్టి రుద్దుకొన్నా, ఎన్నిపౌడర్లు కొట్టుకొన్నా లాభంలేదు. నీ మనస్సులో ప్రేమామృతం తొణుకులాడుతూ ఉంటుందా, నీ నేత్రాలలో కరుణాజ్యోతులు వెలుగుతూ ఉంటాయి. నీ పెద

వుల మీనను ఆ సఖ్యరస ముట్టిపడుతూ ఉంటుంది. నీ చెక్కిళ్ళ మీద గులాబీలు పూస్తాయి. నీ ఫాలతలంపై బ్రహ్మవర్చస్సు ప్రతిఫలిస్తూ ఉంటుంది.

కాబట్టి నీ శరీర సాధనకోసమైనా, నీ మనస్సును జక్కబరచుకో. నీబుద్ధి పైపైన తిరుగుతూఉంటే లాభంలేదు. నీ మనస్సు అజాగ్రత్తగ ఉండడంవల్ల, నీ ప్రకృతిలో ఎన్నో దురభ్యాసాలు పాదుకుపోయి యున్నాయి. వానిని పెకలించి వేయడం కష్టమవుతోంది. చీటికి మాటికి కోపం తెచ్చుకోడం వల్ల, కోపిష్ఠివై పోయినావు. మాట్లాడితే నీ ముఖం కందగడ్డ అయిపోతుంది. నీ నరాలెట్లా ఉబికివున్నాయో చూచుకో — ఎందుకా ఏడుపుకొట్టు ముఖం? ప్రతిదానికీ దిగులుపడడం, నిరుత్సాహం చెందడం, దురదృష్టుడని ఏడవడం-ఈ అభ్యాసం మూలంగా ముఖంలో దారిద్ర్యం ఓడుతూ ఉంటుంది. నీవు ఒకవేళ నవ్వినా నీముఖం ఏడుస్తున్నట్లుంటుంది. నీ స్నేహితులు నిన్నుచూచి అసహ్యించుకొంటూ ఉంటారు. తుమ్మల్లో పొద్దువలె, నీ ముఖంమీద చీకట్లు క్రమ్మిఉంటే నీ సహవాసం ఎవరుకోరుతారు? నీ ముఖాన్నిట్లా వికారంగా చేసుకొని, ఇతర్లు నిన్నాదరించడం లేదని ఎందుకు వారిని నిందించడం?

నీ మనస్సులో భావరత్నాలు, సంతోష వీచికలు, ఉత్సాహపు నురుగులువుంటే, నీ ముఖమూ, నీ మూర్తీ ఎంత శోభాయమానంగా ఉంటుందో ఆలోచించుకో. నీలో ఒక అపూర్వమైన వశీకరణశక్తి సమ్మోహనాస్త్రం పుట్టుకొని

వస్తుంది. నిన్ను జూచేటప్పటికల్లా నీ మిత్రులకు ప్రాణం లేచి వచ్చినట్లుంటుంది. నీ నగుమోమునుండి సూర్యరశ్మి బయల్వెడలి, నీ పరిసరాలను ప్రకాశవంతంగా జేస్తుంది. నీ మోము పూలతోటగ మారుతుంది. నీ హాసం, నీ మాట, నీ నడక, నీ చేష్టలు సర్వం ఆకర్షవంతంగా ఉంటాయి. మురళీధరునివలె నీవు చెలికాండ్రను నృత్యశీలురనుగ జేసి, నీ జీవితాన్ని ఒక క్రీడా రంగంగా చేసుకోగల్గుతావు.

నీ మనస్సును పదిలపరచుకోవాలంటే, పైపైన శుద్ధి చేసి లాభంలేదు, నీ బుద్ధిలోపల ఎన్నో పొరలున్నాయి. భూమి లోపల ఎన్ని పొరలు యుగయుగాంతరాల నుండి పేరుకొని వస్తున్నాయో, అట్లాగే నీలోగూడా ఎన్నో పొరలు గడ్డ కట్టుకొని బిగుసుకుపోయి ఉన్నాయి. అవి సునాయాసంగా పొమ్మంటే పోయేవికావు. వానిలో నీ అభ్యాసాలు. నీ వ్యసనాలు, నీ సంస్కారాలు గూళ్లు కట్టుకొని ఉన్నాయి. ఆ గూళ్ళను వదిలేస్తేనేకాని, నీ చిత్తం నీవు చెప్పినట్లుగ వినదు. నీ అభ్యాసాలే నిన్ను బానిసగ జేసివేయడంవల్ల, ఏ అభ్యాసాన్ని వదిలిపెట్టలేకుండా ఉన్నావు. నీ నోములు, వ్రతాలు తీర్మానాలు, నీ శపథాలు నీ పూర్వవాసనలను సంస్కరించలేకుండా ఉన్నాయి. బాహ్యశుద్ధి నిరర్థకం. నీలోపలి పొరలలో ప్రవేశించి, అట్టడుగునుండి క్రొత్తకట్టడాలు కట్టడం ప్రారంభించు. చిత్తశుద్ధి అంటే, ఏమనుకొంటున్నావు సోదరా ! నీ మనస్సులోపల మురిగిఉన్న ప్రాతకూపాలను తోడివైచి శుభ్రపరచడానికి స్థిర సంకల్పుడవు కమ్ము.

నీ స్వప్నాలను పరీక్షించుకో. నీలో ఎట్టి కోరికలు, తలంపులు అణగారిఉండి, సెలలు వేస్తున్నాయో పరిశోధించుకో. నీ లోపల ఎన్నో చెదల పుట్టలున్నాయి - అవే నీ బుద్ధిని, నీ శరీరాన్ని గుల్ల చేస్తున్నాయి. నీ మనస్సులోని లోతుల్లోకిదిగి పునాదులను భద్రపరుస్తేనే కాని, నీ మనస్సు నీలోపలి పనిముట్టు నీ వశములో నుండి, నీకు సుందరభవనాన్ని నిర్మించిపెట్టి, అందు కనులపండువుగ నుండే అలంకారాలను దిద్దిపెట్టలేదు. జయదేవుని మనోమందిరంవలె నీది కూడా "వాగ్దేవతా చరిత చిత్త చిత్రసద్మ" అయితే, నీకంటె భాగ్యశాలి ఎవరు ?

# చిత్తనిగ్రహం

సోదరా, ఏంత పిచ్చిపని చేస్తున్నావు ? నీ మనస్సు నీవు చెప్పినమాట వినటంలేదని, దానిని కృశింపజేస్తున్నావా ? అది దుర్బలమైపోతే, అది నీకు లోకువగా ఉంటుందని కాదూ నీ ఉద్దేశం ? నీ మనస్సును నీవట్లా నీరసింపజేస్తే. అది నిన్ను కూడా క్రుంగదీసి, నీరసింప జేస్తుందని నీవు గ్రహింపలేకున్నావు. నీవెంత పిచ్చిధోరణిలో పడిపోయినావు !

సోదరా ! నీపని ఎట్లా ఉన్నదో తెలుసూ ? ఒక రౌతు తన గుర్రంపై స్వారీచేయలేక, అది తనను తన్ని క్రింద బడ వేస్తుందని, దానికి మేత పెట్టడం మానివేశాడట. అది బక్క చిక్కితే, అది తనకెదురు తిరగకుండా, తాను చెప్పినట్లు నడుస్తుందని వాని ఆశ. అది చివరకు ఏమిచేసింది ? గడ్డెంతలేక. నడ్డెంత ఎండీ ఏమిచేసెనే గుర్రం దేవలోకం అన్నట్లు ఎత్తు పడిపోయింది. ఇక ఆ గుర్రాన్ని తానే ఈడ్చుకొని పోవాలసి వచ్చింది. అట్లావుంది నీపనికూడా.

మంచి బలంలోవున్న గుర్రాన్ని స్వారీచేయడంలో ఉన్నది రౌతు తెలివి తేటలన్నీ. దానిని చంపితే తాను రౌతు ఎట్లా అవుతాడు ? నీవుకూడా నీ మనస్సును శక్తివంతంగా, పుష్టికరంగా, ఉత్సాహవంతంగా చేసి, దానిని నీ స్వాధీనంలో ఉంచుకుంటే, నీ జీవితం కూడా సమృద్ధంగా, ఐశ్వర్య వంతంగా, శోభాయమానంగా ఉంటుంది. అంతేనే కాని మనస్సుకు నీళ్ళూ మేతా లేకుండా చేశావా, నీ పనికూడా ఉత్తదవుతుంది.

కాబట్టి నీ మనస్సును నీ స్వాధీనంలో ఉంచుకోమంటే, దానిని నీరసింపజేయమనికాదు. నీకు మనస్సనేదే లేకపోతే, వట్టి జడమైపోతావు. రాయీ రప్పాకంటె కూడా కనాకష్టమై పోతావు. మనస్సు నీలో వెలుగుతూండడం వల్లనే, నీవు మనిషివై లోకానికంతకు సామ్రాట్టు కాగలుగుతున్నావు. నీవు పైకి రావాలంటే, నీ జీవితాన్ని ఫలప్రదంగా చేసుకోవాలంటే. మనస్సును బాగా పోషించుకో. అది ఎంత విశాలమై, గంభీరమైనదైతే, ని సామ్రాజ్యంకూడా అంత విశాలమై సృథ వంతమైన దవుతుంది. నీమనస్సును సంకుచిత పరచుకొన్నావా నీవెందుకూ కొరగానిదరిద్రుడవై పోతావు.

నీ మనస్సు అంటే, అదేదో నీకు శత్రువు అని భ్రమ పడి, దానినిజూచి భయపడుతున్నావు. అది నీశత్రువు కాదు. అది నిన్ను ఉద్ధరించడానికి, సృష్టికంతకు నిన్ను ప్రభువునిగ జేయడానికి, నీ జీవనాన్ని ఆనందమయంగా జేయడానికి, నీకది

వరంగా ప్రసాదింపబడినది. నీ మనస్సు ఒక మహాశక్తి అని నమ్ము. ఏ భౌతికశక్తి దానిముందు నిలవలేదు. విద్యుచ్ఛక్తి కంటె గూడా రాసాయనిక శక్తులకంటెగూడా, ప్రాణశక్తి కంటె గూడా, అది ప్రబలమైనది, అమోఘమైనది. ఈ భూతలంలోని సమస్త శక్తులను అది లోబరచుకోగలదు. వాయువేగమెందుకు మనోవేగం ముందు ? ఇంద్రుని వజ్రాయుధం పర్వతాల రెక్కలను విరగగొట్టితే, నీ మనస్సు నీకు రెక్కలనిచ్చి, పర్వతశిఖరాల నెక్కిస్తుంది — ఆకాశవీధుల నూరేగిస్తుంది. పాతాళగంగను చేదుతుంది. మరుభూములను సస్యవంతంగా చేస్తుంది. నిన్ను త్రిలోక విజేతనుగ జేస్తుంది. అట్టి మహాశక్తి నీమనస్సు.

మనస్సుయొక్క పై పొరలను జూచి. అది ఇంతేనా అని చులకన చేస్తున్నావు. నీవు పైనచూచేది వట్టి నురుగు. ఆ నురుగును తప్పించుకొని లోపలకుపోయినావా అంటే, అది పెద్ద అఖాతం. దానిలోతును కనుపెట్టగలవారెవరు? దానిలో ఎన్ని ప్రవాహాలో ఉన్నాయి. సముద్రాలనుకూడా ఘూర్ణిల జేసే జలపాతాలున్నాయి. అది అపారమైన శక్తి అని విశ్వసించి, నీవు శక్తివంతుడవు కమ్ము.

పాము చుట్టచుట్టుకొని పడుకున్నంతసేపూ, అది చైతన్యంలేని తాడువలె గనుపడుతుంది. ఆ సర్పాన్ని లేపావంటే, అదేమి చేస్తుంది ? చుట్ట విప్పుకొని బుసలుకొట్టుతూ పైకిలేచి నిలబడుతుంది. పడగల నన్నిటిని విప్పుకొని ఆడడం మొదలు

పెట్టుతుంది. ఎట్టి ఆట అది! నీ మనస్సుకూడా సర్పంవంటిదే. ప్రస్తుతం అది చుట్టచుట్టుకొని నిద్రపోతోంది. దానిని కదిపావంటే, అది మేల్కొంటుంది. గర్భితంగావున్న శక్తులన్నీ లేస్తాయి. ఎంత భయంకరం! ఎంత సుందరం!

నీమనస్సు అనే బుట్టలోపల ఒక మహాశక్తి దాగివుంది. అది చుట్టచుట్టుకొని వడుకొని ఉన్నది కనుక దానిని "కుండలినీ" శక్తి అన్నారు. ఆ పైమూత తీసి దానిని లేపావా అంటే, నీలో ప్రవహించేశక్తి అపారం. నీ శరీరం, నీ అవయవాలు చైతన్యంతో తొణికిపోతూ ఉంటాయి. నీ ఇంద్రియాలు విచ్చుకొన్న పుష్పాలవలె విలసిల్లుతూ ఉంటాయి. నీ ఇచ్ఛాశక్తి, నీ జ్ఞానశక్తి, నీ క్రియాశక్తి వేయిమడుంగులు పెరుగుతాయి. నీవు సర్వశక్తి మానుడవవుతావు. నీకిక బాహ్యోపకరణాలెందుకు? మానసిక సిద్ధులు లభించిన తర్వాత, నీకే విషయంలోను కొదువ అనేది ఉండదు.

ఓ సోదరా, నీవు దుర్బలుడవని అనుకొంటున్నావు, కాదు. ఎందు కీ కించిజ్ఞత, కృపణత్వం ఆవహించిందో తెలియకున్నది. నీవు శక్తిమానుడవు - నీదేహం శక్తి, నీప్రాణంశక్తి, నీ మనస్సు శక్తి—సర్వం శక్తిమయం. నీ మనస్సును మనస్సుగా జూడక, అది ఒక మహాశక్తిగ భావించి, పూజించావా, నీజీవితమంతా శక్తివంతమై పోతుంది.

ఆశక్తి నీకెట్లా గోచరిస్తుంది అని అడుగుతావా? ప్రథమంలో అది ఉత్సాహశక్తిగ కనబడుతుంది. ఎట్టి ఉత్సాహ

మది ! అపూర్వమైన ఉత్సాహం - ఆ ఉత్సాహం ముందు అన్ని విఘ్నాలు పలాయనమై పోతాయి. ఏ పని కష్టమని పించదు. ఏ శ్రమా, శ్రమగ తోచదు దేనినిజూచీ నీవు భయ పడవు. నీలో ఉత్సాహ తరంగాలు లేచిపడుతూంటే, ఇంకా దిగులు, మాంద్యం, నీరసం ఎక్కడ ? నీ కాలినడక కూడా చురుకై పరుగులెత్తుతుంది. నీ చూపులు కరుకుబారి మర్మా లను భేదించి వేస్తాయి. మనస్సు మేల్కొని, సహస్రాక్షము లతో లోకాన్ని తిలకిస్తుంది. నీలో ఇంతవరకు మందగించిఉన్న నాడీ చక్రాలన్ని కదలబారి, క్రొత్త క్రొత్త భూములు నీకంట పడతాయి. నీలో ఇంతవరకు మురిగివున్న ప్రాతకూపాలన్ని పొంగి, నిర్మలములై పోతాయి. ఆలోచనలు ఎంత నిశితంగా సూక్ష్మంగా పరంపరలుగ సాగుతాయో చూడు. నీ స్మృతి కూడా మేల్కొంటుంది. ప్రచండ మారుతానికి వీథులలోని చెత్తా చెదారమంతా ఎలా కొట్టుకొనిపోతుందో, అల్లాగే నీలో ఉబికే ఉత్సాహానికి నీలో గూడుకట్టుకొని పోయిన, ప్రాత బూజులు, వాసనలు, సంస్కారాలు జలజల రాలిపోతాయి. ఆ ఉత్సాహశక్తి నీకొక క్రొత్తజన్మ ఇచ్చిందా అనిపిస్తుంది. ఎట్టి ఉల్లాసం ! ఎట్టి విలాసం ! ఎట్టి సంబరం !

నీలో ఉత్సాహశక్తి ఎప్పుడు బయలుదేరి, నీ జీవనా న్నంతను ఉత్సాహవంతంగా చేస్తుందో, అప్పుడు నీ చింతనా పటిమకూడా బలిష్ఠమవుతుంది. ఎట్టి గహన విషయాలైనా నీ కవలీలగ సుబోధకమై పోతాయి. నీ బుద్ధి ప్రతి విషయంలోను

చొరుచుకొనిపోయి, అపూర్వములైన రహస్యాలను కనిపెట్టు తుంది — నీ జ్ఞాపకానికి మరుగైన ప్రాత కథలన్నీ తిరిగి స్మృతిపథంలో బడుతాయి. ధారణాశక్తి హెచ్చుతుంది. అంతకు పూర్వం చీకిరి బాకిరిగనున్న భావాలన్నీ క్రమంగా బారులు తీర్చి, వీధులుదిద్ది, సోపానాలను నిర్మించి, జ్ఞాన సౌధాలకు ద్వారాలెత్తుతాయి. ఉత్సాహం మూలంగా జ్ఞానశక్తి బలిష్ఠ మగుతుంది.

అంతేనా? ఉత్సాహం నీలోని క్రియాశక్తిని గూడ వేయి మడుంగుల పెంచుతుంది. ఉత్సాహం కష్టాలని లెక్కించ నీయదు. అధైర్యం చెందనీయదు. ఎంత ఎత్తులనైనా ఎగబ్రాకే టట్టు చేస్తుంది. ఉత్సాహం ఆత్మవిశ్వాసాన్ని ఉద్దీపనచేసినట్టుగ, ఏదీ చేయలేదు. ఎందుకు? నీవు కార్యకుశలుడ వవుతావు. కర్మ వీరుడుగ విజృంభిస్తావు. కర్మభూమి నీకు నాట్యరంగంగా మారిపోతుంది. ఉత్సాహం కార్యాన్ని పరిశ్రమగా ఉంచదు; కార్యాన్ని సృష్టి విలాసంగా మార్చివేస్తుంది. గర్భితశక్తుల నన్నిటిని వెలికిదీసి నిన్ను భాగ్యశాలినిగ, ఐశ్వర్యవంతునిగ, విజేతనుగ జేసివేస్తుంది.

"ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత"

# ఉత్సాహం, ఉత్తేజం

సోదరా, నీవు ఉత్సాహివైతే, నీజీవితం పుష్టికరమై, శోభాయమానంగా ఉంటుందని గ్రహించడం మంచిదే కాని, ఉత్సాహమంటే ఏమనుకొంటున్నావో కొంచెం సంశయం కలుగుతోంది. ఉత్సాహమనడంతోటే, ఉద్రేకావేశాలు నీకు జ్ఞాపకం వస్తాయేమో! కాని ఉత్సాహి కావడమంటే ఉద్రేకి అవడం కాదుసుమా! ఉద్రేకం కొన్ని ప్రతికూల సందర్భాల్లలో, ప్రతీకారంగా వచ్చే ఆవేశంకాని, నీలో స్వతస్సిద్ధంగా, స్థిరంగా, బయలుదేరే ఆసక్తికాదు. నీ శత్రువును జూస్తే ఉద్రేకం కలుగుతుంది. నీమాట కెవరైనా అడ్డంవస్తే నీ కాగ్రహం కలుగుతుంది. నీకెవరైనా నష్టం కల్పిస్తే, వానిమీద ఎగిరి పడుతావు. నిన్నెవరైనా నిందిస్తే, నీ కండ్లెఱ్ఱవేసి, పండ్లు పటపట కొరుకుతావు. ఈ వికారాలన్నీ ఇతరులమీద ప్రతీకారంగా వచ్చే తాత్కాలికావేశాలు. ఇవన్నీ క్రోధంతో, చిత్త విక్షేపంతో గూడినవి. వీనిని జూచి ఉత్సాహం అనుకో కూడదు.

ఉత్సాహమనేది ప్రతీకార సంబంధమైన చిత్తవికారం కాదు. అది నీ లోపలనుండి, సహజంగా, సరళంగా, స్వతంత్రంగా ఉబికే ఉల్లాస పూర్వకమైన ఊట. ఆ ఊట నీజీవితాన్ని సస్యవంతంగా జేసివేస్తుంది. మరుగై మూసుకొని పోయిన శక్తుల నన్నిటిని వెలుపలకుదెచ్చి, నిన్ను జాగరూకునిగ ఉత్తేజితునిగ, విశ్వాస పూరితునిగ జేస్తుంది. ఉద్రేకమెక్కడ? ఉద్రేక కారణం కేవలం బయటిది-ఉత్సాహ హేతువు పూర్తిగ నీ లోపలది. ఉద్రేకం అపాయం సూచిస్తుంది. ఉత్సాహం స్వశక్తిని చూపుతుంది. ఉద్రేకం నీ ప్రాణంయొక్క, నీ స్నాయువుల యొక్క వికారం. ఉత్సాహం నీ చిత్తం లోపల నుండి బయలుదేరే ఉల్లాసం. మొదటిది నీ బలాన్ని బయటకు విరజిమ్ముతుంది. రెండోది నీ అంతరంగ బలాన్ని ఉద్దీపనచేస్తూ, నిన్నెక్కువ వీర్యవంతునిగ జేస్తుంది. అంత భేదమున్నది ఉత్సాహానికీ ఉద్రేకానికీని.

గడియారం ఇరువది నాలుగు గంటలూ పనిచేస్తోందంటే ఎందుచేత ? - లోపలి "స్ప్రింగు" చేత. ఆ స్ప్రింగు గంతులేస్తుందా? అరుస్తుందా? దొర్లుతుందా? లేదు. పనిచేస్తున్నట్లే ఉండదు. అది టైట్‌గా చుట్టచుట్టుకొని ఉంటుంది - ఊపిరి బిగబట్టుకొని యోగం చేస్తున్నట్లు. మెల్లగా, క్రమంగా, సునాయాసంగా, ఊపిరిని విడుస్తూంటుంది. చుట్టలు మెల్లగా విప్పుకొంటూ ఉంటుంది. దేనికి? యంత్రాన్నంతా నడపడానికి.

గడియారం యంత్రం యొక్క పని అంతా ఆ స్ప్రింగుమీదనే ఆధారపడి ఉన్నది. ఆ స్ప్రింగు బయటకు కనపడదు. లోపల దాగి ఉంటుంది. బయటకు కనబడేదల్లా - పెండ్యులం ఆడుతూ ఉండడం, చక్రాలు కదులుతూ ఉండడం, టక్కు టక్కుమంటూ చప్పుడు వినబడడం. ఈ పనంతా చేసేదెవరు ? ఆ స్ప్రింగు, దాని బిగువు, దాని కుంభకం, దాని టెన్షన్, దాని ఎలాస్టిసిటీ, దాని ఉల్లాసం. ఉత్సాహం కూడా గడియారంలోని స్ప్రింగు వంటిదేనని నమ్ము. అది నీలో చుట్టచుట్టుకొని అప్రకటితంగా, దాగుకొని ఉన్న శక్తి, గర్భితశక్తి, కుండలినీశక్తి. అదే నీ దేహ, ప్రాణ, మనములతో గూడిన యంత్రాన్ని నడుపుతోంది. ఆ శక్తి క్రమంగా విప్పుకొని, విచ్చుకొని, ఉబికినకొద్దీ-నీ జీవితం ఉత్తేజిత మవుతుంది. ఉల్లాసభరిత మవుతుంది. అంత శ్శక్తిని బయట కుబుకేటట్లు చేసుకోవడంలో ఉత్సాహమంటే ఏమిటో నీకు బోధపడుతుంది.

ఉత్సాహం నీకులేని క్రొత్తశక్తిని గల్పించి పెట్టదు. నీలో ఎంతశక్తో దాగిఉన్నది. కాని దాని ఉనికి తెలుసుకోలేక, దుర్బలుడనని అనుకొంటున్నావు. బయటనుండి శక్తిని అరువు తెచ్చుకోవాలెనని చేతులు చాస్తున్నావు. ఇతరుల సహాయమపేక్షిస్తున్నావు. నీ లోపల అపారమైన శక్తిని దాచిపెట్టుకొని, బలంకోసం దేహి అని బిచ్చమెత్తడం దేనికి ? నీలోని "స్ప్రింగు" నుపయోగించుకోక, బయటి ఆలంబనాలకోసం

ఎందుకు వెతుకు లాడడం? ఆ ఊట కడ్డంకులన్నీ తీసివేసి పైకి పొంగేటట్లు చేశావా, నీ జీవితమంతా శక్తితో నిండి నిబిడీకృత మగుతుంది.

ప్రపంచాన్నంతా ఏశక్తి యంత్రంలాగు త్రిప్పి నడుపుతోందో అదే నీలోగూడ నిగూఢంగా ఉండి క్రమంగా బహిర్గత మవుతోంది. అది నీలో అప్రకటితంగా "పవర్ హౌస్" అనుకో. ఆ శక్తి నీ మూలాధారంలో దాగి ఉండి ఊర్ధ్వముఖంగా ప్రకటితం కావడానికి చూస్తోంది. నీలో ఆ శక్తి బయలుదేరిందంటే, దాని ఉద్బోధచేతనే అని గ్రహించు. అది ఎంతకాలమో మరుగై యుండజాలదు. విత్తనంలో చెట్టు ఎంతకాలం దాగి ఉంటుంది? సమయం చూచుకొని బయటకు వచ్చి వేస్తుంది. గ్రుడ్డులో పక్షి ఎంతకాలం ఖయిదీ అయి యుంటుంది? స్వల్ప కాలంలోనే గ్రుడ్డును పగుల గొట్టుకొని, రెక్కలాడించుకొంటూ బయట పడుతుంది. తల్లి గర్భంలో శిశువు ఎన్నాళ్ళు దాక్కొంటుంది? నవమాసాలు పూర్తి అయ్యేటప్పటికల్లా శీర్షోదయం కాక తప్పదు. నీలో ఆ శక్తి బయలు దేరడం ఎందువల్ల? ఆ గర్భితమైన శక్తి బహిర్గతం కావడానికి పొందే ఆవేదన మూలంగానే. అది Evolutionary Force — దీనినే బర్గ్‌సన్ తత్వజ్ఞుడు Vital Elan అని వాక్రుచ్చాడు. ఎందుకు దానిని చిచ్ఛక్తి Creative Force అని చెప్పకూడదు?

నన్నిటిని ఉత్సాహ వేగాలని భ్రమపడక. నీ ఆధారాన్ని అనగా నీ కాయాన్ని నీ మనస్సును, నీ బుద్ధిని, నీ చిత్తాన్ని ఎంత వాసనారహితంగా, ఎంత విశుద్ధంగా, ఎంత నిర్మలంగా చేసుకొంటే, నీ ఆసక్తి కూడా అంత ఉత్తేజక శక్తిగ, ఆనందోల్లాసంగా మంగళప్రదంగా పరిణమిస్తుంది. ఆ మూల శక్తిని ఆశ్రయించు శక్తి ఉపాసకుడవు కమ్మి — ఆ శక్తే నీలో ఉత్సాహాన్ని, ఆసక్తిని ఆకాంక్షను ఉద్దీపనచేసి, నిన్నూర్ధ్వ లోకాలకు జేరుస్తుంది.

"ఓజోసి, బలమసి, భ్రాజోసి——"

## సౌందర్యబోధ

సోదరా, నీవు ఉత్సుకుడవని తెలుసుకోవడ మెట్లా ? నీలో ఉత్సాహాముంటే, అది నీ జీవితంలో, నీ ప్రవృత్తుల్లో వ్యక్తం కావాలి కాదూ ? నీ జీవిత ప్రకరణాలన్నిటిలోను, అన్ని ప్రవృత్తులలోను నీ కుత్సాహం ఉండకపోవచ్చు. నీ కభిమాన విషయంలోనైనా, ఉత్సాహం, పట్టుదల, ధైర్యం లేకపోతే ఎట్లా ? గాలికిపుట్టి, గాలికి ఎగిరి పోతున్నట్లుంటే, నీలో ఉత్సాహం లేనట్లే !

మనోవ్యాపారాలు ఇన్ని అని చెప్పడానికి వీలులేదు. కాని వానిన్నన్నిటిని మూడు ప్రకరణాల క్రింద వర్గీకరించవచ్చు, ఆ మూడు ఏవి ? ఒకటి—జిజ్ఞాస. జిజ్ఞాస అంటే తెలుసుకోవలెననే కోరిక. రెండు—కర్మనిరతి. అంటే ఏదో ఒకపని చేయవలెననే కోరిక. మూడు-సుఖలిప్స. సుఖలిప్స అంటే ఆనందించాలనే కోరిక. ఈ మూడు కోరికలూ అందరిలోనూ ఉంటాయి. కాని అన్ని కోరికలూ సమానంగా ఉండవు. వీనిలో ఏ ఒకటో ఏ రెండో ఎక్కువగా ఉంటాయి. మిగిలినవి తక్కువగా

ఉంటాయి. కాని హెచ్చుగనో, స్వల్పంగానో ఈ కోరికలు లేనివా డుండడు.

నీ కుత్సాహ మున్నదంటే ఈ కోరికల్లో కనబడాలి. నీకు నిజమైన జిజ్ఞాస, జ్ఞానేచ్ఛ ఉంటే, ఆ కోరికను సఫల పరచుకోడానికి ఎన్ని కంటాలైనా పడుతావు – నిజంగా నీవు ఉత్సాహివై యుంటే బీరువాల కొలదీ పుస్తకాలు చదువుతావు. గురువులను వెదకి వెదకి వారి పాదాలదగ్గర కూర్చుండి విద్యల నభ్యసిస్తావు - నీవే విద్యలో గడతేరాలనుకొన్నావో - దానికోసం నీవు సర్వాం ధారపోస్తావు. రాత్రింబగళ్లు నీ కదే ధ్యాస. ఆ హెచ్చరిక నిన్ను ఊరకే కూర్చోనిస్తుందా? విశ్రాంతిని కోరనిస్తుందా ? ఏది తెలుసుకోవలెనని కోరుతున్నావో - అది ఈడేరేవరకూ నీవు కళ్ళల్లో వత్తులు వేసుకొని, ఏకాగ్రచిత్తంతో, అనన్యమనస్కుడవై, నిష్ఠాగరిష్ఠుడ వవుతావు.

ముందు శ్రద్ధ బయలు దేరుతుంది. శ్రద్ధంటే ఏమిటి? మనస్సులో బయలుదేరే అభినివేశమూ, హెచ్చరికాను. హెచ్చరిక ఉన్నచోట నిష్ఠ ఉంటుంది. నిష్ఠ ఉంటేనేకాని సిద్ధి అనేది వుండదు. నీ జ్ఞానప్రవృత్తి ఉత్సాహ పూర్వకమైనదైతే శ్రద్ధ, ఏకాగ్రిత, నిష్ఠ అలవడతాయి. ఇవి నీకు అలవడినదీ లేనిదీ చూచుకో, అవి ఉన్నాయా, నీవు వుత్సాహివి అన్నమాటే. చూడు ఆధునిక వైజ్ఞానికుల ఉత్సాహశక్తి ఎట్టిదో! వారు ప్రయోగ శాలలలో కూర్చుండి తాము కనిపెట్ట దలచుకొన్న రహస్యాన్ని గూర్చి, సంవత్సరాల కొలది ఎక్సుపెరిమెంట్సు

చేస్తూంటారు. ఎంత తదేక ధ్యానం! ఎట్టి నిష్ఠాగరిమ! ఎట్టి అపూర్వ సహనం! ఉత్సాహం జ్ఞానప్రవృత్తి నట్లా ఏకముఖం చేసి, జ్ఞానోపాసనాబలంగా పరిణమింపజేస్తుంది. మన ప్రాచీన ఋషుల తత్వజిజ్ఞాస ఎట్టిదో నీకు తెలియనిది కాదు. వారి జిజ్ఞాస కేవలం తపోబలంగా సిద్ధిపొందేది.

ప్రతి మానవునిలోను ఈ జిజ్ఞాస ఉన్నది. కాని దానిని అందరూ కనిపెట్టి, సరిగ ప్రజ్వలింపజేయక పోవడంవల్ల, అది మినుకుమినుకుమంటూ వుంటుంది కాని, నిండు జ్ఞానజ్యోతిగా ప్రకాశించదు. అసలు మానవునిలో ఈ జ్ఞానేచ్ఛ ఎందుకు బయలు దేరిందంటావు? పిల్లవానిలో గూడ ఉంటుందే తెలుసుకోవాలెననే కోరిక. చూచిన దానినల్లా ఇదేమిటి, అదేమిటి అని ప్రశ్నిస్తూంటాడు. మనం వానికి జవాబు చెప్పలేక చచ్చిపోతాము. ఎందుకీ కుతూహలం? కనబడ్డ దానితో తృప్తిపడి ఉండరాదూ? ఈ దృశ్యాల లోపల ఏదో రహస్యమున్నట్లు పృచ్ఛించడం వెదకటం దేనికి?

అది బుద్ధియొక్క వ్యాపారం. జ్ఞానేచ్ఛ దాని పెచ్చరిక. బుద్ధివెనుక "సత్యం" అనే మూలం దాగివున్నది. అది బయటకు రావాలని బుద్ధిని ఎప్పుడూ, తొలుస్తూంటుంది, దాని ప్రేరణే బుద్ధియొక్క జ్ఞానేచ్ఛ. ఆ ఇచ్ఛనుబట్టే క్రమక్రమంగా ముందుకు పోయావంటే, బుద్ధి విజ్ఞానంగా ప్రకాశించి, నీకు సత్యోపలబ్ధి కలుగుతుంది. కాబట్టి నీలోని జిజ్ఞాసను నిరోధించకు.

దాని ని కా ఉద్దీపనచేసి, సత్యోపాసకుడవు కమ్ము. నీవు జ్ఞాన యోగివి అవుతావు.

జిజ్ఞాసవలెనే, నీలో కర్మ నిరతికూడా ఉన్నది. చూడు కార్యోత్సాహులెట్లా, పట్టు విడువకుండా, తమ పంతాన్ని నెగ్గించుకొంటారో ! ఎన్ని కష్టాలు వచ్చినా భరిస్తారు. కార్య సాధకులు వారు. ఎందరు కార్యోత్సాహులు ఉత్తరధ్రువం చేరడానికి పంతంపట్టి, మహాయాత్రలు సాగించలేదు ? ఎందరో ఆ ప్రస్థానంలో మడిసారు. అయినా, ఇంకా ఎందరో తిరిగి సాహసించారు. అట్లాగే గౌరీశృంగం ఎక్కి తీరాలనే కుతూహలంతో, దేశదేశాలనుండి కార్యతత్పరులు సాహసులు ఈ దేశానికి పయనమై వచ్చారు. వారి కార్యసాహస మత్యద్భుతం. ప్రాణాలను సహితం ఒడ్డుతారు క్రియాసిద్ధికొరకు. వారి కార్య తత్పరత అట్టిది. కార్యోత్సాహం సంకల్పశక్తిని అప్రతిహతం చేస్తుంది. అది వజ్రంవలె అభేద్యమైన శక్తి. ధైర్యాన్ని తోడుగ తీసుకుంటుంది. సాహసంచేత క్రొత్తదారులు తీయిస్తుంది.వారు విజేతలు, స్థిరసంకల్పులు, బలాఢ్యులు, ధీరులు.

ఈ కార్యనిరతి మానవునిలో ఎందుకు బయలుదేరిందంటావు ? "సత్య" మెట్లా నీ బుద్ధిలో దాగివుండి, జిజ్ఞాసను పురికొల్పుతోందో, అట్లాగే "శివ" మట్లా నీ శక్తిలో మరుగై వుండి, నిన్ను కార్యోత్సాహినిగ జేస్తున్నది. శివశక్తుల కెప్పుడూ ఎడబాటులేదు. వానికి నిజంగా అభేదం. ఎక్కడ శక్తివున్నదో

అక్కడ శివమున్నదనుకో. కాబట్టి నీ కార్యోత్సాహానెప్పుడూ చల్లపరచుకోక, దానికి దోహదంచేయి. వ్రతాలు, యాగాలు, శపథాలు నీ కర్మనిరతిని స్థిరపరుస్తాయి. కర్మయందు శ్రద్ధా భక్తులు కుదురుతాయి. కర్మ కుశలుడవవుతావు. శక్తి నీయందావహించి, నిన్ను కర్మవీరునిగ జేస్తుంది. నీకు శివధ్యానం లభిస్తుంది. శివుడు మంగళ స్వరూపుడు. నీలో ధర్మాసక్తి బయలుదేరిందంటే అది ఆ మంగళ స్వరూపుని ఆగమనమని తెలుసుకో. ధర్మపథంలో నడిచావాంటే, నీవు కర్మయోగివి అయిపోతావు. సందేహం లేదు. శివసిద్ధి కలుగుతుంది. నీలో సుఖలిప్సకూడా ఉన్నది. భోగేచ్ఛ లేనివాడెవడు? ఆనందించాలనే కోరిక - ఆనందమనేటప్పటికల్లా నీ ముఖంలో నవ్వులు మొలకలెత్తుతాయి. కాళ్ళు చిందులు తొక్కుతాయి. చూడు తల్లి వాత్సల్యమెట్టిదో! బిడ్డను ముద్దాడుతూంటె, పాలిండ్ల నుండి అమృతధారలు పొంగడం మొదలు పెట్టుతాయే! ఆ సుఖస్పర్శ ఎట్టిదంటావు? ప్రేమీ ప్రేమకుల ప్రణయ గాథలను విని ఉల్లాస భరితులు కానివారెవరు? కవులు, గాయకులు, నటులు, శిల్పులు - వీరి కళోపాసన ఎట్టిదంటావు? వారి కళావిన్యాసంలోని రసానుభవాన్ని నీ వెప్పుడూ చవిచూడకపోతే నీకంటె హతభాగ్యులెవరు? సుఖం, సుఖం, సుఖం - నీ జీవితమంతా సుఖమయమనుకో, రమ్యమైన వస్తువును జూచినప్పుడు నీకది పండుగ కాదూ? మధురవాణి నీ కెన్నిమారులు నీ వీనులకు విందు గొల్పలేదు? నీ మిత్రుని ప్రేమాలింగమునం

దెట్టి సు స్పర్శ ననుభవించి యుండవు? జిహ్వపై రుచిని భోగించని అల్పభాగుడెవడు? నీశరీరము డస్సిపోయి పాన్పుపై బరుండినప్పుడు, - ఓహో ఆ గాఢ నిద్రలోని సుఖమెట్టిది? నీ జీవితము సుఖమయము గాక, దుఃఖ భాజనమని ఎందు కల్లాడెదవు?

నీకు దేనిలో సుఖంలేదు? — నీ దేహారోగ్యంలో సుఖమున్నది. నీ ప్రాణంకంటె తీపి అయిందేది? నీ ఆహార విహారాలలో సుఖమున్నది. నీ కోరిక లీడేరినప్పుడల్లా వల్లమాలిన సుఖ మనుభవిస్తున్నావు. శాంత దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యాదుల్లో సుఖాన్ని పొందుతున్నావు. దేశభక్తుడు ప్రాణత్యాగంలో గూడా సుఖమనుభవిస్తాడే! ఆర్తులకు శరణ్యమియ్యడంలో ఎంత సుఖమున్నది? సేవాపరుల సుఖము నెన్నడును ఎరుగవా? త్యాగంలో, దానంలో, ప్రాణోత్సర్గంలో, ఆత్మసమర్పణంలో సుఖసంపదలు పొంగి పొరల్తుంటే, లోకం దుఃఖమయ మంటావేమిటి?

నిజమే. వియోగంలో, దారిద్ర్యంలో, దేహబాధలలో — దుఃఖం కలిగేమాట నిజమే. కాని ఆ దుఃఖంలో నీవు కోరుతున్నదేమిటి? సుఖంకాదూ? దుఃఖాన్నే సుఖంగా చేసుకొంటే అంతకంటె సుఖ మేమున్నది? నీ సుఖాన్నిక చెడగొట్టగల్గే దెవరు? నీ కన్నీటి కాల్వలు ఆనందమయములై పోవూ — నీ ఆర్తనాదాలు కరుణామయములుగ మారవూ? దుఃఖమే లేకపోతే, నీకు దయారసానుభవం ఎట్లా కలుగుతుంది?

సీతాదేవి వియోగాన్ని పలుమార్లు చదువుతూ టావే ? ఎందుకు ? కరుణ నుపభోగించడానికి గాదూ ? నీ సంసారం దుఃఖ భూయిష్ఠంగా ఉన్నదంటే అది రసమయమై పోతోం దన్న మాట. సుఖానుభవంలోలేని ఎరుక, దుఃఖానుభవంలో కలుగుతుంది. నీ హృదయంయొక్క లోతులను దెలిపే దదే. నీ మిత్రుని సఖ్యాన్ని రుచిచూపే దదే. భక్తుల ప్రేమామృ తాన్ని ఒలికించే దదే. జాలి, కనికరం, దయ, కరుణ—వీని ననుభవింపని బ్రతుకెందుకు ? దుఃఖం నీ కఠిన హృదయాన్ని గరిగించివేస్తుంది. నీ చిత్తాన్ని ద్రవీభూతంగా చేస్తుంది. నీ హృదయం మైత్రిని గోరుతుంది. కవీశ్వరు డేమన్నాడు ?- One touch of Nature makes the whole world kin అన్నాడు. దుఃఖమనేది లోకాన్నంతా బంధువుగ చేసి వేస్తుంది. భూత దయకంటే ఆనందమయమైన దేది ? ఎందుకు శిల్పులు, కవులు లోకంలోని దుఃఖాన్ని అట్లా చిత్రించి, రస సిద్ధులైనారు ?

నీ అజ్ఞానంలోనుండి జిజ్ఞాసద్వారా జ్ఞానజ్యోతి ఎట్లా ప్రకాశింప జూస్తోందో, నీ దౌర్బల్యంలో నుండి కర్మనిరతి ద్వారా శక్తి ఎట్లా ప్రకటితము కాగోరుతున్నదో, అట్లాగే నీ దుఃఖంలోనుండి సుఖలిప్స ద్వారా ఆనందం పొందచూస్తోంది. నీ దుఃఖం లోపలకుపోయి చూడు - ప్రేమయొక్క అఖాతం కనబడుతుంది. ఆనందసాగరం తరంగితమగుతూ ఊగుతూ ఉంటుంది. సుఖదుఃఖాలు ఆ రససింధువుయొక్క ఆటుపోట్లు.

దుఃఖానికి క్రుంగిపోక, దుఃఖాన్ని శోకరసభాండమని తెలుసుకొని దానిని భోగించు. నీ సుఖలిప్స తనివి తీరుతుంది. నీ దేహం, నీ ప్రాణం, నీ మనస్సు, నీ బుద్ధి నీ చిత్తం - సర్వం సుఖమయ మవుతుంది.

ఎందుకీ సుఖలిప్స, ఈ భోగేచ్ఛ నిన్ను విడువకుండా ఉన్నదో తెలుసునా ? నీజ్ఞానం వెనుక సత్యం ప్రకాశిస్తున్నట్లే నీ కర్మవెనుక శివశక్తి ప్రబుద్ధమగుతున్నట్లే, నీ సుఖస్మృతి వెనుక సౌందర్యబోధ బహిర్గత మగుతోందని తెలుసుకో. సుందరం ! - ఆ పదంలో ఎట్టి మోహనశక్తి ఉన్నదంటావు ? ఈ జగత్తు సౌందర్యరాశి కాదూ ? ఆహోహో ఆ తారల సౌందర్యం, ఆ మేఘ మాలికల సౌందర్యం, ఆ పర్వత సానువుల సౌందర్యం, ఆ కాసారాల సౌందర్యం, ఆ పూలవనాల సౌందర్యం - నీ జగత్తు పూలడోలికోయీ ! సౌందర్యరసం ఉట్టిపడని చోటేది ? వృక్షజాలంలోనేనా ? ఆ జంతు సంతానంలో, కోయిలగానంలో, కురంగలోచనల్లో, సర్పం వంపులలో ఎట్టి చక్కదనాలు ?

మానవ విగ్రహం ఎట్టి సౌందర్యసృష్టి ! కేవలం రసామృత మూర్తికాదూ. వాని మనోవీధుల విహరించు లలిత భావాల సౌందర్యం, కవుల బంగారు కలల సౌందర్యం, శిల్పుల కుంచెలనుండి జారు రేఖల సౌందర్యం - సౌందర్య మెక్కడ లేదు ? సోదరా, సుందరమునుండి బయల్వెడలిన జగము సుంద

రముకాక మరెట్లుండగలదు ? నీ సుఖలిప్స ఆ సుందరుని ఉల్లాసమే సుమీ. నీ సుఖస్మృతితో ఆనంద రసానుభవంలో నీ దుఃఖ బాధలలో గూడ నీ సౌందర్యబోధ ననుభవించు. నీ చిత్తాబ్జము ఆ త్రిలోక సుందరిని, ఆ జగన్మోహనుని, ఆ మురళీధరుని లీలాభూమి సుమీ. చూడుము నీ చిత్తాబ్జమునందలి దళములెట్లు విచ్చుకొని, అందుండి మధురరసమెట్లు ప్రవహింపుచున్నదో ? నీ సుఖలిప్స, నీ భోగేచ్ఛ, నీ ఆనందోత్సాహము - అనుభవించిన కొలదీ, ఉన్మత్తుడవైన కొలదీ, నీవు భక్తియోగివై, ప్రేమ వితరణము సేయగల్గుదువు.

"సత్యం—శివమ్—సుందరమ్"

# ఏకాగ్రత

సోదరా, నీవు చంచలుడవు, చపలచిత్తుడవు. నీ మనస్సు ఒక నిమిషం కూడా ఏ ఒకదానిమీదా నిలవదు. ఒకరిని చూస్తూంటావు. నీ మనస్సు ఇంకొకరిని గూర్చి ఆలోచిస్తూంటుంది. ఇదంతా అవధానం అనుకొంటున్నావు కాబోలు. కాదు. నీ మనస్సుకు నిలకడలేదు. క్షణక్షణం పరిపరివిధాల పరుగెత్తుతూ ఉంటుంది.

ఈ చాంచల్యం ఎందుచేతనో ఆలోచించుకొన్నావా? నీ మనస్సు నీ స్వాధీనంలో లేకపోవడంవల్ల, దానంతట అది విచ్చలవిడిగ భ్రమరంలాగ ఒక లక్ష్యం లేకుండా పరుగులెత్తుతూంటుంది. అందుచేతనే నీ బుద్ధి నీకు ప్రయోజనకరంగా లేదు, నీకు ఆలోచనాపటిమ లేకపోవడానికిదే కారణం.

ఆలోచనంటే ఏమిటి? నీ బుద్ధికి యోచనచేసే శక్తి ఉన్నది. అది నీకు నిశ్చయజ్ఞానం ఇయ్యగలదు. కాని ఒక షరతు ఉన్నది. ఏ విషయమై నీకు జ్ఞానం కావాలో, దానిమీద నీ బుద్ధిని నిలపాలి - ఇటూ అటూ కదలనియ్యకూడదు. దీనినే

ఏకాగ్రత అంటారు. ఏకాగ్రత అనేది నీ కలవడకపోతే, నీకెట్టి జ్ఞానమూ కలగదు. ఏ విద్యా అబ్బదు. నీ వేపనీ కుశలంగా చేయలేవు. కాబట్టి ముందు ఏకాగ్రతను కుదుర్చుకో. కుదుర్చుకొన్నావా. నీవెంత ప్రయోజకుడవైనా అవుతావు. లేకపోతే వట్టి నిరర్థకుడవు.

వడ్రంగి దగ్గర ఎప్పుడైనా కూర్చున్నావు ? వాని దగ్గర కొయ్యకు రంధ్రంవేసే పనిముట్టు ఉంటుంది. దానితో ఎట్లా రంధ్రం వేస్తాడో తెలుసా? ఎక్కడ రంధ్రం వేయాలనుకొన్నాడో అక్కడ గుర్తుపెట్టుకొంటాడు. తర్వాత తన పని ముట్టు కొనను ఆ గుర్తుమీద అదిమిపెట్టి, ఆ పనిముట్టును గిర గిర త్రిప్పడం మొదలు పెట్టుతాడు. అదిమిపెట్టి ఉంచడంవల్ల, పనిముట్టు ఎంత గిరగిర తిరుగుతున్నా, దాని కొనమాత్రం ఆ గుర్తునుండి జరిగిరాదు-కొంచెం సేపయ్యేటప్పటికి ఆకొయ్యకు రంధ్రం పడుతుంది. పనిముట్టును అదిమిపెట్టి త్రిప్పడంలో ఉన్నది వాని కౌశలమంతా.

నీ బుద్ధికూడా ఆ పనిముట్టువలె పనిచేయగలదు. ఎట్టి గహన విషయాన్నైనా ఛేదించగలదు. లోపలకు జొరుచుకొని పోయి, అంతర్యాన్ని కనిపెట్టగలదు. నీబుద్ధి మర్మభేది అనుకో. కాని నీ బుద్ధికి నిలకడ ఉండాలి. దానినే విషయంమీదనైనా అదిమిపెట్టి ఉంచాలి. ఆ కొంచెంసేపూ దానిని ఇటు అటూ కదలనియ్య కూడదు, ఇట్లా నిలిపియుంచడం పేరే ఏకాగ్రత.

ఏకాగ్రతను కుదుర్చుకోవలసినది ఒక జ్ఞానే అనుకొంటు న్నావేమో, కాదు. అది జ్ఞానికెంత అవసరమో, కర్మకారు నకు గూడ అంత అవసరం. రసజ్ఞునకుగూడ అది అవసరం. బుద్ధితో పనిచేసే ప్రతివానికీ ఏకాగ్రత అవసరం - సందేహం లేదు. ఏకాగ్రత మూలంగా, నీబుద్ధి ఒక విషయంమీద, ఒక కార్యంమీద నిలవడమే కాకుండా నీబుద్ధి పదును తేరుతుంది. పదుకు తేరిఉన్న బుద్ధినే కుశాగ్రబుద్ధి అంటారు. పదునులేని బాణాన్ని ఎంతజోరుగ సంధించి వదిలినా ఏమి ప్రయోజనం? దాని అలుగు పదునుగ ఉన్నదా, అది అవలీలగ ఎట్టి కఠిన మైన గురినైనా భేదించి వేయగలదు. ఏకాగ్రత నలవరచు కోవడమంటే నీ బుద్ధిని నిలకడలో ఉంచడమే కాదు. దానిని పదునుపెట్టి ఉంచాలి. అప్పుడు నీ చింతనాపటిమా, నీ కార్య కుశలతా, నీ రసభోగమూ అత్యద్భుతం. నీ మనస్సును ఒక గురిమీద నిలిపి ఉంచినప్పుడు, నీ మనస్సెట్లా ఉంటుందో, ఎప్పు డైనా ఆలోచించి చూచుకొన్నావా? నీ మనస్సు గురిమీద నిమగ్నమై ఉన్నంతసేపూ, నీకు "నేనూ" అనే జ్ఞానం ఉండదు. గురిని "చూస్తున్నా"ననే జ్ఞానంకూడా ఉండదు. ఆ ఒక్కగురే అయిపోతావు. ఆగురి నిన్నూ, నీ చూపునూ మింగేసి, అంతా తానై పోతుంది. ఆశ్చర్యం! ఆశ్చర్యమా? నీ మనస్సును నీవు చూచుకోకపోవడంవల్ల నీ మనస్సు ఎట్టి గారడీ చేయగలుగు తున్నదో నీవు కనిపెట్టడంలేదు.

పోనీ, నీ నిదురలో "నేనూ" అనే జ్ఞానమున్నదా? "నిద్ర పోతున్నాను" అనే తెలివికూడా ఉన్నదా? ఈ రెండూ లేవు. నిద్రిస్తున్నంతసేపూ, నిద్రానుభవం తప్ప వేరొకటి లేదు. నిద్ర వదిలిన పిమ్మటనే "నేను సుఖంగా నిద్రపోయినాను" అనే స్మృతి కలుగుతోంది. అట్లాగే నీవేపనినైనా ఏకాగ్రతతో చేస్తున్నావంటే - నీ మనస్సు ఆ కార్యరూపం దాలుస్తుంది. అంటే నీవా కార్యమై పోతావు. నీవొక పూవును చూస్తున్నావనుకో. దానిని తదేక ధ్యానంతో చూస్తూండు. నిశ్చలంగా చూస్తూండు. నీచూపు ఆ పూవులో గలసిపోయేటట్టు చెయ్యి- ఆ ఒకనిమిషం నీవు ఆ పూవువై పోయినా వన్నమాటే— "నేను పుష్పాన్ని చూ స్తున్నాను" అనే ఆలోచనే ఉండదు. ఆ కాస్సేపూ, చూచేవాడూ చూచేకర్మ ఈ రెండూ చూపు అయిపోతాయి. ద్రష్ట — దృక్కు - దృశ్యం - ఈ మూడు ఏకమైపోతాయి ధ్యాన నిమగ్నతలో. ఎంత విచిత్రమైన మనః పరిణామ మంటావిది ?

నీ అనుభవాలను నీవు తరచి చూచుకోక పోవడంవల్ల కర్త - కార్యం - కరణం, భోక్త — భోగం - భోగ్యం ఈ త్రిపుటి ఎట్లా ఒకటగుతుందీ అని ప్రశ్నిస్తావుకాని, అది నీలో నీకు తెలియకుండానే, ఒకటి మూడు కావడం, మూడు ఒకటి కావడం జరిగిపోతోంది. యోగావస్థలో మూడు ఒకటగుతాయి. యోగం లేనప్పుడు ఒకటి మూడగుతాయి. ఇది నిజంగా ఇంద్రజాలమే అనుకో - కాని ఈ ఇంద్రజాలాన్ని

దాని నిశ్చింకా ఉద్దీపనచేసి, సత్యోపాసకుడవు కమ్ము. నీవు జ్ఞాన యోగివి అవుతావు.

జిజ్ఞాసవలెనే, నీలో కర్మ నిరతికూడా ఉన్నది. చూడు కార్యోత్సాహులెట్లా, పట్టు విడువకుండా, తమ పంతాన్ని నెగ్గించుకొంటారో! ఎన్ని కష్టాలు వచ్చినా భరిస్తారు. కార్య సాధకులు వారు. ఎందరు కార్యోత్సాహులు ఉత్తరధ్రువం చేరడానికి పంతంపట్టి, మహాయాత్రలు సాగించలేదు? ఎందరో ఆ ప్రస్థానంలో మడిసారు. అయినా, ఇంకా ఎందరో తిరిగి సాహసించారు. అట్లాగే గౌరీశృంగం ఎక్కి తీరాలనే కుతూహలంతో, దేశదేశాలనుండి కార్యతత్పరులు సాహసులు ఈ దేశానికి పయనమై వచ్చారు. వారి కార్యసాహస మత్యద్భుతం. ప్రాణాలను సహితం ఒడ్డుతారు క్రియాసిద్ధికొరకు. వారి కార్య తత్పరత అట్టిది. కార్యోత్సాహం సంకల్పశక్తిని అప్రతిహతం చేస్తుంది. అది వజ్రంవలె అభేద్యమైన శక్తి. ధైర్యాన్ని తోడుగ తీసుకుంటుంది. సాహసంచేత క్రొత్తదారులు తీయిస్తుంది.వారు విజేతలు, స్థిరసంకల్పులు, బలాఢ్యులు, ధీరులు.

ఈ కార్యనిరతి మానవునిలో ఎందుకు బయలుదేరిందంటావు? "సత్య" మెట్లా నీ బుద్ధిలో దాగివుండి, జిజ్ఞాసను పురికొల్పుతోందో, అట్లాగే "శివ" మట్లా నీ శక్తిలో మరుగై వుండి, నిన్ను కార్యోత్సాహినిగ జేస్తున్నది. శివశక్తుల కెప్పుడూ ఎడబాటులేదు. వానికి నిజంగా అభేదం. ఎక్కడ శక్తివున్నదో

అక్కడ శివమున్నదనుకో. కాబట్టి నీ కార్యోత్సాహాన్నెప్పుడూ చల్లపరచుకోక, దానికి దోహదంచేయి. వ్రతాలు, యాగాలు, శపథాలు నీ కర్మనిరతిని స్థిరపరుస్తాయి. కర్మయందు శ్రద్ధా భక్తులు కుదురుతాయి. కర్మ కుశలుడవవుతావు. శక్తి నీయందావహించి, నిన్ను కర్మవీరునిగ జేస్తుంది. నీకు శివధ్యానం లభిస్తుంది. శివుడు మంగళ స్వరూపుడు. నీలో ధర్మాసక్తి బయలుదేరిందంటే అది ఆ మంగళ స్వరూపుని ఆగమనమని తెలుసుకో. ధర్మపథంలో నడిచావాంటే, నీవు కర్మయోగివి అయిపోతావు. సందేహం లేదు. శివసిద్ధి కలుగుతుంది. నీలో సుఖలిప్సకూడా ఉన్నది. భోగేచ్ఛ లేనివాడెవడు? ఆనందించాలనే కోరిక - ఆనందమనేటప్పటికల్లా నీ ముఖంలో నవ్వులు మొలకలెత్తుతాయి. కాళ్ళు చిందులు తొక్కుతాయి. చూడు తల్లి వాత్సల్యమెట్టిదో! బిడ్డను ముద్దాడుతూంటె, పాలిండ్ల నుండి అమృతధారలు పొంగడం మొదలు పెట్టుతాయే! ఆ సుఖస్పర్శ ఎట్టిదంటావు? ప్రేమీ ప్రేమకుల ప్రణయ గాథలను విని ఉల్లాస భరితులు కానివారెవరు? కవులు, గాయకులు, నటులు, శిల్పులు - వీరి కళోపాసన ఎట్టిదంటావు? వారి కళా విన్యాసంలోని రసానుభవాన్ని నీ వెప్పుడూ చవిచూడకపోతే నీకంటె హతభాగ్యులెవరు? సుఖం, సుఖం, సుఖం - నీ జీవితమంతా సుఖమయమనుకో, రమ్యమైన వస్తువును జూచినప్పుడు నీకది పండుగ కాదూ? మధురవాణి నీ కెన్నిమారులు నీ వీనులకు విందు గొల్పలేదు? నీ మిత్రుని ప్రేమాలింగమునం

దెట్టి సుఖస్పర్శ ననుభవించి యుండవు? జిహ్వాపై రుచిని భోగించని అల్పభాగుడెవడు? నీశరీరము డస్సిపోయి పాన్పుపై బరుండినప్పుడు, - ఓహో ఆ గాఢ నిద్రలోని సుఖమెట్టిది? నీ జీవితము సుఖమయము గాక, దుఃఖ భాజనమని ఎందు కల్లలాడెదవు?

నీకు దేనిలో సుఖంలేదు? — నీ దేహారోగ్యంలో సుఖమున్నది. నీ ప్రాణంకంటె తీపి అయిందేది? నీ ఆహార విహారాలలో సుఖమున్నది. నీ కోరికలీడేరినప్పుడల్లా వల్లమాలిన సుఖ మనుభవిస్తున్నావు. శాంత దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యాదుల్లో సుఖాన్ని పొందుతున్నావు. దేశభక్తుడు ప్రాణత్యాగంలో గూడా సుఖమనుభవిస్తాడే! ఆర్తులకు శరణ్యమియ్యడంలో ఎంత సుఖమున్నది? సేవాపరుల సుఖము నెన్నడును ఎరుగవా? త్యాగంలో, దానంలో, ప్రాణోత్సర్గంలో, ఆత్మ సమర్పణంలో సుఖసంపదలు పొంగి పొరల్తుంటే, లోకం దుఃఖమయ మంటావేమిటి?

నిజమే. వియోగంలో, దారిద్ర్యంలో, దేహబాధలలో— దుఃఖం కలిగేమాట నిజమే. కాని ఆ దుఃఖంల్లో నీవు కోరుతున్న దేమిటి? సుఖం కాదూ? దుఃఖాన్నే సుఖంగా చేసుకొంటే అంతకంటె సుఖ మేమున్నది? నీ సుఖాన్నిక చెడగొట్టగల్గే దెవరు? నీ కన్నీటి కాల్వలు ఆనందమయములై పోవూ — నీ ఆర్తనాదాలు కరుణామయములుగ మారవూ? దుఃఖమే లేకపోతే, నీకు దయారసానుభవం ఎట్లా కలుగుతుంది?

సీతాదేవి వియోగాన్ని పలుమార్లు చదువుతూంటావే ? ఎందుకు ? కరుణ నుపభోగించడానికి గాదూ ? నీ సంసారం దుఃఖ భూయిష్ఠంగా ఉన్నదంటే అది రసమయమై పోతోం దన్న మాట. సుఖానుభవంలోలేని ఎరుక, దుఃఖానుభవంలో కలుగుతుంది. నీ హృదయంయొక్క లోతులను దెలిపే దదే. నీ మిత్రుని సఖ్యాన్ని రుచిచూపే దదే. భక్తుల ప్రేమామృతాన్ని ఒలికించే దదే. జాలి, కనికరం, దయ, కరుణ—వీని ననుభవింపని బ్రతుకెందుకు ? దుఃఖం నీ కఠిన హృదయాన్ని గరిగించివేస్తుంది. నీ చిత్తాన్ని ద్రవీభూతంగా చేస్తుంది. నీ హృదయం మైత్రిని గోరుతుంది. కవీశ్వరు డేమన్నాడు ?- One touch of Nature makes the whole world kin అన్నాడు. దుఃఖమనేది లోకాన్నంతా బంధువుగ చేసి వేస్తుంది. భూత దయకంటే ఆనందమయమైన దేది ? ఎందుకు శిల్పులు, కవులు లోకంలోని దుఃఖాన్ని అట్లా చిత్రించి, రస సిద్ధులైనారు ?

నీ అజ్ఞానంలోనుండి జిజ్ఞాసద్వారా జ్ఞానజ్యోతి ఎట్లా ప్రకాశింప జూస్తోందో, నీ దౌర్బల్యంలో నుండి కర్మనిరతి ద్వారా శక్తి ఎట్లా ప్రకటితము కాగోరుతున్నదో, అట్లాగే నీ దుఃఖంలోనుండి సుఖలిప్స ద్వారా ఆనందం పొందచూస్తోంది. నీ దుఃఖం లోపలకుపోయి చూడు - ప్రేమయొక్క అఖాతం కనబడుతుంది. ఆనందసాగరం తరంగితమగుతూ ఊగుతూ ఉంటుంది. సుఖదుఃఖాలు ఆ రససింధువుయొక్క ఆటుపోట్లు.

దుఃఖానికి క్రుంగిపోక, దుఃఖాన్ని శోకరసభాండమని తెలుసుకొని దానిని భోగించు. నీ సుఖలిప్స తనివి తీరుతుంది. నీ దేహం, నీ ప్రాణం, నీ మనస్సు, నీ బుద్ధి నీ చిత్తం - సర్వం సుఖమయ మవుతుంది.

ఎందుకీ సుఖలిప్స, ఈ భోగేచ్ఛ నిన్ను విడువకుండా ఉన్నదో తెలుసునా? నీజ్ఞానం వెనుక సత్యం ప్రకాశిస్తున్నట్లే నీ కర్మవెనుక శివశక్తి ప్రబుద్ధమగుతున్నట్లే, నీ సుఖస్మృతి వెనుక సౌందర్యబోధ బహిర్గత మగుతోందని తెలుసుకో. సుందరం! - ఆ పదంలో ఎట్టి మోహనశక్తి ఉన్నదంటావు? ఈ జగత్తు సౌందర్యరాశి కాదూ? ఆహాహా ఆ తారల సౌందర్యం, ఆ మేఘ మాలికల సౌందర్యం, ఆ పర్వత సానువుల సౌందర్యం, ఆ కాసారాల సౌందర్యం, ఆ పూలవనాల సౌందర్యం - నీ జగత్తు పూలడోలికోయీ! సౌందర్యరసం ఉట్టిపడని చోటేది? వృత్తుజాలంలోనేనా? ఆ జంతు సంతానంలో, కోయిలగానంలో, కురంగలోచనల్లో, సర్పం వంపులలో ఎట్టి చక్కదనాలు?

మానవ విగ్రహం ఎట్టి సౌందర్యసృష్టి! కేవలం రసామృత మూర్తికాదూ. వాని మనోవీధుల విహరించు లలిత భావాల సౌందర్యం, కవుల బంగారు కలల సౌందర్యం, శిల్పుల కుంచెలనుండి జారు రేఖల సౌందర్యం - సౌందర్య మెక్కడ లేదు? సోదరా, సుందరమునుండి బయల్వెడలిన జగము సుంద

రముకాక మరెట్లుండగలదు? నీ సుఖలిప్స ఆ సుందరుని ఉల్లాసమే సుమీ. నీ సుఖస్మృతిలో ఆనంద రసానుభవంలో నీ దుఃఖ బాధలలో గూడ నీ సౌందర్యబోధ ననుభవించు. నీ చిత్తాబ్జము ఆ త్రిలోక సుందరిని, ఆ జగన్మోహనుని, ఆ మురళీధరుని లీలాభూమి సుమీ. చూడుము నీ చిత్తాబ్జమునందలి దళములెట్లు విచ్చుకొని, అందుండి మధురరసమెట్లు ప్రవహింపుచున్నదో? నీ సుఖలిప్స, నీ భోగేచ్ఛ, నీ ఆనందోత్సాహము - అనుభవించిన కొలదీ, ఉన్మత్తుడవైన కొలదీ, నీవు భక్తియోగివై, ప్రేమ వితరణము సేయగల్గుదువు.

"సత్యం—శివమ్—సుందరమ్"

# ఏకాగ్రత

సోదరా, నీవు చంచలుడవు, చపలచిత్తుడవు. నీ మనస్సు ఒక నిమిషం కూడా ఏ ఒకదానిమీదా నిలవదు. ఒకరిని చూస్తూంటావు. నీ మనస్సు ఇంకొకరిని గూర్చి ఆలోచిస్తూంటుంది. ఇదంతా అవధానం అనుకొంటున్నావు కాబోలు. కాదు. నీ మనస్సుకు నిలకడలేదు. క్షణక్షణం పరిపరివిధాల పరుగెత్తుతూ ఉంటుంది.

ఈ చాంచల్యం ఎందుచేతనో ఆలోచించుకొన్నావా? నీ మనస్సు నీ స్వాధీనంలో లేకపోవడంవల్ల, దానంతట అది విచ్చలవిడిగ భ్రమరంలాగ ఒక లక్ష్యం లేకుండా పరుగులెత్తుతూంటుంది. అందుచేతనే నీ బుద్ధి నీకు ప్రయోజనకరంగా లేదు, నీకు ఆలోచనాపటిమ లేకపోవడానికిదే కారణం.

ఆలోచనంటే ఏమిటి? నీ బుద్ధికి యోచనచేసే శక్తి ఉన్నది. అది నీకు నిశ్చయజ్ఞానం ఇయ్యగలదు. కాని ఒక షరతు ఉన్నది. ఏ విషయమై నీకు జ్ఞానం కావాలో, దానిమీద నీ బుద్ధిని నిలపాలి - ఇటూ అటూ కదలనియ్యకూడదు. దీనినే

ఏకాగ్రత అంటారు. ఏకాగ్రత అనేది నీ కలవడకపోతే, నీకెట్టి జ్ఞానమూ కలగదు. ఏ విద్యా అబ్బదు. నీ పనీ కుశలంగా చేయలేవు. కాబట్టి ముందు ఏకాగ్రతను కుదుర్చుకో. కుదుర్చుకొన్నావా. నీవెంత ప్రయోజకుడవైనా అవుతావు. లేకపోతే వట్టి నిరర్థకుడవు.

వడ్రంగి దగ్గర ఎప్పుడైనా కూర్చున్నావు ? వాని దగ్గర కొయ్యకు రంధ్రంవేసే పనిముట్టు ఉంటుంది. దానితో ఎట్లా రంధ్రం వేస్తాడో తెలుసా? ఎక్కడ రంధ్రం వేయాలనుకొన్నాడో అక్కడ గుర్తుపెట్టుకొంటాడు. తర్వాత తన పనిముట్టు కొనను ఆ గుర్తుమీద అదిమిపెట్టి, ఆ పనిముట్టును గిర గిర త్రిప్పడం మొదలు పెట్టుతాడు. అదిమిపెట్టి ఉంచడంవల్ల, పనిముట్టు ఎంత గిరగిర తిరుగుతున్నా, దాని కొనమాత్రం ఆ గుర్తునుండి జరిగిరాదు-కొంచెం సేపయ్యేటప్పటికి ఆకొయ్యకు రంధ్రం పడుతుంది. పనిముట్టును అదిమిపెట్టి త్రిప్పడంలో ఉన్నది వాని కౌశలమంతా.

నీ బుద్ధికూడా ఆ పనిముట్టువలె పనిచేయగలదు. ఎట్టి గహన విషయాన్నైనా ఛేదించగలదు. లోపలకు జొరుచుకొని పోయి, అంతర్యాన్ని కనిపెట్టగలదు. నీబుద్ధి మర్మభేది అనుకో. కాని నీ బుద్ధికి నిలకడ ఉండాలి. దాని నే విషయంమీదనైనా అదిమిపెట్టి ఉంచాలి. ఆ కొంచెంసేపూ దానిని ఇటు అటూ కదలనియ్య కూడదు, ఇట్లా నిలిపియుంచడం పేరే ఏకాగ్రత.

ఏకాగ్రతను కుదుర్చుకోవలసినది ఒక జ్ఞానే అనుకొంటు న్నావేమో, కాదు. అది జ్ఞానికెంత అవసరమో, కర్మకారు నకు గూడ అంత అవసరం. రసజ్ఞునకుగూడ అది అవసరం. బుద్ధితో పనిచేసే ప్రతివానికీ ఏకాగ్రత అవసరం - సందేహం లేదు. ఏకాగ్రత మూలంగా, నీబుద్ధి ఒక విషయంమీద, ఒక కార్యంమీద నిలవడమే కాకుండా నీబుద్ధి పదును తేరుతుంది. పదుకు తేరిఉన్న బుద్ధినే కుశాగ్రబుద్ధి అంటారు. పదునులేని బాణాన్ని ఎంతజోరుగ సంధించి వదిలినా ఏమి ప్రయోజనం? దాని అలుగు పదునుగ ఉన్నదా, అది అవలీలగ ఎట్టి కఠిన మైన గురినైనా భేదించి వేయగలదు. ఏకాగ్రత నలవరచు కోవడమంటే నీ బుద్ధిని నిలకడలో ఉంచడమే కాదు. దానిని పదునుపెట్టి ఉంచాలి. అప్పుడు నీ చింతనాపటిమా, నీ కార్య కుశలతా, నీ రసభోగమూ అత్యద్భుతం. నీ మనస్సును ఒక గురిమీద నిలిపి ఉంచినప్పుడు, నీ మనస్సెట్లా ఉంటుందో, ఎప్పు డైనా ఆలోచించి చూచుకొన్నావా? నీ మనస్సు గురిమీద నిమగ్నమై ఉన్నంతసేపూ, నీకు "నేనూ" అనే జ్ఞానం ఉండదు. గురిని "చూస్తున్నా"ననే జ్ఞానంకూడా ఉండదు. ఆ ఒక్కగురే అయిపోతావు. ఆగురి నిన్నూ, నీ చూపునూ మింగేసి, అంతా తానైపోతుంది. ఆశ్చర్యం! ఆశ్చర్యమా? నీ మనస్సును నీవు చూచుకోకపోవడంవల్ల నీ మనస్సు ఎట్టి గారడీ చేయగలుగు తున్నదో నీవు కనిపెట్టడంలేదు.

చేస్తూంటారు. ఎంత తదేక ధ్యానం! ఎట్టి నిష్ఠాగరిమ! ఎట్టి అపూర్వ సహనం! ఉత్సాహం జ్ఞానప్రవృత్తి నట్లా ఏకముఖం చేసి, జ్ఞానోపాసనాబలంగా పరిణమింపజేస్తుంది. మన ప్రాచీన ఋషుల తత్వజిజ్ఞాస ఎట్టిదో నీకు తెలియనిది కాదు. వారి జిజ్ఞాస కేవలం తపోబలంగా సిద్ధిపొందేది.

ప్రతి మానవునిలోను ఈ జిజ్ఞాస ఉన్నది. కాని దానిని అందరూ కనిపెట్టి, సరిగ ప్రజ్వలింపజేయక పోవడంవల్ల, అది మినుకుమినుకుమంటూ వుంటుంది కాని, నిండు జ్ఞానజ్యోతిగా ప్రకాశించదు. అసలు మానవునిలో ఈ జ్ఞానేచ్ఛ ఎందుకు బయలు దేరిందంటావు? పిల్లవానిలో గూడ ఉంటుందే తెలుసు కోవాలెననే కోరిక. చూచిన దానినల్లా ఇదేమిటి, అదేమిటి అని ప్రశ్నిస్తూంటాడు. మనం వానికి జవాబు చెప్పలేక చచ్చి పోతాము. ఎందుకీ కుతూహలం? కనబడ్డ దానితో తృప్తిపడి ఉండరాదూ? ఈ దృశ్యాల లోపల ఏదో రహస్యమున్నట్లు పృచ్ఛించడం వెదకటం దేనికి?

అది బుద్ధియొక్క వ్యాపారం. జ్ఞానేచ్ఛ దాని హెచ్చరిక. బుద్ధివెనుక "సత్యం" అనే మూలం దాగివున్నది. అది బయటకు రావాలని బుద్ధిని ఎప్పుడూ, తొలుస్తూంటుంది. దాని ప్రేరణే బుద్ధియొక్క జ్ఞానేచ్ఛ. ఆ ఇచ్ఛనుబట్టే క్రమక్రమంగా ముందుకు పోయావంటే, బుద్ధి విజ్ఞానంగా ప్రకాశించి, నీకు సత్యోపలబ్ధి కలుగుతుంది. కాబట్టి నీలోని జిజ్ఞాసను నిరోధించకు.

దాని నింకా ఉద్దీపనచేసి, సత్యోపాసకుడవు కమ్ము. నీవు జ్ఞాన యోగివి అవుతావు.

జిజ్ఞాసవలెనే, నీలో కర్మ నిరతికూడా ఉన్నది. చూడు కార్యోత్సాహులెట్లా, పట్టు విడువకుండా, తమ పంతాన్ని నెగ్గించుకొంటూరో ! ఎన్ని కష్టాలు వచ్చినా భరిస్తారు. కార్య సాధకులు వారు. ఎందరు కార్యోత్సాహులు ఉత్తరధ్రువం చేరడానికి పంతంపట్టి, మహాయాత్రలు సాగించలేదు ? ఎందరో ఆ ప్రస్థానంలో మడిసారు. అయినా, ఇంకా ఎందరో తిరిగి సాహసించారు. అట్లాగే గౌరీశృంగం ఎక్కి తీరాలనే కుతూహలంతో, దేశదేశాలనుండి కార్యతత్పరులు సాహసులు ఈ దేశానికి పయనమై వచ్చారు. వారి కార్యసాహస మత్యద్భుతం. ప్రాణాలను సహితం ఒడ్డుతారు క్రియాసిద్ధికొరకు. వారి కార్య తత్పరత అట్టిది. కార్యోత్సాహం సంకల్పశక్తిని అప్రతిహతం చేస్తుంది. అది వజ్రంవలె అభేద్యమైన శక్తి. ధైర్యాన్నితోడుగ తీసుకుంటుంది. సాహసంచేత క్రొత్తదారులు తీయిస్తుంది.వారు విజేతలు, స్థిరసంకల్పులు, బలాఢ్యులు, ధీరులు.

ఈ కార్యనిరతి మానవునిలో ఎందుకు బయలుదేరిందంటావు ? "సత్య" మెట్లా నీ బుద్ధిలో దాగివుండి, జిజ్ఞాసను పురికొల్పుతోందో, అట్లాగే "శివ" మట్లా నీ శక్తిలో మరుగైవుండి, నిన్ను కార్యోత్సాహినిగ జేస్తున్నది. శివశక్తుల కెప్పుడూ ఎడబాటులేదు. వానికి నిజంగా అభేదం. ఎక్కడ శక్తివున్నదో

అక్కడ శివమున్నదనుకో. కాబట్టి నీ కార్యోత్సాహానెప్పుడూ చల్లపరచుకోక, దానికి దోహదంచేయి. వ్రతాలు, యాగాలు, శపథాలు నీ కర్మనిరతిని స్థిరపరుస్తాయి. కర్మయందు శ్రద్ధా భక్తులు కుదురుతాయి. కర్మ కుశలుడవవుతావు. శక్తి నీయందావహించి, నిన్ను కర్మవీరునిగ జేస్తుంది. నీకు శివధ్యానం లభిస్తుంది. శివుడు మంగళ స్వరూపుడు. నీలో ధర్మాసక్తి బయలుదేరిందంటే అది ఆ మంగళ స్వరూపుని ఆగమనమని తెలుసుకో. ధర్మపథంలో నడిచావాంటే, నీవు కర్మయోగివి అయిపోతావు. సందేహం లేదు. శివసిద్ధి కలుగుతుంది. నీలో సుఖలిప్సకూడా ఉన్నది. భోగేచ్ఛ లేనివాడెవడు? ఆనందించాలనే కోరిక - ఆనందమనేటప్పటికల్లా నీ ముఖంలో నవ్వులు మొలకలెత్తుతాయి. కాళ్ళు చిందులు తొక్కుతాయి. చూడు తల్లి వాత్సల్యమెట్టిదో ! బిడ్డను ముద్దాడుతూంటె, పాలిండ్ల నుండి అమృతధారలు పొంగడం మొదలు పెట్టుతాయే ! ఆ సుఖస్పర్శ ఎట్టిదంటావు ? ప్రేమీ ప్రేమకుల ప్రణయ గాధలను విని ఉల్లాస భరితులు కానివారెవరు ? కవులు, గాయకులు, నటులు, శిల్పులు - వీరి కళోపాసన ఎట్టిదంటావు ? వారి కళా విన్యాసంలోని రసానుభవాన్ని నీ వెప్పుడూ చవిచూడకపోతే నీకంటె హతభాగ్యులెవరు? సుఖం, సుఖం, సుఖం - నీ జీవిత మంతా సుఖమయమనుకో, రమ్యమైన వస్తువును జూచినప్పుడు నీకది పండుగ కాదూ ? మధురవాణి నీ కెన్నిమారులు నీ వీనులకు విందు గొల్పలేదు? నీ మిత్రుని ప్రేమాలింగమునం

దెట్టి సుస్పర్శ ననుభవించి యుండవు? జిహ్వాపై రుచిని భోగించని అల్పభాగుడెవడు? నీశరీరము డస్సిపోయి పాన్పుపై బరుండినప్పుడు, - ఓహో ఆ గాఢ నిద్రలోని సుఖమెట్టిది? నీ జీవితము సుఖమయము గాక, దుఃఖ భాజనమని ఎందు కల్లల్లాడెదవు?

నీకు దేనిలో సుఖంలేదు? — నీ దేహారోగ్యంలో సుఖమున్నది. నీ ప్రాణంకంటె తీపి అయిందేది? నీ ఆహార విహారాలలో సుఖమున్నది. నీ కోరిక తీరినప్పుడల్లా వల్లమాలిన సుఖ మనుభవిస్తున్నావు. శాంత దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యాదుల్లో సుఖాన్ని పొందుతున్నావు. దేశభక్తుడు ప్రాణత్యాగంలో గూడా సుఖ మనుభవిస్తాడే! ఆర్తులకు శరణ్యమియ్యడంలో ఎంత సుఖమున్నది? సేవాపరుల సుఖము నెన్నడును ఎరుగవా? త్యాగంలో, దానంలో, ప్రాణోత్సర్గంలో, ఆత్మ సమర్పణంలో సుఖసంపదలు పొంగి పొరల్తుంటే, లోకం దుఃఖమయ మంటావేమిటి?

నిజమే. వియోగంలో, దారిద్ర్యంలో, దేహబాధలలో దుఃఖం కలిగేమాట నిజమే. కాని ఆ దుఃఖంల్లో నీవు కోరుతున్నదేమిటి? సుఖం కాదూ? దుఃఖాన్నే సుఖంగా చేసుకొంటే అంతకంటె సుఖ మేమున్నది? నీ సుఖాన్నిక చెడగొట్టగల్గేదెవరు? నీ కన్నీటి కాల్వలు ఆనందమయములై పోవూ — నీ ఆర్తనాదాలు కరుణామయములుగ మారవూ? దుఃఖమే లేకపోతే, నీకు దయారసానుభవం ఎట్లా కలుగుతుంది?

సీతాదేవి వియోగాన్ని పలుమార్లు చదువుతూంటావే ? ఎందుకు ? కరుణ నుపభోగించడానికి గాదూ ? నీ సంసారం దుఃఖ భూయిష్ఠంగా ఉన్నదంటే అది రసమయమై పోతోందన్న మాట. సుఖానుభవంలోలేని ఎరుక, దుఃఖానుభవంలో కలుగుతుంది. నీ హృదయంయొక్క లోతులను దెలిపే దదే. నీ మిత్రుని సఖ్యాన్ని రుచిచూపే దదే. భక్తుల ప్రేమామృతాన్ని ఒలికించే దదే. జాలి, కనికరం, దయ, కరుణ—వీని ననుభవింపని బ్రతుకెందుకు ? దుఃఖం నీ కఠిన హృదయాన్ని గరిగించివేస్తుంది. నీ చిత్తాన్ని ద్రవీభూతంగా చేస్తుంది. నీ హృదయం మైత్రిని గోరుతుంది. కవీశ్వరు డేమన్నాడు ?-
One touch of Nature makes the whole world kin అన్నాడు. దుఃఖమనేది లోకాన్నంతా బంధువుగ చేసి వేస్తుంది. భూత దయకంటే ఆనందమయమైన దేది ? ఎందుకు శిల్పులు, కవులు లోకంలోని దుఃఖాన్ని అట్లా చిత్రించి, రస సిద్ధులైనారు ?

నీ అజ్ఞానంలోనుండి జిజ్ఞాసద్వారా జ్ఞానజ్యోతి ఎట్లా ప్రకాశింప జూస్తోందో, నీ దౌర్బల్యంలో నుండి కర్మనిరతి ద్వారా శక్తి ఎట్లా ప్రకటితము కాగోరుతున్నదో, అట్లాగే నీ దుఃఖంలోనుండి సుఖలిప్స ద్వారా ఆనందం పొందచూస్తోంది. నీ దుఃఖం లోపలకుపోయి చూడు - ప్రేమయొక్క అఖాతం కనబడుతుంది. ఆనందసాగరం తరంగితమగుతూ ఊగుతూ ఉంటుంది. సుఖదుఃఖాలు ఆ రససింధువుయొక్క ఆటుపోట్లు.

దుఃఖానికి క్రుంగిపోక, దుఃఖాన్ని శోకరసభాండమని తెలుసు కొని దానిని భోగించు. నీ సుఖలిప్స తనివి తీరుతుంది. నీ దేహం, నీ ప్రాణం, నీ మనస్సు, నీ బుద్ధి నీ చిత్తం - సర్వం సుఖమయ మవుతుంది.

ఎందుకీ సుఖలిప్స, ఈ భోగేచ్ఛ నిన్ను విడువకుండా ఉన్నదో తెలుసునా ? నీజ్ఞానం వెనుక సత్యం ప్రకాశిస్తున్నట్లే నీ కర్మవెనుక శివశక్తి ప్రబుద్ధమగుతున్నట్లే, నీ సుఖస్మృతి వెనుక సౌందర్యబోధ బహిర్గత మగుతోందని తెలుసుకో. సుందరం ! - ఆ పదంలో ఎట్టి మోహనశక్తి ఉన్నదంటావు ? ఈ జగత్తు సౌందర్యరాశి కాదూ ? ఆహోహో ఆ తారల సౌందర్యం, ఆ మేఘ మాలికల సౌందర్యం, ఆ పర్వత సాను వుల సౌందర్యం, ఆ కాసారాల సౌందర్యం, ఆ పూలవనాల సౌందర్యం - నీ జగత్తు పూలడోలికోయీ ! సౌందర్యరసం ఉట్టిపడని చోటేది ? వృక్షజాలంలోనేనా ? ఆ జంతు సంతా నంలో, కోయిలగానంలో, కురంగలోచనల్లో, సర్పం వంపు లలో ఎట్టి చక్కదనాలు ?

మానవ విగ్రహం ఎట్టి సౌందర్యసృష్టి ! కేవలం రసా మృత మూర్తికాదూ. వాని మనోవీధుల విహరించు లలిత భావాల సౌందర్యం, కవుల బంగారు కలల సౌందర్యం, శిల్పుల కుంచెలనుండి జారు రేఖల సౌందర్యం - సౌందర్య మెక్కడ లేదు ? సోదరా, సుందరమునుండి బయల్వెడలిన జగము సుంద

రముకాక మరెట్లుండగలదు ? నీ సుఖలిప్స ఆ సుందరుని ఉల్లా సమే సుమీ. నీ సుఖస్మృతిలో ఆనంద రసానుభవంలో నీ దుఃఖ బాధలలో గూడ నీ సౌందర్యబోధ ననుభవించు. నీ చిత్తాబ్జము ఆ త్రిలోక సుందరిని, ఆ జగన్మోహనుని, ఆ మురళీధరుని లీలాభూమి సుమీ. చూడుము నీ చిత్తాబ్జమునందలి దళములెట్లు విచ్చుకొని, అందుండి మధురరసమెట్లు ప్రవహింపుచున్నదో ? నీ సుఖలిప్స, నీ భోగేచ్ఛ, నీ ఆనందోత్సాహము - అనుభ వించిన కొలదీ, ఉన్మత్తుడవైన కొలదీ, నీవు భక్తియోగివై, ప్రేమ వితరణము సేయగల్గుదువు.

"సత్యం—శివమ్—సుందరమ్"

# ఏకాగ్రత

సోదరా, నీవు చంచలుడవు, చపలచిత్తుడవు. నీ మనస్సు ఒక నిమిషం కూడా ఏ ఒకదానిమీదా నిలవదు. ఒకరిని చూస్తూంటావు. నీ మనస్సు ఇంకొకరిని గూర్చి ఆలోచిస్తూంటుంది. ఇదంతా అవధానం అనుకొంటున్నావు కాబోలు. కాదు. నీ మనస్సుకు నిలకడలేదు. క్షణక్షణం పరిపరివిధాల పరుగెత్తుతూ ఉంటుంది.

ఈ చాంచల్యం ఎందుచేతనో ఆలోచించుకొన్నావా? నీ మనస్సు నీ స్వాధీనంలో లేకపోవడంవల్ల, దానంతట అది విచ్చలవిడిగ భ్రమరంలాగ ఒక లక్ష్యం లేకుండా పరుగులెత్తుతూంటుంది. అందుచేతనే నీ బుద్ధి నీకు ప్రయోజనకరంగా లేదు, నీకు ఆలోచనాపటిమ లేకపోవడానికిదే కారణం.

ఆలోచనంటే ఏమిటి ? నీ బుద్ధికి యోచనచేసే శక్తి ఉన్నది. అది నీకు నిశ్చయజ్ఞానం ఇయ్యగలదు. కాని ఒక షరతు ఉన్నది. ఏ విషయమై నీకు జ్ఞానం కావాలో, దానిమీద నీ బుద్ధిని నిలపాలి - ఇటూ అటూ కదలనియ్యకూడదు. దీనినే

ఏకాగ్రత అంటారు. ఏకాగ్రత అనేది నీ కలవడకపోతే, నీకెట్టి జ్ఞానమూ కలగదు. ఏ విద్యా అబ్బదు. నీ వేపనీ కుశలంగా చేయలేవు. కాబట్టి ముందు ఏకాగ్రతను కుదుర్చుకో. కుదుర్చు కొన్నావా. నీవెంత ప్రయోజకుడవైనా అవుతావు. లేకపోతే వట్టి నిరర్థకుడవు.

వడ్రంగి దగ్గర ఎప్పుడైనా కూర్చున్నావు ? వాని దగ్గర కొయ్యకు రంధ్రంవేసే పనిముట్టు ఉంటుంది. దానితో ఎట్లా రంధ్రం వేస్తాడో తెలుసా? ఎక్కడ రంధ్రం వేయాలను కొన్నాడో అక్కడ గుర్తుపెట్టుకొంటాడు. తర్వాత తన పని ముట్టు కొనను ఆ గుర్తుమీద అదిమిపెట్టి, ఆ పనిముట్టును గిర గిర త్రిప్పడం మొదలు పెట్టుతాడు. అదిమిపెట్టి ఉంచడంవల్ల, పనిముట్టు ఎంత గిరగిర తిరుగుతున్నా, దాని కొనమాత్రం ఆ గుర్తునుండి జరిగిరాదు-కొంచెం సేపయ్యేటప్పటికి ఆకొయ్యకు రంధ్రం పడుతుంది. పనిముట్టును అదిమిపెట్టి త్రిప్పడంలో ఉన్నది వాని కౌశలమంతా.

నీ బుద్ధికూడా ఆ పనిముట్టువలె పనిచేయగలదు. ఎట్టి గహన విషయాన్నైనా ఛేదించగలదు. లోపలకు జొరుచుకొని పోయి, అంతర్యాన్ని కనిపెట్టగలదు. నీబుద్ధి మర్మభేది అనుకో. కాని నీ బుద్ధికి నిలకడ ఉండాలి. దానినే విషయంమీదనైనా అదిమిపెట్టి ఉంచాలి. ఆ కొంచెంసేపూ దానిని ఇటు అటూ కదలనియ్యకూడదు, ఇట్లా నిలిపియుంచడం పేరే ఏకాగ్రత.

ఏకాగ్రతను కుదుర్చుకోవలసినది ఒక జ్ఞానే అనుకొంటు న్నావేమో, కాదు. అది జ్ఞానికెంత అవసరమో, కర్మకారు నకు గూడ అంత అవసరం. రసజ్ఞునకుగూడ అది అవసరం. బుద్ధితో పనిచేసే ప్రతివానికీ ఏకాగ్రత అవసరం - సందేహం లేదు. ఏకాగ్రత మూలంగా, నీబుద్ధి ఒక విషయంమీద, ఒక కార్యంమీద నిలవడమే కాకుండా నీబుద్ధి పదును తేరుతుంది. పదుకు తేరిఉన్న బుద్ధినే కుశాగ్రబుద్ధి అంటారు. పదునులేని బాణాన్ని ఎంతజోరుగ సంధించి వదిలినా ఏమి ప్రయోజనం? దాని అలుగు పదునుగ ఉన్నదా, అది అవలీలగ ఎట్టి కఠిన మైన గురినైనా ఛేదించి వేయగలదు. ఏకాగ్రత నలవరచు కోవడమంటే నీ బుద్ధిని నిలకడలో ఉంచడమే కాదు. దానిని పదునుపెట్టి ఉంచాలి. అప్పుడు నీ చింతనాపటిమా, నీ కార్య కుశలతా, నీ రసభోగమూ అత్యద్భుతం. నీ మనస్సును ఒక గురిమీద నిలిపి ఉంచినప్పుడు, నీ మనస్సెట్లా ఉంటుందో, ఎప్పు డైనా ఆలోచించి చూచుకొన్నావా? నీ మనస్సు గురిమీద నిమగ్నమై ఉన్నంతసేపూ, నీకు "నేనూ" అనే జ్ఞానం ఉండదు. గురిని "చూస్తున్నా"ననే జ్ఞానంకూడా ఉండదు. ఆ ఒక్క గురే అయిపోతావు. ఆగురి నిన్నూ, నీ చూపునూ మింగేసి, అంతా తానై పోతుంది. ఆశ్చర్యం! ఆశ్చర్యమా? నీ మనస్సును నీవు చూచుకోకపోవడంవల్ల నీ మనస్సు ఎట్టి గారడీ చేయగలుగు తున్నదో నీవు కనిపెట్టడంలేదు.

పోనీ, నీ నిదురలో "నేనూ" అనే జ్ఞానమున్నదా? "నిద్ర పోతున్నాను" అనే తెలివికూడా ఉన్నదా? ఈ రెండూ లేవు. నిద్రిస్తున్నంతసేపూ, నిద్రానుభవం తప్ప వేరొకటి లేదు. నిద్ర వదిలిన పిమ్మటనే "నేను సుఖంగా నిద్రిపోయినాను" అనే స్మృతి కలుగుతోంది. అట్లాగే నీ వేపనినైనా ఏకాగ్రతతో చేస్తున్నావంటే - నీ మనస్సు ఆ కార్యరూపం దాలుస్తుంది. అంటే నీవా కార్యమై పోతావు. నీవొక పూవును చూస్తున్నావనుకో. దానిని తదేక ధ్యానంతో చూస్తూండు. నిశ్చలంగా చూస్తూండు. నీచూపు ఆ పూవులో గలసిపోయేటట్టు చెయ్యి- ఆ ఒకనిమిషం నీవు ఆ పూవువై పోయినా వన్నమాటే— "నేను పుష్పాన్ని చూస్తున్నాను" అనే ఆలోచనే ఉండదు. ఆ కాస్సేపూ, చూచేవాడూ చూచేకర్మ ఈ రెండూ చూపు అయిపోతాయి. ద్రష్ట – దృక్కు - దృశ్యం - ఈ మూడు ఏకమైపోతాయి ధ్యాన నిమగ్నతలో. ఎంత విచిత్రమైన మనః పరిణామ మంటావిది ?

నీ అనుభవాలను నీవు తరచి చూచుకోక పోవడంవల్ల కర్త - కార్యం - కరణం, భోక్త – భోగం - భోగ్యం ఈ త్రిపుటి ఎట్లా ఒకటగుతుందీ అని ప్రశ్నిస్తావుకాని, అది నీలో నీకు తెలియకుండానే, ఒకటి మూడు కావడం, మూడు ఒకటి కావడం జరిగిపోతోంది. యోగావస్థలో మూడు ఒకటగుతాయి. యోగం లేనప్పుడు ఒకటి మూడగుతాయి. ఇది నిజంగా ఇంద్రజాలమే అనుకో - కాని ఈ ఇంద్రిజాలాన్ని

నీవు అనుక్షణం చేస్తూనే ఉన్నావు - కాని చేస్తున్నానని నీవు గ్రహించటం లేదు.

సోదరా, నిన్నేదో మాయచేసి, వేదాంతబోధ చేస్తున్నానని అనుమానపడకు. వేదాంతం మాత్రం లేని విషయాన్ని చెప్పుతుందా? ఉన్న విషయాన్నే విప్పి చూపుతుంది. మనలో యేమి జరుగుతుందో మనం విమర్శించుకోక పోవడంవల్ల, నిజంగా మూడు ఒకటి కావడం, ఒకటి మూడు కావడం జరుగుతోందా అని తర్కిస్తున్నాము. కాని నిజంగా జరిగేదదే - నీవు ఒక చెట్టును చూస్తున్నప్పుడు నీకు వృక్షజ్ఞానం ఎట్లా కలుగుతున్నది? నీవు నీ కన్నుద్వారా ఆ చెట్టును పట్టుకొని, దానిని తిరిగి నీ లోపలకు తెచ్చుకొంటున్నావు. ఎట్లా? ఆ చెట్టు కదిలి నీ లోపలకు వస్తున్నదా? లేదు. నీ మనస్సే ఆ వృక్షాకృతినిబొంది, అది నీ లోపల ప్రవేశించే టప్పటికి, నీకు వృక్షజ్ఞానం కలుగుతున్నది. ఈ మనఃక్రీడ నీకు తెలియకుండానే సహజంగా, స్వభావ సిద్ధంగా జరిగిపోతున్నది. అది నిరంతరం సహజంగా జరిగేయోగంకావడంవల్ల అది మనబుద్ధికి స్ఫుటంగా గోచరం కావటంలేదు. కాని బుద్ధితో నీ మనోవ్యాపారాన్ని విమర్శిస్తే ఇది నిజమేనని ఆశ్చర్యపోతావు.

నీ వేకాగ్రత నలవరచుకొన్నావా - అంటే ఏ విషయానైనా, అనన్య మనస్కుడవై, యేకాగ్రచిత్తంతో, తదేక ధ్యానంతో చింతన చేయడం మొదలుపెట్టావా, — ఎక్కడా తెంపులేకుండా నీబుద్ధి ఆ విషయంలో నిమగ్నమై పోయిందా,

నీకు ధ్యానం, ధారణ, నిధి, ధ్యాన క్రమంగా కుదిరి సమాధి అవస్థలో పడతావు. సమాధి అంటే యేకొండ గుహల్లోనో తపస్సుచేసే జటాధారులకే లభ్యమనుకోకు. నీలోకూడ సమాధి అవస్థ ఉన్నది. అది క్షణికంగా ఉన్నది. ఆ క్షణిక తన్మయతను సంయమంచేత, యేకాగ్రత వలన, ధారణాపటిమ మూలంగా సాధిస్తే ఆ క్షణిక తన్మయత ఎక్కువకాలం అనుభూతమై, దాని సుఖం అనుభవిస్తావు. ఒకక్షణం కునుకుపాటుకూ ఎక్కువ సేపు నిద్రకూ ఎంత భేదమున్నదో, నీలో నిరంతరం జరిగే తన్మయతకూ సమాధి అవస్థకు అంతే భేదం. కునుకును నిద్ర జేసుకోవాలంటే, ఎట్లా ఇంద్రియ వ్యాపారాలను కట్టిపెట్టే స్తావో, అట్లాగే నీ క్షణికానుభవాన్ని సమాధిలోకి మార్చా లంటే చిత్తవిక్షేపంలేకుండా, మనోవ్యాపారాలను స్తంభింప జేయగలిగితే సమాధి సులభసాధ్యమై పోతుంది. నిద్ర నీకు నీ బడలిన శరీరానికి ఏంత సహజమో, సమాధికూడా నీచంచల మైన మనస్సుకు అంత సహజము.

సమాధ్యవస్థలో నీజ్ఞానం స్థిరసౌదామినివలె తేజరిల్లుతూ ఉంటుంది. అంతకుబూర్వం మనస్సులో దాగిఉన్న కుసంస్కా రాలన్నీ జారిపోతాయి. చింతనలు, భావనలు, రసానుభవాలు విచ్చలవిడిగ చెలరేగకుండా, ఘనీభూతమై నీ జ్ఞానజ్యోతిలో లీనమైపోతాయి. నీ నిదురలో బొందే సుఖం కేవలం తామసి కం - అంటే కేవలం స్థూలశరీరానికి సంబంధించిన యోగమది. అది నీ శరీరానికి కొంత విశ్రాంతి ఇయ్యగలుగుతుంది కాని, నీ

మనస్సును, నీ బుద్ధిని, నీ చిత్తాన్ని ప్రకాశవంతంగా జేయ లేదు. యోగసమాధి అట్టిదికాదు. దీని సుఖం సాత్వికానందం- నీ ఆధారాన్ని ఆ ధేయాన్ని సర్వాన్ని ప్రకాశవంతంగా జేస్తుంది. నీ శరీరానికి వన్నె ఇస్తుంది. నీ ప్రాణాన్ని ఉత్తేజిత మొనరిస్తుంది. నీ బుద్ధిని, నీ చిత్తాన్ని ప్రజ్వలింప జేస్తుంది. నీ జాగ్రదవస్థలో లేని సమగ్రత, ఓజస్సు, బలం, పుష్టి సిద్ధిస్తుంది. నీ జీవితమంతా చైతన్యమయమై పోతుంది. ఆశ్చర్యకరమైన మార్పు-జ్ఞాన భక్తి కర్మల నొకటిగ జేసే పూర్ణయోగమది.

"యోగస్థః కురు కర్మాణి"

## చిత్త సంస్కారం

సోదరా, నీ వేకాగ్రత నలవరచుకోకపోతే, నీ జీవితం వ్యర్థ మని చెప్పినంతమాత్రాన, నేను నిన్నేదో శపించినట్లుగ ఎంచుకొని, ఎందుకు అట్లా తత్తరపడుతావు ? నీ వింతకాలం నీ మనసును విచ్చలవిడిగ వదిలేసి ఉండడంవల్ల, నీ వకస్మాత్తుగ దానిని నిలిపి ఉంచడం కష్టసాధ్యంగా తోచడంలో ఆశ్చర్యం లేదు.

అడవి గుర్రాలను చూడు, వానిని బండికికట్టి లాగమంటే - వానికెంత కోపమో. తాళ్లు తెంపుకొని బండిని ముక్కలు ముక్కలుగ విరిచి పారిపోతాయి. బరువును మోయడానికి ఒప్పుకోవు. ఒకబాటను నడవడం వానికి దుస్సహం.

కాని ఒకసంగతి కనిపెట్టేవో లేదో ! ఆకలి తీర్చుకోడానికి మాత్రం - అటూ ఇటూ పరుగెత్తకుండా గడ్డిబీడులోనే ఎందుకు పడిఉంటాయి ? ఎవరికోసం ? ఆకలిబాధ అట్టిది, అది తీరేవరకు వాటిని వదలదు. వాటి మెడలనువంచి తినేటట్టు చేస్తుంది. అంతసేపూ వాటికి మైమరపు. వాటికి దాహం వేసిందా యే చెరువో, యే యేరో కనబడేంతవరకూ, అదే

ధ్యాసతో పరుగెత్తుతాయి. కాబట్టి అడవి గుర్రం కూడా లోపలనుండి ఆకలీ, దాహం బాధించేటప్పటికి, దాని స్వేచ్ఛను అరికట్టుకొని, వానికి లోబడి పనిచేస్తుంది.

దీనినిబట్టి యేమి తెలుసుకొంటున్నావు? నీ మనస్సును నిలుపుకో అని నేను బయటనుండి చెప్పుతున్నంత కాలమూ, నేను నీ స్వేచ్ఛను నిర్బంధిస్తున్నట్లుగ ఎంచుకొంటున్నావు. నీకు కూడా యే విషయంలోనైనా బాధ కలిగితే, ఆ బాధను తీర్చుకోకుండా ఉండగలవా? ఆ బాధానివృత్తికోసం, నీ బుద్ధిని నిర్బంధించకుండా ఉంటావా? ఎన్ని ఆలోచనలు, ఎన్ని ఉపాయాలూ - రాత్రిళ్ళుకూడా నిద్రలేకుండా శ్రమ పడతావే. అప్పుడు నీ స్వేచ్ఛ యేమైంది?

నీ కభిలాష, అభినివేశం, ఆసక్తి లేకపోతే స్వేచ్ఛ అంటావు కాని, యేదైనా తెలుసుకోవాలనీ, యేదైనా సంపాదించాలనీ, యేదైనా భోగించాలనీ — నీకు గట్టిగా కోరిక ఉంటే, ఆ కోరిక నీడేర్చుకోవడం కోసం, నీ స్వేచ్ఛను బంధించు కొంటావు. విశ్రాంతిని వదులు కొంటావు. ఎంత శ్రమైనా పడుతావు.

కాబట్టి నీవు సర్వస్వతంత్రుడవని అనుకోక. స్వతంత్రుడవు కావు. నీ కోరికలకు బానిసవు. నీ కోరికలు నిన్ను ముప్పతిప్పలు పెట్టినా పడుతావు. ఆ శ్రమలోనే నీకు సుఖమున్నట్లు భావిస్తావు. ఆ కష్టంలోనే ఫలితం చూచుకుంటావు. ఆ నిర్బంధంలోనే నీకు స్వేచ్ఛ ఉన్నట్లు భ్రమిస్తావు. అవునా, కాదా?

స్వేచ్ఛ, స్వేచ్ఛ అని అర్థంలేకుండా పలవరించక. నీవెంత అలసుడవైనా, నీకేవో బాధలున్నాయి, కోరికలున్నాయి. వానికోసం నీవు తంటాలు పడుతూనే ఉన్నావు. నీ ప్రయత్నాలు సార్థక మగుతున్నాయా లేదా అనే విషయం వేరు. నీ ప్రయత్నాలెన్నో విఫలము లగుతున్నమాట కూడా నిజం. విఫల మనోరథుడవైనప్పుడు, నీవు నిన్ను తిట్టుకొంటావు. దైవాన్ని దూషిస్తావు. జాతకాలు చూపిస్తావు — అంతేనేకాని నీ ప్రయత్నంలో యేమి లోపమున్నదో అని ఆత్మపరీక్ష మాత్రం చేసుకోవు.

ఆత్మపరీక్ష చేసుకోవడం చాలాకష్టం. సర్వ సామాన్యంగా మనలోపాలు మనకు కనబడవు. బయటివారెవరైనా, నీకిట్టి లోపాలున్నాయి అని వేలుపెట్టి చూపినా, వెంటనే నీ బుద్ధికి నీ తరఫున వకాల్తనామా ఇచ్చి, డిఫెన్సు చేయించుకొంటావు.

ఎప్పుడు నీవు డిఫెన్సులో పడ్డావో, అప్పుడు నీలోపాలు తెలుసుకోనేదెట్లా ? ఇతరులకు నీవు నిర్దోషివిగ గనబడాలని కోరుకొంటూంటావు. నిజమే. కాని బయటకు నీవెట్లా కనబడ్డా, నీ ఆంతర్యాన్ని నీవే కనుపెట్టుకోలేకపోతే యెట్లా ? నీవు నిన్ను మోసం చేసుకొంటే నష్టపడేదెవరు ? నీవే.

బయటి ప్రసక్తి ఎట్లా ఉన్నా, ముందు నీ ఆంతర్యాన్ని దాని నిజస్వరూపాన్ని తెలుసుకోడానికి ప్రయత్నించు. నీ లో కన్ను తెరచి చూచుకొంటే, నీ మనోప్రపంచమంతా తెరచు

క్కొని కనబడుతుంది. దానిపైన ఎన్ని ముసుగులో, తెరలో, పొరలో ఉండేమాట నిజం. లోకన్నుతో జూచే అభ్యాసంచేసుకోక పోవడంవల్ల, నీ చూపు సరిగ ఆనదు. దిక్కులు చూస్తుంది. దేనినీ సరిగ గుర్తించదు. ఇది నీ అంతర్యమా అని నీవే ఆశ్చర్యపోతావు.

నీ మనోరాజ్యం ఒకనాటిదా ? ఈ జన్మలోనే సృష్టి అయిందనుకొందాము. కాని అందు నీ బాల్యచేష్టలు, నీవిద్యార్థిదశలు, నీ సాంసారికావస్థలు, నీ స్వప్నాలు-ఎన్నెన్నో వెలుగు నీడలుగ అల్లుకొనిపోయి వున్నట్లు చూసుకొంటావు. నీ కంతగ జ్ఞాపకశక్తి లేకపోయినా - ఇది ఫలానిదీ అని గుర్తించలేక పోయినా, ఆ అనుభవాలన్నీ అజ్ఞాతంగానైనా నీ మనస్సులో అంకితమైయున్న సంగతి నీకు తెలుసు. అందుండేకదా, నీ సంకల్ప వికల్పాలన్నీ సముద్రంలోని అలలవలె లేచిపడుతున్నాయి. నీ మనస్సును నీ వెంత మరుగు చేసుకొన్నా, ఈ విషయం నీకు బోధపడనిదికాదు.

నీలో లేచిపడే సంకల్ప వికల్పాలన్నీ ఎప్పటికప్పుడు నీ పూర్వానుభవాలతో గాని, బాహ్య ప్రపంచంతోగ్గాని సంబంధం లేకుండా స్వతంత్రంగా బయలుదేరుతున్నాయంటావా ? నీ మనస్సు యేనాడు పుట్టిందో నీకు దెలియకపోవచ్చు. కాని అది నీలో అనాదిగా ప్రవహిస్తూనే ఉన్నది. బయటినుండి ఎన్ని ఉపనదులో వచ్చి, దానిలో పడుతూ ఉండవచ్చు. కాని నీ మనస్సు నీదేగా ? నీ మనస్సు నిజంగా నీదే అయితే, దానిమీద నీకు

పెత్తనం లేకపోవడమేమిటి? నీలో సంకల్పాలు నీ అనుమతి పుచ్చుకొని నీలో ఉద్భవిస్తున్నాయా? బాహ్యప్రపంచం నీలో అనేక వికారాలు కల్పిస్తున్నది గదా, అవన్నీ నీ టిక్కెట్టు మీదనే నీలోపల ప్రవేశిస్తున్నాయా? నీవు వి టున్నావో లేదో- నీ యాంతరంగిక సంకల్పాలు, నీ బాహ్యవికారాలు నీ మనస్సును పదేపదే ప్రశ్నిస్తున్నాయి. ఏమని? ఓ మనసా, నీ యజమాని యేడి అని.

"నేను స్వతంత్రుడను" అని అన్నావే. చివరకు నీ ఇల్లు నీది కాదాయే. దానికి తలుపులు కాని, తాళాలు కాని లేవాయే. నీకు తెలియకుండానే ప్రతిదయ్యం, ప్రతిభూతం లోపల ప్రవేశించి, కాపురం చెయ్యవచ్చె. నీలో నీకు తెలియకుండా ఎట్టి సంకల్పాలు బయలుదేరి ఎట్టి అల్లరిచేసినా, వానిని అదుపాజ్ఞలలో పెట్టలేవాయె. ఏమిటీ అరాచకం? పైగా నాదే పెత్తనమని బయటకు బుకాయిస్తావా?

ప్రవాహంలో కొట్టుకొనిపోయే కట్టె మాదిరివి కావా నీవు? ఆ కట్టె స్వతంత్రమైనదా? ఆ నీటిప్రవాహం ఎట్లా తీసుకొనిపోతే, అదట్లా కొట్టుకొని పోతుంది. దానిమీద ఎన్ని పాములు, పురుగులు చేరినా, అది వానిని దులుపుకోలేదాయె! నీవుకూడా అంతేకాదూ? నీ మనస్సు నిన్నెట్లా ఈడ్చుకొని పోతే, అట్లా ఈడ్వబడుతున్నావు. బయటనుండి ఎట్టి వికారాలు, ప్రతీకారాలువచ్చి, నీలో గూళ్ళు కట్టుకొని కాపురం

చేస్తున్నా నీవు వానిని పైగా భద్రపరచి, అవి నీ సొత్తు అయి నట్లు హుంకరిస్తావు.

నీ లోకన్ను తెరచిచూచుకో, నీ ఇంటిని ఎట్లా దయ్యాల కొంపగ చేసుకొన్నావో. నీ ఇంటిని నిజంగా నీదిగ చేసుకో డానికి, ముందు ఏమి చెయ్యాలో ఆలోచించుకో. నీ వితరులకు అద్దెకిచ్చిన ఇల్లుకూడా పండ్రెండేండ్లదాకా ఇతరుల భుక్తంలో ఉంటే ఆ ఇంటిలో వాళ్ళకు హక్కు ఏర్పడుతుందని "లా" శాస్త్రం చెప్పుతోంది. అట్లాగే నీలో ఎన్నో విషయాలు నీ అనుమతి లేకుండానే ప్రవేశించి, ఏండ్ల తరబడి కాపురం చేస్తూంటే, అవి హక్కును స్థిరపరచుకోడానికి పోట్లాడకుండా ఉంటాయా ? అప్పుడు వాని మంచి చెడుగులతో సంబంధం లేదు. నిన్ను వదిలి వెళ్ళమంటే-అవన్నీ నీమీద తిరుగుబాటు చేసి, నిన్నే నీ ఇంటిలోనుండి బయటకు గెంటుతాయి.

కాబట్టే, ఎప్పుడో అప్పుడు ఈ పోరాటం తప్పదు. ఆలస్యం చేసినకొద్దీ, వానిహక్కు స్థిరపడిపోతుంది. ఒక్క సంక ల్పంకూడా నీకు తోడ్పడటానికి సహాయం చేయదు. నీ బుద్ధి కూడా నీ తరఫున వాదించక, వాని తరఫున వక్తాల్తనామా పుచ్చుకొని, వానికి జిరాయతీ హక్కున్నట్టు వాదించి నిన్ను నిరుత్తరునిగ జేసివేస్తుంది. కాబట్టి నీ అజాగ్రత్తవల్ల, నీ ఇల్లు నీది కాకుండా పోతున్నది. పైగా నీ యింటిలో బయటినుండి వచ్చి కాపురంచేసే ఇతరులు నీమీద పెత్తనం సాగించి, నిన్ను నీచాతినీచుణ్నిగా భావిస్తున్నారు.

తొందరపడు. నీ పెత్తనాన్ని స్థిరపరచుకోడానికే, నీ మనస్సును బంధించి వేయమంటున్నాను. మంచిరౌతు అడవి గుర్రాన్ని తెచ్చి, దానికి కదను నేర్పినట్లుగ, నీ మనస్సు నీ యిష్టప్రకారం అడుగువేసేటట్లు చేయమంటున్నాను. ఏకాగ్రత నలవరచుకో మంటున్నానంటే, నీ మనస్సుకు కళ్ళెంవేసి, నీ లక్ష్యం ప్రకారం అది నడిచేటట్లు చేయడమన్నమాట - అంతేనే కాని నీ స్వేచ్ఛను వదులుకోవడం కాదు. నీవు సరిగ ఆలోచిస్తే, నీ స్వేచ్ఛను నీవు తిరిగి పొందడమన్నమాట.

"ఉత్తిష్ఠంతు భూతపిశాచాః"

# స్వబుద్ధి

సోదరా, నీ యింటిమీద పెత్తనం వదులుకోవద్దని ఎన్నిమార్లు చెప్పను ? నీ యిల్లు ఎంత గిజాటుగా ఉందో చూడు. ఇది కాపురంచేసే ఇల్లువలె ఉందా ? ఇంటికి అపులనేది ఉంటేగా ? ప్రతిచెత్తా ఇంట్లోకివచ్చి పడడమేనా? అయ్యో! వట్టి దయ్యాల కొంపగా చేసివైచుకొన్నావే !

ఇప్పటికే చాల జాగుచేశావు, ఇక ఆలస్యం వలదు. ఇంటిని పూర్తిగ ఖాళీచేయించు. ఏమీ మిగలనీయకు. అటక నిండా ఏమిటి ఆ కాగితాల కట్టలు ? తాతలనాటి దస్తావేజుల నన్నిటిని ఎందుకట్లా దాచిపెట్టుకోవడం ? అమూల పుస్తకాల కుప్పలేమిటి ? ఏమిటా చెదలపుట్టలు? వెలిసెలనిండా ఆ ఎలుక లేమిటి? ఎక్కడ జూచినా పందికొక్కులున్నాలే! ఈ యింటిలో ఎట్లా నివసిస్తున్నావు, సోదరా ?

ఒక్కమారు తగులబెట్టెయ్యి ఈ యింటినంతా ఎన్నేండ్లనుండో పేరుకొన్న క్రుళ్ళంతా తగులబడి పోతుంది. తర్వాత మంచి ప్లానువేసి, చక్కటి ఇల్లు కట్టుకొందువుగాని సర్వం నీ యధీనంలో ఉండేటట్టు, ప్రతిభాగం నీ యందు చందా

లని ప్రతిఫలింపజేసేటట్టు, శుచి, శుభ్రత, నిశ్చలత, సౌందర్యం ఉట్టిపడేటట్టు చేసుకొందువుగాని సంకోచించక.

ఇన్నాళ్ళు పోగుచేసిందంతా వ్యర్థమైపోదా అని చింతా? ఎందుకంట, ఈ ప్రోగులు? ఇదంతా నీ చదువు, విద్య, పాండిత్యం అని నీ అభిప్రాయం కాబోలు. ఈకాగితాల కట్టలే నీ చదువులైతే, అవి తగులబడి పోవడమే మంచిది. నీకు నిజంగా చదువు వచ్చివుంటే, అది తగులబడి పోయేదా? నీ శరీరం బుగ్గి అయినా, నీ చదువు పోయేదికాదు. ఈ కాగితాల చుట్టలను జూచుకొని, ఇదంతా చదువు అనుకొని భ్రమపడుతున్నావు. పలుకులు నేర్చిన చిలుకలు కూడా పండితులేనా ?

ఒహో, అవన్నీ ప్రమాణ వాక్యాలనా, అవిపోతే, నీ బుద్ధి నిరాధారమై పోతుందనా, నీభయం? ఎట్టి ఆత్మవంచనం ఇతరుల వాక్యాలు, మతాలు, సిద్ధాంతాలు, లక్ష్యాలు నీకు! ప్రమాణాలెట్లా అవుతాయి చెప్పు! అరువు సొమ్ములు అరువు సొమ్ములేకాదూ? నీ తలనిండా ఇంతకాలం ఇతరులువచ్చి కాపురం చేస్తూండడం వల్లనే, నీ యిల్లు నీది కాకుండా పోయింది. నీ బుద్ధికి స్వతంత్రంగా చింతనచేసే పటిమపోయింది. నీవు కేవలం గ్రుడ్డివాడవై పోయినావు. ఇతరులువచ్చి, కర్ర పట్టుకొని నడిపితే, నడుస్తావు. లేకపోతే, నీవు చతికిలబడవలసిందేగా. ఎట్టి దురవస్థ వచ్చిందంటావు? నీ కండ్లను బోగొట్టు

కొని, ఇతరుల చూపుమీద ఆధారపడడమా ? స్వశక్తి అంతా ఏమైపోయింది, సోదరా ?

ఇంతకాలమూ నీతలలో పేర్చుకొన్నదంతా తోసివేస్తే, నీ బుర్ర ఖాళీ అయిపోతుందని కాదూ, నీ భయం ? అదే మంచిది. నీ యింటిలో చెత్తను పేర్చి ఉంచడంకంటే, దానిని ఖాళీగ ఉంచడమే మంచిది. స్వచ్ఛంద వాయువులైనా వీస్తూంటాయి. మంచివెల్తురు నాలుగుమూలలా ప్రసరిస్తూంటుంది. ఇప్పుడేమిటి ? ఈ కట్టలన్నీ అడ్డమే. గాలిని రానియ్యవు. వెల్తురును చేరనియ్యవు. పైగా వానిమీద దుమ్మూ దుమారం పేరుకొని నానా కశ్మలంగాను ఉన్నాయి.

సోదరా, ఏమంటున్నావూ? వీనిలో మంచివి ఏరి ఉంచుకొని, మంచివికాని వానిని పారవేస్తానంటావు ? అది పొరపాటు. అవి నీవి కాకపోయిన తర్వాత, మంచీ చెడ్డా అనే భేదంలేదు. దానిలో చాలా అపాయమున్నది. అదంతా దొంగసొత్తే. ఒక్కొకటీ నీమీద అధికారం చెలాయించడానికి, వేషాలు వేసుకొని వచ్చినాయి. నేను ఋషిప్రోక్తమని ఒకటి, నేను కవిసూక్తమని మరియొకటి, నేనొక భక్తుని మానస సరోవరంలో పూచిన కమలాన్నని ఇంకొకటి, నేనొక వైజ్ఞానికుని సత్యాన్వేషణంలో లభించిన రత్నాన్నని మరోటి — ఈ విధంగా తలోపేరుతోను, తలో అధికారంతోను, నీ బుర్రలో

దూరి నిన్నాడిస్తున్నాయి. ఇదంతా పరాశ్రయం. దీని •కేమాత్రం విలువలేదు. నీది కానిదంతా వట్టిమాయ అనుకో.

సోదరా, ముందు వెనుక లాలోచించక, ఒక్కమారుగ నీ మనస్సును నిరామయంగా చేసుకోగలిగావంటే - నీవు బలాఢ్యుడ వన్నమాట. పుణ్యం పాపం, మంచి చెడుగు, చిన్న గొప్ప, ప్రమాణం అప్రమాణం - అనేభేదం చేయక. సర్వాన్ని తుడిచి వేసెయ్యి. అంకురాలతో గూడా బెకలించివెయ్యి — వాసనలను గూడ దాగి ఉండనీయక. నీ స్మృతిలోగూడా ఏదీ మరుగై ఉండకూడదు. నీ మనోఫలకాన్ని శుభ్రంగా కడిగి వేసెయ్యి. దానిమీద ఒక అక్షరం, ఒకపొల్లు, ఒకగీత కనబడ నీయక. బాగా తోమేసెయ్యి.

అసాధ్యమంటావా ? నీది కానిది వదులు కోవడం దుస్సాధ్యమా ? పరుల నింట్లోనుండి వెడలగొట్టడం కష్ట తరమా? ప్రాత గూళ్ళను వదల్చడం నీకు సాధ్యం కాని పనా ? ఇన్నాళ్ళూ, ఈ కాగితాల కట్టల్లో మెలగబట్టి, వానిని చింపివేసేస్తే, ఇక బ్రతికేదెట్లా అని తత్తర పడుతున్నావు. లోకం నిన్ను చదువులు రానివాని క్రింద కట్టివేస్తుందేమోనని నీ కనుమానమా ? బుద్ధిని ఖాళీచేసిన పిమ్మట నీ జీవితమే అంతమైపోతుందని నీ భయమా ?

అభ్యాసం నిన్నట్లా, వంచకునిగ జేసివేసింది. ఈ అభ్యాసమే నిన్ను నిర్వీర్యునిగ, దుర్బలునిగ, వట్టి చిలుకనుగ జేసి

వేసింది. వేదాలు వల్లించడం, పుస్తకాలు చదవడం, లెక్చర్లు వినడం, పత్రికలు పఠించడం — ఇవన్నీకూడా నీ బుద్ధిని నీ సొత్తును గాకుండా చేసివేసాయి. నీ కంటితో నీవు చూడ లేకుండా ఉన్నావు. నీ చెవితో వినలేకుండా ఉన్నావు. పైగా నీవు గొప్ప విద్వాంసుడనని విర్రవీగుతున్నావు. కాని, నీవు నిజంగా పరప్రత్యయనేయబుద్ధివి - చాకలివాని మురికి బట్టల మూటలను మోసే గాడిదెవు.

నీ బుద్ధిని నిరామయంగా చేసుకొంటే, నీకెట్టి శాంతి, ఎట్టి సుఖం కలుగుతుందో నీ కనుభవంలేక నీవిట్లా అల్లల్లాడు తున్నావు. నీవు ఏ ఒక్కనాడైనా ఏకాంతంగా ఉండగలిగే మతి స్థిమితం లేకపోతే, నీకు నిజమైన సుఖంలేదు. నాకు తెలుసు, ఏకాంతమంటే - బందిఖానా - "సాలిటరీ కన్ఫయి న్మెంటు" అను కొంటున్నావు. నీ యిల్లు ఎప్పుడూ గందర గోళంగా ఉంటే, నీకు సుఖంకాదూ? వెనుక ఒక మిత్రుడుండే వాడు. వానికి ఇంట్లో నిద్రపట్టదికాదు. రైలుస్టేషనులో పడు కొని నిద్రపోయేవాడు. అట్లా ఉంది నీ పనికూడా. సందడి ఉంటేనేకాని, నీ మనస్సుకు నెమ్మది ఉండదన్నమాట. పుస్త కాలు లేకపోతే, లోకం చీకటన్నమాట.

పైగా వాదిస్తావు - నా బుర్రలో ఋషులు, కవులు భక్తులు, త్యాగులు, మతకర్తలు, భాష్యకారులు, శాస్త్ర విశారదులు — కాపురం చేస్తున్నారనీ, లోకవృత్తమంతా నీ

తలలో దూరి ఉన్నదని, నీ మనస్సు ఒక పెద్ద పుస్తక భాండా గారమనీ, నీవు గొప్ప సరస్వతీ పీఠమనీ - ఎట్టి అహంకారం, ఎట్టి మిడిసిపాటు ! ఈ పాండిత్య ప్రకర్షే నిన్ను నిజంగా బుద్ధి విహీనినుగ, పరతంత్రునిగ, వట్టి హానిసనుగ చేస్తోంది. అందుకనే ఈ చదువులను వదిలేసుకోమంటే-అసాధ్యమంటావు. ప్రమాణాలమీద ఆధారపడి ఉండడం నీ కలవాటైపోయింది. ఆ ప్రమాణాలే నీ మనస్సును నిలిపి ఉంచుతున్నాయనీ - వానిని తీసివేస్తే నీ బుద్ధి గుభేలుమని కూలిపోతుందని నీ భయం. ఇతరుల ఇండ్లలో తేరతిండికి మరగిన భోజనప్రియునికి, స్వంతంగా వంటచేసుకొని భోజనం చేయమంటే — ఎట్లా ఉంటుంది ?

సోదరా, నీవు వట్టి సోమరివి. ఇన్ని గ్రంథాలు, శాస్త్రాలు, భాష్యాలూ కష్టపడి చదివితే, నన్ను "సోమరి"వి అని అంటావా అని కోప్పడుతావు. నాకు తెలుసు. కాని నీదంతా వ్యర్థశ్రమ. నీ బుద్ధియొక్క స్వాతంత్ర్యాన్ని నాశనం చేసుకొన్న శ్రమ. స్వశక్తిని నష్టపరచిన శ్రమ - ఏకాంతంగా నిలిచే యోగంలేకుండా చేసిన శ్రమ. నిరామయం, నిరాలంబం, నిరాకారం - అంటే యేమిటో అనుభూతం చేసుకోకుండా చేసినశ్రమ - నిన్ను పుస్తకాల కారాగారంలో బంధించి ఉంచిన శ్రమ. ఈ శ్రమ నిరర్థకమే కాదు - నిజంగా అనర్థకం కూడాను.

సోదరా, నేచెప్పినమాట విను. "ఉత్తిష్ఠంతు భూత పిశాచాః" అంటూ నీళ్లు మంత్రించి చల్లు. నీ బుద్ధిలో దూరి తాండవిస్తున్న ఈ భూత పిశాచాల నన్నిటిని పారద్రోలు. నీ మనోమందిరాన్ని ముందు నిరామయంగా చేసుకో. దానిలో నీ వొక్కడవే, యేకాంతంగా విహరించు. అప్పుడెట్టి చల్లటి గాలులు వీస్తాయో, ఎట్టి స్వర్గ కాంతులు అన్నివైపులనుండి ప్రసరిస్తాయో, ఎట్టి శాంతి సౌఖ్యములలో ఓలలాడగలవో — ఒక్కమా రనుభవించు. ఏకాంత సేవలో ఉన్న మాధుర్యం దేనిలో ఉన్నది, సోదరా? నీవే వెలుగై ఉండ, ఈ మైనపు వత్తులు దేనికి బుద్ధివిహీనుడా? ఆలోచించుకో.

"నాయమాత్మా బలహీనేన లభ్యః"

## ఏకాత్మభావన

సోదరా, సంతోషమే నీ యింటిని శుభ్రపరచుకొని, ఏకాంతంగా శాంత్యానందా లనుభవిస్తున్నందుకు ! కాని నీ యిరుగు పొరుగంతా అశుచితో, రోగాలతో, తాపత్రయాలతో, దుఃఖాలతో బాధపడుతూంటే, నీకు శాంతి ఎక్కడ ? నీకు సౌఖ్యమెట్లా లభిస్తుంది? నిష్కపటంగా జెప్పు.

ఈ విశాల ప్రపంచంలో నీ దొక్కటేనా ఇల్లు? అనంత భూతకోటిలో నీ వొక్కడవు సుమీ. అనేక గృహాలలో నీ దొక్కటి. నీవు వీని మధ్యనుండి పారిపోయి ఏ గుహలోనో, ఏ పర్వత శిఖరంమీదనో దాగుకొన్నా, నీ కండ్లను, నీ చెవులను, నీ హృదయాన్ని నీ లోపల బంధించి వేసుకొన్నా, లోకం నిన్ను వెంటాడుతూనే ఉంటుంది సుమీ. నీవు లోకాన్నుండి విడివడి, నీ ముక్తిని నీవు సాధించుకోవాలన్నా అసంభవమని తెలుసుకో.

ఎందుకంటావా ? నీవు లోకంలో ఉన్నావు. లోకం నీలో ఉన్నది. నీవు దానిని విడువలేవు. అది నిన్ను విడువ

లేదు. నీవేదో కృత్రిమంగా నీ చుట్టూ ఒక గిరి గీసుకొని, ఇది నా దేహం, ఇది నా ప్రాణం, ఇది నా మనస్సు, ఇది నాదైవం, అని మమకారాన్ని పెంచుకొన్నావు, జగత్తు ఈ గిరులను, ఈ పంపుళ్ళను, ఈ ఎల్లలను చెరిపివేసి, "నేనంతా ఒక్కటి" అని ముక్తకంఠంతో ఘోషిస్తుంది. ఈ ఘోష నీ హృదయాంత రాళంలో వినిపించటంలేదా? నీవు పాషాణమై పోయినా, ఈ ఘోష దానిని బ్రద్దలుకొట్టి ఈ సత్యాన్ని వినేటట్టు చేస్తుంది, జాగ్రత్త.

సోదరా, నీ వీ ప్రపంచాన్ని వంచించలేవు. అది వట్టి మాయ అని దులిపివేసుకొన్నావు, నీ ఉనికినే అది మాయంచేసి వేస్తుంది. ఇక నీకు శాంతి సౌఖ్యాలెక్కడ? అయితే ఈ లోకా న్నంతా నే నుద్ధరించగల్గుదునా అని అంటావేమో ? కాని లోకాన్నుద్ధరించడానికి నీ వెవరవు ? నీ వొక కర్తవైనట్లు, సర్వాధికారి వైనట్లు, మాట్లాడుతావేమి ? నీ యింటిని నీవు సరిగ పదిలపరచుకో లేవు. ఇక లోకాన్ని మరమ్మత్తు చేస్తా నంటావు, డాంబికుడా. ఈ దురహంకారాన్ని మానివెయ్యి. ఏ శక్తి నిన్నుద్ధరించాలని కోరుతున్నావో, ఆ శక్తే లోకా న్నంతా ఉద్ధరిస్తుంది. ఈ లోకంలో నీవెట్లా మెలగుతున్నా వనేదే ప్రశ్న. ఈలోకాన్ని అహంకారంతో ఈసడిస్తున్నావా? లేక నిర్మమత్వంతో ఆదరిస్తున్నావా ? మైత్రా, వైరమా నీకీ లోకంతోగల సంబంధం ? మైత్రితో అనగా సర్వభూత రతితో మెలగడం నేర్చుకొన్నావా, లోకంకూడా నీ ఉన్నతికి

సహాయకారి అవుతుంది. వైరం పెట్టుకొన్నావా? లోకం నిన్ను అధోలోకాల కీడ్చుకొనిపోయి, నిన్ను దుఃఖసాగరంలో పడవేస్తుంది.

కాబట్టి, సోదరా, ముందుగ లోకంతో సామరస్యం కుదుర్చుకో. నేనూ ఈ లోకమూ ఒక్కటే అనుకో. ఈ లోకంలో ఒక దుఃఖి ఉండేవరకూ నాకు సుఖం లేదనుకో. అప్పుడు ప్రపంచ దుఃఖమంతా దయారసంగా మారిపోయి, నిన్ను గౌతమ శాక్యమునిగ జేసివేస్తుంది. ఈ లోకంలో ఒక అజ్ఞాని ఉండేవరకూ, నాకు జ్ఞానసిద్ధి లేదనుకో - అప్పు డజ్ఞానం "ఆత్మమాయ"గ బరిణమించి నిన్ను వ్యాసమహర్షినిగ జేసి వేస్తుంది. లోకం నీకు అన్యం అని అనుకోవడంవల్ల, నీవట్లా నీ లోపల నీవు సంకుచితపరచుకొని క్షుద్రుడవై పోతున్నావు. లోకం నీకు "అనన్యం" అనేభావం కుదిరిందా, నీవు లోకంలో లీనమైపోయి, పెరిగిపోతావు – ప్రపంచిస్తావు. నీ జీవితం గోపీ వల్లభుని రాసక్రీడై పోతుంది. నీవు గోవర్ధనగిరినెత్తి, లోకాన్ని సంరక్షిస్తావు. చిత్తైకాగ్రత నీకు ధారణాపటిమ నిచ్చుగాక. చిత్తవృత్తి నిరోధం నిన్ను "ఆత్మస్థు"నిగ జేయుగాక, ఈ మాట నిజమే, కాని మైత్రి నిన్ను "ఐశ్వర్య" వంతునిగ జేస్తుంది, ఏకాగ్రతకంటె, యోగసాధనకంటె, విశ్వమైత్రి ఆనంద రసానుభవానికి పరమసాధనం, సోదరా!

లోకంతో, "మైత్రి" ఎట్లా సమకూడుతుందంటావా? నీవు దానిని క్రొత్తగ సమకూర్చుకొనే దేమిటి? లోకం నీకు

బయటకు స్పర్ధతో గూడుకొన్నట్లు కనబడుతున్న దే కాని, లోకంలో ఉన్నది "మైత్రి". ఆ"మైత్రి" లేకపోతే, నీదేహం ఒకక్షణం నిలుస్తుందా? నీ ప్రాణం ఒక్కక్షణం సుఖిస్తుందా? నీ మనసు ఒక్కక్షణం శాంతిస్తుందా? నీ దేహం దేహంగా ఒక్క ఆకృతిలో ఉన్నదంటే నీప్రాణం సచేతనమై ఉల్లాస పడుతున్నదంటే, నీ మనస్సులో వెలుగు జిలుగులు ప్రసరిస్తున్నాయంటే నీ లోపలా, నీ బయటా ఆవరించిఉన్న జగత్తుయొక్క స్వరూపం మైత్రి కనుకనే. దీనిని సంశయించక. ఇది తథ్యమని నీవు కొంచెం నెమ్మదిగ పరికించి ఆలోచిస్తే నీకే బోధపడుతుంది.

ముందు నీ దేహాన్ని జూచుకో. అదేమిటి? అది ఈ పృథివినుండి తీసి చేసిన వట్టి మట్టిబొమ్మ కాదూ? కాని ఆమట్టి బొమ్మను జేయడానికి ఈ పృథివి ఎన్ని యుగయుగాంతరాల నుండి, ఎన్ని ఆవేదనలను బొంది, ఎన్ని ప్రళయాలగుండా ఈదుకొనివచ్చి, నీ విగ్రహాన్ని సృష్టి చేసింది సోదరా? ఆ మట్టిని ఎన్నిమార్లు ప్రేమరసంతో కలిపి, ఎన్ని వడపోతలు పోసి, శుద్ధిచేస్తే, నీకీ సుకుమారమైన, ఈ సర్వాంగ సుందరమైన, లోకానికంతకూ భూషణంగా, ఈ మానవ విగ్రహం తయారైందో విచారించావా?

ధాతువులలో ఉండే రంగులు, రత్నాలలోఉండే కాంతి, జలంలో ఉండే మార్దవం, పుష్పంలో ఉండే సౌరభం, కోకిల

కంఠములో ఉండే శ్రావ్యత, లేడి కన్నులలోనుండే తరళజ్యోతి ఎన్ని ఎంత సుకుమారంగా కలిస్తే నీ దేహం, నీ అవయవాలు, నీ ఇంద్రియాలు వెలిసాయోయి సోదరా! ఈ భూదేవి నిన్ను కనడానికి ఎన్ని నోములు నోచిందో, ఎన్ని వ్రతాలాచరించిందో. లోకాన్నంతా తన కడుపులో బెట్టుకొని నీ కెట్లా నివేదించిందో నీకు తెలుసునా? ఇదంతా కవిత్వమంటావా? ఓరి బుద్ధి విహీనుడా? నీ పాశ్చాత్య విజ్ఞానాన్నడిగైనా తెలుసుకో, ఈ భూతలంమీద నీ వవతరించడానికి ప్రకృతి ఎట్టి తపస్సు చేసిందో, వారు ప్రకరణం ప్రకరణం విప్పి చెప్తారు.

భూదేవి నిన్ను కని పారవేసిందా? లేదే. ఇంకా నిన్ను ఒడిలో బెట్టుకొని స్తన్యపానం చేయిస్తున్నదే. ఎన్ని లక్షల యోజనాల దూరంలో ఉన్నాడో ఆ సూర్యుడు. ఆ సూర్యుడు తన వెలుగుతో, ఉష్ణంతో నీ శరీరానికి పుష్టినిస్తూనే ఉన్నాడు. ఏ కొండలనుండో వీస్తూండే వాయువులు వాని మృదుహస్తాలతో నిన్ను కౌగిలించి, నీకు శ్వాస నిశ్వాసలను గరపుతున్నాయే. ఈ సమస్త భూతాలు నీకు నిరంతరం ఉపచారం చేస్తూండబట్టే కదా, నీ దేహమనే ఈ కూర్పు, మూస, ఈ ఘటం, ఈ ఆకృతిలో సచేతనంగా నిలిచియున్నది.

ఇది కొంతకాలమే అనుకో. ఏ క్షణాన్నో ఈ కూర్పు విడిపోవచ్చు. నీశరీరం తిరిగి పంచత్వం పొందవచ్చు. అప్పుడైనా నీ మట్టి నీ తల్లి అంకం విడిచిపోతుందా? భూదేవి నీ దేహాన్ని పుష్టివంతంగా జేస్తుంది. తుదకు నీ దేహాన్ని తిరిగి తన కడుపు

లోకి తీసుకొంటున్నది. నీ దేహంలో ప్రతి అణువు, ప్రతి కణం, ప్రతి బిందువు, ప్రతి శ్వాస నిశ్వాస ప్రతి స్పందనం, తల్లి యొక్క కృపారస విలాసమే అని అనుభూతం కావటం లేదా? నీ దేహ పోషణం ఒక్కటి చాలదా, ఈ ప్రకృతియొక్క మైత్రి ననుభు క్త పరచుకోడానికి. నీ తల్లియొక్క ప్రేమామృతమే, ఓ సోదరా నీ దేహంగా ఘనీభవించింది. ఎంత ధన్యుడవు ?

ఈ విశాలపృథివి నీకు ఎట్లా ఈ అలంకార ప్రాయమైన శరీరాన్నిచ్చి, తన వక్షఃస్థలంలో నుంచుకొని పోషిస్తున్నదో, అట్లాగే లోకలోకాంతరాల నావరించివున్న ఆ మహాప్రాణ సాగరం నీ దేహాన్ని చైతన్యవంతంగా జేసి, అవయవిగా, ఇంద్రియగ్రామంగా నొనర్చి నీ ఐహికజీవనాన్ని సాధ్యపరుస్తున్నది. ఆ ప్రాణసాగరంలో నీ ప్రాణం ఒక తరంగం. నీలో ఏ ప్రాణం తరంగితమై సుఖలాలసతో ఉబుకులాడుతున్నదో, ఆ ప్రాణమే సమస్త భూతకోటిలోను తరంగితమవుతున్నది. వృక్షలతాగుల్మాదులలో ఏ ప్రాణం పుష్పించి ఫలప్రదమవుతున్నదో, ఏ ప్రాణం క్రిమికీటకాదులలో, వన్యమృగాలలో, సమస్త జంతుజాలంలో క్షుత్పిపాసనిద్రామైథున క్రీడలలో నర్తిస్తున్నదో, ఆ ప్రాణమే నీ దేహంలో నా దేహంలో సమస్త నారీనరుల దేహాలలో మూర్తించి, నర్తిస్తున్నది.

సోదరా! ఏనాడు ఆ ప్రాణసాగరం పాటుతీయునో, ఆనాడు, ఆ క్షణం నీవు వట్టి అచేతనమయ్యెదవు. జగత్తుతో నీకు సంబంధం లేదా ? అయితే ఎందుకు ఈ మహాసాగరా

న్నుండి, ఈ ప్రాణతరంగాన్ని నీలోనికి తీసుకొని, వ్యవహరిస్తు న్నావు? ఎందుకీ ఆత్మవంచనం? పృథివి నిన్నాశ్లేషించి తన కౌగిటిలో బిగించుకొని నిన్నెట్లా శరీరినిగ జేస్తున్నదో, అట్లే మహాప్రాణం కూడా నీలో ఉబికి నిన్ను ప్రాణినిగ జేస్తున్నది. ఈ విశాల పృథివిలోని ప్రతి అణువుకూడా శరీరివైన నిన్ను "సోదరా" అని ఎట్లా మైత్రితో సంబోధిస్తున్నదో, అట్లాగే మహాప్రాణసాగరంలోని ప్రతిబిందువు కూడా ప్రాణివైననిన్ను "సోదరా" అని ఆహ్వానిస్తున్నది. నీ దేహానికి దేహం ఆ పృథివి. నీ ప్రాణానికి ప్రాణం ఆ మహాప్రాణం. నీవిక ఎక్కడికి పారిపో గలవు. ఈ మైత్రిని అనుభవించకుండా? ఈ జగత్తే నీ శరీరం, నీ ప్రాణం—నమ్ము.

ఓహో, మనస్సు మాత్రం నీదనా నీ అహంకారం? వట్టి పిచ్చివాడవు. నీ ఒక్కనిలో ఈమనస్సు ఎట్లా ఒంటరిగ మేల్కొన్నదంటావు? వట్టిది. ఏ మనస్సు ప్రపంచమునంతా ఆవరించి ఉన్నదో ఏ మనస్సు జడంలో నిద్రిస్తున్నదో చేత నంలో కలలు కంటున్నదో, జంతుజాలంలో ఇంగితజ్ఞానంగా ప్రకాశిస్తున్నదో, అదే నీ దేహంలో కూడా ప్రబుద్ధమై నిన్ను మానవ నామార్హునిగ చేస్తున్నది. ఈ విశ్వమానవంలో నీ మనస్సు ఒక పాయ, ఒక చీలిక. నీవు కన్ను మూసుకొని, ఈ చీలికనే సర్వంగా భావిస్తున్నావు. ఏమనస్సు బాలబాలకులలో క్రీడిస్తున్నదో, నారీనరులలో ప్రణయంగా విలసిల్లుతున్నదో, మేధావులలో జ్ఞానసంపదగా అలరారుతున్నదో - ఆ మనస్సే

నీలోగూడా నెలవేర్పరచుకొని, నిన్ను మానవ సమాజంలో ఒక సామాజికునిగ చేస్తున్నది. ప్రపంచంలో వ్యాపించి ఉన్న మనస్సు నీలోగూడ వెలుగుతున్నది కనుకనే, నీవును ప్రపంచాన్ని గుర్తించి, దాన్ని పరిచయం చేసుకో గల్గుతున్నావు. మానవకోటిలో అంతర్గతమైన మనస్సు నీలోగూడ ప్రకాశిస్తున్నది కనుకనే, సోదరమానవుల సహవాస భాగ్యాన్ని అనుభవించ గల్గుతున్నావు.

ఈ ప్రపంచానికి అతీతుడవనే అహంకారాన్ని వదులుకో. నీదేహం, నీ ప్రాణం, నీ మనస్సు జగత్తువి. ఈ జగత్తు వీనిని నీ కిచ్చినంత కాలమే నీకీ జీవితం. ఏనాడు వానిని నీ నుండి ఊడ బెరుక్కొనునో, ఆనాడు నీ జీవితం ముగింపు. సోదరా, నీవు శరీరివి. కాబట్టి ప్రపంచమైత్రిని కోరు. నీవు ప్రాణివి, సర్వభూతరతిని అభిలషించు. నీవు మనుష్యుడవు, కాబట్టి నానాత్వములోని ఐక్యముతో అనుసంధానము కావించు. అప్పుడు నీకూ జగమునకూ అభేదం సంప్రాప్తించి, నీ జీవితం విశ్వవిలసనంగా, ఆనందఖేలనంగా పరిణమిస్తుంది.

"ఆత్మవత్ సర్వభూతాని"

# వి శ్వా స ం

సోదరా, ఇన్నిమాటలెందుకుగాని, ఇంతకూ నీ జీవితంలో, నీ దినచర్యను, నీ సర్వవ్యవహారాలను వెనుకనుండి నడుపు తున్నదేదో, ఆలోచించి చూచుకొన్నావా ? ఇట్టి ప్రశ్న ఉంటుందని నీ వెప్పుడూ అనుకొనియుండవు. మనమెప్పుడూ ఏ దూరపు సంగతులనో ఆలోచిస్తూంటాము కాని. మనకు అత్యంత సన్నిహితమైన, తోడునీడగా ఉండే విషయాన్ని అసలు కనిపెట్టియుండము. మనకేది అత్యంత సన్నిహితమైతే, అది మనబుద్ధికి అంతదూరం. ఇది విచిత్రమైన సంగతి కాదూ ?

ఇంతకూ నే నడిగిన ప్రశ్నకు సమాధాన మేమిటి ? నాబుద్ధే నన్ను నడుపుతున్నదంటావా ? అయితే ప్రతిదినం నీవుచేసే ప్రతి పనీ, కోరే ప్రతివిషయం తట్టే ప్రతి ఆలోచనా ముందుగ నీ బుద్ధి తీరికగ కూర్చుండి పూర్వాపర సందర్భాల నాలోచించుకొంటూ, లాభనష్టాలను గుణించుకొంటూ, మంచి చెడ్డలను విచక్షణచేస్తూ నిర్ణయిస్తూంటే, ఆ నిర్ణయ ప్రకారం నీవు నడుస్తున్నాననా నీ యభిప్రాయం ?

చాలా బుద్ధిమంతుడవే, ఇట్లా అయితే. కాని యిది నిజంకాదు. ఏ క్రొత్త విషయమైనా నిన్నెదుర్కొన్నప్పుడు, కొంత తెరపి చేసుకొని నీ బుద్ధితో కొంచెం ఆలోచించుకొంటే ఆలోచించుకోవచ్చునుగాని, బండి చక్రంవలె తిరిగిపోతూం టుందే నీ దినచర్య - అందులోని ప్రతి అంశాన్నీ ఆలోచించే, కర్తవ్యం నిర్ణయిస్తున్నావా? వట్టిమాట. అదేదో దానంతట అదే యంత్రంలాగ సాగిపోతోంది. నిజమగునా, కాదా ?

అది అభ్యాసమను, స్వభావమను, గతానుగతిగమను — ఏమైనా అను. ఆ అభ్యాసానికైనా, ఆ స్వభావానికైనా, గతానుగతికానికైనా, యేదో ఒక ఆధారం ఉండి ఉండాలి చూడు. లేకపోతే దేనిమీద నిలుచుండి నీ అభ్యాసాలను అల వరచుకొంటున్నావు ? నీ స్వభావానికైనా, యేదో కీలకం లేకపోతే, దానంతట అదే నిన్ను నడుపుతుందా? లోకానికైనా, యేదో ఒక ఇరుసుండాలి. లేకపోతే అది ఒకేవిధంగా తిరగడం అసంభవం. కొంచెం నెమ్మదిగ ఆలోచించుకొని చెప్పు.

ఎందుకూ? చర్యతీసుకో. రాత్రి పరుండబోయేటప్పుడు నీ ఆలోచనయేమిటి ? ఇవ్వేళ ముగించని పనిని రేపు పూర్తి చేసుకొంటాననో, లేకపోతే ఫలాని మిత్రుని కలుసుకొంటా ననో, లేక ఏ గ్రామాంతరమో వెళ్ళవలసి వస్తుందనో అనుకొని పడుకొంటావు. నిజమే. కాని రేపు తెల్లవారుతుందో లేదో

సూర్యుడుదయిస్తాడో లేదో, లోకం యథా ప్రకారంగా ఉంటుందో లేదో నీ కెప్పుడైనా అనుమానం కలుగుతుందీ ? మామూలు ప్రకారమే తెల్లవారుతుందనే నమ్మకంతోనే, నిశ్చింతగా నిద్ర పోతావు. అసలా సందర్భమే నీ బుద్ధికి తట్టదు.

అంటే ఏమిటి? నీదైనిక జీవితం యేదో లోడ్డిగ దానంతట అదే సాగిపోతోంది. అది సంశయాలకు ఆలోచనలకూ తావియ్యదు. ఎందుకని? మామూలు విషయం కనుక. మామూలుకు యేదైనా అడ్డం తిరిగేదైతే, ఇదేమిట్రా అని కొంచెం వెనక్కుపోయి దృష్టి నిగిడించి చూస్తావుకాని, మామూలు రస్తాలో నడుస్తున్నంత కాలం నీ జీవితం నిర్విచారంగానే సాగిపోతూంటుంది. సామాన్యంగా ఆమామూలుకు భిన్నముండదనే నమ్మకమే కాదూ నీ జీవితం వెనుకాల ఉన్నది ?

దీనికికూడా ఇంత మీమాంస చెయ్యవలెనా ? స్వతస్సిద్ధమైన విషయానికి ఇంత ఆలోచన ఎందుకు ? అని నీ వడుగుతావు. నిజమే. రోజూ తెల్లవారుతూ ఉంటుందనీ, నీ జీవితం - ఏ అసందర్భాలలోనో తప్ప - సర్వసామాన్యంగా ఎప్పటివలెనే సాగిపోతూంటుందనీ లోకం యథారీతిగనే నీచుట్టూతిరుగుతూ ఉంటుందనీ ఈ నమ్మకం నీకు తెలియకుండానే, నీ జీవితాన్ని నడుపుతోందంటే, అట్లా తెల్లబోయి చూస్తావెందుకు ?

ఇది నీ విషయంలోనే కాదు, అందరి విషయంలోను అంతే - అసలు లోకమే అది. ఈ విశ్వాసం ఇంగితంగా అందరి

లోనూ ఆబాలగోపాలం ఉన్నది. ప్రతివాడూ చేసే ప్రతిపని లోను ఈ విశ్వాసం దాగి ఉన్నది. నీవు రేపు ప్రయాణం పెట్టు కొన్నావంటే, మామూలుకు లోపం లేకుండా, తెల్లవారు తుందనీ, నీకు తెలిసిన బాట అట్లాగే ఉంటుందని నమ్మే— రాత్రి నిర్ణయం పెట్టుకొంటావు.

కర్షకుడు తొలకరిలో విత్తనాలను నాటాడంటే, అవి సకాలంలో మొలకలెత్తి, పెరిగి పంటపండుతుందనే నమ్మకం తోనే వ్యవసాయం చేస్తాడు. పంటకోసి పొలంలో కుప్పవేసు కున్నాడంటే, సంక్రాంతినాటికి ఆ కుప్పను నూర్చి, ఇంటికి ధాన్యం చేర్చుకొంటాననే నమ్మకంతోనే నిశ్చింతగా ఉంటాడు. సోదరా, నీవు ప్రయాణాన్నుండి తిరిగి ఇంటికి చేరేటప్పటికి నీ యిల్లు పదిలంగా ఉంటుందనీ, నీ పిల్లలూ మేకలు సుఖంగా ఉంటారనీ, నీవు రావడంతోటే, వాళ్ళు నిన్ను చుట్టుకొని ఆనం దిస్తారనీ-నమ్మకంతోనే ప్రయాణంచేసి వస్తావు.

ఈ నమ్మకమే లేకపోతే, ఎప్పటికప్పుడు నీ జీవితం, నీ సంసారం, నీ లోకం తారుమారగుతుందనే భయమేఉంటే, నీకు రోజులు గడుస్తాయా? నీ వొక అడుగు ముందుకు వేయ గలవా? అప్పుడప్పుడు నీ మామూలుకు భిన్నం సంఘటించ వచ్చు. అనుకోని సందర్భా లెదురౌతుంటాయి. రస్తా తలక్రిందుల గుతుంది. నీ అంచనాలన్నీ పట్టీకొట్టుతాయి. నిజమే. అప్పుడే నీవు కలవరం చెందేదీ, నీమనస్సుకు ఏమీ తోచందీ, నీ బుద్ధిని

పట్టుకొని రాపాడేదీని. ఈ కలవరాన్ని బట్టే, ఇది మన దినచర్య కాదనే విషయం బోధపడటం లేదు ?

ఎప్పుడు నీలో దాగిఉన్న విశ్వాసానికి భంగం కలుగుతూందో, అప్పుడే, ఇదేమిట్రా అని నిశ్చేష్టుడవై దిగులు పడతావుకాని, నీ అజ్ఞాత విశ్వాసప్రకారం నీ జీవితమూ, నీ లోకమూ సాగిపోతూంటే, నీవు తెలియకుండానే శాంతి సౌఖ్యాలనుభవిస్తూ ఉంటావు. రైలు పట్టాలమీద నడచినన్నాళ్లు భయంలేదు. బండీ ఆ పట్టానుండి తొలగినప్పుడే చిక్కులన్నీని. విశ్వాసమనే పట్టామీదనే నీ బండి నడుస్తోందని ఇప్పటికైనా బోధపడలేదూ ?

దేనిమీద విశ్వాసం అని అడుగుతావా ? ఒక దానిమీద ఏమిటి? సర్వం మీదాను—నీమీద, నీ భవిష్యత్తుమీద, నీ లోకం మీద యావత్తు విశ్వంమీద నీకు సహజంగా విశ్వాసం ఉన్నది. కనుకనే, నీ జీవితం నిశ్శబ్దంగా దానంతట అదే జరిగి పోతున్నట్లు సాగుతోంది. ఎప్పుడు నీమీదే నీకు విశ్వాసం పోయిందో-ఆనాడే నీ జీవితం వికలమైపోతుంది. నీభవిష్యత్తు అంధకారంగా కనబడుతుంది. లోకంకూడా నిన్ను అనుమానిస్తుంది. నీవూ లోకాన్ననుమానిస్తావు - "సర్వత్ర శూన్యా దిశః" అని ఎలుగెత్తి అరుస్తావు.

నీవు చాలా చదువుకొన్నవాడననీ, దేనినీ హేతువాదంతో తర్కించిగాని స్వీకరించననీ, ప్రత్యక్ష ప్రమాణమే

నీ మతమనీ వి[ప్ర]రవీగుతావు. ఓరికపటుడా? ఇది నిజంగాదు; నీ దినచర్యను నడిపేది నీహేతువాదంకాదు. నీహేతువాదంతో లోకవృత్తం నడవటంలేదు. కనబడని "అదృష్టం" ఒకటి అందరి లోను, తుదకు క్రిమికీటకాదులలో కూడా దాగిఉండి, నిన్నూ నీ లోకాన్ని కూడా, నడుపుతోంది. ఎప్పుడా విశ్వాసాన్ని భంగ పరిచే అవాంతరాలు వచ్చినా, అవే ఆ విశ్వాసాన్ని మరింతగా రుజువుచేస్తాయి. నిర్మలమైన నీలాకాశంలో అప్పుడప్పుడు మబ్బులు, మెరుపులు, ఉరుములు బయలుదేరేమాట నిజమే. కాని అంతమాత్రంచేత, ఆ నీలాకాశంయొక్క సర్వవ్యాప్తికి భంగం కలుగుతుందా? పైగా ఈ మబ్బులే ఆకాశంయొక్క నిత్యరూపాన్ని మరింత వెల్లడిచేస్తాయి. ఆ నీలాకాశంలాగానే విశ్వాసంకూడా మనజీవితం లోపలా బయటా ఆవరించి, మన చక్రాలను మెత్తనిబాటల్లో నడిపిస్తున్నది.

ఇంతకూ ఆ విశ్వాసం దేనిమీద? ఈ లోకంలో ఒకప్రణా ళిక, ఒక విధానం వున్నదనీ, ఫలానికార్యంచేస్తే ఫలాని ఫలితం ఇస్తుందనీ. నీతినియమాలనేవి లోకాన్ని శాసిస్తూ ఉంటాయనీ, ఆ విశ్వవిధానం క్రమక్రమంగా భూతకాలంలోనుండి వర్తమాన కాలంలోకి, వర్తమానకాలంలోనుండి భవిష్యత్తులోకి అభివ్యక్త మవుతూందనీ—నమ్మకం పండిత పామరుల కందరకూ సహ జంగా, అజ్ఞాతంగాఉన్నది. ఇది నిర్వివాదాంశం. ఆ విశ్వాసాన్ని సహజజ్ఞానమను, ఇంగితమను—ఏ పేరుతోనైనా పిలు అది ఉన్నది—సర్వానికి మూలంగా.

సమస్తభూతాలు సాక్ష్యమిస్తున్నాయి—ఏమని ? మా శక్తులన్నీ భవిష్యత్తులా వికసించడానికి ఆశిస్తున్నామని. మట్టి లోని విత్తనం మొలకెత్తుతోంది. ఆ విశ్వాసంతోనే నీటి కమలం విచ్చుతోంది, ఆ ఉషఃకాంతులను కీర్తించడానికే. పెట్ట పొదుగు తోంది గ్రుడ్డును—రేపటి రెక్కలను తెరిపించడానికి. తల్లి తొట్టె నలంకరిస్తున్నది—తన గర్భంలోని శిశువు నూపడానికి. గురువు శిష్యునిచేత పుస్తకం పట్టిస్తున్నాడు—వానిలో గర్భిత మైన జ్ఞానాన్ని వికసింపజేయడానికి. దేశభక్తుడు తనప్రాణాన్ని ధారపోస్తున్నాడు—తన దేశంయొక్క దాస్యశృంఖలాలను భగ్నంచేయడానికి. ప్రవక్త లవతరిస్తున్నారు—పతితులను పావనచరితులనుగ జేయడానికి. ఈ ప్రబోధమంతా విశ్వాస విలసనం కాదా ?

తుదకు ప్రత్యక్ష ప్రమాణాన్ని మతంగా చేసుకొన్న "సైంటిస్టు" కూడా ప్రయోగశాలలో కూర్చుండి పరిశోధన ఎట్లా చేయగల్గుతున్నాడు ? ప్రపంచంలో ఒక "లా"—ఒక నియతి—కార్యకారణ సంబంధం—ఒక విశ్వవిధానం—ఉన్నదనే నమ్మకమే లేకపోతే "సైంటిస్టు" చేసే కృషి ఎందు నిమిత్తం ? లోకం పట్టి అరాచకమని చెప్పిన సైంటిస్టును బేర్కొనుడు. ఈ విశ్వశక్తుల మధ్య అన్యోన్య సహకారం ఉన్నదనే విశ్వాసమే, ప్రకృతికి ఒక ధర్మమున్నదనే నమ్మకమే సైంటిస్టును సహితము జ్ఞానినిగ చేస్తుంటే, విశ్వాసమేమిటి అని ప్రశ్నిస్తావా ?

సోదరా, సంశయాత్ముడవుకాక. ఏ ఆకర్షణశక్తి నక్షత్ర గోళాల నన్నిటిని వాని వాని పథాలలో నిలుపుతున్నదో. ఏ చైతన్యశక్తి వృక్షజాతులను ఆయా విశిష్టలక్షణాల ప్రకారం రక్షించి పోషిస్తున్నదో, ఏ మానసికశక్తి ఆయా జంతువులను వాని స్వభావస్వధర్మాను వర్తులనుగజేసి నడుపుతున్నదో—ఏ అనిర్వాచ్యమైన ఆత్మశక్తి నీలో దాగివుండి, నీ శాంతదాస్య సఖ్యవాత్సల్య మాధుర్యాది భావములను జవిజూపి నిన్ను రస స్నిగ్ధునిగ జేస్తున్నదో, ఏ అతీతమైన విశ్వశక్తి లోకాన్నంతను యథాతథంగా తన గమ్యాన్ని చేర్పజూస్తున్నదో—ఆ శక్తిపైనే నీలోని అమోఘ విశ్వాసం.

ఈ విశ్వాసమే నీకు తెలియకుండా, నీ మనస్సును, నీ బుద్ధిని, నీ స్వభావాన్ని, నీ స్వధర్మాన్ని, నీ కర్మను, నీ భవితవ్యాన్ని నడుపుతున్నది. ఈ విశ్వాసబలమెట్టిదో ఒక్కమారు జ్ఞాననేత్రంతో జూచి దానికి ప్రణమిల్లుము.

"విశ్వాసో ధర్మ మూలం హి"

ఆతవితరణం

సోదరా. ఈ విశాల విశ్వమంతా ఒక అఖండశక్తియొక్క చిద్వి లాసమని నమ్ముతున్నావుకదా. నీవు కూడా ఈ విశ్వంలోని వాడవై యుండీ, ఎందుకు నీకింత మమకారం, ఆగ్రహం, దురాశాను ? నీవు ఒక్కడివేనా, ఈ విశ్వంలో? లోకం నీ ఒక్కడి నిమిత్తమే ఏర్పడ్డదా ? ప్రపంచం నీ కోరిక ప్రకారం నడవక పోతే తిరుగుబాటుచేసి, పోట్లాడుతావూ ? ఎవరిమీద నీకింత కసి ?

అవునులే నీ వేమనుకొంటున్నావో నాకు తెలుసు. "ఈ విశ్వమంతా ఒక శక్తియొక్క క్రీడేకాని, ఆ శక్తి నాలో ఇచ్ఛ, జ్ఞానం, క్రియా ఎందుకు నాటింది ? వీనిని ఇచ్చికూడా, వీనిని సఫల పరచకుండా, భంగపరుస్తూంటే. నాకు కోపం రాదూ ? నన్నుకూడా ఒక రాతివలె చేసివుంటే, ఏమూలో పడి ఉండే వాడిని. అట్లా కాదే, నాకో దేహం, ప్రాణం, మనస్సు, బుద్ధి చిత్తం, అహంకారం కల్పించి, నాకు సుఖంలేకుండా అడ్డం తగులుతూంటే, ఎదురు తిరుగుతానా, ఇంకా చంపివేస్తానా?" అని కాదూ నీయూహ?

సోదరా. ఆ విశ్వశక్తికి తెలివి వుందనే నమ్ముతున్నావన్న మాటే కదూ? అదేదో? యంత్రంలాగ, గ్రుడ్డిగ పని చేస్తూంటే దానిమీద కోప్పడుతావా ? ఆ జడశక్తిని కోప్పడి మాత్రం లాభమేమి ? దానిని కొట్టినా తిట్టినా ఒకటే. దానికి తెలివి వుందంటావా? నిజమే, దానికి "తెలివే" లేకపోతో నీలో "తెలివి" ఎట్లా వచ్చింది? విత్తనంలో లేనిది చెట్టులో వస్తుందా? ఆ శక్తికూడా ఒక వెలుగు వంటిది కనుకనే నీలో కూడా ఒక వెలుగు "ఎరుక" ప్రకాశిస్తున్నది. ఆ ఎరుక మూలంగానే "నేను" అని అనుకొంటున్నావు.ఇది విశ్వం అని తెలుసుకొంటు న్నావు. ఆ శక్తి నీలోని ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి వం టిదే కాని తన్ను తానే తెలుసుకోలేని అంధశక్తి కాదన్న మాట. అందుకనే నీ యిచ్ఛ సఫలం కానప్పుడు, విశ్వంయొక్క ఇచ్ఛాశక్తిని నిందిస్తున్నావు. అవునా, కాదా ?

"ఈ విశ్వాన్ని నిందిస్తున్నానా ? లేదు. నా యిరుగు పొరుగు వాళ్లు నా కడ్డం వస్తూంటే, నా మాట సాగనీయక పోతే, నాకు మోసం హానీ చేస్తూంటే, నేనెట్లా వూరుకోను" అని అడుగుతావు కదూ ? కాని వాళ్లు మాత్రం నీవంటి వాళ్లు కారూ? వాళ్ళలోనూ ఇచ్ఛా, జ్ఞానం, క్రియ, మమత్వం లేవూ? నీవు వాళ్ళ ఇచ్ఛలకు అడ్డం తగలవచ్చా, వాళ్లుమాత్రం నిన్ను నిరోధించకూడదూ? ఏమి న్యాయమిది? ప్రపంచంలో నీ కెంత హక్కున్నదో, వాళ్ళకీ అంత హక్కున్నది. నీ కెన్ని కోరిక లున్నాయో, వాళ్ళకీ అన్ని కోరికలున్నాయి. ఏమీ నీ అధి

క్యము? ప్రపంచమంతా నీకు లోబడి వుండాలి. నీవు మాత్రం ప్రపంచానికి లోబడకూడదూ? ఇది నీ బుద్ధికేనా యుక్తంగా కనబడుతోంది?

ఏమిటట్లా యోచిసున్నావు? ఓహో ఇదా? "ఇతరుల కంటె నా కెక్కువబలం, ఎక్కువ జ్ఞానం, ఎక్కువ అహంకారం వుంది. కాబట్టి ఇతరులనోడించి, నేను రాజునవుతాను. వాళ్ళకు కూడా బలముంటే, నాతో పోరాడి గెలవమనండి. బలవంతునిదే రాజ్యమన్నారు. ఆ విశ్వశక్తి నాకెందుకు ఎక్కువ బలం ఇచ్చింది? దీనుడనై పడి ఉండడానికా? కాదు. ఇతరులను ఓడించడానికి. విశ్వం ఒక యుద్ధరంగం మాదిరిగ లేదా? చిన్న చేపను పెద్ద చేప మ్రింగుతోంది. ఎలుకలను పిల్లి తినేస్తున్నది. బల్లి దోమలను అమాంతంగా కబళిస్తున్నది. పెద్దపులి కాళ్ళకు అంత గోళ్ళెందుకు? లేళ్ళను చీల్చివేయడానికి కాదా? చిచ్చు అడవులను దహించివేసుంది. సముద్రాలు పొంగి దేశాలను ముంచుతాయి. బలవంతులు దుర్బలజాతులను లోబరచుకొని పీక్కొని తింటారు. లోకంలో ఎక్కడ చూచినా ఈ స్పర్ధ, పోరాటం,యుద్ధం, విజయం, ఘోషిల్లుతూంటే నేనుమాత్రం నా బలాన్నుపయోగించుకోవడం తప్పా? విశ్వం నాలో క్రోధాగ్నిని రగుల్కొల్పుతున్నది. మదమాత్సర్యాదుల నుద్దీపన చేస్తోంది. అది విశ్వశక్తి యొక్క ప్రబోధం. ఆ ప్రబోధం ప్రకారం నేను విజృంభిసున్నాను".

సోదరా, నీవు బలే పరిశోధకునివలె ఉన్నావు. నీవు ప్రపంచాన్ని పరీక్షిస్తే, నీకు కనబడ్డది హింసా ? ఈ విశ్వమే నిజంగా యుద్ధరంగమే అయియుంటే, ఇది మొదట్లోనే మట్టి కొట్టుకొని పోయేది. ఇంతకాలం పట్టాలా, ఈ ప్రకృతిని సంహరించడానికి? ఒక్క సూర్యుడు చాలడూ, లోకాన్ని దగ్ధపటలం చేయడానికి? ఒక్క సముద్రం చాలనూ, ఈ పృథ్వీతలాన్నంతా ఒక్కమారుగ పొట్టలో బెట్టుకోడానికి ? ప్రపంచం మొదటినుండీ యుద్ధరంగమా ? అయితే, ఈ చెట్లూచేమలూ ఎట్లా మొలిచాయి? ఈ జంతుజాలం ఎట్లా పుట్టుకొనివచ్చింది? ఈ నరజాతులు, ఈ రాజ్యాలు ఎట్లా విజృంభించాయి ? నీవు క్రోధపురుషుడవై చూడడంవల్ల లోకమంతా నీకు రుద్రభూమిగ, శ్మశానవాటికగ, బొమికల గుట్టగ కనుబడుతోంది. ఎంత పొరబడ్డావోయి?

నీవు వట్టిఉన్మాదంలో ఇట్లా అంటున్నావుకాని, నిజంగా నమ్మికాదు. తల్లి స్తన్యపానంమీద బ్రతికిన నీకు ఈ ప్రపంచం నిజంగా సంహార భూమిగ కనబడుతోందా? ఒక్కమారు నీ తల్లిముఖం చూచిచెప్పు. ఎట్టి ప్రేమజ్యోతులు వెలుగుతున్నాయి మీ అమ్మ కండ్లల్లో? తన ఒడిలో బెట్టుకొని నీ తల్లి అమృత హస్తాలు నిన్ను కౌగిలించుకొని ఉంటే, నీకు సంహారమా కనబడేది? ఎంత కృతఘ్నుడవోయి. ఈ విశ్వం తల్లియొక్క ప్రేమపాత్ర. దయారసం ఎట్లా పొంగిపొరలుతున్నదో చూడు. విశ్వమంతా ప్రేమరసంలో కరగిపోవటం లేదూ?

చూడు, ఆ మట్టి ఎండలో ఎండి, వానలో తడిసి, సృష్టి జాలాన్ని ఎంతసచేతనంగా జేస్తున్నదో? ఆమట్టె కాదూ, ఉడికి, కరిగి, రోజా కుసుమంగా పరిమళిస్తున్నది? చూడు ఆ గూళ్ళలో రెక్కలు రాని పక్షులు తల్లులు నోటకరచి తెచ్చిన ఆహారాని కోసం ఎట్లా దీనంగా చూస్తున్నాయో. ఆ కోయిల పాటలో నీకు వినబడుతున్నది క్రోధగీతమా? సోదరా ? వ్యాఘ్రం వన్య మృగమే. అది ప్రకృతియొక్క క్రౌర్యానికి నిదర్శనమంటు న్నావే. కాని దాని పిల్లల కెలా పాలిచ్చి పెంచుతున్నదో, ఆ క్రౌర్యంనుండేనా, ఆ మధుర క్షీరాలు స్రవిస్తున్నవి ? ఒక్క మారు ఆ పులిపిల్లలను పట్టుకుపో చూస్తాను. వానిని రక్షించు కోడానికి తల్లిపులి తన ప్రాణాలను సహితం అర్పిస్తుందే. అది క్రౌర్యమా సోదరా? ఆ పులిని చూచైనా ఆత్మబలిదానమంటే యేమిటో నేర్చుకో.

ప్రకృతి సంహార క్రీడ కాదోయి. ఇది సృష్టి. నిర్మాణము, ప్రేమవిలసనం, ఆత్మబలిదానం. చూడు ఈ ప్రపంచంలో ప్రతి అణువూ, ప్రతి జీవకణం, ప్రతి రక్తబిందువు, తననుతాను ఎట్లా అర్పించుకొంటోందో- ఈ సృష్టిని పోషించడానికి, తన ప్రేమ నాస్వాదించుకోడానికి, తన ఆనందాన్ని భోగించుకోడానికి. ఈ విశ్వభోగం కోసమే నీవుకూడా పరితపిస్తున్నావు. అందుకనే నీ వల్లమాలిన కోరికలూను. కాని తప్పుదోవను పడ్డావు. విశ్వంలోనుండి విడివడి, విశ్వంమీది అధికారం సంపాదిస్తే, నీకు శాంతి సౌఖ్యాలు కలుగుతాయని భ్రమిస్తున్నావు. ఈ విశ్వంలో స్వార్థానికి స్థానం లేదోయి, సోదరా!

ఎట్లా పరమాణువుల దగ్గరనుండి లోకమంతా సర్వం విశ్వానికి అర్పణం చేసుకొని, విశ్వాన్ని పొందుతోందో, అట్లాగే నీవు కూడా మమత్వం వీడి, లోకానికి అర్పణ చేసుకొంటే, నీకు నిజంగా విశ్వభోగం సిద్ధిస్తుంది. విశ్వం కూడా నీ స్వార్థాన్ని విడగొట్టి, తనలోకి కలుపుకోడానికే ప్రయత్నిస్తున్నది, ఆ ప్రయత్నమే నీకు వైరంగా, ఘోరంగా, సంహారంగా కనబడుతోంది. అది సృష్టియొక్క పిలుపు సోదరా, విశ్వమంతా ఒక్కటై, చూపులో చూపు కలుపుకొంటూ, చేతిలో చేయి వేసుకొంటూ అడుగులో అడుగు కలుపుతూ. నర్తిస్తూంటే, నీవు దూరంగా అవిశ్వాసంతో నిలవబడి అసూయపడుతూంటే, విశ్వప్రేమ నిన్ను జాలితో నీ వెన్ను చరచి తన ఆలింగనంలోకి తీసుకోడానికి పిలుస్తున్నది. ఏమని ఆ పిలుపు? రా, విశ్వానికి అర్పణ చేసుకో-విశ్వం నీదవుతుంది. శిశువు తల్లి యొడిలో ఒరుగునట్లు ప్రియురాలు ప్రియుని ఆలింగనంలో కరగునట్లు. నీవు విశ్వంలో లీనమైపోతివా. విశ్వమంతా నీదే సోదరా!

నీలో నీవు ముడుచుకొన్నంత కాలం విశ్వం నీది కాదు, నీవు ప్రవాసియైన యక్షునివలె విరహాకాతరుడవు అయిపోతావు. నీలో నీవు కుమిలి క్రుంగిపోతావే కాని, బయటకు రాలేవు. నీవు బలవంతుడవనుకొని రాక్షసివయి, లోకాన్ని పీక్కు తింటావా, విశ్వం కనిపెట్టివుండి నీ నెత్తినణచి, అధోలోకాలకు విసరి పారేస్తుంది, తామసికంగా ముడుచుకొనిపోక

రాజసికంగా దురహంకారివి కాక. సాత్వికంగా విశ్వంలో లీనమై పోయినావంటే, విశ్వమంతా నీదై పోతుంది. నీవు బయటనుండి సంగ్రహిస్తున్నంత కాలం, నీవు విశ్వానికి వైరివి. నీవు నాదేమీ లేదని విశ్వానికి సర్వస్వం అర్పణ చేసుకొన్నావా. విశ్వం నీకు భోగభూమి అయి, ఆనందడోలికలలో నీవు ఊగులాడుతావు. విశ్వశక్తి నీకు ఇచ్చె, జ్ఞానం. క్రియ ఇచ్చింది ఎందుకు? అర్పణ కొరకు, సమర్పణకోసం. నీవు విశ్వమానవుడై వెలయడానికి.

"తేన త్యక్తేన భుంజీథాః
మాగృధః కస్యస్విద్ధనం"

# విధి విధానం

సోదరా, నిన్ను మమకారం వీడి, విశ్వానికి అర్పణ చేసుకో మంటే, నీ స్వభావనియతకర్మలు మాని, సన్యాసం పుచ్చుకో మని అడుగుతున్నాననుకొన్నావా ? కాదు. నీ వెందుకో ఈ లోకంలో పడ్డావు. పడినందుకు, నీ జీవితోద్దేశ మే మైయుం టుందో కనిపెట్టి దానిని సక్రమంగా నిర్వర్తించుకొంటే, నీవు విశ్వానికి నివేదించుకొన్నట్టే.

నీవు లోకంలోకి వచ్చింది, ఈ లోకాన్ని తన్నివేసి పారిపోవడానికా? కాదు. పారిపోయినావా, నీవు పిరికిపంద వన్నమాట. లోకంలో ఉంటే, నీకు కష్టాలు నష్టాలు సంభవించే మాట నిజమే. కాని ఆ కష్టాలనెదుర్కొగల ధీరవృత్తి ఉండాలి. నీలో. నీ నష్టాలను భరించే నిగ్రహం అలవరచుకోవాలి. ధైర్య నిగ్రహం లేని వాడీ లోకానికి పనికిరాడు. సోదరా, వాడు వ్యర్థుడు.

ఈ లక్షణాలు ప్రతి ప్రాణికి సహజంగా వున్నాయి. ఏ ప్రాణి తన ఉనికిని తాను కాపాడుకోడానికి ప్రయత్నించదు?

స్వరక్షణోపాయం ఎరుగని జంతువంటూ లేదు. అపాయం వచ్చిందంటే తాబేలు తన చిప్పలో తాను ముడుచుకొంటుంది. ఎద్దు కొమ్ములతో కుమ్ముతుంది. కోతి చెట్లపైకి ఎగబ్రాకుతుంది. పక్షి రెక్కలతో అకాశంలోకి ఎగురుతుంది. ఇవన్నీ ఆత్మరక్షణోపాయాలే.

ఈ జంతువులకు శరీర రక్షణమే ప్రధానం గనుక, శరీర రక్షణార్థం శరీర సంబంధమైన రక్షణోపాయాలు కల్పించబడ్డాయి. మానవుని అభివృద్ధి శరీరంలో కాదు. నిజంగా పశువుల దేహానికిగల జవసత్వాలు మానవదేహానికి లేవు. కాని వానికిలేని బుద్ధి ప్రాగల్భ్యం మానవునకున్నది. ఎందుచేత ? ప్రకృతి మానవులకు ఆత్మోపలబ్ధిని పరమలక్ష్యముగ విధించింది. దానికి సాధనములుగ దేహప్రాణ మనములు ప్రసాదింపబడ్డాయి. మానవుడు ఉత్తమ స్థితికిబోయిన కొలదీ వివేకము, ధైర్యము, నిగ్రహము, నిష్ఠ మొదలైన ఉత్తమ గుణములలవడుతాయి. బుద్ధి వివేకిని పెడత్రోవను త్రిప్పజాలదు. ధీరుని కష్టాలేమియు జేయజాలవు. సంయమి ఎన్ని నష్టాలనైనను భరించగలడు. ఏ శస్త్రాస్త్రములకూ లేని బలమున్నది మానవుని అత్మశక్తికి.

నీ అభ్యాసంలోనే ఉన్నది నీవెట్టి లక్షణాల నలవరచుకోగల్గేది. చిన్నతనంనుంచీ, బూచివాడంటే భయపడితే నీవు వట్టి భీరుడవై పోతావు. రాత్రిళ్ళు ఒంటరిగ స్మశానంలోకి

గూడ పోగల ధైర్యం ఉన్నదా, నిన్ను తల్లడిల్లచేసే దేదీ ఉండదు. ఈ లోకంలో నీ జీవితంలో నీవు ఏ యే సంఘటనకు ఎట్టి మదింపు వేసుకొంటూంటావో. ఆ మదింపులనుబట్టే, నీ లాభ నష్టాల పరిమాణంకూడా నిర్ణయమౌతూంటుంది. నీ జీవితం యొక్క జయాపజయాలకు నీ మదింపులే కారణమని తెలుసుకో.

సోదరా, మన జీవితంలో అన్ని సందర్భాలూ మనం ఆశించినట్లుగ అనుకూలించవు. మన ఆశలు భంగమైనప్పుడు, దిగులుచెంది అధైర్యపడతాము. బహుశః ఆ ఆశాభంగం మనకు చివరకు ఉపకార మవుతుందేమో అనే యోచనకూడా ఉండదు. మన పంచప్రాణాలూ ఒక దానిమీద పెట్టుకొని, దాని సిద్ధికొరకు పెనగులాడుతాము. అది సిద్ధించక పోయే టప్పటికి ఎందుకూ కొరగానివానివలె చతికిలపడతాం. మన భవితవ్యం మీద మనకు విశ్వాసం లేక పోవడంవల్ల, ఇట్లా తటస్థిస్తూ వుంటుంది.

పెద్దల జీవితాలను పరిశీలిస్తే తెలుస్తుంది. వారి ఆశా భంగాలే వారి ఉన్నతికి సాధన భూతములైనట్లు. ఆంగ్లతత్వ వేత్తయగు కార్లయిలు మహాశయుడు కేంబ్రిడ్జి యూనివర్సిటీలో గణిత శాస్త్రోపాధ్యాయత్వానికి చాలా తంటాలు పడ్డాడు. కాని ఎన్ని తంటాలుపడ్డా, వాని కాపని కాలేదు. నిరాశచెందాడు. ఇక గ్రంథాలు వ్రాసుకొని ఆయనా బ్రతుకుతా ననుకొన్నాడు. ఆ గత్యంతరమే వానిని ఆంగ్లవాఙ్మయంలో

ఒక సుప్రసిద్ధునిగ జేసింది. ఎవరి భవితవ్యము ఎట్లా నిర్ణయమై ప్రకృతి తనఉద్దేశం నెరవేర్చుకొంటుందో ఎవరు చెప్పగలరు?

శ్రీ అరవింద యోగీంద్రుడు ఐ. సి. ఎస్. లో ఉత్తీర్ణుడు కాకపోవడంలో ఎట్టి దైవసంకల్పమున్నదో యోచించు. ఏ జిల్లా మ్యాజిస్ట్రేటో అయి, సత్యాగ్రహులకు శిక్ష విధించడమా, లేక ఒక కులపతియై, లోకానికి నూతన దివ్య జీవన విధానాన్ని ప్రదర్శించడమా? దైవవిధే అరవిందుని ఐ.సి.ఎస్. నుంచి తప్పించి, వానిని లోకానికి మహాజ్ఞానినిగ ప్రసాదించింది.

ఇంకా ఎన్నో ఉన్నాయి నిదర్శనాలు. రవీంద్రనాథుడు చిన్నతనంలో బారిస్టరీకోసం ఇంగ్లాండు వెళ్ళడమేమి అది సరిపడక, స్వదేశానికి తిరిగి వచ్చివేయడమేమి? కవిచంద్రుడై లోకాన్ని సౌందర్య తేజంతో నింపవలసినవాడు కోర్టులో బారిష్టరుగ వాదిస్తూండే పని కెట్లా నిబద్ధుడై ఉండగలడు? మనం అపజయాలనుకొనేవి, దైవదృష్టిలో విజయాలవుతాయి. మన జీవితంలోగల భగవద్విధానాన్ని తెలుసుకోలేకపోవడంవల్ల, మనకు వచ్చే మేళ్ళను కీళ్ళనుగాను, కీళ్ళను మేళ్ళనుగాను మదింపు వేసుకొంటూ మోసపోతూ ఉంటాము.

సోదరా నీ జీవితంలో నీ మనోరథాలు భగ్నమగుతున్నందుకు, నీవు తత్తరపడకు. నీవీ లోకంలోకి వచ్చావంటే ఈ లోకంలో నీకొక ఉచితస్థానం నిర్ణయమై ఉన్నదన్నమాట.

కాని ఆ ఉచితస్థానాన్ని ముందుగ తెలుసుకోవడం కష్టం. నీ భవితవ్యాన్ని, అనగా నీ స్వధర్మాన్ని నిర్ణయించేది నీ యిచ్ఛ కాదని విశ్వాన్ని శాసించే ఆ పరాశక్తే నీ భాగ్యవిధాత అని నీవు విశ్వసించిఉంటే, నీ వనుకొనే కష్టాలు నష్టాలు, తుదకు మంచిగానే పరిణమిస్తాయనే నమ్మకం కుదిరి నీ భవిష్యత్తును ఆశతో తిలకిస్తావు. నీ స్వధర్మం నీకు గోచరిస్తుంది.

సామాన్యంగా లోకం వాంఛించే అధికారం, ధనం, కీర్తి గౌరవం నీ జీవితంలో సమకూడితే, నీవు అన్యథా ఆలోచించవు. అదృష్టవంతుడవని సంతృప్తి పడతావు. అవి సిద్ధించక దారిద్ర్యం, లోకం వెక్కిరించడం, శాసనం దండించడం, దేశాంతర ప్రవాసం, బంధుమిత్రుల వియోగం మొదలైనవి సంప్రాప్తిస్తే—దురదృష్టవంతుడవైనట్లు, లోకానికి నీ వుపయోగపడనట్లు చింతిస్తావు. ఎందుచేత ? బజారు కొలతలను ప్రమాణంగా తీసుకోవడంవల్ల. సోదరా, ఇతరుల కొలతలు నీకు ప్రమాణంకావు. నీ కొలత నీదే.

కఠినమార్గమే నీకు దైవం నిర్ణయించిన జీవితమని సంతృప్తి పడక, పైగా దైవాన్ని దూషిస్తావు. లోకం కూడా నీ యెడల నిర్దయగా ఉన్నట్లు నెపమెంచుతావు. బహుశా నా పూర్వజన్మలో ఏదో పాపం చేసుకొన్నానని అందుకని ఈ జన్మలో ఇట్లా అనుభవిస్తున్నానని, పరితపిస్తావు. ఎట్లా అనుకొన్నా, ఈ తలంపులు నిన్ను నిజంగా ఉద్ధరించగలవికావు.

నిన్ను నీవు లోకానికి నివేదించుకోతలచుకొంటే, ఆ నివేదన నీ యిచ్ఛ ప్రకారం జరగాలని అనుకొన్నావా, అది నిజంగా నివేదనే కాదు. అది నీ అహంకారాన్ని బలపరచుకొన్నట్లే అవుతుంది. ఆత్మ నివేదనంటే, నీ ఇచ్ఛను వదులుకోవడమన్నమాట. విధాత నిన్నెట్లా ఉపయోగించుకొనునో, దానికి పూర్తిగ లోబడితేనే, నీ ఆత్మార్పణం సార్థకం. ప్రకృతి నిన్ను రాజ్యాధికారిణిగ జేయవచ్చు. లేదా అజ్ఞాతవాసంలో బడవేసి ఇకుమలగుండ ఈడ్వవచ్చు నీ జీవితాన్ని సఫలపరచేది ఈ బాహ్యావ్యవస్థలు కావు—నీకు విధింపబడ్డ కర్మక్షేత్రంలో నీవు చూపే ధైర్య నిగ్రహాలు, శాంత్యానందాలు, సంసారులలో సుఖులూ ఉన్నారు, దుఃఖులూ ఉన్నారు. సన్యాసులలో సుఖులూ ఉన్నారు, దుఃఖులూ ఉన్నారు, సుఖదుఃఖాలు నీ మానసిక కల్పనలు.

నీ వేవృత్తి నవలంబిస్తున్నా, ఏ వ్యాపారం చేస్తున్నా అయ్యది ఈశ్వర విహితమని నమ్మి, త్రికరణశుద్ధితో నాచరించగల్గితే నీ జీవితం నిజంగా విశ్వేశ్వరుని కాశీక్షేత్రమే అవుతుంది ఎప్పుడు నీ జీవిత విధులలో దైవసంకల్పం గోచరిస్తుందో, అప్పుడప్రయత్నంగానే, నీకు ధైర్యనిగ్రహాదులు, శాంతి మాంగళ్యాదులు సిద్ధిస్తాయి. నీ జీవితం ప్రకృతికి ఉపకరణమైన తర్వాత, నీకేమి భయం, నీకేమి కొదువ?

పురుష ప్రయత్న దూరమైన మాంద్యాం, అలసత, మొదలైన తామసిక ప్రవృత్తులచే అలవడే అల్పసంతుష్టి నిజమైన వైరాగ్యమని అనుకోక, ఇట్టి మిథ్యా వైరాగ్యం మనదేశంలో

చాలా ఉన్నది. ఇల్లు వదిలిపెట్టే చొరవలేక, క్రొత్త పుంతలు త్రొక్కే సాహసంలేక, అనుకోనికష్టాల నెదుర్కోగల ధైర్యం లేక, ఈ దైన్యస్థితిని అవలంబిస్తున్నావు కాని, శక్తి ఉండి వదులు కోవడం కాదు, ఎవరైనా నీకెట్టి కష్టాలూరావని అభయహస్త మిచ్చి, నీ సుఖజీవనానికి త్రోవచూపితే, దానిని స్వీకరించడానికి నీవు సంసిద్ధుడవే. అంటె నీ ఇచ్ఛను వదులుకో లేవన్నమాట. అల్పసంతుష్టి నిజంగా ఆత్మనివేదనవలన గలిగినదైతే, అది గొప్ప వరమే. కాని అది తామసిక ప్రవృత్తి ఆయితే మాత్రం అది నీ ఉన్నతికి సాధనభూతం కాదు, అది వట్టి దౌర్బల్య చిహ్నం. దైవసంకల్పాన్ని నీ చూపునుండి మరుగుపరచే పొర అది. అది ఆత్మహననం.

ప్రకృతి నిన్నీలోకానికి పంపినది నీ ఆత్మోపలబ్ధికోసం— అనగా నిన్ను ప్రతిభావంతునిగ జేయడానికి. నీలో ధీరవృత్తిని వికసింపజేయడానికి, నిన్ను ఆత్మస్థునిగ జేయడానికి, నిన్ను లోకాభ్యుదయానికి ఉపయోగించుకోడానికి. అంతేనే కాని, క్రిమికీటకాదులవలె, బొక్కలలో దీనంగా ప్రాకుతూ ఉండ డానికి కాదు.

నీ జీవితంయొక్క మూల్యాన్ని బజారు ధరలనుబట్టి, గతానుగతికమైన మదింపులనుబట్టి నిర్ణయించుకోక, నీ జీవిత విధానమంటే నీ స్వధర్మనిర్వహణం, నీ అభ్యాసాలు ఎంతవరకు నిన్ను ఆత్మవిదునిగ, లోకహితైషిణిగ జేయగల్గునో, అంత వరకే నీ జీవితం విలువ. నీవు రాజ్యాధికారివైనా, నీ కట్టి జీవితం సిద్ధించకపోవచ్చు. ఏ పేదగుడిసెలోనో హరిజనదాసుగ

నున్నా నీకట్టి అమూల్యజీవితం సిద్ధించవచ్చు. విశ్వరంగంమీద గజ్జెకట్టి, ఆడి లోకంయొక్క మెప్పును బడయుచే నీ జీవిత సాఫల్యమైనట్లు ఎంచుకొన్నావా, నీ వాత్మదూరుడవై పోయినావన్నమాట,

నీ వుపయోగపడవలసింది లోకానికైనా, నీ విలువను నిర్ణయించేది లోకం కాదు, ప్రతివాని జీవితం వెనుకా దైవ సంకల్పం ఉన్నది. నీ జీవితంలో నీ వెంతవరకు ఆ భగవ దిచ్ఛను గుర్తించి తదనుగుణముగ ప్రవర్తిస్తున్నావో వినమ్రుడవై యోచించుకో, నీకు భక్తి ఉన్నదా, నీలోని చక్షువు తెరచు కొని. జగన్నాటక సూత్రధారుని జాడలను కనిపెట్టగలదు. నీ యథోచిత పాత్రనిర్వహణం ఫలప్రదమవుతుంది. అప్పుడే నీ జన్మ ధన్యం. నీ ఆత్మసమర్పణం యథార్థం.

"ఉద్ధరే దాత్మనాఽఽత్మానం
నాత్మాన మవసాదయేత్."

# స్వధర్మం

సోదరా, నీలో ఒక దురలవాటున్నది. ఏదంటావా? ఏ క్రొత్త విషయం కనబడినా. దాని వెంబడి పరుగిడుతావు, ఎట్టి ఆలోచనా లేకుండా. ఎందుకని? కాలానికి వెనుక పడిపోతానేమోనసే భయంచేత-తక్కినవాళ్లు నీకంటె ముందుకు త్రోసుకొని పోతారేమో అనే అసూయచేతాను.

అందుకని, ప్రతి ఉద్యమంలోను నీవు పూసుకొని తిరుగుతావు. నీకు జోక్యంలేని ప్రయత్నమేమీ నీ సంఘంలో ఉండకూడదని నీ ఆలోచన. నీవు పట్టి పందెపు గుర్రమైపోయినావు సోదరా. ఎప్పుడైనా వెనుకచూపు ఉంటేగా. ఎక్కడపడితే అక్కడ నీవే. పేరు ప్రతిష్ఠలకోసం, ప్రాముఖ్యంలోకి రావాలనీ, నీ తంటాలు.

నీకు ఇందుమూలంగా పేరు ప్రఖ్యాతులు వస్తే వచ్చుగాక. కాని ఈ పోటీలలో చిక్కుకోవడం నీ ఆత్మోన్నతికి మాత్రం సహాయకారికాదు. ఒకరితో నీకు పోటీ ఎందుకు? ఎన్నిమార్లు చెప్పేది సోదరా, ఎవరి రస్తా వారిదేనని, నీ

స్వభావం నియమించిన జీవిత విధానాన్నే నీ వనుసరించాలి కాని, ప్రక్క త్రోవల్లోకి పోకూడదని. నీ యభిప్రాయం వేరు- ఒక్క త్రోవకు కట్టుబడివుంటే, నీ జీవితం సంకుచితమై పోతుం దనీ, అందరి త్రోవలూ నీవిగా చేసుకొంటేనే, నీవు మహో దారచరితుడవుగా, విశాల హృదయుడవుగా కనబడతావని నీ వనుకొంటున్నావు. కాని, అది సరియైన ఆలోచన కాదు సోదరా.

మానవులందరూ ఒక్కటి అనే మాటా నిజమే. అందు కనే సోదరమానవులతో కలసి మెలసి తిరగ గల్గుతున్నావు. ఒకరి అభిప్రాయాల నింకొకరు తెలుసుకోగల్గుతున్నారు. నీలో మైత్రి ప్రబలిన కొలదీ, ఇతరులతో ఐక్యం కాగల ప్రవృత్తి నీకేర్పడుతున్నది, అందరిని సమానంగా చూచే దృష్టికూడా వికసిస్తుంది,

ఇది కాదనను, సోదరా, కాని, సామాన్య ధర్మాలతో బాటు విశేష ధర్మాలుకూడా ఉన్నాయి. ప్రతి మనిషికీ పుట్టు కతోనే, విశిష్టలక్షణాలు, ప్రత్యేకవ్యక్తిత్వము, భిన్న స్వభావం నిర్ణయమై ఉన్నాయి. ఒకరిని బోలిన మనిషి ఇంకొకడు లేడు. అందరకూ కళ్లున్నాయి, కాని నీచూపు నీదే, అందరకూ కంఠాలున్నాయి. అయినా ని కంఠస్వరం నీదే, అందరకూ కాళ్లున్నాయి, అయినా నీ నడక నీదే. నీవు మానవులలో మానవుడవైనా, నీవు ప్రత్యేక మానవుడవనే సత్యాన్ని మనోగతం చేసుకో.

ఇది గ్రహించకపోవడంవల్లనే, నీ ఇతరులను అనుకరించ జూడడం, ఇతరులతో పోటీకి దిగడం, ఇతరుల దోవలకు అడ్డం రావడం సంభవిస్తోంది. మూల ప్రకృతి నీకు ప్రత్యేక స్వభావ మిచ్చే నిన్ని లోకంలో విడిచింది. ఆ స్వభావాన్ని గుర్తించి నడిచావా నీజీవితం దైవదృష్ట్యా సఫలమవుతుంది. నీ స్వభావ విరుద్ధంగా ప్రవర్తించావా, నీ జీవితం భగ్నమైపోయిందన్న మాటే.

కోయిలకున్న బుద్ధి నీకు లేదే. కోయిల ఏమిచేస్తుంది? దానికి గ్రుడ్డును పొదగడం చేతకాక, దానిని తీసుకొనిపోయి, కాకిగూడులో పెట్టుతుంది. కాకి ఆ గుడ్డును గూడ తన గ్రుడ్లతోబాటు పొదుగుతుంది. కాని అది పక్షికావడంతోటే అది కాకివలె కూస్తుందా ? కూయదు—అది సహజంగా కోయిలగానే పంచమస్వరంలోనే కూస్తుంది. అన్నిపక్షులైనా "కాకః కాకః, పికః, పికః" అంటే ఏమిటి? ప్రతి జంతువు దాని స్వభావం ప్రకారం ప్రవర్తిస్తుందన్న మాట. కాని మానవుడు, మాత్రం స్వేచ్ఛాజీవియై, తన స్వభావాన్ని గుర్తించుకోకుండా ప్రవర్తించి, సంఘంలో సామరస్యానికి బదులు సాంకర్యాన్ని తెచ్చిపెట్టుతున్నాడు.

నీ వేమనుకొంటున్నావో నాకు తెలుసు. స్వభావ మనేది, శాశ్వతంగా, స్థిరంగా నిర్ణయమైఉందా? ఎందరి స్వభావాలు మారుతూ ఉండడం చూడడంలేదు? కోపస్వభావం

కలిగినవాడు కొంతకాలానికి శాంతస్వభావం అలవరచుకొంటు న్నాడు. లోకద్వేషి లోకహితైషి అగుతున్నాడు. తోవలు కొట్టే కిరాతుడు వాల్మీకి ఋషిగ మారలేదా ? చిన్నతనంలో బండ రాముడుగ నుండిన మందబుద్ధి కవికులతిలకమైన కాళి దాసు కాలేదా? ఈ జగత్తులో దేనికి నిలకడ వున్నది? అన్నిటి తోబాటు స్వభావంకూడా మారేదే — అని కాదూ నీ వాదన ?

స్వభావమనేది నీ స్థూల సూక్ష్మ శరీరాలకు సంబంధిం చిన వాసనా ఫలితమే అయితే, నీవాదం యుక్తమైనదే. నేను స్వభావం అని చెప్పేది నీ కిటీవల అలవడిన ప్రకృతికాదు. అభ్యాసాలవల్ల సంప్రదాయాలవల్ల, సామాజిక పరిస్థితులవల్ల శీతోష్ణస్థితులవల్ల కల్పితాలైన సంస్కారాలు పరివర్తనాలు చాలా ఉన్నమాట నిజమే. ఈ మార్పు అనేదే లేకపోతే. మానవునకు అభ్యున్నతీ, వికాసం అనేవే ఉండవు. బంధనంలో ఉన్న మానవుడు శాశ్వతంగా బంధనంలోనే చిక్కిపోతాడు. బంధనాలను త్రెంచుకొని పోగలశక్తి, బుద్ధి, చిత్తం మానవు నకు నిత్యసిద్ధమై వున్నది. కనుకనే ప్రతివాడూ ఏదోవిధంగా స్వతంత్రుడు కావాలని చూస్తున్నాడు. నేడు కాకపోయినా కొన్ని జన్మాలకైనా, జీవుడు ముక్తుడై తీరుతాడు.

ఇదంతా నిజమే. గీతాకారుడు 'స్వభావ నియతం కర్మ కురుత్వం' అని ప్రబోధిస్తున్నాడు. ఆ "స్వభావం" మారేదే

అయితే గీతాకారుడు కట్టిన సౌధమంతా ఒక క్షణంలో కూలి పోతుంది, గీతాకారుడు సూచించిన స్వభావం అనిత్యములైన స్థూల సూక్ష్మ శరీరాలకు, నీ కర్మ సంచయాలకు, వాసనా పరంపరలకు సంబంధించినది కాదు. అది మూల ప్రకృతిలోని నిత్యమైన కారణ శరీరానికి సంబంధించినది. ప్రకృతియొక్క మూలంలో నానాత్వం అనే వైచిత్ర్యం అనాదిసిద్ధమై లేక పోతే, జగత్తులో ఈ అనేకత్వమే వ్యక్తమయ్యేదే కాదు.

సోదరా, మూల ప్రకృతిలోని ఏకత్వం అనేకత్వాన్ని మ్రింగివేసే కళా విహీనమైన ఒక్కటికాదు. అది అనేకత్వాన్ని అంతర్భుక్తంగా చేసుకొన్న కళా పరిపూర్ణమైన ఐక్యము. "యాథా తథ్యతో అర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యస్సమాభ్యః" ఏయేభూతం, ఏ యే జీవి, ఏ యే స్వభావంతో, ఏయే విశిష్టలక్షణాలతో విలసిల్లాలో—ఆ విశిష్ట లక్షణాలన్నీ మూలంలోనే విభజనమై ఉన్నాయి. కల్పాంతంలో గూడా ఆ విభజనం అనభివ్యక్త మగుతుందేకాని. అసలు నాశనం కాదు. అది నిత్య ధర్మం. అందుకనే ప్రతిజీవికి స్వభావ విహిత స్వధర్మము నిర్ణయమై ఉన్నదని శ్రీకృష్ణ భగవాను డుపదేసిస్తున్నాడు. సృష్టి రహస్యమే ఇది—స కామో అజాయత బహుస్యాం ప్రజాయేయేతి. సోదరా, ఏవో అర్థంకాని వేదాంతం ముక్క లేకర పెట్టుతున్నానని అనుకోక. నీకు అనాది సిద్ధంగా ప్రత్యేక ధర్మం విహితమై యున్నదని, ఆ సత్యమే లేకపోతే, ఈ నానా

ప్రకారంగా శోభిల్లే ఈ జగత్తే లేదనీ నీకు బుద్ధిగతం కావడానికే, ఈ మాటలను నొక్కి చెప్పుతున్నాను.

నిజమే, సోదరా, నీ జీవితం అట్టడుగున ఉన్న నీస్వభావమేదో వెంటనే గోచరంకానిమాట సత్యమే. నీ ఆత్మ నిహితమైన స్వభావాన్ని గుర్తించడానికి నీ బాహ్య జీవనంలోనుండి లోపలకు పోవాలి. ఉపాసనాబలంతో ఈశ్వరానుగ్రహంతో అన్వేషించాలి. అప్పుడుకాని అయ్యది గ్రాహ్యంకాదు. అది అంతర్వాహినిగా నీలో నీ జీవితపరిణామంలో, నీ సమస్త దశాంతరాల్లోను ప్రవహిస్తున్నదని విశ్వసించి, జిజ్ఞాసచేస్తే అది నీకు సుబోధకం కాగలదు. ఆది సుసాధ్యంకావాలంటే ఇప్పటినుండీ దానికొరకు సాధన చెయ్యాలి.

సోదరా, ముందు ఇతరుల ననుకరించడం మాను. ఎవరితోను పోటీ పెట్టుకోక, నీ చిత్తవృత్తులను సూక్ష్మంగా పరిశీలించుకొంటూ, నీ అభినివేశా లేదిక్కును సూచిస్తున్నాయో, జాగరూకతతో కనిపెట్టుతూవుండు. నీ జీవితంలోని ఘటనాఘటనలు కూడ నీకు మందలింపులుగనో, లేక హెచ్చరికలుగనో పరిణమిస్తూంటాయి. ఇట్లా నీ యాంతరంగిక జీవితాన్ని శ్రద్ధా భక్తులతో పరిశోధించుకొంటూ ఉంటే, నీ దైవవిహిత స్వభావం మెరుపుతీగవలె నీ కన్నులముందర ప్రకాశించకపోదు. ఈశ్వర విధానం ఎంతకాలం మరుగై ఉంటుంది ?

నీ స్వభావాన్ననుసరించే, నీ అభిమాన విద్యలు, నీ అభిమానమతం, నీ అభిమాన కర్మ, నీ యిష్టదైవం క్రమ

క్రమంగా నిర్ణయ మవుతాయి. నీకు విశేషలక్షణాలున్నాయి కదా అని. నీకు విశ్వంలో ఇతరులతోబాటు సమానస్థానంలేదని తలంపకు. బ్రహ్మాండమంతా నీలో ఇమిడివున్నప్పుడు, నీవు విశ్వానికి ఎట్లా దూరమై పోగలవు ? విశ్వమంతా ఇతరులతో బాటు నీకును భోగ్యమే. అన్ని విద్యలు, సమస్త కళలు, సర్వ మతాలు, అఖిల సాధన విధానాలు నీవే. కాని నీ వ్యాప్తి సూత్రం నీస్వభావాన్ననుసరించే అనిగమనించు. నీ కేంద్రాన్ని విడువకుండా, ప్రపంచాన్నంతా ఆవరించావా, నీవు స్వధర్మ భ్రష్టుడవు కావు. నీకు కేంద్రమనేదే లేదా, విశ్వంకూడ నీ కనుభవం కాజాలదు. నీ స్వభావవిహిత స్వధర్మమే నీ కేంద్రం —దానిపై నిలుచుని నీ చూపులను, నీ హస్తాలను, నాలుగు వైపుల చాపుము.

దైవం సర్వాంతర్యామి అయినా, నీకు ప్రత్యక్షమయ్యే దైవం యొక్కరూపం వేరు, నీతో క్రీడించే విధం ప్రత్యేకం. గోపీవల్లభుడు పదివేలమందితో ఏకకాలమందు క్రీడించాడంటే అందరితోను ఒకేవిధంగా క్రీడించాడా? లేదు. ఆ నిఖిల రసామృతమూర్తి, ఆయా నాయికల స్వభావ స్వానురక్తుల ననుసరించి, భిన్నప్రకారంగా క్రీడించగలిగాడు. శ్రీకృష్ణుడు కేవలం లీలా విగ్రహమేకాదు. లీలలో అంతటా, ఒక్కటే రూపం శ్రీకృష్ణుడు విలాసపురుషుడు కూడాను. ఒక్కటై యుండి కూడా, భిన్న భిన్న రూపాలలో ప్రకాశించగల చిద్ఘనుడు. నీవా పురుషుని ఇతరులకు గనబడిన రూపంలో జూడదలచుకొన్నావా, నీకు వాని సాక్షాత్కారం కాజాలదు. ఆ పురుషు

డారూపంలో నీ వాకిలి దగ్గరకువచ్చి నిలవబడినా, నీవుగుర్తించ లేవు. నీ స్వభావ ప్రతిష్ఠితమైన స్వానుభవమే నీ నిలయం. నీ రహస్య నిలయాని కా పరమపురుషు డేరూపంలో వస్తాడో, నీ స్వానుభవ ద్వారముననే వేచియుండుము. అప్పుడు నీవు వానిని గుర్తించి, వాని సౌందర్యామృతమును గ్రోల గల్గుదువు.

సోదరా, నీకూ ఈ జగత్తుకూ మధ్య నిరంతరం ఆదాన ప్రదాన లీల జరుగుతూనే ఉన్నదిసుమా. జగత్తునుండి నీ వేమి ఎంతెంత తీసుకొంటున్నావో, నీవు జగత్తుకు ఏమి ఎట్లు ఇస్తున్నావో నీకు తెలియదు. నీకు తెలియకుండానే నీలోపలా, నీ బయటా ఈ కేళి అతి చిత్ర విచిత్రంగా జరుగుతోంది. అందరి కేళివంటిదికాదు నీది. నీ కేళికి ప్రత్యేక రూపం ఉన్నది. ఈ జగత్తు నిన్ను సమీపించినట్లుగ, ఇంకొకరిని సమీపించదు. నీనుండి జగత్తు తీసుకొనేది ఇంకొక రియ్యగలినదికాదు. నీకూ నీ జగత్తుకూ మధ్యజరుగుతున్న లీలను నీవెప్పుడు తెలుసుకొంటావో సోదరా, అప్పుడు నీ ప్రాపంచిక జీవితంయొక్క రహస్యవిధానాన్ని గుర్తించి, ఆనందభరితుడ వవుతావు.

సోదరా, ఇది కేవలం నీ బాహ్యలీల. దీనికంటె అతి గంభీరమైనది, అత్యంత సుందరమైనది వేరే లీల నీలోపల జరుగుతున్నది. అది నీ అభ్యంతర లీలాభోగం. దీనిని నీవు బొత్తిగ గ్రహింపలేకున్నావు. ఈ ఆంతరంగికలీల ఎవరితో?

నీప్రాణేశ్వరునితో, నీ హృదయ నాథునితో, నీ ఆత్మవల్లభునితో. నీవనుకొంటున్నావు-ఈ అఖిల బ్రహ్మాండకోటిలో. నేనెంతవాడిని, నాకుకూడా ఒకప్రాముఖ్యం ఉన్నదాలని, ఆ,ఉన్నది. ప్రత్యేకస్థానమున్నది; ప్రత్యేకక్రీడకూడా ఉన్నది. నీవల్లభుడు నీదగ్గరకు ఇతరులదగ్గరకు వచ్చినట్లుగ వస్తాడని అనుకోక. నీ వల్లభుడు నీకు వ్రాసే ప్రణయలేఖలు వేరు. నీకు నిర్ణయించేసంకేతస్థలం, కాలంవేరు. నీవల్లభునకు నీవియ్యగలిగిన ఆనందం ఏ యితరభూత కోటీ ఇయ్యలేదు. జీవాత్మకూ పరమాత్మకుగల సంబంధం-అతి నిగూఢం. అతినిబిడం. అది భోక్తృభోగ్య సంబంధం - ఎవరు భోక్త? ఎవరుభోగ్యం? ఇది అన్యోన్యం విచిత్రగతుల జరిగే రహస్యసంభోగం. ఆ రహస్యం హ్లాదినీశక్తియగు రాధకు దెలుసు. రసిక శేఖరుడగు మాధవునకు దెలుసు. ఆ రహస్యక్రీడలో నీకునూ స్థానమున్నది. దానిలో పాల్గొనగలవు. సాక్షిగానూ నుండగలవు. అదెట్టిభాగ్యమోయి, సోదరా !

"అహో, విచిత్ర మే తత్!"

# దేహాత్మల ఘనిష సంబంధం

సోదరా, ఏమిటి నీరూపమూ నీవూను? మనస్సు ప్రధానంకాని బయటకు ఎట్లా ఉంటేనేమి అనా నీ యభిప్రాయం ? ఇది నిజంగా మిధ్యావైరాగ్యం సుమీ., నీవు నిశ్చయంగాజ్ఞానాన్ని, చిత్త శుద్ధిని, ఆత్మానందాన్ని కోరుతూ ఉంటే, నీవు దేహాన్ని ఇంత చులకనగా తోసివెయ్యవు. నీ శరీరాన్నే కాంతివంతంగా చేసుకోలేనివాడవు, నీ బుద్ధిని మాత్రం తేజోవంతంగా చేసుకోగల్గుతున్నా వంటే, నమ్మేదెట్లా? నిజంగా నీ ఆత్మలో సౌందర్యజ్యోతే వెలుగుతూంటే అది నీ శరీరంలో మాత్రం ప్రతిఫలించకుండా పోతుందా? నీవు వట్టి ప్రజ్ఞావాదం చేస్తున్నావే కాని, యధార్ధాన్ని గ్రహించడం లేదు.

నీ శరీరానికి నీ ఆత్మకు ఘనిష్ఠమైన సంబంధమున్నది. నీ శరీరాన్ని హింసించి, నీవు ఆత్మశాంతిని పొందలేవు. నీ మనస్సును వికారపెట్టుకొని, నీ దేహాన్ని శోభాయమానంగా చేసుకో లేవు. నీవు నిజంగా సంస్కారివీ, సాధకుడవూ కాదలచు కొంటే రెంటినీకూడా పదిలపరచుకోవాలి. శరీరం క్షణభంగురం కదా, దానిసౌఖ్యం అపేక్షించడం ఎందుకు అని ఉపేక్షించావా నీ ఆత్మను కూడా మరుగుపరచుకున్న వాడవవుతావు.

నీ మనస్సు నిజంగా నిర్మలంగా, తేజోవంతంగా ఉంటే ఎందుకు నీ రూపం ఇంత వికృతంగా ఉన్నది సోదరా? ఏమిటా డోక్కుపోయిన ముఖం, లోతుకుపోయిన ఆ కండ్లు, ఆకుచెప్పులలాగా చప్పిడిపోయిన ఆ దవడలు, వాచుకువచ్చిన ఆ ఉదరపొట్ట, ఆ ఊచకాళ్ళు, ఆ జిడ్డుకారే దేహం - ఎంత అనాకారంగా, ఎంత అసహ్యంగా ఉన్నావోయి! ఓ సోదరా, నిన్ను చూస్తే, ఎవరికైనా జుగుప్స కలుగుతుంది. నిన్ను "న్యూసెన్సు" నేరంక్రింద ఎందుకు దండించకూడదో చెప్పు. పైగా బాహ్యారూపం ఎట్లా ఉంటేనేమిలే అని మహా విరాగి వలె సమర్థించుకొంటావూ?

ప్రకృతి నీకు దేహం ఇచ్చింది, దానిని చంపుకోమనా? కాదు. దాని ద్వారా ఆత్మోన్నతిని పొందమని, నీకు అపూర్వమైన, అమూల్యమైన శరీరాన్నిచ్చింది. "శరీరమాద్యం ఖలు ధర్మసాధన"మ్మని, పెద్దలు చెప్పారంటే, వెర్రివాళ్ళయి చెప్పారనుకొన్నావా? శరీరాన్ని అమూల్య సాధనంగా వాడుకోమన్నారు. ఏ పనివాడైనా, తన పనిముట్లను సరిగా ఉంచుకోకపోతే, వాడేమి పని చెయ్యగలడు? వాని చేతిలో ఎంత కౌశలముంటే ఏమి? వాని పనిముట్టు పదునుగ, గట్టిగ ఉంచుకొంటేనే వాని పనితనం కనబడేది — వాడు సిద్ధహస్తుడు కాగలేదీని.

అట్లాగే, నీవు సిద్ధుడవు కావాలంటే, ముందు నీ శరీరాన్ని నీ ఆత్మ కనుకూలమైన సాధనంగా చేసుకోవాలి.

అంటే, నీ మనస్సుకు ఏ లక్షణాలైతే కోరుతావో, ఆ లక్షణాల కుపకరించేటట్లుగ ఉండాలి నీ శరీరం కూడాను. నీమనస్సు సాత్వికంగా, తేజోవంతంగా, సుందరంగా ఉండాలనుకొన్నావా, ఆ లక్షణాలు నీ శరీరంలో ముందు ప్రకాశించేటట్టు చేసుకోవాలి. లేకపోతే నీ శరీరం నీ ఆత్మోన్నతికి ప్రతిబంధకమవుతుంది. గీతాకారుడు చూడు, జ్ఞాని తన శరీరపోషణానికి ఎట్టి ఆహారం తీసుకోవాలన్నాడో :—

ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధా స్థిరాహృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః.

ఇది ఎంత చక్కని ఉపదేశమో ! ఈ ఉపదేశాన్ని ఆచరించిన వాని శరీరం ఎంత సుందరంగా, శోభాయమానంగా మెరిసిపోతూ ఉంటుందంటావు ? ఆయువు, జవం, బలం, ఆరోగ్యం, సుఖం, సంతోషం వృద్ధిపొందించే, షడ్రసోపేతమైన — నీ హృదయాన్ని పల్లవింపజేసే ఆహారాన్ని తినమన్నాడోయి. అవి తింటూంటేనే సుఖం, సంతోషం కలుగుతూంటే, తర్వాత వాని శరీరమెంత రమణీయంగా పరిమళిస్తుందంటావు ? గీతాకారుడు నీ శరీరాన్ని కుప్పకింపజేసుకొని, అనాకారిగ ఉండమని చెప్పాడా ? లేదే.

ఒక్క ఆహారవిషయంలోనే ఇంత చక్కని సలహా ఇస్తే, విహారాదుల విషయంలో ఎట్టి ఉద్బోధ చేసి ఉంటాడంటావు ? పుష్టిప్రదమైన సాత్వికాహారంతోబాటు, శౌచం, బ్రహ్మ

చర్యం, ఆర్జవం, అహింస మొదలగు విధులనుగూడా నిరూపించాడు. శరీరంయొక్క మూల్యాన్ని, పవిత్రతను తెలుసుకొన్నాడు కనుకనే, దాన్ని పోషణచేసే విధానాన్ని ఇంత విపులంగా వివరించాడు,

దేహాన్ని శుచిగా ఉంచుకోమన్నాడు, నీ శరీరానికివలె దుర్గంధపూరితంగా ఉంచుకోమనలేదు. శుచి కావాలన్నాడు — శుచి అంటే అభ్యంగనాదులచేత నిర్మలంగా చేసుకోవడమే కాదు. అది స్ఫటికంవలె ప్రకాశమానంగా ఉండాలని వాని బోధ. నరాల కుద్వేగం కలిగించకూడదు. నీ ఇంద్రియాలు మలిన విషయాలపై ప్రసరింపరాదు, నీ అంగప్రత్యంగములు శుచికరమైన వస్తువులతో సంపర్కం కలిగి ఉండాలి. శరీరాన్ని ఎవ్విధంగాను మైలపరచకూడదని దానిభావం. శుచి అయిన వస్త్రధారణం, శుచి అయిన నివాసం, శుచితోగూడిన పరికరాలు, శుచిని పోషించే కర్మలు — వీనిని పొందాలి. అప్పుడే దేహానికి శౌచలక్షణం సార్థకమవుతుంది.

బ్రహ్మచర్యం, అహింసాకూడా చేర్చాడు ఆరోగ్య విధులలో. ఆశ్చర్యకరం ! శరీరానికీ మనస్సుకూగల సంబంధం ఘనిష్ఠమైనదని గీతాకారుడు తెలుసుకొన్నాడు కనుకనే, మనస్సుకు మాత్రమే సంబంధించినట్లుగ కనబడే బ్రహ్మచర్యం, అహింసా లక్షణాలను శరీరానికికూడా విధించాడు. బ్రహ్మచర్యమంటే, కామసంబంధమైన శారీరిక కర్మలను నిగ్రహంలో

ఉంచడం. నీ ఇంద్రియాలెప్పుడూ వ్యామోహాన్ని ఉద్రేకించే విషయాలమీదకు పరుగెడుతూ ఉంటాయి. నగ్న స్త్రీ చిత్రబింబాలను చూస్తూండడం, కామక్రీడ వర్ణనలను చదువుతూండడం – మనస్సును వికలపరచే తలంపులను స్మరణ చేస్తూండడం మొదలగు వ్యాపారాదులవల్ల, నీ నరాలలో ఉద్వేగం బయలుదేరుతుంది. నీ ఇంద్రియాలకు ఒక విధమైన మైకం కమ్ముతుంది. శరీరంలో ఒక అపూర్వమైన సంక్షోభం బయలుదేరి, ఆరోగ్యాన్ని భంగపరచడమేకాక, దానికూర్పును పొందికను, తూకాన్ని, ఆర్జవాన్ని, శుచిని, భగ్నంచేస్తాయి. కాబట్టి నీ శరీరాన్ని తేజోవంతంగా చేసుకోవాలంటే, వీర్యాన్ని గుప్తంగా పదిలపరచుకొని, ఊర్ధ్వరేతస్కుడవు కావాలి. వీర్యాన్ని నష్టపరచుకొన్నావా, ఇంద్రియపటుత్వమూ, మేధాపటిమకూడ నష్టపరచు కొంటున్నావన్న మాట. అందుకనే, గీతాకారుడు శరీరవిధులలో బ్రహ్మచర్యం అవశ్యాచరణీయ మన్నాడు. బ్రహ్మచర్యమంటే కేవలం అవివాహితుడుగ ఉండమనికాదు. విశృంఖల సంచారం కూడదని దాని అర్థం. కామలోలుడవై ఉండకూడదన్నమాట. శారీరిక ప్రవృత్తులను నీతి నియమాలలో ఉంచవలసి ఉంటుంది. బ్రహ్మచర్యం మూలంగా శరీరానికి అపూర్వమైన వర్చస్సు వస్తుంది. దేహకాంతి బంగారం వలె మెరుస్తుంది. శరీరశోభకోసమైనా బ్రహ్మచర్యం అవసరం.

శరీరవిధులలో అహింసనుకూడా గీతాకారుడు చేర్చడం నీకు ఆశ్చర్యకరంగా ఉండవచ్చు. శరీర పోషణఅంటే, నీలోని

పంచభూతాలకు ప్రాణప్రతిష్ఠ చేయడమన్నమాట. తోడి ప్రాణులను హింసించేవాడు తన శరీరానికిమాత్రం ప్రాణ ప్రతిష్ఠ ఎట్లాచేయగలడు? సమస్త ప్రాణులలోఉండే చైతన్యం ఒకటే అనే జ్ఞానం నీలో ఉదయించినప్పుడు, నీ మనస్సుకే కాకుండా నీ ప్రాణానికికూడా పుష్టి, తుష్టి కలుగుతుంది. నీ శరీరంలోఉండే ప్రతిజీవకణం యథార్థానికి ప్రాణవిలసనంతో కలసి వర్తిస్తూనే ఉన్నది. నీ శ్వాసకోశాలాడుతున్నాయంటే, నీ హృదయం నిరంతరం స్పందిస్తున్నదంటే, నీ నాళాలలో రక్తం చిందులు తొక్కుతూ ప్రవహిస్తున్నదంటే, నీ కరచరణాద్యవయవములు వాని వాని చేష్టలను నిర్వహిస్తున్నాయంటే, నీ ఇంద్రియాలు జగత్ప్రవాహ తరంగాలపై ఆడుతున్నాయంటే, నీ శరీరం విశ్వప్రాణవిలసనంలో పాల్గొంటున్నదన్నమాటకాదూ? ఆ విశ్వప్రాణాని కెప్పుడు ఏ మూల విఘాతంకలిగినా, ఆ దెబ్బ నీ శరీరందాకా వ్యాపిస్తుందంటే ఆశ్చర్యమేమి?

ఇది నమ్మతగ్గ విషయం కాదంటావా? నీవెప్పుడూ ఆ విషయం ప్రత్యక్షంగా చూడక పోవడంవల్ల, అది నీకు నమ్మ తగినదిగ కనబడడంలేదు. ఇది భౌతికంగా కూడా నిజమని చెప్పడానికి అనేక నిదర్శనాలున్నాయి. ఎక్కడో దూరాన ఒక ఫిరంగి ప్రేలితే, దాని అదురుడుకు నీ యింటిలోని తలుపులు కదలడం చూచే ఉంటావు. రైలు గబగబా పరుగెత్తుతూంటే, రైలుస్టేషను కదిలిపోతూండడం నీ కనుభవమైన

విషయమే. ఆ అదురుడు భూమిమీదా, గాలిమీదా, 'వైబ్రేషన్సు' మూలంగా వ్యాపిస్తుందని నీవు దానికి సమాధానం చెప్పుతావు. కాని ఎక్కడో ఒక ప్రాణికి బాధకలిగితే, ఆ బాధ నీ ప్రాణంవరకూ వ్యాపిస్తుందా అని నీప్రశ్న.

నీ ప్రాణం, నా ప్రాణం అనే విభాగాలు నిజంగా లేవు. అవి మనం వ్యావహారికంగా కల్పించుకొన్నవే కాని, వేరు కావు. విశ్వంలోని ప్రాణమంతా ఒకటే; నీ ప్రాణం ఆ ప్రాణ సాగరంలోని ఒక తరంగం. ఈ తరంగమాలికలన్నీ లోపలా బయటాకూడా కలిసే ఆడుతున్నాయి. మనశరీరాలు బండబారి ఉండడంవల్ల, మన ఇంద్రియానుభూతి సూక్ష్మంగా వికసించక పోవడంవల్ల, విశ్వంలోని ప్రాణవిలసనంయొక్క స్పర్శను మనం సమానంగా అనుభవించడం లేదు. కాని, మన మనుభవించనంత మాత్రాన దాని ఐక్యతకు భంగం కలుగదు. కొన్ని సన్నిహిత విషయాలలో మాత్రం ఆ స్పర్శ ననుభవిస్తాం, నీ అనుంగుబిడ్డ నెవరైనా కొట్టుతున్నారంటే, ఆ పిల్లవాని శరీరంమీద పడ్డదెబ్బలు నీమీద పడ్డట్టే బాధపడుతావు. నీ బండ శరీరం కూడా ప్రేమకు వశమై, తోడిప్రాణియొక్క సుఖదుఃఖాలను సమంగా అనుభవించగల్గుతున్నది. గీతాకారుని ఉద్దేశం, నీ బండబారిన శరీరాన్ని సమస్త ప్రాణులలోని విలసనాన్ని అనుభవించేటంత సుకుమారంగా చేసుకోమని.

తీగలు వదులైన తంబురా నెంతమీటినా పలుకదు. శృతిని సరిపుచ్చావా, దానిపై ఒక ఈగ వాలినా, ఆ తీగలు ఝుంకారం చేస్తాయి. భక్తుల శరీరా లట్టివి. ఒక శిష్యుడు ఇంటిలో ప్రవేశించిన గేదెను కర్రతో బాదుతున్నాడట. దీనిని కనిపెట్టుతున్న భక్తుడు అబ్బా అంటూ క్రిందపడిపోయి నాడట. ఏమిటా అని చూస్తే, వాని వంటిపై దెబ్బలు తేలి ఉన్నాయి. గేదె వంటిమీదపడ్డ దెబ్బలు భక్తుని శరీరం వరకూ ఎట్లా వ్యాపించాయి ? భక్తుని శరీరం బహు సాత్వికమైనది. వాని శరీరంలోని ప్రతిజీవకణం ప్రేమరసార్ద్రి భూతమై ఉన్నది. ఎక్కడ భూతతృప్తి కలిగినా, వానిశరీరం సుఖిస్తుంది. ఏ భూతానికి దుఃఖం కలిగినా, వాని శరీరం దుఃఖిస్తుంది. వాని శరీర మెట్టిదంటావు ? రసస్నిగ్ధమైన శరీరమది. వాని నేత్రాలు దయారస సంకలితాలు. వాని అధరముల నుండి ప్రేమామృతం స్రవిస్తూంటుంది. వాని బాహువుల ఆలింగనానికి పోయిన ప్రాణాలు లేచివస్తాయి. అట్టి శరీరాన్ని సాధించుకో అని గీతాకారుడు ప్రబోధిస్తున్నాడు.

సోదరా, శరీరానికి ఆత్మకూ గల సంబంధం ఎంత దట్ట మైనదో ఇప్పుడైనా గ్రహించు. నీ శరీరానికి నీ ఆత్మకూ గల భేదం నీ సాత్త్విక సాధనవల్ల అంతకంతకు తగ్గిపోతుంది. నీ శరీ రానికి గూడ నీ ఆత్మలక్షణా లలవడుతాయి. నీ మనస్సులోని సౌమ్యత, ప్రసన్నత, భావసంశుద్ధి, నీ శరీరంలో క్రమంగా ఫలించక తప్పవు. తల్లి తన ఒడిలోని శిశువును ముద్దాడుతున్న

ప్పుడు కలిగే వాత్సల్యం ఎట్టిది ? ఆ వాత్సల్య రసానుభూతి కేవలం మానసికమే కాదు. ఉభయుల శరీరాలు కూడా వాత్సల్యరససిక్తములై పోతాయి. ఇదివట్టి ఉత్ప్రేక్ష కాదు. యథార్థం. శారీరక ప్రవృత్తులన్నీ రససిక్తములు కాగల అవస్థ వున్నది. నాయికానాయకుల ప్రణయలీలలు ఎంతవరకు మానసికములు, ఎంతవరకు శారీరకములు అని నిశ్చయం చేయ గలం ? వారి శరీరాలుకూడ భావాత్మకములై పోతాయని అంగీకరింపక తప్పదు.

ఆత్మ తన సౌందర్యాన్ని క్రమక్రమంగా దేహానికి కూడా సంక్రమింపజేసి, ఇంద్రియానుభూతి ద్వారా కూడా తన పరిపూర్ణతను పొందగలదు. మన శరీరాలు మలినములై ఉండడంచేత ఆత్మసౌందర్యం వానిలో ప్రవేశించడంలేదు. గ్లోబు మసిపారితే, లోపల దీపం వెలుగుతున్నా, దానికాంతి బయటకురాదు. గ్లోబును శుభ్రపరచి, నిర్మలంగా చెయ్యి. అప్పుడు దీపంయొక్క కాంతి బయటకు రావడమే కాకుండా, గ్లోబునంతా కాంతిమయంగా చేస్తుంది. గ్లోబుయొక్క గాజుకు గూడ ప్రకాశత్వం వచ్చినట్లే, శరీరానికిగూడ ఆత్మప్రకాశత్వం రాగలదు, సోదరా, నీ శరీరాన్ని ఆత్మమయంగా చేసుకొని, ఇంద్రియ ద్వారములగుండా కూడా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందు అని గీతకారుడు బోధిస్తున్నాడు. శరీరంమాత్రం ఆనందోద్భవం కాదూ ?

సోదరా, నీవెందుకు తీర్థయాత్రలుచేస్తూ, దేవాలయాలకుపోయి, ఆ రాతివిగ్రహాలను అర్చిస్తావు? ఆ రాతివిగ్రహం కంటె, నీ శరీరం సచేతనమైన దేవతావిగ్రహం కాదూ? దీనికెందుకు షోడశోపచారాలుచేసి, భక్తిరస సింధువులో ఓలలాడవు? నీ దేహంకంటె పవిత్రమైన దేవాలయమేది? దేవాలయమేమిటి—సాక్షాత్తు శ్రీమన్నారాయణుని విగ్రహం. ఆ నిఖిల రసామృతమూర్తి తన సృష్టిని అనుభవించుకోడానికి, నీ తనువు నాశ్రయించి, జీవుడుగ విరాజమానుడవుతున్నాడు. జాగ్రత్త, ఈ దేవాలయాన్ని మైలపరుపకు. నీ శరీరాన్ని సాత్వికంగాచేసే ఆహారాన్ని స్వీకరిస్తూ, ఆర్జవం, శౌచం, బ్రహ్మచర్యం, అహింస, మనః ప్రసాదం, సౌమ్యత్వం భావసంశుద్ధి మొదలగు అభ్యాసాలతో దానిని శుద్ధిపరచి, అందు ఆ నిఖిలరసామృత మూర్తిని ప్రతిష్ఠించు. నీ శరీరంలో ఇంతవరకూ అభివ్యక్తం కాని ఆనందం వెల్లువై తరంగితమవుతుంది.

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే"

# మౌనసాధన

సోదరా, ఎందుకు నీ నోటికి అంత దురద? నోరున్నది కదా అని పారిద్ధ స్తమానం, అట్లా వదరుతూండవలసినదేనా? కొంచెంసేపు కూడా నీ అంకెళ్ళు మూతపడవల్లె ఉన్నదే. అంత వదురుబోతుతనం పనికిరాదు సుమీ.

అదంతా బోళాతనం అనుకొంటున్నావు కాబోలు. "పాపం అతను కడుపులో ఏమీ ఉంచుకోడు – ఎప్పటికప్పుడు, కక్కేస్తాడు"—అని లోకం నిన్నభినందిస్తుంది కదా అని నీ అభిప్రాయం!

బోళాతనం అంటే, వదురుబోతుతనమనా? నీవు వదరే దానిలో ఎంత సత్యమున్నదీ నీకు తెలియదూ? ముప్పాతిక మువ్వీసం పాల్లేగా? మన నోటంబడి వచ్చేదంతా సత్యమే అయితే, లోకం ఈపాటికి సత్యంతో నిండిపోయేది.

సత్యం వెల్లడించడానికి ఇన్నిమాట లవసరంలేదు. వెలుగుకు టమటమా వాయించాలా? తనకు తానే నిశ్శబ్దంగా,

వెల్లడి చేసుకొంటుంది, వెలుతురు. మీదపడేటంతవరకూ దాని రాక మనకు తెలియదు.

వెలుగు పడేటప్పటికల్లా, పువ్వులెట్లా తెరుచుకొంటాయో ! గూళ్ళల్లోని చిలుకలుకూడా ఎట్లా కిలకిలలాడుతూ బయటకు వస్తాయో ! ప్రపంచాన్నంతా మేలుకొలుపుతుంది వెలుతురు—ఎంత నెమ్మదిగ అది మనలను స్పర్శిస్తుందంటావు ? తల్లి బిడ్డను స్పృశించినట్లుగ స్పృశిస్తుంది. దాని సౌఖ్యమంతా దాని నిశ్చలమైన మృదుత్వంలో ఉన్నది.

నీ వనుకొంటావు, ఎంత ఉరిమితే, ఎంత కంకితే, ఎంత శబ్దజాలం ప్రయోగిస్తే, అంతగా సత్యం వెల్లడి అవుతుందని. మాటలు సత్యాన్ని వెల్లడి చేయలేవు. పైగా మరుగుచేస్తాయి. సామాన్యంగా మన మాటలువట్టి నురుగులు, వట్టిపొగలు – మన అహంకారంలోనుండి బయలుదేరే బడాయికోరుమాటలవి.

మనం సాధారణంగా నాలుక చివరనుండి మాట్లాడుతాం, నాలుక తనంతట తానే ఆడుతూంటుంది. వదరుబోతుతనం దాని కలవాటయిపోయింది. ఒకప్పుడు కడుపులోనుండి మాటలు బయలుదేరే మాట నిశ్చయమే. ఎప్పుడు ? కడుపు నిండా విషంఉంటే - కోపమో, క్రోధమో, అసహనమో తీవ్రిస్తే, మన నాలుకే కత్తివాటువలె, ఇతరులను గాయపరచ

డానికి విజృంభిస్తుంది. మన నోటినుండి వెలువడేమాటల్లో, ఇతరులను దూషించనివీ, పరుల మనస్సుకు నొప్పి కల్గించనివీ ఎన్నోవంతు ఉంటాయో, ఒకమారు ఆలోచించుకో సోదరా !

ఇక ఇతరుల దుఃఖభారాన్ని తగ్గించేవి, శాంత పరచేవి, సుఖం ఇచ్చేవి, – నూరోవంతైనా ఉంటాయీ ? మన హృదయంలో దయ, సత్యం, శౌచం ఉంటేగా, మన మాటల్లో గూడా అవి వెల్లడి అయి, ఇతరులకు నెమ్మది చేకూర్చగల్గేది. దయ వెల్లడి కావడానికి మాటలవసరమా? ఒక అశ్రుకణం, ఒక చూపు, ఒక నిట్టూర్పు, ఒక హస్తస్పర్శ ఉపశమనం చేసేటంతగా వాక్కు చేయగలదా ? ఇంగ్లీషులో ఒక సామెత వినలేదూ ?—ఖాళీ గిన్నెలు ఎక్కువ చప్పుడు చేస్తాయని. మనం వాగే వాగుడంతా చాలవరకు ఆ ఖాళీచప్పుడే.

మన మెంత తక్కువ వాగితే లోకానికీ మనకూ అంత ఉపకారం చేసిన వారమవుతాం. సోదరా, ముందు నీ సంగతి చూచుకో. ముందు నీ మరమ్మతు చూచుకొన్న తర్వాత, లోకాన్ని మరమ్మతు చేద్దువుకాని. నీ నోటినే నీవు కట్టుకోలేనివాడవు, ప్రపంచానికి ఏమి కట్టుబాటులు చేద్దామని ప్రచారకుడవుగా బయలుదేరావు ? నీ యింద్రియాలే నీ వశంలో లేవు. ఇక లోకాన్నా నీవు నీ వశంలోకి తెచ్చుకోగల్గేది ? సోదరా, ఈ దంబాలు కట్టిపెట్టు. నోరు మంచిదైతే లోకమంతా మంచి అవుతుంది అని పెద్దలు చెప్పినమాట అబద్ధమా ? నోరు

మంచి కావడమంటే ఏమిటి ? నిందాభాషణాలను, దంభోక్తులను, అనవసర ప్రసంగాలను, మోసపుమాటలను కట్టిపెట్టితే చాలు నీ నోరు మంచి కావడానికి ? వాక్స్వాతంత్ర్యం కావాలని పోరాడుతావు—దేనికి ? ఇతరులమీద మాటలను విసరడానికేగా, సోదరా.

నీవు బాగుపడాలంటే, ముందుగ నీవు గట్టిగ అభ్యసించవలసిన విద్య ఒకటి ఉన్నది. అదేమిటంటావా? మౌనం—మౌనమంటే మూగనోము పట్టమంటున్నానని అనుకొంటున్నావేమో. కాదు. అనవసర వాగ్ధోరణిని కట్టిపెట్టడమన్నమాట - పల్లెత్తిమాట ఎవరినీ అనని ఒట్టుపెట్టుకోవడమన్నమాట, తెలియని విషయాలను తెలిసినట్లుగ మాట్లాడకూడదన్నమాట. నీకు నీ మిత్రులు రహస్యంగా చెప్పిన మాటలను బయటకు చెప్పకూడదన్నమాట, మాటకుమాట ఎదురు ఆడకూడదన్నమాట. వితండవాదం చేయరాదన్నమాట. మన వాగింద్రియం ఎన్ని తప్పుత్రోవలను త్రొక్కుతూంటుందో నీ వెప్పుడూ పరీక్షించుకొని వుండవు. నీ కర్మేంద్రియాల్లోకాని నీ జ్ఞానేంద్రియాల్లోకాని ఏదీ నీ వాగింద్రియంచేసేటంత చెరుపు చేయలేదు. కాలుజారితే తీసుకోవచ్చును గాని పెదవిజారితే తీసుకోలేమని పెద్దలూరికే చెప్పారా ?

భగవంతుడు నీకు రెండు కళ్ళిచ్చాడు, రెండు చెవులిచ్చాడు. కాని నాలుకమాత్రం ఒకటే ఇచ్చాడు. ఆ నాలు

కకు కూడా ఆహారం తినేపని పెట్టాడు. దీనినిబట్టి ఏమి తెలుస్తోంది ? నీవు చూచేదానికన్న, వినేదానికన్న, నీ కాళ్ళతోను చేతులతోను చేసేదానికన్న, ఎన్నోవంతులు తక్కువగ మాట్లాడాలని. మితాహారం శరీరారోగ్యాని కెంత అవసరమో, మిత వాక్కు నీ చిత్తశుద్ధి కంతకంటెకూడ అవసరమని తెలుసుకో, సోదరా.

వేదాంతులు నిగ్రహాన్నిగూర్చి ఎంతో బోధిస్తారు. కాని నిగ్రహాన్ని ముందు ఎక్కడ ప్రారంభించాలో చెప్పరు. అన్ని ఇంద్రియాలను నిగ్రహించుకోవలసినమాట నిశ్చయమే. కాని నీ మనస్సుకు ఇంద్రియాలను స్వాధీనం చేసుకోవడమేగా నిగ్రహం. అయితే నీ మనస్సే దుడుకుగాఉంటే, దారీ తెన్నూ లేకుండా పరిభ్రమిస్తూంటే, నీ ఇంద్రియాలను నిగ్రహించేదెట్లా? నీమనస్సును నీ ఇంద్రియాలను ఒక్కసూత్రంతో కట్టేఉపాయం ఒకటి కనపడితే, దాని నవలంబించి, రెంటిని ఒకేమారుగ సాధించవచ్చు. ఆ ఉపాయం నీ వాఙ్నియమంలో సులభంగా దొరుకుతుంది, నీవు కొంచెంలోతుగ ఆలోచించుకొంటే, ఒక్క బాణంతో రెండుపక్షుల నొకేమారుగ కొట్టే ఉపాయమది. నీవు వాఙ్నియమానికి పూనుకొన్నావంటే. నీ మనస్సును, నీ నాలుకనూ ఒకమారుగ నిగ్రహింప చూచుకొంటున్నావన్న మాట. అందుకనే సాధకులు ముందు మౌనవ్రతంతో సాధనను ప్రారంభిస్తారు.

నీవు స్వారిచేసే గుఱ్ఱం పొగరుమోతుదనుకో. దానిని నీ స్వాధీనంలోకి తెచ్చుకోవాలంటే ఏమి చేస్తావు ? నాలుగు కాళ్ళు కట్టేశావా, అది కదలనేలేదు. దానికి తిండిలేకుండా ఎండపెట్టావా, అది నీ స్వారికే పనికిరాదు. దాని నోటికి కళ్ళెం పెట్టితే, ఎంత పొగరుమోతు గుఱ్ఱమైనా, నీవు చెప్పినట్లు వింటుంది. అట్లాగే నీ నోటికి మౌనమనే కళ్ళెం తగిలించావా ? నీ మనస్సుయొక్క దుడుకుతనం చాలవరకు తగ్గిపోతుంది. ఆ నోటి కళ్ళెం నీ మనస్సుకు గూడా కళ్లెంవలె పనిచేస్తుంది. వాఙ్నియమాన్ని అవలంబించి చూడు, అది నీ ఆత్మోన్నతి కెంత సహాయకారో నీ అనుభవంవల్ల నీవే తెలుసుకొంటావు.

ఆత్మోన్నతిని సాధించాలనుకొన్నవాడు ముందుగ ధర్మప్రసంగాలను కట్టిపెట్టాలి. నీకు కొంత వేదాంతమో, భక్తో అలవడేటప్పటికల్లా నీవు జ్ఞానివలె, భక్తునివలె కనపడాలనే కోరిక బయలుదేరుతుంది. ఎందుకనీ ? నీవు తక్కినవాళ్ళవలె పామరుడను కాననీ, చాల భక్తిపరుడననీ లోకం గమనించాలని నీ కోరిక. అందుకనే, ధర్మప్రసంగాలు తరుచుగ చేస్తూండడం, బహిరంగంగా ప్రార్థన గీతాలు పాడుతూండడం, వేషభాషలలో నీ ఆధిక్యమును ప్రదర్శించుకోవడం తటస్థిస్తుంది. ఈ ప్రదర్శనమంత హానికరమైనది ఇంకొకటిలేదు. నీకు నిజమైన భక్తి ఉంటే అట్లా లోకానికి చాటుకోవు. ఏ సాధ్వి అయినా, తన పెనిమిటి పేరును బయటకు చెప్పుతుందా ? అది ఆమె

హృదయంలోని గుప్తధనం. చంద్రమతీ దేవియొక్క మంగళ సూత్రంకూడా పెనిమిటికితప్ప ఇతరులకు కనపడేదికాదట ! ఎట్టి ప్రణయగంభీరత ?

చూడు, గురూపదేశం ఎంత రహస్యమో. గురువు నీ చెవిలో ఊదుతాడేకాని, ఆ మంత్రాన్ని బయటకు చాటడు. మంత్రాన్ని ఎంత రహస్యంగా జపిస్తే, అది నీ కంత జ్ఞానాన్ని స్తుంద. గాయత్రీ మంత్రాన్ని ఎంత రహస్యంగా జపిస్తారు సాధకులు ? వాక్కు ప్రాణాన్ని బయటకు పంపివేస్తుంది. నీ శక్తిని నీవు పదిలపరచుకోవాలంటే, దానిని లోపల స్తంభింపజేయాలి. ఆవిరిని మూతలేకుండా వదిలివేస్తే, దానికి బలమేమున్నది ? దానిని కూడపెట్టి, నొక్కి ఉంచితేనే, అది రైళ్ళనుగూడా లాగివేయగల్గుతుంది. అట్లాగే నీ ఆత్మ మర్మాన్ని ప్రగల్భంతో ప్రదర్శించుకొన్నావా, అది నిన్ను విడిచి, దుర్బలునిగ చేసి వేస్తుంది. కాబట్టి సోదరా, నీ ఆత్మను గోప్యంగా ఉంచుకొనే శమదమాదుల నవలంబించు.

వెనుక ఒక రాజు ఉండేవాడు. వాని నోటివెంబడి ఎప్పుడూ "హరి" అనే నామోచ్చారణమే వినబడేదికాదు. వానిసతీమణి చాల భక్తురాలు. ఎప్పుడూ భజనలు చేస్తూండేది. నోములు వ్రతాలు, దానాలు చేస్తూండేది. ఆమెకొకటేకోరిక. రాజుగారుకూడా తనవలె భక్తుడు కావాలని. ఎప్పుడైనా వానినోట "హరి" అనే దివ్యనామం వెలువడుతుందా అని దానికొరకు ఎన్ని మ్రొక్కులో మ్రొక్కుకొన్నది.

ఒకరోజున రాణి రాజధానినంతా అలంకరించమని చాటింది. పౌరులందరూ ఇంటింటికి తోరణాలు కట్టుతున్నారు, గోడలకు సున్నాలు కొట్టుతున్నారు. గడపలకు పసుపు కుంకాలు పెట్టుతున్నారు. బీదలకు అన్నప్రదానం జరుగుతున్నది. ప్రతి గుడిలోను అర్చనలు, భజనలు, అలంకారాలు వైభవంగా జరుగుతున్నాయి. రాజుగారికి తెలిసిందికాదు, నాకు అంత ఉత్సవం జరగడానికి కారణమేమై ఉంటుందో అని. రాణివాసంలోకివచ్చి, అడిగారు ఈ ఉత్సవం ఎందు నిమిత్తమని? రాణి ఏమి జవాబు చెప్పింది ?

స్వామీ, ఎన్నాళ్ళనుండో మొక్కుకొంటున్నాను, మీ నోటినుండి ఎప్పుడు ఆ ద్వారకావాసుని దివ్యనామాన్ని వినగల్గుతానోనని. నా నోము ఫలించింది. గత రాత్రి నిదురలో మీరు "కృష్ణా" అని సంబోధించారు. ఇక నా ఆనందానికి మేరలేదు. కృతజ్ఞతతో ఈ రోజున పౌరులచేత ఈ ఉత్సవం చేయిస్తున్నాను."

అని రాణి చెప్పేటప్పటికి రాజుగారు నిశ్చేష్టుడై నేనెంత పతితుడనైతిని అని కండ్లలో నీరునింపుకొన్నాడు, ఎంతకాలంనుండో ఆ దివ్యనామాన్ని నా హృదయధనంగా కాపాడుకొంటూ వస్తున్నాను. గతరాత్రికి నా వ్రతం భంగమైంది. స్వప్నంలో నా నిగ్రహం సడలినందున, నా ఆత్మమర్మం బయటపడింది. దీనికి ప్రాయశ్చిత్తముగ నేడు నిరాహారినై ఏకాంతవాసము చేసెదనని చెప్పి, తోటలోకి వెడలినాడు.

సోదరా, ఎట్టిదంటావు ఈ రాజుగారి భక్తిగరిమ ? ఆ రాజుగారి హృదయం అగాధం. దానిలోతు ఇతరుల కెట్లు తెలియగలదు?

మౌనంలోగాని నీ వట్టి లోతులలోకి పోలేవు. అది మాటల కందని లోతు, తలపులుకూడ జేరనిలోతు–శబ్దబ్రహ్మాతి వర్తతే— భావాతీతమైన నిరతిశయశాంతపదమది. శాంతిసమాహితచిత్తులైన మౌనవ్రతులకే లభ్యమది. సోదరా, లోకం యొక్క కాకిగోలలో చిక్కుకొని, శబ్దజాలములోనే నీ ఆత్మోన్నతిని బడయగోరి, ఆత్మవంచకుడ వవుతున్నావు. ఈ శబ్దమయ ప్రపంచంలో తిరుగుతున్నంతకాలం నీకు సత్యం గోచరించదు. నీవు శృతి విప్రతిపన్నుడవై సత్యానికి దూరమైపోతావు, మరలుము, ఈ బాహ్యామునుండి, ఈ వాఙ్మయమునుండి, ఈ వాదాలనుండి, ఈ తర్క మీమాంసలనుండి, నీ బుద్ధీంద్రియం నుండి—లోపలకు ఇంకను లోపలకు, కేవలం గర్భగోళంలోకి పో....ఏమి వెలుగది ? ఎట్టి నిరామయమైన శాంతమది ? నీ ఉనికే క్షీరఖండంవలె కరగిపోయే రసస్రోతమది. మధుపమవై రసపానంచేసి, ఉన్మత్తుడవు కమ్ము.

"మౌనం చైవాస్మి గుహ్యానాం—"

# నిర్లిప్తత

సోదరా, నీ మొగం చూస్తే, రాత్రి నీకు నిదురపట్టినట్లులేదు. ఎప్పుడూ ఏదో బాధపడుతున్నట్లు కనబడతావు. ముఖం చిట్లించుకోవడం, ధుమధుమలాడుతూండడం. నీతో మాట్లాడ వచ్చిన వాళ్ళమీద కసురుకోవడం, దిక్కులు చూస్తూండడం, అలసిసొలసి పోతూన్నట్లుండడం - చూస్తే నీలోపల ఎప్పుడూ ఏదో కళవళ లాడుతూన్నట్లు తోస్తుంది. ఏమిటా బాధ ?

నిజమే, తాపత్రయా లెవరి కుండవు ? శరీరమున్న తర్వాత, ఏవో శరీరబాధ లుంటూంటాయి. మనస్సున్న తర్వాత, ఏవో కోరిక లుంటూండడం, అవి నెరవేరకపోవడం ఉంటూంటుంది. సంసారం, సంఘం, దేశం ఉన్నతర్వాత, మనస్సుకు విసుగు పుట్టించే కష్టాలు, నష్టాలూ రాకుండా ఉంటాయా ? వానిని సహించి, సంతృప్తితో నెమ్మదిగ ఉండాలి కాని, అట్లా ఆందోళన పడుతూంటే ఏమిలాభం ? ఏమిసుఖం ?

పైగా నీ దగ్గరకువచ్చిన వాళ్ళనుకూడా ఏమీ తోచకుండా చేస్తావు. నీవు బాధపడడమేకాకుండా, ఇతరులకుకూడా బాధ కలిగిస్తూంటే, నీబాధ తగ్గుతుందా ? పైగా హెచ్చుతుంది. అది నీకూ హింసే, ఇతరులకూ హింసే.

నీ వెన్నిచదువులో చదివావుకదా, లోకాన్నంతా చూస్తున్నవాడవుకదా, మహాపురుషుల జీవిత చరిత్రలుకూడా చదివావే ఇంత జ్ఞానం సంపాదించిన ప్రయోజనమేమి ? నీ హృదయాన్ని చిక్కబట్టుకోలేకపోతే, మనోధైర్యం అవలంబించలేకపోతే, తుదకు ఓరిమికూడా లేకపోతే, నీ బ్రతుకువల్ల ప్రయోజనమేమిటంట ?

నీవు పట్టిదుర్బలుడనన్నమాట. "నావి అందరి కష్టాల వంటివికావు, నావి భరింపరానివి" అని విలపించడం దేనికి ? ఎవరికి వారు అట్లాగే అనుకొంటారు. నీలో చిత్తస్థైర్యముంటే, ఈ కష్టాలేమిచేస్తాయి ? ఈ నష్టాలేమిచేస్తాయి ? నీవు మరీ సంక్షోభపడుతూ కూర్చున్నావంటె, నీకు పిచ్చైనాపట్టుతుంది. లేక ఏదో ఒకరాత్రి ఏనుయ్యో, గొయ్యో చూచుకొంటావు. అంతగా అయితే, ఎవరి సలహాయో విని, త్రాగుడు అలవాటు చేసుకుంటావు. త్రాగుడు మూలంగా, కష్టాలు మరపుకు వస్తాయని.

ఇది పురుషలక్షణంకాదు. సంస్కారి లక్షణం అకతకంటెనూ కాదు, నీవు పురుషుడవైనందుకు, సంస్కారివైనం

దుకు, ధీరవృత్తి కలిగిఉండాలి, ధీరవృత్తి నలవరచుకోలేవాళ్ళతో జీవితం విలువ ఒక్క పైసాకూడా చెయ్యదు. ఎన్నికష్టాలైనా రానీ, కొండవిరిగి మీదపడనీ, ధీరుడు చలించడు, గాంభీర్యం వదలడు. శాంతం వీడడు నిండుకుండ తొణుకుతుందా? తొణ కదు ధీరుని లక్షణం అట్టి నిశ్చలతత్వం.

సోదరా, నీవనుకోంటావు. ధీరుడు కఠిన హృద యుడై ఉంటాడనీ, జాలి, దయ, దాక్షిణ్యం ఎరగడనీ, వాని శరీరం ఎండిన కట్టెలనీ, వానిమనస్సు జీవంలేని పాషాణమనీ, అందుచేత, ధైర్యంగా ఉన్నట్లు కనబడతాడనీ. ఇది వట్టిమాట. లోకంలో కఠినచిత్తు లుండేమాట నిశ్చయమే. కాని వారి కఠినచిత్తం ఇతరుల విషయాల్లోగాని, తమకు కష్టం వచ్చేటప్ప టికి, నీళ్ళల్లే కారిపోతారు. నీ గుండెను రాయిచేసుకోమని చెప్పుతున్నా ననుకున్నావా? లేదు.

నిజమే కొందరు "స్టోయిక్కు" లనేవారుంటారు. ఇత రుల విషయాల్లోనే కాకుండా, స్వవిషయాల్లోగూడా తమ గుండెను రాయిగా జేసుకొంటారు, వారిది నిజంగా రాతిగుండె. బాధలను సహించే నిగ్రహంకోరకు, కొన్ని విచిత్రమైన అభ్యా సాలను అవలంబిస్తారు. ఎండల్లో ఎండుతారు, వానల్లో తడు స్తారు. మంచుకొండల్లో దిగంబరులై తిరుగుతారు. ముండ్ల కంచెలమీద పడుకొంటారు. నాలికమీద నారసాలు గుచ్చు కొంటారు. ఉపవాసాలు చేస్తారు, నేలమీద దొర్లుకొంటూ,

యాత్రలు చేస్తారు. వేపాకు తింటారు. శ్మశానాల్లో తిరుగుతారు. మెళ్ళల్లో ఎముకలు కట్టుకొంటారు. వంటిపై చితాభస్మం పూసుకొంటారు. ఈ విధంగా లేనిబాధలను దెచ్చుకొని, సమత పేరున నిగ్రహసాధనల నవలంబిస్తారు. ఇవి కృత్రిమమైన సాధనలు-ఆత్మహింసాక్రియ—Self-mortification.

ఈ సాధనలవల్ల, కొంత "స్టోయిసిజం" లభిస్తే లభించవచ్చునుగాని, ఇవి ఆత్మను శూన్యంగా చేసివేస్తాయి. వీనివలన అసలు మానవలక్షణమే మృగ్యమైపోతుంది. మానవునకు సుఖదుఃఖాలు రాక తప్పవు. ఆ అనుభవాలు ఆత్మోన్నతి కత్యంతావసరం. వానిని అనుభవించే రీతిని అనుభవిస్తే అవి మనలను తప్పక ఊర్ధ్వముఖానికి తీసుకొనిపోతాయి శరీరాన్ని ఎండుకట్టెగాను, చిత్తాన్ని రాయిగాను, బుద్ధిని జడంగాను చేసుకొని, సాధించేది ఆత్మోపలబ్ధికాదు—అది వట్టి చైతన్యవిగతమైన స్థాణుత్వం.

ఇక వైరాగ్యం అవలంబించకుండా సమతను సాధించమంటే; ఎట్లా అని కాదూ నీ ప్రశ్న ? మన జీవితంలో జరిగే ఘటనాఘటనలన్నీ మన పురాకృతకర్మయొక్క ఫలితాలని సమర్థించుకొంటూ, నిబ్బరంగా ఉండమని అడుగుతున్నానని నీ వనుకొంటూ ఉండవచ్చు. కర్మసిద్ధాంతం సత్యంకాదని ఎవరంటారు ? కాని కర్మతో మన జీవితాన్ని సర్దుబాటు చేసుకోవడం మాత్రం సులభసాధ్యమా ? మనకు వచ్చే జయాలు, లాభాలు, సుఖాలూ మన స్వప్రయోజకత్వంక్రిందే జమ కట్టు

కొంటాము. అప్పుడు కర్మసంగతి జ్ఞాపకం తెచ్చుకోము. సంతోషంలో ఆకాశమెత్తున పొంగుతాం. కర్మసిద్ధాంతం మనకు కష్టాలు వచ్చినప్పుడే జ్ఞాపకం వస్తుంది. అప్పుడైనా సమాధానపడి శాంతచిత్తుల మవుతామా? వట్టిది. ఉద్విగ్నమనస్కుల మయ్యే ఉంటాము. కాని మన బాధ్యతను, పురుషప్రయత్నాన్ని, తప్పించుకోడానికి మాత్రం కర్మను చాటుచేసుకొంటాము. బుద్ధిః కర్మానుసారిణీ అంటూ మన అపచారాలను సమర్థించుకొంటాము. అంతేనేకాని, కర్మసిద్ధాంతం మనలో ధీరవృత్తిని, చిత్తశాంతిని, ఆత్మసంతుష్టిని, కల్పించడానికి మాత్రం ఉపయోగపడదు. కర్మసిద్ధాంతంవల్ల కలిగే వైరాగ్యం కూడా ఆత్మావబోధకమైనదికాదు.

ఇక ఎట్లా ఆత్మకు శాంతి చేకూరేది? స్టోయిసిజం ఆత్మహింసాయె. కర్మమంటూ విరక్తి కలిగివుండడం బాహ్యానిబంధనాయె. ఇక శాంతి లోపలనుండి ఎట్లా సమకూడేది? సుఖదుఃఖాలను నిరసించకుండ, హృదయాన్ని ఆర్ద్రీభూతంగా చేసుకుంటూ నిశ్చలంగా వుండమంటే, ఎట్లాగో తెలియడం కష్టం కావచ్చు. కాని నీవనుకొనేటంత కష్టంకాదు. నీలో భక్తి విశ్వాసం అనేవి ఉంటే, ఈసమస్య తేలికగానే పరిష్కారమవుతుంది. దేనిమీద భక్తి, విశ్వాసం అని అడుగుతావా? అన్యులెవరిమీదా కాదు. నీలో శాంతి లేకపోతే, పరులెవరూ నీకు శాంతి చేకూర్చలేరు. అది నీ లోపలనుండే సిద్ధించే విధానాన్ని తెలుసుకోవాలి. నీ జీవితంలో జరిగే ఘటనాఘటనలన్నీ

నీ మంచికే అనే దృఢమైన విశ్వాసం నీకు కలగాలి. నీకు వచ్చే అనుభవాలన్నీ నీ జీవితాన్ని రసభరితంగా చేయడానికే తటస్థి స్తున్నాయనే గట్టి నమ్మకం కలిగితే, నీ బాధలన్నీ ప్రబోధా లుగ మారుతాయి,

నీ వనుకొంటున్నావు—దేశం. కాలం నీవు చెప్పినట్లు వినటంలేదని. అట్లా వినకపోవడంవల్లేగా, నీకు అశాంతి కలిగేది? నీ అపజయాలు, నష్టాలు, ఆశాభంగాలు, దారిద్ర్యాలూ, దోషాలు - ఇవేగా నీకు బాధను కలిగించేవి ? లోకం నీవు కోరినరీతిగ నడిచిఉంటే, కాలంయొక్క నడక నీ యభిమతాను సారంగా సాగిపోతూంటే, చాల అదృష్టవంతుడవైనట్లు భావించుకొంటావు అవునా, కాదా ?

ఇక్కడే ఉన్నది నీ లోపమంతా, నీవు లోకాన్నుండి విడివడి, లోకంమీద నీ అధికారం సంపాదించుకోవాలని నీ కోరిక. నీ శరీరం ఈ లోకంలోది కాదూ ? ఈ భూమినుండి నీ శరీరాన్ని విడదీసి యుంచగలవా ? నీ ప్రాణం విశ్వప్రాణం లోని ఒక తరంగంకాదూ ? నీ ప్రాణాన్ని ఆ విశ్వప్రాణంతో సంబంధంలేకుండా ఉంచుకోగలవా ? నీ మనస్సు ఈ విశ్వ మానసంలోని ఒక చీలికకాదూ ? నీ మనస్సును విశ్వమానసం నుండి విడదీసి ఉంచగలవా? సహజంగా ఒకటిగా ఉన్నదానిని నీవు రెండుగా చేయలేవు, సోదరా ! "అవిభక్తం విభక్తేషు."- ఇదంతా ఒక్కటే అని తెలుసుకొని ప్రవర్తించావా, ఇక నీది

అనేది, నీ బాధ అనేది ఉండనేఉండదు. ప్రకృతిలో జరిగే ఘటనాఘటనలన్నీ నీవే అయితే, నీకు ప్రత్యేకంగా కలిగే దుఃఖ మెక్కడ ? ఈ లోకం నీకు భిన్నమని అనుకోడంవల్ల, నీ కిట్టి అశాంతి కలుగుతోంది. నీ శరీరం, నీ ప్రాణం. నీ మనస్సు విశ్వానిదే అని తెలుసుకొని, ఈ నీ చిత్తాన్ని వదిలపరచు కొన్నావా, నీకు భయవ్యామోహా లెక్కడ ? నీ వప్పుడు కాలంతో పోట్లాడవు. ప్రకృతితో కలహించవు. నీ జీవితాన్ని విశ్వ శ్రుతికి మేళవించడంవల్ల నీకు అనంతమైన, అపారమైన. శాంతి సిద్ధిస్తుంది.

అయితే ప్రకృతిలో సుఖదుఃఖాలూ, జయాపజయాలూ లేవా ? అవి బాధాకరం కావా, అని అంటావా ? ప్రకృతిలో ఉన్నవే అవి. నీ కనుభవం కల్గించడానికే ఆ సుఖదుఃఖాలు కల్పించబడ్డాయి. ఆ అనుభవాలే లేకపోతే, నీకీ తనువు ఉండి లాభమే లేదు. నీ జన్మే నిష్ప్రయోజనం. ప్రకృతి నిన్ను రస భరితునిగ జేయడానికే నిన్ను ఎన్నోవిధాల ఆడిస్తోంది. దుఃఖ దృశ్యాల నెన్నో చూపిస్తోంది. ఎందుకు ? నీకు కరుణను రుచి చూపడానికి. నీ కెన్నో ఆశ్చర్యకరమైన విషయాలను ప్రదర్శిస్తోంది. ఎందుకు ? నీలో అద్భుతరసాన్ని ఉదీపనచేయడానికి, నీ కెన్నో ప్రణయలీలలను వెల్లడిస్తోంది — ఎందుకు ? నీకు శృంగారరసానుభవం కలిగించడానికి. ఇక ఎందుకు నీవు రసానందలహరిలో ఓలలాడడానికి బదులు, ఉద్విగ్నమానసుడవు

కావడం ? ఈ ప్రకృతి నీలోపల, నీ బయటాకూడా ఆవరించి ఉన్నది. కాబట్టే, నీ అనుభవాలు లోకానివి, లోకానుభవాలు నీవి అయి, లోపలా బయటాకూడా రసానుభవం పొందగల్గుతున్నావు.

నీవు ప్రకృతికి దూరుడవైనావా, నీకూ ప్రకృతికి నిరంతరం వైరంపొసగి, శాంతివిహీనుడవై పోతావు. శాంతి లేక పోతే, రసానుభవమే సాధ్యంకాదు. అన్ని రసాలకు శాంతి మూలం. ఒక్క మూలమే కాదు. శాంతియొక్క విలాసాలే, పరిణామాలే అన్ని రసాలూను. ఏ రసమూ శాంతిని విడిచిలేదు. శాంతి విహీనములైన భావాలు వట్టి చిత్తవికారాలు. అవే నిన్ను బంధించి, కష్టాలపాలు చేస్తున్నాయి.

నీవు ఏ ప్రబంధమైనా చదువుతున్నావనుకో. లేక ఏ నాటక ప్రదర్శనాన్నో చూస్తున్నావనుకో. అప్పుడు నీ మనస్థితి ఎట్లా ఉంటుంది ? నీవా ప్రబంధంలోగాని, నాటకంలోగాని మునిగిపోవు. వానిలోని దృశ్యాలను సాక్షిగచూస్తూ ఆనందిస్తూంటావు. శోకం వచ్చినప్పుడు శోకరస మనుభవిస్తావు. శృంగారం వచ్చినప్పుడు శృంగారరసం అనుభవిస్తావు. ఈ అనుభవాల ననుభవిస్తున్నా, నీవు వీనికి పైగా సాక్షివైయుండి, ప్రశాంతంగా ఉంటావు. నీ జీవితంలోకూడా నీవట్లా ఉండాలి. నీ ఘటనాఘటనలలో, నీ వివిధావస్థలలో, నీ దశాంతరాలలో మునిగిపోకుండా. వానిలోని అంతర్యాన్ని అనుభవిస్తూ, వానికి

సాక్షీభూతంగా ఉండగలిగే చిత్తస్వస్థతను సాధించుకోవాలి. అప్పుడే నీకు శాంతి చేకూరుతుంది. ఈ అంతశ్శాంతి మూలంగా నీ జీవితాన్ని ఎక్కువగా అనుభవిస్తూ, ఆత్మోన్నతిని బడయ గలవు.

నీలో రెండుఅంతస్థు లున్నాయనుకో. ఒకటి కర్తృత్వం, రెండవది సాక్షిత్వం. కర్తగ నీ జీవితాన్నీ నీ ప్రవృత్తులనూ నడుపు కొంటూంటావు. సాక్షిగ నీ కర్తృత్వంవల్ల కలిగే జయాపజయాలను, లాభనష్టాలను ఉదాసీనంగా చూస్తూం టావు. కర్తగ నీ జీవితంలో మునిగిఉంటావు. సాక్షిగ నీ జీవి తానికి అతీతంగా ఉంటావు. నీ కర్మకు నీవే అధ్యక్షుడవు. ఈ రెండూ ఏకకాలమందు కుదుర్చుకోగలిగితే, నీ జీవితం రసాత్మ కమై ఒక కావ్యంవలె భావవ్యంజక మగుతుంది.

సాక్షిగ ఉండడమంటే — అభావాత్మకంగా ఏమీ ఎరుగని జడునివలె ఉండడంకాదు. అది శాంతిపదం. దీని స్వరూపాన్ని గీతాకారుడు బహురమ్యంగా చిత్రించాడు. శాంతిపదంలో నీ వెట్లా ఉంటావన్నాడు ? అంతస్సుఖః— (inner ease) అంతరారామః— (inner repose) అంత ర్జ్యోతిః—(inner light) విశ్రాంతి—ప్రశాంతి—కాంతి— వీనితోగూడినదే సాక్షిత్వం—ఉదాసీనత్వం. ఉదాసీనత్వమంటే వట్టి స్థాణువుగా ఉండడమనుకొన్నావేమో ? కాదు. ఉత్— ఆసీనం. వైమానికుడు విమానంలో గూర్చుండి, క్రిందనున్న

యుద్ధరంగాన్ని సర్చిలైట్లువేసి సమగ్రంగా చూస్తున్నట్లు నీవు చిత్తవిక్షేపం పొందకుండా పైనుండి నీ జీవిత సమర రంగాన్ని నీ ఆత్మకాంతి వెలుగున చూస్తూంటావు. ఎట్టి మహద్దశ అంటా వది ? అశాంతిలో శాంతి, దౌర్బల్యంలో శక్తి, అజ్ఞానంలో జ్ఞానం, మృత్యువులో అమృతం—నీ ఆత్మ స్వరూపమున ప్రకాశిస్తూంటే—ఎందుకు నీవు ధీరుడవు కావు? నాటకమాడుతున్నదీ నీవే. ఆ నాటకాన్ని చూచి ఆనందిస్తున్నదీ నీవే. నీ నాటకంలో నీవు ధీరోధాత్తుడవై నటిస్తే, ఇక నీకు కొదువయేమి ?

"ఆత్మస్థం యేను పశ్యంతి ధీరాః"

# నరలీలా రహస్యం

సోదరా, సరే పరీక్షలిచ్చావు, ఉద్యోగం సంపాదించావు. సుఖంగా సంసారంచేస్తున్నావు. మంచిపేరు తెచ్చుకొంటున్నావు. నెమ్మదిగ కాలం గడుపుతున్నావు. ఇంతటితో నీ జీవితం సఫలమైనట్లేనా ? ఇంతకంటె నీ జీవితానికి వేరే మూల్యం, ప్రయోజనం లేదన్నమాటా ? ఈ ప్రపంచంలోకి రావడం బ్రతుకుతెరువుకోసమేనా ? ఎప్పుడైనా యోచించుకొన్నావా, నీ జీవితానికి వేరే పరమార్థమున్నదేమో?

నీ వంటావు—నేనెవరికీ భారంగా లేను. నా పొట్ట నేను పోసుకొంటున్నాను. వీలైతే ఇతరులకు సహాయంకూడా చేస్తూంటాను. నాలో కొన్ని దోషాలున్నా, మొత్తంమీద మంచివాడననే పేరు తెచ్చుకొన్నాను. ఇంతకంటె చేయదగ్గదేమున్నది ? – అనికాదూ నీవనేది? నిజమే నీ వింతమాత్రం సంతుష్టి, సంతృప్తి కలిగిఉండడం మంచిదే. కాని ఈ మంచితనంవల్ల నీకుగాని, లోకానికిగాని ఏమి ప్రయోజనం ? కాలం నెమ్మదిగ గడడమే జీవితలక్ష్యమైతే, నరజన్మ ఎత్తాలా?

ఏ చెట్టో పుట్టో అయి పుట్టకూడదు? అవి కాలం గడపడం లేదూ? అవి ఎవరికీ అపకారం చేయడంలేదే, పైగా చెట్టు బాటసారులకు నీడయిస్తుంది. పండ్లిచ్చి ఆకలిబాధ తీరుస్తుంది. ఇంటికి కలప యిస్తుంది. అయినా దానిది వృథజన్మే. మానవుడు దానికంటే ఎక్కువనిగా మనం గర్వించుకోవడం? నర జన్మలో ఏదోవిశేషం ఉండకపోతే, వీనికెందుకు ఆధిక్యం వచ్చింది చెప్పు

నీ వనవచ్చు — నే నీ జన్మ ఎత్తాలని ఎత్తానా? ఎట్లాగో నరుడనై పుట్టాను. పుట్టినందుకు, ఎవరికీ భారంకాకుండా, నెమ్మదిగ కాలం గడుపుతున్నాను - సరే, సోదరా, నీవు కాలం గడుపుతున్నందుకు నేను నిందించడంలేదు. కాలం నీవు గడిపేదేమిటి? కాలం దానంతట అదే నడుస్తుంది నీవు ఆపితే ఆగుతుంది కనుకనా? కాలమంటే, ఒక ఘడియతర్వాత ఒక ఘడియరావడం అనుకొంటున్నావు కాబోలు, కాలం వట్టి ఘటికాయంత్రంకాదు. అది గొప్ప శక్తి సుమా ఏమనుకొంటు న్నావో? అది నీ ముందు నిలుచుని, క్షణంక్షణం నిన్ను తట్టు తోంది. ఎందుకు? తలుపు తీయమని - నీలోని గర్భితశక్తులను వెలుపకు లాగడానికి - నీలో గొప్ప మార్పులను కలిగించ డానికి - నిన్ను తనపై నెక్కించుకొని, ఊర్ధ్వలోకాలకు తీసు కొనిపోవడానికి, కాబట్టి కాలం గడపడమంటే, పండ్లను నింపు కోడంకాదు— కాలంయొక్క ప్రబోధాన్ని విని, కాలం యొక్క సహాయాన్ని పొందడం.

చెట్టూ కాలం గడుపుతోంది. నీవు నూరేండ్లు గడిపితే, కొన్ని చెట్లు అయిదువందల ఏండ్లు కూడా గడుపుతాయి. కాని ఏమి ప్రయోజనం? అది పుట్టినప్పుడెట్లా ఉంటుందో, గిట్టే టప్పుడు కూడా అట్లాగే ఉంటుంది. ముదరవచ్చు, ఎక్కువ కొమ్మలు వేయవచ్చు. కాని పుట్టినప్పుడూ వృక్షమే, చచ్చి నప్పుడూ వృక్షమే దానిలో ప్రబోధమేమున్నది? ఏండ్లు గడిపినందుకు ఎక్కువ అనుభవం సంపాదింపగలిగిందా? తన్ను తానెవరో తెలుసుకోగలిగిందా? వట్టి ప్రాణక్రీడ తప్పితే, మానసికంగా ఎట్టి పరివర్తన పొందిందదీ? ఏదైనా క్రొత్త చరిత్రను సృష్టించగలుగుతున్నదా? లేదు.

ఆదిమ వృక్షానికీ ఎంత తెలివితేట లున్నాయో, ఈ నాటి వృక్షానికీ అంతే తెలివితేటలు. ఇక మార్పుదేనిలో? కాలం ఏమి తెచ్చిపెట్టింది? చెట్టు ఋతుప్రకారం ఆకు రాల్చవచ్చు, చిగర్చవచ్చు, పుష్పించవచ్చు, కాయ కాయవచ్చు. అంతే కాలంయొక్క పరిణామం అంతకంటె ఎక్కువలేదు. అది వృక్షత్వా న్నతిక్రమించలేదు. అప్పుడూ స్థావరమే, ఇప్పుడూ స్థావరమే. కాలంచూపగల క్రమవికాసమనేది ఎక్కడ? వృక్షాల్లోనేకాదు, పశువుల్లోనూ అంతే. సంవత్సరాలు కాదు, శతాబ్దాలు గడవనీ పశువు పశువే. దానికి మానసిక పరిణామ మేమున్నది? క్షుత్పిపాస నిద్రామైథునాలతో వాని జీవితం పరిపూర్తి- గోజాతి దైహికంగా క్షీణించవచ్చు, లేదా వృద్ధి

పొందవచ్చు. కాని గోత్రంలోమాత్రం మార్పు ఉండదు. కాల మెంతవరకూ వాని దేహంలో మార్పుపొందించడమే కాని, వాని లోపల మానసికంగా ఎట్టి వికాసాన్ని తెచ్చిపెట్టలేదు.

సోదరా, మానవునిలోకూడా కాలం అట్లే శరీరసంబంధ మైన మార్పేనా తీసుకొని రాగల్గేది? బాల్య, కౌమార, యౌవన, వార్ధక్య దశలను మాత్రమేనా? ఈ దశలు చెట్లకూ చేమలకూ, పశువులకూ, పక్షులకూ ఉన్నాయి, ఇక మానవ జన్మలో ఉన్న విశేషమేమి? మానవునిలో కాలం కేవలం శారీరిక పరివర్తనాన్నే కాక, మనస్సులో బుద్ధిలో, చిత్తంలోగూడా మార్పులను తీసుకొని రాగల్గకపోతే, మానవజన్మ జన్మే కాదు, కాలం కాలమే కాదు. ప్రకృతియొక్క పరిణామశక్తే కాలం. ఏమంటావు, సోదరా!

మానవజన్మ కుక్షింభరత్వానికి గాదు. సోదరా, నీలో నీ శక్తిని నీవు గ్రహించుకోక, దీనపుచూపులు చూస్తున్నావు. ఈ ప్రపంచంలో స్వతంత్రమైన జీవి ఏమైనా ఉంటే, అది నీవే. రాతికి స్వాతంత్ర్యం లేదు. అది శాశ్వతంగా రాయై పడిఉండ వలసిందే. వృక్షానికి స్వాతంత్ర్యంలేదు. ఎన్నియుగాలకైనా అది స్థావరమే — పశువుకు స్వాతంత్ర్యంలేదు. ఎన్నటికీ పశువు పశువే. ప్రపంచంలో నాలుగువైపులా చూడు, సర్వం బంధిఖానాలో చిక్కుకొని ఉన్నాయి. కాలం వానిని తన పాశాల్లో అణచిపెట్టి ఉంచుతోంది. "భయాత్ తపతి సూర్యః" సర్వం

భయగ్రస్తమై ఉన్నది—సర్వం కాలాధీనం—కాలంయొక్క నిరంకుశశాసనానికి లోబడిఉన్నది.

మానవుడొక్కడే ఈ జగత్తులో స్వతంత్రుడు. సోదరా, అట్లా తెల్లబోయి చూస్తావేమి? మానవుడుకూడా బంధిఖానాలో ఖయిదీ అయియున్నాడనా నీ అభిప్రాయం? అది వట్టి పొరబాటు. నీవు ఖైదీవికావు. నీవు ముక్తుడవు. ఎట్లా గంటావా? మానవుడు ఘటనాఘటీకుడు — ఘటనాఘటన పటీయసి. కాదా? అవును. నీవు సృష్టి చేయగలవు, నాశనమూ చేయగలవు. నీవు మహాత్ముడవు కాగలవు, అల్పాత్ముడవూ కాగలవు. ధనికుడవు కాగలవు. దరిద్రుడవూ కాగలవు. పుణ్యాత్ముడవు కాగలవు, పాపాత్ముడవు కాగలవు. నీవు కాలేనిది ఏది సోదరా? ప్రకృతి జగతుయొక్క చరిత్రను సృష్టించిందంటావా, దానికంటె ఎన్నోరెట్లు మానవుడూ ప్రపంచ చరిత్రను సృష్టించాడు. ఆతడు సృష్టించనిదేది?—రాజ్యాలు, మతాలు, వ్యవస్థలు, సభ్యతలు, ఆచారాలు, విద్యలు, శాస్త్రాలు, దర్శనాలు, కళలు—క్రొత్త లోకాలనే సృష్టించాడు. చూడు పాశ్చాత్య మానవుడేమి చేస్తున్నాడో-రాజ్యాలను సృష్టించాడు. ఆకాశం ఎత్తున సౌధాలను నిర్మించాడు—వానిని ఒక క్షణంలో నేల కూలుస్తున్నాడు—వాడు ఘటనాఘటికుడు కాదంటావా?

సోదరుడా, కాలపురుషుడు నీలో అవతరించి నిన్ను క్రొత్త లోకాలకు తీసుకొనిపోతున్నాడు. నీవు పరతంత్రుడవు కావు. ప్రకృతి నీ కనుకూలం. చరిత్ర నీ కనుకూలం. దైవం నీ కనుకూలం—ఎందుకు ? నిన్ను స్వతంత్రునిగ జేయడానికి. చేయడమేమిటి ? అసలు నీవు స్వతంత్రుడవే. పొరపాటున నీవు బానిసనని అనుకొంటున్నావు. కాదు, స్వతంత్రుడవు కనుకనే నీలో నీవు ముడుచుకొని పోగల్గుతున్నావు, తలచుకొన్నావంటే నీ గూటిలోనుండి బయటకువచ్చి, విశ్వం కొనల వరకూ వ్యాపించనూ గలవు. ప్రకృతి శాస్త్రాన్ని మథించి, ఇప్పుడు దానిలోని విషం త్రాగుతున్నావు. నీవు తలచుకొంటే ఆ విషాన్ని అమృతంగా మార్చి అమరధామం చేరగలవు. ఇప్పుడు హింసాకర్మలకు లోబడి దుఃఖసముద్రంలో కొట్టుకొని పోతున్నావు. నీవు తలచుకొంటే, ప్రేమరసపానంచేసి, భూతలాన్ని ఆనందలోకంగా చేయగలవు. నీ విప్పుడు కండ్లు మూసుకొని చీకట్లో తడుములాడుతున్నావు. నీవు తలచుకొంటే, జ్ఞానదీపం వెలిగించి సూర్యలోకం చేరగలవు. నీవు స్వతంత్రుడవు కనుకనే నీవు పడిపోగలవు, లేవనూగలవు.

మానవజన్మ ఎంతఘనమైన దంటావు ? నరరూపం ఎత్తేటప్పటికల్లా నీకెట్టి స్వాతంత్ర్యం చేకూరిందో చూడు. నీవు నిత్యముక్త బుద్ధస్వరూపుడవని తెలుసుకోడానికే కాలం నీ హృదయ కవాటాన్ని నిరంతరం తట్టుతోంది. మెల్లగా కాలం గడపడంకాదు నీజన్మ ప్రయోజనం. ఇతరులకేదో ఉపకారం

పేరట నాలుగు పైసాలు గిరాటువేయడంకాదు, నీ జీవిత సాఫల్యం. నీ ఘటనా ఘటనశక్తిచే, నీ స్వాతంత్ర్యాన్ని తెలుసుకోవడమే నీ పరమావధి. వెనుక కొందరు విద్యార్థులు శివాజీ ఉత్సవం సలపడంకోసం వివేకానందస్వాములవారి దగ్గరకు పోయి, వారిని ప్రెసిడెంటుగ నుండమని కోరారు. స్వాముల వారంతట నవ్వి, మీరిప్పుడేమి చేస్తున్నారు, అని అడిగారట. ఏమీ చేయటంలేదు – యానివర్సరీ చేయబోతున్నాం-అన్నారట. శివాజీ యానివర్సరీ చేయుకపూర్వం ఎక్కడకైనాపోయి, డెకాయిటీ—బందిపోటు దొంగతనంచేసి రమ్మన్నారట వివేకానందులవారు. విద్యార్థులు తెల్లబోయినారు స్వాములవారి హెచ్చరికకు! బందిపోటు దొంగతనంకూడా చేయడానికి ధైర్య సాహసాలులేని యువకులు శివాజీపేరును స్మరించడానికి అర్హులుకారని వివేకానందులవారి అభిప్రాయం,

సోదరా, మానవజన్మ ఎత్తింది ఎట్లాగో నెమ్మదిగ కాలం గడపడానికికాదు. నీ నిజసత్తాను తెలుసుకోడానికి. వెళ్ళితే స్వర్గానికి వెళ్ళు. లేకపోతే పాతాళలోకానికిపో. లేదా అన్ని లోకాల నతిక్రమించి నిరాకారుడవైపో. అంతేనే కాని, నీవున్నచోటునే ఎట్లాగో ఊపిరిపీల్చుకొంటూ కూర్చుంటానంటే—కాలం సహించదు. నీవు వచ్చే జన్మలో చెట్టోపుట్టో అయిపుట్టుతావు. అట్లాకాదు–బయటకురా, నరలీలారహస్యం తెలుసుకొని, నీ యపారమహిమను ప్రతిష్ఠించుకో. నీవు

జన్మతః నరుడవు — విశ్వవ్యాప్తియందు నారాయణుడవు. నీ పరిపూర్ణతవలన నరోత్తముడవు. నీవు కర్మలో విశ్వకర్మ డవు. ప్రేమలో గోపీవల్లభుడవు, జ్ఞానంలో వేదవ్యాసుడవు. దైవాంశలో సాక్షాత్తు భగవానుడవు. నీ వెంతవరకు నీ జీవితంలో నీ నరలీలా రహస్యాన్ని ఉద్ఘాటించగల్గుదువో అంత వరకే నీజన్మ చరితార్థం.

"నారాయణ నమస్కృత్య
నరంచైవ—నరోత్తమం"

# స్వాతంత్ర్యసాధన

సోదరా, "నీవు స్వతంత్రుడవు" అని అన్నానని కాదూ, నీలో నీవు నవ్వుకొంటున్నావు? నే నన్నమాట నిశ్చయమే. నీవు స్వతంత్రుడవే అని మళ్ళీ అంటాను. కాని, నీవెందుకు శంకిస్తున్నావో, నాకు తెలుసు. నీ జీవితాన్ని నీవు పరీక్ష చేసుకొంటే, నీవు అన్నివిషయాల్లోను పరతంత్రుడవుగ ప్రవర్తించు కొంటున్నట్లు నీవు తెలుసుకొని, "ఎక్కడ నాకు స్వేచ్ఛ" అని ప్రశ్న వేస్తున్నావు.

నిజమే, అన్నివైపులా నిన్ను పాశాలు చుట్టుకొని, ఇటూ అటూ కదలకుండా చేస్తున్నాయి. నీవు చిన్నప్పటి నుండీ, ఎన్నో అభ్యాసాలకు లోబడిపోయినావు. వానిని వదిలి పెట్టాలన్నా వదిలిపెట్టలేకుండా ఉన్నావు. నీవు చేసుకొనే తీర్మానాలన్నీ వ్యర్థమైపోతున్నాయి. నీ సంకల్పానికి నీ ఆచరణకీ సంబంధం లేకుండా ఉన్నది—తీర్థానికితీర్థం ప్రసాదానికి ప్రసాదం.

నీవు నిజంగా స్వతంత్రుడవైతే, నీవనుకొన్నట్లు ఎందుకు చేయలేవు ? నీ బుద్ధి ముందుకు పోతున్నా, నీ చిత్తం నిన్ను వెనక్కులాగుతూ ఉంటుంది. ఈ రెంటిమధ్య పడి నలిగిపోతూంటావు. రాగద్వేషాలు నీలో జీర్ణమై పోయినాయి. అవి నశిస్తే కదా, నీవు స్వతంత్రుడవు అని నిర్ణయంచేసుకోగల్గేవి. ఎప్పుడు నీలో "ద్వైధీభవతి మేమనః" అని సందిగ్ధతలోబడి పెనగులాడుతూ ఉంటావో, అప్పుడు స్వతంత్రుడవు ఎట్లా అగుతావు ?

నీకు నిశ్చయజ్ఞానం లేదాయె. భయవ్యామోహాలతో ఒకకోట కట్టుకొని, దానిలో బంధించుకు కూర్చుంటావు. నీ బుర్రలో ఎన్ని గ్రంథాలనో దూర్చిపెట్టుకొన్నావు. అవి నిన్ను ఆలోచన చేయనిస్తేనా ? ప్రతివిషయానికి ఏదో గ్రంథం. ఏదో వాక్యం, ఏదోప్రమాణం తోసుకొంటూవచ్చి, అదే సత్యమైనట్లు నీకు భ్రమను కల్పిస్తూ ఉంటుంది. నీ బుద్ధికి విశ్రాంతిఉంటేగా, స్వతంత్రంగా చింతన చేసేటందుకు ? అది దయ్యాలకొంప అయ్యె. ఏవో భూతాలు నీ బుద్ధిలో ఎప్పుడు ఆడుతూనేఉండి నిన్ను ఎక్కడకో ఈడ్చుకొని పోతూంటే, నీకు స్వాతంత్ర్యమెక్కడ ?

ఇవ్వాళ ఒక నాస్తికుడువచ్చి లెక్చరిస్తే, దేవుడిని కాస్తా నీ బుద్ధిలోనుండి తోలివేస్తావు. ఒక బ్రాహ్మసామాజికుడు వచ్చి

ఒక సెర్మన్ ఇస్తే, కండ్లుమూసుకొని బ్రహ్మసాక్షాత్కారమైనట్లు భ్రమిస్తావు. ఒక ఆర్యసామాజికుడు వేదాన్ని ప్రశంశిస్తూ మాట్లాడితే, నీకు వేదంమీద ప్రామాణ్యం కుదిరె. ఇవ్వేళ సత్సంగుడవవుతావు. రేపు హరనాథబాబా మఠంలో జేరుతావు. మరుసటిదినం దివ్యజ్ఞాన సామాజికుడవు. అవతల సోషలిస్టువు—రోజుకు ఒక అవతారం ఎత్తుతూ ఉంటావు. నీలో నిలకడ ఎక్కడ ? నీ స్వంతమనేది ఒకటి ఉంటేగా ? నీ బుద్ధి వట్టి అద్దుడుకాగితమై పోయింది. దేనిని అద్దితే అదే పడుతుంది నీ బుద్ధిమీద. నీ బుద్ధిని చుక్కానిలేని పడవవలె వదిలేశావు. ఎవరా చుక్కాని త్రిప్పితే, నీవావైపుకు ఒరుగుతావు. అంటే గాలికెగిరే గడ్డిపోచవైనా వన్నమాట. స్వతంత్రంగా చింతనచేసేశక్తి లేనప్పుడు, నీవు స్వతంత్రుడవెట్లా అగుతావు సోదరా ?

నీ బుద్ధితోబాటు నీ జీవితమంతా పరాధీనంచేసి చేసుకొన్నావు. ఏమిచేయాలనుకొన్నా, పరులేమి అనుకొంటారో అనేభయం—సంఘం వెలేస్తుందేమో అనేభయం—స్నేహితులు విడనాడతారేమో అనేభయం—లేనికష్టాలను దెచ్చుకొన్నట్లగుతుందేమో అనేభయం—నిజం మాట్లాడితే రాజు దండిస్తాడేమో అనేభయం—ఈ భయాలతో ఒక అడుగు కూడా ముందుకు సాగదయ్యో. నీ నీడను జూచుకొని నీవే భయపడుతూంటే ఎవరేమిచేస్తారు ?

నీవు స్వతంత్రుడవుకావాలని కోరికఉన్నది. కాని అది ఊరికే లభ్యమగుతుందా ? ప్రతి వస్తువుకూ మూల్యంఉంది. ఆ మూల్యమిస్తేనేకాని, అది నీకు లభించదు. ఇంతకూ నీ స్వాతంత్ర్య కాంక్ష తీవ్రంకాలేదు. అది నిజంగా తీవ్రమైతే నీ వెంత మూల్యమైనా ఇయ్యగలవు. నీ ప్రాణాన్నికూడా ఒడ్డు తావు. అప్పుడు నీబుద్ధి కాలిబంతివలె ప్రచారకులచేత తన్నించు కోడానికి ఒప్పుకోదు. రాగద్వేషాలను, భయవ్యామోహాలను నీ దరి చేరకుండా వానిని దూరంగా ఉంచుతావు. బయటి గ్రంథాలనుకంటె, నీ శుద్ధాంతఃకరణను, నీ అనుభవాన్ని ఎక్కువ ప్రమాణంగా ఎంచుతావు. దూదిపింజవలె ప్రతిగాలికీ, ప్రతివాదానికీ ఎగిరిపోవు. నీ యునికిని కనుపెట్టి, అక్కడ నీ కాలును నిలవత్రొక్కుకొంటావు. సంఘానికి భయపడవు. రాజశాసనానికి జడియవు. నీ లోపలి వెలుగునే, నీ యంతర్వా ణినే అనుసరిస్తూంటావు. ప్రజారంజకత్వంకోసం, కపటనాటకా లాడవు.

నీ చూపును, నీ బుద్ధిని, నీ చిత్తాన్ని ఎన్నిపొరలో చుట్టుకొనిఉండి. నిన్ను నిరంతరం వకమార్గంలోకి దింపుతూ ఉంటాయి. ఈ పొరలే నిన్ను పరతంత్రునిగ జేసివైచాయి. నీ మానధనాన్ని దోచివైచాయి. ఈ పొరలు నిజంగా నీలోవి కావు. అవి బయటనుండివచ్చి, నీచుట్టూ ఆవరణ నేర్పాటుచేసు కొన్నాయి. అవి నీలో చిరకాలంగా కాపురం ఉండడంవల్ల,

అవి నీ లోనివే అనే భ్రమకలుగుతోంది. అవి తొలగిపోతే, అసలు నీ బ్రతుకే దుస్సాధ్యమగుతుందనే భయంకూడా నీ కావహిస్తోంది. గాలిలో ఏదైనా వస్తువును పెట్టావనుకో—అది కొంతకాలాని కేమగుతుంది? దానిచుట్టూ దుమ్ము కొట్టుకొంటుంది. దానిమీద సాలీళ్ళు గూళ్ళుపెట్టుతాయి. కాకులు రెట్టలేస్తాయి. చుట్టూ కంచెలు పెరుగుతాయి. దానిరూపమే మరుగైపోతుంది. అట్లాఅయింది నీ సంగతికూడాను. నీ బుద్ధికి బూజుపట్టింది. నీ చిత్తంలో మకిలి ఏర్పడ్డది. నీశక్తిని బంధిస్తూ ఎన్నో పాశాలు అల్లుకొనిపోయినాయి. వీనిమూలంగా నీ సుస్వరూపం మరుగైంది. ఈ దుమారం, ఈ బూజు, ఈ కంచెలు, ఈ పాశాలు ఇవే నీ మూలధనమనుకొని, వీనిమీదనే ఆధారపడి ఉండడంవల్ల, నీవు స్వతంత్రుడవనే జ్ఞానంకూడా నష్టమైంది. పైగా, ఈ పేరుకొన్న పొరలను వదలకుండా, వానితోనే స్వతంత్రుడవు కావాలని కోరడంకంటె పరిహాసాస్పదమైన విషయమేమున్నది?

నీ వెప్పుడైనా జైలును జూచావో లేదో—అక్కడ ఖైదీలు తాము ఖైదీలనే సంగతిని మరచిపోయి, తమ సంకెళ్ళను తామే మెరిసేటట్టు తోముకొని, వానిని ధరించి, మురిసిపోతూ ఉంటారు. నంబరుబిళ్ళను ధగధగ ప్రకాశించేటట్లు తోముకొని, దానిని మెడలో ధరించి, తమ చక్కతనానికి భ్రమసిపోతుంటారు. అట్లాగే మన మీలోకాన్ని జైలుగ జేసు

కొని, నానారకాల సంకెళ్ళను బిళ్ళలను ధరించి, అభివృద్ధిని పొందుతున్నట్లు పొంగిపోతూ ఉంటాము. మన చదువులు, మన అభ్యాసాలు, మన ఆచారాలు, మన నడవడులు, మన వేషభాషలు—మనలను బంధించివైచే సంకెళ్ళగుతున్నాయనే జ్ఞానమే లేకుండా పోతున్నది. మన కాలేజీలు నిజంగా జైళ్ళు, మన సంఘాలు చెరసాలలు, మన రాజ్యాంగాలు ప్రవాసాలు - ఇవన్నీ మనను మనలోనుండి దూరంగా ఎక్కడకో విసరివేస్తున్నాయి. మనకు మనమే దూరమైపోయిన పిమ్మట - మనకు స్వాతంత్ర్యమెక్కడ ?

"స్వాతంత్ర్యం" అంటే ఏమిటి? నీ "స్వ" మీద నిలచి ఉండడం. ఎక్కడఉన్నది సోదరా, నీ "స్వ"? పుస్తకాలలోనా? స్వాముల మఠాలలోనా ? మతవాదాలలోనా ? సాంఘిక ఆచారాలలోనా ? రాజశాసనాల్లోనా ? నీ చింతనలు, నీ ధ్యానాలు, నీ సాధనలు, నీ వృత్తులు, నీ "స్వ"కు అధీనమై యుంటే, నీవు స్వాధీనుడవు అవుతావుకాని, "పరవశుడ"వై యున్నంతకాలం నీవు నీవాడ వెట్లా అగుతావు ? నీ ధనాన్ని పరులుహరిస్తే నీవు కోర్టుకెక్కుతావు, నీ యింటిని పరులాక్రమించుకొంటే, వారిమీద దావావేస్తావు. నీ హక్కులను నీవు స్థిరపరచుకోడానికి ఎన్నితంటాలో పడతావు. నీ గ్రామంలో నుండి నిన్ను బయటకు గెంటివేస్తే, కాళిదాసుని యక్షునివలె

విరహాకాతరుడవవుతావు. ఇదంతాసరే, కాని నీ వ్యక్తిగతమైన మనఃస్వాతంత్ర్యాన్ని, బుద్ధి స్వాతంత్ర్యాన్ని, చిత్తస్వాతంత్ర్యాన్ని, నీ ఆత్మసాతంత్ర్యాన్ని బుద్ధిపూర్వకంగా వదులు కొంటున్నావే. ఇంతకంటె దుఃఖకరమైనదేది ?

ఇంటగెల్చి రచ్చగెల్వమన్నారే పెద్దలు. నీమీద నీకు పెత్తనం లేకుండాచేసుకొని, నీ దేశంమీద నీ సంఘంమీద పెత్తనంలేదని ఎందుకు తగవులాడుతావు ? నీవు స్వయంగా పరులకు అమ్ముడుపోతావు. పైగా దేశం అమ్ముడుపోయిందని దుఃఖిస్తావు. సోదరా, నీ స్థితిగతులు ఇట్లా ఉండడంచేతనే, "నేను స్వతంత్రుడనగుదునా, కాదా" అనే సంకోచం నిన్ను బాధిస్తున్నది. నీ స్థితి ఎంతవరకు వచ్చిందో చూడు. నీవు బ్రతికిఉన్న సంగతి నీకే అనుమానంగా ఉంటే. ఇకనిన్ను బ్రతికించేదెట్లా ? "నీవు నిజంగా ముక్తుడవోయి" అని నీ పారతంత్ర్యమే వ్యంగ్యంగా బాధలను కలిగిస్తూ బోధిస్తూంటే. నీ వా బోధను బెడబెవిని పెడుతున్నావే, నీ జీవితం దుర్భరంకావడానికి కారణమేమిటి? నీ స్వాతంత్ర్యాన్ని కూలద్రోసుకోవడంవల్లే నీ కంటికి చూపుపోయింది, నీబుద్ధి మందగించింది. నీ చిత్తం కఠినమైంది. నీ ఆత్మ మరుగైంది, ఆనంద్యం దూరమైంది. నీవు స్వరూపతః ముక్తుడవని తెలుసుకో - సర్వం నీదగుతుంది.

నీ "స్వ"ను గుర్తించడం ఎట్లా అని అడుగుతావా ? నిజమే. వెంటనే దానిని గుర్తించలేవు. నీలో ఇంతకాలం బంధు

జనంవలె కాపురంచేస్తున్న సంస్కారాలు, వాసనలు, అభ్యాసాలు, వాదాలు, మతాలు, ఆచారాలు, భయవ్యామోహాలు చిత్రవిచిత్ర రూపాల్లోవచ్చి, మేమే నీ "స్వ" అని ఒప్పించడానికి చూస్తాయి. నీ చిత్తమప్పుడు విక్షేపం బొందుతుంది. స్వ - పర వివేకం భ్రష్టమగుతుంది. నీ ఆత్మే నీకు పరాయిగ గనబడుతుంది. పరాయివారే నీ ఆత్మబంధువులుగ గనబడుతారు. నీ సంకెళ్ళే నీ కాభరణాలుగ గనబడుతూంటే, వానిని విసర్జించడమెట్లా ? జైలులో దీర్ఘకాలం వాసంచేసే, అదే నీ స్వగృహమనేభావం కలుగుతుంది. అభిమానాలనేవి నీచుట్టూ అల్లికలల్లి, నిన్ను బంధించివేస్తాయి. చివరకు నీ గురువుకూడా నీకు జైలరగుతాడు - నిన్ను నీ బాటల్లో బోనియ్యక, నీకు తెలియకుండానే వింత పుంతల్లో పెట్టుతాడు.

ఎంతకష్టమోచూడు, నీ "స్వ"ను, నీ ఆత్మప్రత్యయాన్ని పట్టుకోవడం? ఎన్నిపొరలను చింపుకొని, ఎన్ని ఆవరణలను దాటి, ఎన్ని అభిమానాలను విసర్జించుకొంటే, నీలో నీవు చేరగలవు ? ఎన్నిమాటలనైనా చెప్పవచ్చునుగాని, నిన్ను పట్టి వంచిస్తున్న అభిమానాలను వదులుకోలేవు. వానిని వదులుకోకుండా ఉన్నంతకాలం నీవు ముక్తుడవుకావు. అభిమానంతో వేసే ప్రతిఅడుగు నిన్ను నీనుండి దూరంచేస్తూంటుంది, ఏ క్షణంలో నీవు నాది అనేది లేదు అని సర్వాభిమానాలను వదులుకొంటావో, అప్పుడే నీవు నీ వాడవగుతావు. నీవు

ముందు "జీరో"—పెద్ద గుండుసున్నా కావాలి. అప్పుడు నీ నిజస్వరూపమైన ఆత్మ ప్రత్యక్షమగుతుంది. అది శూన్యంకాదు. అదే స్వతంత్రమైన సత్యం—నిత్యముక్తమైన ఆత్మవస్తువు, స్వయంప్రకాశకమైన ఆనందం. నిన్ను నీవు గుర్తించుకోగలిగావా, నిన్నింతకాలం భ్రమలోబెట్టిన మమకారాలన్నీ పొద్దున సూర్యుని వెలుగుతో విడిపోయే మంచువలె వాటంతట అవే విడిపోతాయి. నీవు నిన్ను ఉద్ధరించుకోవాలంటే, ఒకటే మార్గం—ఉద్ధరే దాత్మనాత్మానం. గత్యంతరంలేదు.

"నాన్యఃపంథా విద్యతే అయనాయ"

# సమగ్రదృష్టి

సోదరా, అని నిన్ను పిలవడంతోనే, నీవేమి చేస్తున్నావు ?

అంతకుపూర్వం ఇంకేదో పనిలోఉన్న నీవు దానిని వదిలి వేసి, నావంక తిరుగుతున్నావు. నీ చూపును నాప్రక్కకు త్రిప్పు తున్నావు. నీ చెవులను దోరపెట్టుకొని, నామాటల నాలకిస్తు న్నావు, నీ మనస్సును నాభావాలపై నిలిపి, ఆలోచనలలోకి దిగుతున్నావు. అంటే ఏమిటి? నాకూ నీకూ బయటా లోపలా కూడా సంబంధం ఏర్పడుతోందన్నమాట కాదూ ? నీనుండి నాకూ, నానుండి నీకూ కదలికలు కలుగుతున్నాయన్నమాట, ఈ సందర్భం ఎంత విచిత్రమో ఆలోచించుకొన్నావు ?

నాతో సంబంధం ఏర్పరచుకొని, నా హెచ్చరికల మూలంగా ఆలోచనలలో మునిగినకొద్దీ, నీబయటి ప్రపంచంతో సంబంధం వదులుకొంటున్నావు. ఇతర వ్యాపారాలనుండి నీ మనస్సును మరలించి ఇంకో ధోరణిలో బడుతున్నావు. చూచావూ, నీవేమి చేయగలవో ? నీ చుట్టూ ఎన్నివిషయా

లావరించిలేవు ? అయినా, వీనిలో ఏ యొకదానితోనో. ఏ కొన్నిటితోనో నీ యిష్టప్రకారం సంబంధం పెట్టుకోగలవు. మిగిలినవానిని పెడకుద్రోసి తాత్కాలికంగానైనా, వానిని విస్మరించగలవు. నీ మనస్సు ఫోటోలనుతీసే కెమెరా మోస్తరుది. దేనిమీద ఫోకసుచేస్తే, అదే లెన్సుమీద పడుతుంది. విశాలమైన ప్రదేశాన్నీ ఫోకస్సు చేసుకోగలదు. లేదా, ఏ ఒక చిన్న వస్తువుమీదనో లగ్నమై ఉండనూగలదు. నీవు చూచి అనుభవించే విషయాలన్నీ నీ ఫోకసింగుమీద ఆధారపడి ఉన్నాయన్నమాట కాదూ ?

ఎంత విచిత్రమైనశక్తి ఉన్నదో చూడు నీకు ? కన్ను తెరవనూకలవు, మూయనూకలవు. వెలుగును లోపలకు రానియ్యనూ గలవు, రాకుండానూ జెయ్యగలవు. ఒక విషయాన్నుండి ఇంకో విషయానికి నిలకడలేకుండా పరుగులెత్తనూ గలవు. ఒక్కవిషయంమీదే కదలకుండా, నిశ్చలంగా నిలవనూ గలవు. ఒక్కవిషయాన్ని జ్ఞాపకం ఉంచుకోనూగలవు, మరచిపోనూగలవు - మరచినదానిని తిరిగి జ్ఞప్తిలోనికి దెచ్చుకోనూ గలవు, ఎంత విచిత్రమైన శక్తో నీబుద్ధి ! కెమెరాలెన్సుకు లేని విచిత్రశక్తులు నీబుద్ధికి ఉన్నాయి.

ఎట్లా అంటావా ? కెమెరాలెన్సు బయటనున్న వస్తువును ఉన్నది ఉన్నట్లుగ, బయటకు ఎట్లాఉంటే అట్లా తీసుకొంటుంది తటస్థంగా ఉన్నట్లుండి. నీబుద్ధి ఏమిచేస్తుంది ? వస్తు

ఆలంబనంకోసం వెదుకుతుంది. ఆలంబనం లేకపోతే, అది మట్టి కొట్టుకొనిపోతుంది. ఆలంబనం ఉందా. అల్లిక అల్లుకొంటూ విజృంభిస్తుంది. అట్లాగే నీవూను. ఈ జగత్తు నీకు అల్లికపందిరి కాదూ ? ఎందుకు జగత్తంటే నీకు భయం ? ఈ విషయ ప్రపంచంతో నాకేమి సంబంధమని పెదవి విరుస్తావూ ? ఎంత వెర్రివాడవోయి సోదరా ?

విషయాలక్కరలేని విషయివా నీవు ? నీవు జ్ఞాతవా ? కాని నీకు జ్ఞేయమక్కరలేదూ ? నీవు భోక్తవా ? కాని నీకు భోగ్యమక్కరలేదూ? ఈ విషయప్రపంచమంతా ఏదో బయటిది నిన్ను బంధించి ఉంచేదీ అని అనుకోవడం వల్లకాదూ, దీని నిట్లా నిరసించడం, తిరస్కరించడమూనూ ? నీ మూలమూ, ఈ విషయప్రపంచ మూలమూ ఒక్కటే, అని తెలిసికొనిఉంటే, దీనితో ఇట్లా జగడం వేసుకొంటావా? నీవు కొంచెం యోచించావా అంటె, నీకూ నాకూ ఎట్టి సంబంధంఉన్నదో, నీకూ ఈ జగత్తుకూ అట్టి సంబంధమే ఉన్నదని తెలుసుకోగల్గుతావు.

నాకూ నీకు జరిగే సంవాదంలో మన ఇద్దరిమధ్య గలిగే దేమిటో గ్రహించావూ ? నీవు నా ముఖాముఖిని గూర్చుండి, సంవాదం ప్రారంభించడంతోటే, ఏమి జరుగుతోంది? నీలోనూ నాలోను ఒకశక్తి ఆవిర్భవిస్తోంది—స్విచ్చివేస్తే, గాజు బల్బులలో ఎలెక్ట్రిక్కుకరెంటు ప్రవహించి వెలిగినట్లుగ. అవునా, కాదా ? నీవు నాలోని భావాల నుద్దీపనచేస్తున్నావు. నీలోని

భావాలను నేనుద్దీపన చేస్తున్నాను. అంటే నాశక్తిని నీవు, నీశక్తిని నేనూ వెల్లడిచేసికొని, ఒకరినొకరు తెలుసుకొంటున్నా మన్నమాట. నా లోతులోకి నీవు దూరుతున్నావు, నీ లోతు లోకి నేను దూరుతున్నాను. నీలోను నాలోను ఉబుకుతున్న శక్తి ఒక్కటి కాకపోతే, ఒకరిని ఒకరు తెలుసుకోవడం ఎట్లా సంభవిస్తుంది ? ఆశక్తే నిన్నూ నన్నూ ఒక్క ఆలింగనంలోకి తెచ్చి ఐక్యము గూరుస్తున్నదా, లేదా ?

అట్లాగే నీకూ నీ జగత్తుకూ మధ్య ఒకశక్తి సంచారం చేస్తున్నదని తెలుసుకో. ఆశక్తే నిన్ను ప్రకృతిమధ్య ప్రవేశ పెట్టింది. ఆశక్తే ప్రకృతిని నీలోపలా, నీచుట్టూను విపులపరు స్తున్నది. నీలో ఏ శక్తిఅయితే, నీ ఇంద్రియాలను ప్రవర్తింప జేస్తున్నదో, నీ మనస్సును, బుద్ధిని, హృదయాన్ని, చిత్తాన్ని ఉద్బోధం చేస్తున్నదో, ఆశక్తే ప్రకృతిలో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములుగను, చేతనాచేతనములుగను, స్థావరజంగమ ములుగను, నారీనరులుగను ఆవిర్భవించి క్రీడిస్తున్నది. అంటే నీ శక్తి, ప్రకృతియందలి శక్తి ఒక్కటికనుకనే నీవు విషయి గను, ప్రకృతి నీకు విషయముగను, నీవు భోక్తగను ప్రకృతి నీకు భోగ్యంగాను కావడం సంభవిస్తున్నది. లేకపోతే, ఎవరికి వారే.

అంటే ఏమిటి ? నీవు ప్రకృతిని తెలుసుకోవడమంటే నీ శక్తిని నీవు తెలుసుకోవడమనీ, ప్రకృతి నీకు విషయమైన

దంటే, ప్రకృతి నీ ఆత్మౌపమ్యం బొందుతోందని గ్రహించావా, విషయీ విషయముల సంయోగ సంభోగములలోనే నిజమైన ఐక్యము, స్థాయిత్వము, పూర్ణత్వము సిద్ధిస్తుందని తెలుసుకోగల్గుతావు. నీకు ఏదిమూలమో, అదే ప్రకృతికిగూడ మూలమైనప్పుడు ఈ కలయిక కుదరడంలో ఆశ్చర్య మేమున్నది ? మూలంలోలేనిది కొమ్మల్లోను, ఆకుల్లోనూ ఎట్లా రాగల్గుతుంది చెప్పు, సోదరా ?

ప్రకృతి కేవలం పురుషుని శక్తి, పురుషుడు శక్తియొక్క నిదానం. నీవు నీ శక్తిలో నిమగ్నమైపోయినావా, నీవు ప్రకృతివై పోతావు. నీవు నీశక్తినుండి నిస్సంగుడవగుతావా ? నీవు పురుషుడవుతావు. నీకు రెండవస్థలు - ఒకటి పురుషావస్థ- రెండు ప్రకృతి అవస్థ — రెండూ నీవే ఈ రెండూ నీ వేక కాలమందే కాగలవు. అవుతూనే ఉన్నావు. అక్కడే ఉన్నది నీ మహిమంతా. నీవు నీ శక్తిలో కరగిపోతున్నావు. నీవు నీ శక్తిలో ఇమిడిపోకుండా అతీతంగానూ ఉంటున్నావు. నీవు నిన్ను విస్మరించీ ఉండగలవు. నీవు నీవై యుండాగలవు. క్షరుడవయ్యీ, అక్షరుడవు. అక్షరుడవయ్యీ క్షరుడవు.

సోదరా, నీవు కానిదేమీలేదు. నీవు కన్ను మూసుకొని నిద్రిస్తావా? నిన్ను లోకం జడమంటుంది, నీవు కన్నుతెరచి భేదబుద్ధి నలవరచుకొంటావా ? లోకం నిన్ను అజ్ఞానివంటుంది. నీవు భేదబుద్ధి నతిక్రమించి సర్వంగా ప్రపంచిస్తావా ? లోకం

నిన్ను విరాట్ అంటుంది. నీవు సర్వాన్ని అతిక్రమించి నీలో నీవు నిమగ్నుడవై ఉంటావా? లోకం నిన్ను శుద్ధ చైతన్య మంటుంది. నీకీ పేర్లన్నీ నీ అవస్థాభేదాలనుబట్టి వస్తున్నాయి. సోదరా, జడమైనా, ప్రకృతిఅయినా, విషయివైనా, శుద్ధ చైతన్యమైనా నీవే. నీవే ఇన్ని విధాలుగ, ఇన్ని ప్రకారాలుగ, ఇన్ని అంతస్థులలో విరాజిల్లి, అగమ్యగోచరుడవగుతున్నావు లోకానికి. లోకమిట్లా నిన్ను వేరువేరు పేర్లతో పిలిచి, నీలో నీకు వైరం పుట్టిస్తోంది. వేదాంతులు కల్పించిన శబ్దజాలా న్నుండి తప్పించుకొని నీ అనుభవాలను నీవు సమగ్రదృష్టితో అన్వయించుకొన్నావా, నీకు సామరస్యం సిద్ధిస్తుంది.

"ఉపద్రష్టాఽనుమంతాచ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః."

# అ ను భూ తి

సోదరా, నీవు సామాన్యంగా చూచే ఉంటావు టెలిగ్రాఫ్ తీగమీద పిచ్చుకలు కూర్చుండి కిచకిచలాడుతూ ఉండడం. పాపం, వాటికేమి తెలుసు, ఆ తీగలో ఎట్టి విద్యుచ్ఛక్తి ప్రవహిస్తోందో, అదెట్టి సందేశాలను గొనిపోతోందో? వాటి గొడవలో అవి ఉంటాయి కాని, తమ కాధారంగా ఉన్న తీగలలో ఏమి జరుగుతోందో వాటికి తెలియదు.

నీ సంగతికూడా అంతేనా? నీ చుట్టూ, నీ లోపలా ఏమి జరుగుతోందో, నీ ఉనికికి ఆధారమేమిటో, నీ జీవితం ఏ దిక్కుకు నడుస్తోందో - ఏమైనా వివేచన చేసుకొంటూ ఉంటావా? లేక ఆ పిచ్చుకలవలె ఒకక్షణం ఇక్కడ వ్రాలి, ఇంకొకక్షణం ఎక్కడికో రెక్కలల్లార్చటమేనా? నీవెందుకు ఈ జన్మఎత్తిందీ, రోజులు గడచినకొద్దీ నీలో ఏమిమార్పు కలుగుతోందీ, ఎప్పుడైనా యోచించి చూచుకొన్నావా?

నేను దేనినీ అంటకుండా కుమ్మరిపురుగువలె ఉంటున్నానని వేదాంతులు సామాన్యంగా చెప్పేమాట నాకు అప్ప

గిస్తావు? ఏమీ బాధ్యతలేకుండా పైన బట్టవేసుకొని, తిరుగుతూ ఉండాలనా? క్రిమికీటకాదులు కూడా అట్లా ఉండవే. వాని ధర్మాలను అవి నిర్వర్తిస్తూఉంటాయి. వానికి తెలియకుండానే, ప్రకృతికి చేయవలసిన సహాయంచేసి పోతూఉంటాయి. అంతేనే కాని, తామరాకుపై నీటిబొట్టువలె, ప్రపంచంతో ఎట్టి సంబంధమూ, బాధ్యతా లేకుండా ఉండవు. నీకు బుద్ధి ఉన్నది, వివేకం ఉన్నది, వానికిలేని ఆశలెన్నో ఉన్నాయి. సృష్టి చేయగలవు, సంహారం చేయగలవు. ఒక దానిని స్వీకరించా గలవు, నిరాకరించనూగలవు —ఇన్నిశక్తులూ ఉంచుకొని, లోకంలో సంబంధం లేనివానివలె పైపైనే ఉంటానంటే, అర్థమేమిటి?

సోదరా, నీ ఔదాసీన్యం నిజంగా. బుద్ధిపూర్వకంగా, ఒకదీక్షగా ఏర్పరచుకొన్నది కాదు—వట్టి జడత్వం, తామసికం. అలసుడవై ఉండిపోవడంవల్ల, ఇట్లా నిరర్థకంగా రోజులు గడుపుతున్నావు, ఆ రోజులనైనా నీవు గడపటంలేదు—వాటంతటఅవే గడచిపోతున్నాయి. నీలో మాంద్యం ఏర్పడ్డది. శీతకాలంలో నీరు గడ్డకట్టుకునిపోయినట్లు, నీ ప్రకృతి కూడా రాయి అయిపోయింది ఈ శైత్యాన్ని, ఈ మాంద్యాన్ని వేదాంతులు చెప్పే ఉదాసీనత్వంగా భావించుకొని, గర్విస్తున్నావు. ఇది పురుషలక్షణం కాదు. దీనివల్ల నీకు శాంతీలేదు, సౌఖ్యమూలేదు. పైగా నీజన్మ కేవలం నిష్ఫలం.

సోదరా, అలసునికంటె, మందునికంటె, హంతకుడు మేలు. హంతకునిలో క్రోధాగ్ని తీండ్రిస్తూ ఉంటుంది. ధైర్య సాహసాలుంటాయి. ఒక కార్యం సాధించాలనే స్థిరసంకల్ప ముంటుంది. కార్యసిద్ధికొరకు తన ప్రాణాలైనా ఒడ్డుతాడు. బుద్ధిని ప్రజ్వలింపజేస్తాడు. సాధన సామగ్రిని సమకూర్చు కొంటాడు. తన సకల ప్రవృత్తులను ఏకోన్ముఖం చేస్తాడు. లోకం వానిని హంతకుడనని దూషించనీ, రాజ్యాంగం వానిని ఉరితీయనీ. దేనికీ జడియడు. క్రియాసిద్ధే వాని పరమ లక్ష్యం.

నీలో ఏమి విశేషమున్నదని, నీవు వానికన్న అతిశ యుడవైనట్లు సంతోషిస్తున్నావు ? నిజమే. లోకం నిన్ను 'గుడ్' అంటుంది. ఏమి "గుడ్" అది ? ఎవరిజోలికీ పోవనా? నీ ఉనికినే ఎవరికీ తెలియకుండా చేసుకొంటున్నావనా ? ఇది నిజంగా మంచితనంకాదు. నీవు మంచివాడవైతే, నీకంటె గూడా రాళ్ళూ, రప్పలూ ఎక్కువ మంచివి వానికీ నోరు లేదు. చూపూలేదు. వానినెక్కడ పడవేస్తే, అక్కడే ఉంటాయి. నీవు మనుష్యజన్మ ఎత్తింది తమస్సులోపడి ఉండ డానికా ?

ఇక ఎందుకు ? నీ వేపనైనా చెయ్యి, చెయ్యకపో. ధన మార్జించు, ఆర్జించకపో. చదువులు చదువు, చదువకపో. యజ్ఞయాగాదులు చెయ్యి, చెయ్యకపో. ఉద్యోగాలుచెయ్యి,

చెయ్యకపో. ఇవన్నీ బాహ్యావ్యాపారాలు, వీనికోసంకాదు నీ జన్మ. నీ జన్మ అనుభవంకొరకు. అనుభవం సంపాదించడం కోసమే, నీవీ నరరూపం దాల్చావు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలూ ఏర్పడ్డాయి. బుద్ధి, హృదయం, చిత్తం, అహంకారం సృష్టిఅయినాయి. అనుభవం కొరకే ప్రకృతిమధ్య ఉన్నావు. సంఘంలో బ్రతుకుతున్నావు. నీ కొక కుటుంబమూ, ఇల్లూ అంటూ ఏర్పడ్డది. నీ జీవితం ఒక్కవిధంగా నడుస్తున్నదా ? ఎన్ని ఘటనలు, ఎన్ని అఘటనలు జరగటంలేదు ? లాభనష్టాలు, జయాపజయాలు, అభ్యుత్థానపతనాలు, సుఖదుఃఖాలు, కామక్రోధాలు ఎన్ని నీ జీవితాన్ని కలవర పరచటంలేదు ?

నీవు నదీప్రవాహంమధ్య ఉన్నట్లు ఉన్నావే—ఇదంతా ఊరికేనా ? గుడ్డెద్దు చేనులోబడ్డట్టా ? కాదు. ఇదంతా నీ వనుభవాన్ని సంపాదించుకోవడంకోసం ఉద్దేశింపబడ్డది. నీ వభ్యసించే విద్యలకంటె, నీ వార్జించే ధనధాన్యాదులకంటె, నీవు పొందే కీర్తిగౌరవాలకంటె, నీ వాచరించే ధర్మకార్యాలకంటె నీకెక్కువ మూల్యమైనదీ నీ జన్మను చరితార్థంచేసేదీ— నిజంగా నీ అనుభవం. నీకన్నీ ఉండి, అనుభవంలేదా, నీవు శుద్ధదరిద్రుడవన్నమాట. ఏమీ లేకపోయినా. అనుభవం సంపాదించుకో గల్గావా, నీవు మహాభాగ్యశాలివన్నమాట— నీ జీవితాన్ని పరిశోధించి చూచుకో—నీలోపల ఎంత అనుభవం ఉన్నదీ. అన్నిటికీ అదే మూలం, అదే ఫలం.

అనుభవం అంటే ఏమిటి? ఎప్పుడైనా ప్రశ్నించి చూచుకొన్నావా? దేనిని అనుభవం అంటారు? దాని లక్షణా లేమిటి? అనుభవమనేమాట సర్వసామాన్యంగా అందరం వాడుకొనేమాటే. కాని దేనిని అనుభవం అంటామో, అన వలెనో, యోచించి ఉండం. గతానుగతికంగా ఆ మాటను వాడుతున్నాం. తెలిసి వాడడంకాదు. పూర్తిగ తెలియకా కాదు. మనం సామాన్యంగా ఉపయోగించే మాటలన్నీ ఇట్లాగే. సగం తెలిసీ తెలియకుండానే వ్యవహరిస్తూ ఉంటాము. కాని, అంతశ్శోధన చేసుకొనేటప్పుడు, చిక్కువస్తుంది. ఇట్లాగే మనస్సు, బుద్ధి, చిత్తం, హృదయం, అంతఃకరణం, అహం కారం. సంస్కారం, ఆత్మ మొదలైన పదాలన్నీ నిత్యకృత్యాం చలామణిలో ఉండేవే. కాని పరిశీలన చేసేటప్పుడు, వాని అర్థం సరిగ బోధపడక తికమకపడుతాం. ఒక మాటను అనేక అర్థాల్లో ఉపయోగించడంవల్లకూడా వివాదాలేర్పడి. చిక్కుల పాలగుతాం.

"అనుభవం" అనేమాటకూడా ఇట్టి సందిగ్ధార్థంతో కూడిందే కావడంవల్ల, ఇప్పుడు దీనిని నిర్వచనం చేయవలసి వచ్చింది. నీవెంత జడుడవైనా, నీచుట్టూ ఉండే భౌతికప్రకృతి నీ సంఘం, నీ రాజ్యాంగం, నీ కుటుంబం, నిన్నేదోవిధంగా ముట్టడించి, నీలో వికారాలను కల్పిస్తూనే ఉంటుంది. నీ ఇంద్రియ వ్యాపారాలన్నీ బాహ్యప్రపంచం నీ మనస్సులో పురికొల్పే ప్రతిక్రియలే. అట్లాగే నీ తలంపులు. నీ కోరికలు,

నీ ఊహాలు, నీ కామక్రోధాలు, నీ ప్రేమసఖ్యాలు, నీ తాప త్రయాలు—ఇవన్నీకూడా నీ పరిస్థితులవలన నీ బుద్ధిలో కలిగే ప్రతిక్రియలే. ఈ ప్రతిక్రియలనే అనుభవాలంటావా ?

నీకూ నీ చుట్టూఉండే విషయాలకు నిరంతరం లావాదేవీలు జరుగుతున్నమాట నిశ్చయమే. కాని ఈ లావాదేవీలు క్షణికంగా ఉండిపోతున్నాయే కాని, వానిలో ఏమైనా నిలవ ఉంటున్నదా? సముద్రంలో ఎన్ని అలలు లేచిపడటంలేదు ? అట్లాగే నీ మనస్సులో ఎన్ని చిత్తవృత్తులుపుట్టి, వెంటనే గిట్టటంలేదు ? కొన్ని తలంపులు ఎక్కువకాలం ఉండవచ్చు. కొన్ని వెంటనే మాయమై పోవచ్చు. కాని ఇవన్నీ నీటిలోని బుడగల వలె లేచి మాయమై పోతూండేవే. మన కన్నులకు ఎన్ని దృశ్యాలు కనబడటంలేదు ? మన చెవులపై ఎన్ని శబ్దాలు పడటంలేదు ? ఇవన్నీ మన మనస్సులో నిలచి ఉంటున్నాయా ?

సోదరా, నీలో ఏదో—ఒక శక్తో, ప్రవణతో సంస్కృతో ఉన్నది. అదేమి చేస్తున్నది ? బయటా నీ లోపలా మూగే విషయాలను, ప్రవృత్తులను తిలకించి, వానిలో కొన్నిటిని మాత్రమే స్వీకరించి వానిని గొంతకాలం మననం చేయడమో, లేక భోగించడమో, లేక వానిని తిరిగి నెట్టివేయడమో సంభవిస్తున్నది. నీలో ప్రవహించేవన్నీ నిలచి ఉండవు. కొన్ని నిలచి ఉన్నా, కొంతకాలానికి అవి జారిపోతాయి. కొన్నిటిని

జ్ఞాపకం ఉంచుకొంటావు. కొన్ని అసలు జ్ఞాపకంలో ఉండనే ఉండవు.

అయితే, జ్ఞాపకంలో ఉండే ప్రతిక్రియలే. అనుభవాలని అంటావా ? నీ జ్ఞాపకంలో లేకపోయినా, ఆ విషయాలన్నీ నిరర్ధకంగా నిన్ను స్పృశించకుండానే వెడలిపోయినా యంటావా ? నీకు జ్ఞాపకం ఉన్నా, లేకపోయినా, అవన్నీ కూడా నిన్నేదోవిధంగా స్పృశించిపోతూనే ఉన్నాయి. కాబట్టి నీ జ్ఞాపకంలో ఉన్నవే అనుభవాలని అనుకోవడం పొరబాటు.

నీ చిన్ననాటి చదువులన్నీ జ్ఞాపకం ఉన్నాయా ? నీ బాల్యస్నేహాలెన్ని మరపుకురాలేదు ? అవన్నీ నీలో సంస్కార రూపంగా నీ మనస్సులో ఇనికే ఉంటాయి. మన ఇంద్రియాలకు గాని, మనబుద్ధికిగాని, మన హృదయానికిగాని ప్రత్యక్షమయ్యే ప్రతివిషయం వ్యర్థంగా పోవటంలేదు. అవన్నీ జ్ఞప్తియందున్నా లేకపోయినా, వాని సంస్కారం నీ మనస్సులో అంకితమై యుండనే ఉన్నది. నీ మనస్సు అనంతమైన సంస్కారాల కూటమన్నుకో.

నీ జీవితంలో పైన స్థూలంగా ఉపరిభాగంలో కనబడేది చాలా కొద్ది—అది తరంగంపై మెరిసే నురుగువంటిది. అదే కాదు నీ జీవితం. అనేకంగా పొరలున్నాయి - భూమిలో పొరలున్నట్లు—నీవు లోపలకు జరిగినకొద్దీ, త్రవ్వుకుపోయిన

కొద్దీ, ఎన్నో పొరలు కనబడతాయి. అవే నీ జీవితానికి రూపం ఇచ్చేవి. నీ బుద్ధి కి క్షణంలో గోచరించేదే నీ జీవితంకాదు. నీ జీవితం భూతకాలంలోనూ ఉన్నది. వర్తమానకాలంలోనూ ఉన్నది. భవిష్యత్తులోనూ ఉంటుంది. అదో ప్రవాహం. దాని లోతుపాతులు తెలియక పోవచ్చు. దానివేగం కనిపెట్టలేము. కాని మన జీవితం ఈ సంస్కారాలబలంచేత, ఏ దిక్కుకో నడుస్తోంది. ఈ సంస్కారాలెట్టివో, వానిపై నీకెట్టి పెత్తనం ఉన్నదో ఎప్పుడైనా ఆలోచించి చూచుకొన్నావా ?

సోదరా. నీవు స్వతంత్రుడనని అనుకొంటున్నావు కాని నిన్ను నడిపేది ఈ సంస్కారాలే. ఈ సంస్కార పరంపరలు సంచయకర్మగా పరిణమించి, నీ చిత్తవృత్తులను, నీ బుద్ధి వ్యాపారాలను బురికొల్పుతున్నాయి. అందుకనే నీవు వాని ప్రవాహంలోబడి కొట్టుకొని పోతున్నావు. అందుచేత, నీ మతికి నిలకడలేక శాంతివిహీనుడవై, దిక్కుతెలియని పక్షివలె విహ్వలచిత్తుడవగుతున్నావు. అనుభవానికి ఆస్కారముండీ, అనుభవం లేనివానివలె అజ్ఞానివి కావడం సంభవిస్తున్నది. నీలోని శ్రద్ధ నుద్దీపనచేశావంటే ఈ సంస్కారాలన్నీ నీ వశమగుతాయి. అప్పుడవి అనుభవాలుగ వికసించి నిన్నొక దరి చేర్చగలవు.

అనుభవాలంటే ఏమిటో తెలిసిందా ? నీ ఇంద్రియ వ్యాపారాలు కావు, నీ చిత్తవృత్తులూ కావు. నీ జీవితం సమ

కూర్చుకొని పోతూండే సంఘటనాపరంపరలు కావు. అవి ఆత్మగతములైనప్పుడే అనుభవా లగుతాయి. ఆత్మగతం కానంతవరకూ, అవి నీ వశంలో ఉండక నీ చిత్తవిక్షేపమునకు గారణభూతములై, నీ జీవితాన్ని అధోగతికి ఈడ్చుకొని పోతూంటాయి.

వట్టి శ్రద్ధకూడా చాలదు, ఆ సంస్కారాలను ఆత్మ గతంగా చేసుకోడానికి. నీ సత్వాన్నిబట్టి, నీ శ్రద్ధ తామసికం కావచ్చు, లేదా రాజసికం కావచ్చు, సాత్వికమూ కావచ్చు. ఈ గుణాలకు వశుడవై ఉన్నంతకాలం నీ అనుభవాలుకూడా నీ ప్రాప్యాన్ని జేర్చగలిగే సోపానాలు కాజాలవు. అనుభవం అంటే, ఉపభుక్తం. ఎప్పుడు నీ సంస్కారా లనుభుక్త మగు తాయి ? ఆత్మగతములైనప్పుడే అవి అనుభుక్తములు కాదగిన అనుభవాలగుతాయి.

నీ ముందు వట్టి అక్షరాలు కుప్పలు కుప్పలుగ ఉన్నా యనుకో. వాని ప్రయోజనమేమున్నది ? ఆ అక్షరాలను పదాలనుగ, వాక్యాలనుగ గూర్చినప్పుడే వానికి ప్రయోజనం. వానికి అర్థం. అట్లాగే మన జీవితం కూర్చుకుంటూపోయే సంస్కారాలు అక్షరాల కుప్పలువలె క్రమంలేకుండా ఉన్నంత కాలం, వానికి ప్రయోజనంలేదు, భావం ఎట్లా అక్షరాలను పదాలనుగ వాక్యాలనుగ గూర్చి భాషగ జేయగలదో, అట్లే నీ ఆత్మే నీ సంస్కారాలకు ఒక క్రమమేర్పరచి, అన్వయం

చూపి, భావభరితంగా చేయగలదు. భావభరితములైనప్పుడే సంస్కారాలు అనుభవాలై నీకు బ్రియోజనకరములగుతాయి. నీవు ఆత్మదూరుడవై ఉన్నంతకాలమూ, సంస్కారాలు నిన్ను విఫలపరచే పెనుభూతాలనుకో.

ఎప్పుడు వానికి ఆత్మతో సంబంధం ఏర్పరచుకొంటావో-అప్పుడవి అనుభవాలగుతాయి అంటే ఉపభుక్తములు కాగల యోగ్యత వానికి కలుగుతున్నది. గాయకుని జూడుడు. వాని శ్రివణ పుటములపైబడే శబ్దాల నెట్లు శ్రుతి గలిపి, రాగాల నాలపిస్తాడో—ఎందుచేత ? నాదం వానికి వట్టి చప్పుడు కాదు—నాదం భావవ్యంజకం, రాగభరితం ఉపభోగ్యమైన ఆత్మవిలాసం. అట్లాగే కవికి జీవితంలోని సన్నివేశాలు వట్టి చారిత్రిక ఘటనలుకావు. అవి కవిహృదయానికి చిద్విలాసాలు రసతరంగిణులు. త్యాగరాజార్యునకు నాదం ఆత్మగతమైన రసజగత్తు; వాల్మీకికి రామచరిత్రిము ఈశ్వర గుణానుభవం.

సోదరా, మనం సర్వం లౌకికంగా చూస్తాం, అంటే, దృశ్యాన్ని ద్రష్టకు బాహ్యమైనదిగ, విషయాన్ని విషయికి వ్యతిరిక్తమైనదిగ, నామరూపాలను అనాత్మగా చూడడంవల్ల, మనజీవితం అనుభవశూన్యమైపోయింది. ఎప్పుడు మనచుట్టూ మూగే సంస్కారాలను మనవిగ గుర్తించుకొని మనచిత్తంలో లీనం చేసుకో గలుగుతామో, అప్పుడే అవి మన వగుతాయి, అంటే అనుభవాలగుతాయన్నమాట. అవి మనవి కానంత

వరకూ అవి బాహ్య సంస్కారాలుగఉండి, మన జీవితాన్ని అర్థవిహీనంగాను దుర్భరంగాను చేస్తాయి. కాబట్టి సోదరా, సర్వాన్నీ నీ హృదయంతో చూడడం నేర్చుకో, నీలోని భక్తి చక్షువు తెరుచుకొనేటట్లు చెయ్యి. అప్పుడు నీకేదీ బాహ్యం కాదు. సర్వం నీవై పోతావు. అనాత్మకూడ ఆత్మ అయి పోతుంది. "తన్మయీభవన యోగ్యత" నీ కలవడినప్పుడే నీ జీవితం రసభరితమై నీ వనుభవశాలి వగుతావు.

ఆత్మగతమైన అనుభవం నీ జీవితాన్ని రూపాంతరం పొందిస్తుంది. నీ ఇంద్రియాలు ప్రఫుల్లము లగుతాయి. బుద్ధి ప్రజ్వరిల్లుతుంది. అంతఃకరణ నిర్మలమగుతుంది. చిత్తం ఉత్తేజితమగుతుంది. సంసారం నీ క్రీడాభూమి అగుతుంది. అనుభవంలో అంత సత్తా ఉన్నది. అనుభవగతమైన జ్ఞానమే సత్యమైన జ్ఞానం. మిగిలిన వెలుగులన్నీ ఆభాసలు. అనుభవం సత్యాన్ని ముఖాముఖిని చూచేటట్టు చేయగలదు. అందుకనే పెద్దలు సత్యం అనుభవైకవేద్యమన్నారు. దివ్యానుభూతి అన్నా. ఆత్మసాక్షాత్కారమన్నా. రససిద్ధి అన్నా, అనన్యభక్తి అన్నా, ఒక్కటే – కావలసినది అనుభవం...అనుభవం... అనుభవం.

"యోసావసౌ పురుషః సోహమస్మి."

# జీవితపరమార్థం

సోదరా, ఎందుకింకా సంశయాత్ముడవగుతున్నావు? నీలోకి వెలుగురానంతవరకూ జీవితలక్ష్యం తెలియక, మార్గం గోచరించక, సంశయాలతో బాధపడుతున్నావంటే అర్థమున్నది. కాని, పరమార్థం బోధపడిన తర్వాతకూడా ఎందుకు విచారం? మొదట్లో సంశయాలు రావడం మంచిదే. సంశయాలు కలిగితేనే కాని, జిజ్ఞాస బయలుదేరదు. జిజ్ఞాస ప్రారంభమయితేనే కాని, నీలో చూపు వికసించదు. చూపులేనంతకాలం అంధత్వమేగా? సర్వం అయోమయంగా ఉంటుంది. సంశయాలు వేపుకుతింటూ ఉంటాయి.

వెలుగు రానంతవరకూ కన్ను తెరుచుకొన్నా లాభం లేదు. రాత్రి చీకట్లో కండ్లున్నవాడు గుడ్డివాడూ ఒకటే. కాని సూర్యుడుదయించేటప్పటికల్లా, గుడ్డివాడు గుడ్డివాడుగనే ఉంటాడు. కండ్లున్నవాడు కండ్లుతెరవక తప్పదు. సూర్యకిరణాలు నీ కంటి రెప్పలమీదబడి, పొడిచి, కండ్లు తెరిచేటట్టు

చేస్తాయి. ఉదయంవేళ పూవులెట్లా విచ్చుకొంటాయో చూడు. పక్షులింకా గూళ్ళల్లో దాక్కొని ఉండగలవా? ఆ ప్రభాత వాయువులలో రెక్కలు విప్పుకొని, ఉషఃకీర్తనలను పాడుకొంటూ, ఆకాశవీధుల్లో విహరించడం మొదలుపెట్టుతాయి. వెలుగులు చీకట్లను పారద్రోలడమేకాదు, నిన్ను నిద్రనుండి లేపి, నీ జీవితాన్ని మంగళప్రదంగా చేస్తాయి.

ఇప్పుడు తెల్లవారినా, కండ్లు తెరుచుకొన్నా, నీకింకా నిద్రమత్తు సరిగ వదిలినట్లు లేదు. ఒకరాత్రి నిద్ర కనుకనా ఇది? నిద్ర మరిగినవానిని లేవమంటే కష్టంగా ఉంటుంది. నిద్రమత్తు వదలనప్పుడు ఎట్లా ఉంటుంది? ఒకటే ఆవలింతలూ, ఒళ్ళు విరుచుకోవడం, కండ్లు తెరుస్తూఉండడం, మూసుకొంటూ ఉండడం, ఇంకా కలలు కంటూన్నట్లే ఉండడం—ప్రక్క దిగడానికి అయిష్టంగా ఉండడం, చూస్తూనేవుంటాం అట్లాగే తెలివివచ్చినా కూడా మన ప్రాత అభ్యాసాలను వదిలిపెట్టలేము, లక్ష్యం ఎదురుగ కనబడుతున్నా, అది కనబడనట్లే భావించుకొంటాం. త్రోవ కనబడుతున్నా ముందడుగు వేయడానికి భయం వేస్తుంది. రాత్రి పూర్తిగా పోయినట్లూ ఉండదు. సరిగ్గా తెల్లవారినట్లూ ఉండదు. అది సంధ్యవేళ—అజ్ఞానం జ్ఞానం కలిసేచోటు. నీవెప్పుడైనా చూచేవో లేదో, చీకట్లోనుండి చప్పున వెలుగులోకి వచ్చేటప్పుడు. కండ్లు బయర్లు క్రమ్ముతాయి. సరిగ్గా చూడలేము. కొంతకాలానికిగాని, కన్ను వెలుగుకు అలవాటుపడదు. అంతవరకూ ఈ చిరుచీకట్లు

తప్పవు. సోదరా, నీలో వెలుగు ప్రసరిస్తున్నా, కంటిని సరిగ విప్పలేక, ఇంకా చిరుచీకట్లలోవున్నట్లు కండ్లు నులుపుకొంటూ, దిక్కులు చూస్తున్నావు.

కాని భయపడక. కొంచెం నిదానించి చూడు. నీ జీవిత పథంమీద వెలుగు ఎట్లా ప్రసరిస్తున్నదీ నీవు తెలుసుకోగలవు. ఇంతకాలం నీ జీవితంలో ఒక క్రమం, ఒక అన్వయం ఉన్నట్లు నీకు తెలియదు. నీ జీవితమంతా గ్రుడ్డెద్దు చేలో బడ్డట్టుగ ఉన్నది. నీ జీవితంలో ఈ ఘటనలన్నీ ఎందుకు సంభవిస్తున్నదీ. ఏ దిక్కుకు నీవు జరుగుతున్నదీ నీ కవబోధమే కాలేదు. రోజులు గడుస్తున్నా, అసలు నీవు ముందుకు జరుగుతున్న సంగతే నీకు తెలియదు. భూమితోపాటు నీవుకూడా తిరుగుతున్న సంగతి నీకు తెలుసునా ? తెలియదు. బహుశా నీవు చదువుతున్న గ్రంథాలు పెరుగుతూ వుండవచ్చు. నీ వార్జిస్తూండే ధనవాహనాలు వృద్ధి అగుతూండవచ్చు. నీ పేరు ప్రతిష్ఠలు వ్యాప్తిలోకి వస్తూండవచ్చు. నీ సంసారం కూడా తామరతంపరగ విస్తరిల్లుతూ ఉండవచ్చు. ఇంత జరుగుతున్నా, నీ జీవితంయొక్క అంతర్యమేమిటో నీకు బోధపడక పోవచ్చు.

ఎందుచేత ? నీ జీవితాన్ని నీవు సరిగ అనుభవగతం చేసుకొంటూంటేగా, నీ అంతర్యం నీకు బోధపడేది ? నీ అంతర్యమే నీకు దూరమైపోయె, నీ చూపు ఎంతసేపూ నీ జీవితం

లోని బాహ్య ఘటనాఘటనలను. పరివర్తనాలను, దశాంతరాలను తిలకిస్తున్నదే కాని, వాని వెనుక ఎట్టిసూత్రం, ఎట్టి శక్తి, ఎట్టి విధానం నిన్ను నడుపుతున్నదీ నీకు తెలియనప్పుడు, నీ జీవితస్వరూపం నీకెట్లా గోచరిస్తుంది ? కర్తృత్వ జ్ఞాతృత్వ భోక్తృత్వములన్నీ నీవి అనుకొంటున్నావు. వానిని బయటనుండే చూస్తున్నావు. అంతేనేకాని, నీ బుద్ధికి గోచరించకుండా, నీ చూపుకు అందకుండా, నీ లోపల ఒకశక్తి సంచరిస్తున్న విషయాన్ని ప్రత్యక్షంగా గుర్తించి ఉండవు. నీ అహంకృతి నిన్ను లోపలకు పోనిస్తేనా ?

ఏదైనా కావ్యం అర్థం చేసుకోవాలంటే. ఏమిచేస్తావు? పుస్తకాన్ని చేతిలోపెట్టుకొని, పుటలు లెక్కిస్తూంటే, నీకా కావ్యం అర్థమగుతుందా ? మాటలు ఉచ్చరించినమాత్రాన, అది బోధపడుతుందా ? కేవలం ఇతివృత్తాన్ని ఆకళింపు చేసుకొన్నా దాని స్వారస్యం నీ కవగతంకాదు. దాని గర్భంలోకి ప్రవేశించాలి. కవి హృదయంలో నీ హృదయం కలవాలి. అంటే, నీవుకూడా కవివై పోవాలి. కవే కవిని అర్థంచేసుకోగలడు. షేకుస్పియరే షేకుస్పియరును అర్థంచేసుకోగలడని కార్లయిలు మహాశయుడు చెప్పినమాట సత్యం. ఒక కావ్యవిషయంలోనే కాదు, ఈ ఐక్యం అవసరం. దేనిఆంతర్యం తెలుసుకోవాలన్నా, నీ వది అయినప్పుడే నీకు దాని ఆంతర్యం బోధపడుతుంది.

నీ వొక వృక్షరహస్యాన్ని తెలుసుకోవాలంటే, నీవు దానిని బయటనుండి చూస్తున్నంతకాలం, ఆ వృక్షం తన రహస్యాన్ని నీకు తెలుపదు. నీవు ఎప్పుడు వృక్షంలో వృక్షమై పోతావో, వేరుకు వేరై, చర్మానికి చర్మమై, వృక్షరసంతో పాటు వృక్షమంతా ప్రవహిస్తూ, ఆకులో ఆకై, పువ్వులో పువ్వై. పరిమళంలో పరిమళమై, ఆ వృక్ష సర్వస్వంతో ఐక్యమై పోతావో, అప్పుడు ఆ వృక్షజ్ఞానం నీకు కరతలామలక మగుతుంది. అనుభవమంటే అదే—అనుభవం — తాదాత్మ్యం పొందడం. నీకూ నీ విషయానికిమధ్య అంతరం, పార్థక్యం భేదం ఉన్నంతకాలం, అది నీకు దూరమైన విషయమే అగుతుంది. కాని, అది నీకు జ్ఞానంగా పరిణమించదు. మన పెద్దలెందుచేత, జ్ఞానం యోగగమ్యం అని చెప్పుతున్నారు ? యోగం అంటే, ఐక్యంకావడం. ఐక్యమైనప్పుడే, జ్ఞానం లభ్యమగుతుంది—అని దానిభావం.

అయితే, నీవొకటి అడగవచ్చు. నా జీవితం నాదే అయినప్పుడు, నా జీవితంతో ఇంకా ఐక్యంకావడమేమిటి అని అడుగవచ్చు. నిజమే, కాని నీ జీవితం నిజంగా నీదా ? నీ వెవరవు ? నీలో నీ జాతియొక్క స్మృతి వాసనారూపంగా అంకితమైలేదా ? ఈ యుగ పరివర్తనలన్నియు నీకు తెలియకుండానే నీచుట్టూ, నీ లోపలా మూగి నిన్ను కదలించడం లేదా ? నీ వంశసంప్రదాయాలు నీ రక్తంలోఇనికి నిన్నెట్లా విలక్షణునిగ జేస్తున్నాయో నీకు తెలియునా ? నీకొక

పూర్వజన్మఉన్నదని నీవు నమ్మియుంటే, ఆ జననాంతర సౌహృదములకెట్టి సత్తాఉన్నదీ నీ వెప్పుడైనా ఆలోచించు కొన్నావా ? నీవంటే, నీ బుద్ధికి గోచరించే, ఏ పై కించిత్తు భాగాన్నో సర్వస్వమనుకొని, నా జీవితం నాది కాదా అని ప్రశ్నిస్తున్నావు. నీ జీవిత స్రవంతియొక్క పుట్టుక, నీకు తెలియ దాయె. ఈ నదిలో ఎన్ని ఉపనదులు వచ్చిపడుతున్నదీ, నీ వెరుగవాయె. ఈ నది ప్రవహించే దేశకాలాల స్వరూపాన్ని, నీవు సరిగ బోధచేసుకోలేదాయె. ఈ నది ఎన్ని వంకరటింకర్లు తిరుగుతున్నా, ఏ దిక్కుకు ప్రవహింపజూస్తున్నదీ — ఆ భావి స్థితి నీ కగోచరమాయె. నీ జీవితాన్ని గురించి నీ కేమి తెలుసు నని నా జీవితం నాదికాదా అని ప్రశ్నిస్తావు ? పైపైన కన బడుతున్న నాలుగు సన్నివేశాలను జ్ఞప్తికి తెచ్చుకొని, నా జీవి తం నాకు తెలుసును అని భ్రమిస్తున్నావు.

నీవు భూతకాలంతోగాని, భవిష్యత్తుతోగాని సంబంధం లేకుండా, ఈ ఒక్క క్షణంలో మెరిసిపోయేవాడవైతే—ఇదే నా జీవితమని నీవు ప్రకటించుకోవచ్చు. నీ భూతకాలంలో నీ జ్ఞప్తియందున్నది ఏ సహస్రాంశముంటుందో ? భవిష్యత్తు నీ కింకా మరుగై యుండె. వర్తమానకాలంలోనైనా, ఏ కించిత్తు భాగమో నీ కెరుకలో ఉండుగాక. నీ పునాది, నీ కట్టడం, నీలో ఇంకా నిర్మాణం కాబోయే అంతస్థులు నీకు తెలియ కుండా, నీ జీవితం ప్లాను నీకు ఎట్లా బోధపడ్తుంది సోదరా ?

కొంచెం నిదానించి యోచించుకో, నీ జీవితమే నీనుండి ఎంత మరుగై ఉన్నదో.

అయితే, నా జీవితం నాకెట్లా తెలుస్తుందనేగా నీసంశయం ? నీ జీవితమర్మం నీకు దృగ్గోచరమయ్యేవరకూ నీకీ సంశయం బాధిస్తూవుండేమాట నిశ్చయమే. నీ జీవితానికంతకూ, నీ పూర్వజీవితానికి నీ ఉత్తర జీవితానికీ ఏది ఆధారభూతమో, దేని నాశయించుకొని, ఈ ఘటనాపరంపరలు సంభవిస్తున్నాయో తెలుసుకొనేవరకూ, నీ జీవితం అయోమయంగా ఉండేమాట నిశ్చయం ఆధారంయొక్క క్రియా విశేషమే ఆధేయం. ఆధేయం ఆధారంతో ఐక్యమైనప్పుడే నీ జీవితాధేయంయొక్క ప్రణాళిక నీ కవగతమవుతుంది. నీ జీవితంయొక్క ప్లాను నీకు అవగతంకావాలంటే, అనగా నీ జీవితంయొక్క పరమార్థం నీకు బోధపడాలంటే నీ మూలంయొక్క ఐక్యజ్ఞానాన్ని సంపాదించాలి.

ఆ మూలాన్నిబట్టే నీ జీవితం అన్వయమగుతుంది. అప్పుడే నీ జీవితావస్థలయొక్క ప్రయోజనమూ చరితార్థత గోచరిస్తుంది, నీ మూలంతో నీ వైక్యమై నీ ఆత్మస్వరూపం నీకు సాక్షాత్కారమైందా, సర్వం నీకు కరతలామలకమగుతుంది. ఆ మౌలికజ్ఞానం దివ్యజ్యోతిఅయి, నీ జీవితంయొక్క మారుమూలల నన్నిటిని ప్రకాశింపజేస్తుంది. నీ గర్భితశక్తులన్నీ నీ హస్తగతమగుతాయి, నీ జీవితాన్నికముందు, ఎక్కువ ప్రీతి

శతో, ఎక్కువ పరాక్రమంతో, ఎక్కువ ఆనందంతో నిర్వహించగలుగుతావు. అదే ఆత్మోపలబ్ధి.

నీ మూలమంటే, అది వట్టి నిర్గుణతత్వమనుకొంటున్నావేమో ? కాదు. అది సమస్తములైన వెలుగులకు, క్రియాశక్తులకు, ఆనందక్రీడలకు మూలం, నిదానం. అది తెలిస్తే, సర్వం తెలిసినట్లే, అదే నీ జీవితంయొక్క పరమరహస్యం. అది యింతకాలం నిగూఢమై ఉండడంచేతనే. నీబుద్ది దానిని కొంచెం చూచాయగ ఊహించగలిగినా, నీ సంశయాలు తెగలేదు, నీ హృదయగ్రంధులు విడలేదు. చిరుచీకట్లింకా క్రమ్ముకొని ఉండడంచేత, నీవు నిద్రమత్తులో ఉన్నావు, ఇక జాగుసేయక మేలుకో—నీ ఆత్మ ఎట్టి వెలుగుతో, ఎట్టి చిద్విలాసంతో, ఈ జగన్నాటకంలో ఎట్టిభూమి కనుదాల్చి నాట్యం సలుపుతున్నదో ప్రత్యక్షంచేసుకో, అహో ! ఎట్టి సౌభాగ్యం నీది ? నీ రూపము, నీ ఆహారం, నీ వాచికం, నీ భూమిక, నీ నాట్యరంగం, సర్వం జగన్నాటక సూత్రధారుని చిద్విలాసమైన తర్వాత, నీ జీవిత విధానము ఎట్టి విలాసమైనదీ వేరుగ జెప్పవలెనా ?

"కల్యాణతమం రూపం పశ్యామి"

# భేదాభేదం

సోదరా, నీవు పడుతూండే బాధ ఏదో నాకు తెలిసింది. ఐక్య జ్ఞానమే నిజమైన అనుభవమని నేనంటున్నానుగదా అవి, నీవు తికమకపడుతున్నావు. ఎందుచేత ? ఐక్యజ్ఞానంలో బాహ్య వస్తుజ్ఞానం నశిస్తుందనీ, అప్పుడు నిప్పుకూ నీళ్ళకూ భేదముండదనీ, కాబట్టి బ్రతుకుకే ఆస్కారం ఉండదనీ కాదూ, నీ సంశయం ? సోదరా, నీవు వట్టి పిచ్చివాడవు. ప్రపంచం ఏమైపోతుందనుకొన్నావు ? అది లేకుండా పోతుందనా? ప్రపంచంలోని వస్తుజాలమంతా ఒక గడ్డకట్టుకొని పోతుందనా ? నామరూపాలన్నీ గగనకుసుమము లగుతాయనా ? నీటికి ద్రవత్వం, నిప్పుకు ఉష్ణంలేకుండా వాని వాని విశిష్టలక్షణాలను, ధర్మాలను గోలుపోతాయనా ? ఎవరు నేర్పారోయి ఈ మెట్ట వేదాంతం ?

బంగారంతో చేసిన ఆభరణాలున్నాయనుకో—కంఠె, మురుగులు, ఉంగరాలు, వడ్డాణం మొదలైనవి. ఇవన్నీకూడా

బంగారమేగా? ఎప్పుడు ఈ భిన్నాభరణాలలోని లోహం ఒక్కబంగారమే అని తెలిసికొంటావో, అది ఐక్యజ్ఞానంకాదూ? ఇది సిద్ధించిన వెంటనే కంఠె మురుగు అవుతుందా? మురుగు ఉంగరమగుతుందా? అవన్నీ స్వర్ణమయములని తెలుసుకుంటే వాని ఆకారాలు, ప్రయోజనాలూ నష్టమగుతాయా? వానిని ఎక్కడ, ఎట్లా ఉపయోగించుకోవాలో, అట్లాగే ఉపయోగించు కొంటూంటాం. ఆకృతులు ఆకృతులుగానే ఉంటాయి. లోహం ఒక్కటైనా స్వరూపాన్ని నష్టపరచుకోని నామరూపాలన్న మాట ఆకారాలు. స్వరూపాన్నిబట్టి విలువ కట్టుతాం. ఆకారాలనుబట్టి ప్రయోజనాలను తెలుసుకొంటాం.

అట్లాగే కుండ, చట్టి పిడతా ఉన్నాయనుకో ఇవన్నీ మట్టిపాత్రలేగా. అంత మాత్రంచేత, వాని ఉపయోగం పోతుందా? అవన్నీ మృణ్మయములని తెలుసుకొన్నా, ఆ మూర్తులభేదాన్నిబట్టి, వానిని వాడుకొనేరీతిగ వాడుకొంటూనే ఉంటాం. అంతేకాదు, అవన్నీ మృణ్మయములని తెలుసుకోవడంవల్ల, వానిని ఉపయోగించే విధంకూడా బాగా బోధపడుతుంది. ఎందుకంటే, అవన్నీ మట్టిపాత్రలు. మట్టికి లోహంలో ఉన్న గట్టితనం ఉండదు. కాబట్టి మట్టిపాత్రలను జాగ్రత్తగా వాడుకోకపోతే, అవి పగిలిపోతాయని తెలుసుకొంటాం. కాబట్టి స్వరూపజ్ఞానం మూలంగా వ్యావహారిక ప్రయోజనంకూడా సక్రమం సమర్థం అగుతుంది. పారమార్థిక

వ్యావహారికములు పరస్పరం విరుద్ధములని అనుకోక. పర మార్థం అవగతమైన కొద్దీ, వ్యావహారికంకూడా ఎక్కువ పుష్టి-కరమగుతుంది. కాబట్టి నీ జీవితాన్ని ఎక్కువ సుఖవంతంగా చేసుకోవాలంటే, అందలి పరమార్థాన్ని అనుభవగతం చేసుకోవడం అవసరమని గ్రహించు.

ఇప్పుడు సైన్సు వృద్ధికావడంవల్ల, వస్తువుల ఉపయోగం తగ్గిందా ? ఇంకా ఎక్కువైంది. అగునా, కాదా ? ఇప్పుడు సౌండు, హీట్, లైట్, ఎలెక్ట్రిసిటి, మాగ్నెటిజం—శబ్దం, ఉష్ణం, వెల్తురు, విద్యుచ్ఛక్తి, ఆకర్షణశక్తి—ఇవన్నీ స్థూలంగా వేరువేరులక్షణాలు కలిగి, వేరు ప్రయోజనాలకొరకుపయోగ పడుతున్నా, ఇవన్నీకూడా ఒక్క శక్తియొక్క భిన్నరూపాలే; కాని స్వరూపతః వేరుకావు — (modes of energy) అని సైన్టిస్టులు చెప్పుతున్నారు. వీనిస్వరూపం ఒక్కటే అని తెలుసుకొన్న తర్వాత, ఏమి జరిగింది ? ఒకదాని నింకొక రూపంలోకి మార్చుకోగలిగిన ఉపాయం అలవడింది — (transformation of energy) ఇప్పుడు విద్యుచ్ఛక్తినుండి ఉష్ణాన్నిగాని, శబ్దాన్నిగాని, వెలుగునుగాని, ఆకర్షణ శక్తిని గాని పొందగలుగుతున్నాం. వస్తువుల సూక్ష్మజ్ఞానం తెలిసిన కొద్దీ, వస్తువుల ప్రయోజనంకూడ ఎక్కువగుతుందేకాని తగ్గదు. ఇంజనీర్లకు లోహాల, దారువుల, శిలల జ్ఞానం ఎక్కువగ ఉండడంవల్ల, వానిని ఏ విధంగా, ఏ రీతుల ఉపయోగించుకో

వచ్చునో, ఆ ప్రకారం వానిని ఎక్కువ సమర్థతతో నిర్వహింప గల్గుతున్నారా, లేదా?

పరమార్థమంటే ఏమిటి? అర్థమంటే వస్తువు. పరమార్థమంటే పరమవస్తువు. మనకు కనబడే వస్తుజాలంయొక్క రూపాలు నిరంతరం మారుతున్నా, వానియొక్క అసలు తత్వం మాత్రం మారకుండా ఉంటుంది. మారని దానిని పరమార్థమంటాం. మారేదానిని అర్థమంటాం. నగలు మారుతూ ఉంటాయి. బంగారం మారదు. కంటెను కరిగించి కంకణంగా చేయించవచ్చు. కంకణాన్ని మార్చి ఉంగరాలుగ జేయవచ్చు. ఈ మూర్తులు మారినా, వీనిలోని లోహంమాత్రం మారదు. కాబట్టి నగలకు పరమార్థం బంగారం అని చెప్పవచ్చు. శక్తి రూపాలైన ఉష్ణం, శబ్దం, వెలుగు, విద్యుచ్ఛక్తి మారుతూ ఉంటాయి. కాని వీనిలోని శక్తిమారదు. కాబట్టి వీనికన్నిటికి శక్తి పరమార్థమని చెప్పవచ్చు.

అట్లాగే ప్రపంచంలోని రూపాలన్నీ నిరంతరం మారుతున్నాయి. కాని వస్తుతత్వం మాత్రం మారటంలేదు. ఆ వస్తుతత్వమే ప్రపంచానికి పరమార్థమని తెలుసుకో. ఈ విశ్వానికి ఉపాదానంగా ఒక మారనివస్తువు ఉన్నదంటే, మారుతూండే రూపాలు మిథ్యలనా? కాదు, కాదు—ఎన్నటికినికాదు. ఒక మారనివస్తువు ఈ వస్తుజాలంలో వ్యాప్తమై ఉన్నది. అది తన సుస్వరూపాన్ని మార్చుకోకుండా, ఈ వస్తువుల ఆకృతు

లను మాత్రం మారుస్తున్నదన్నమాట. బంగారం తాను మారకుండా ఆభరణాలను మారుస్తున్నట్లు, దూది తాను మారకుండా నూలుగాను, బట్టగాను మారుతున్నట్లు. ఒక వస్తువు యొక్క రూపం మారుతున్నదంటె, ఆ వస్తువు పోయిందనా అర్థం ? దానిరూపం మిధ్య అనా ? కాదు. ప్రతివస్తువుకు మారేలక్షణమూ ఉన్నది, మారని లక్షణమూ ఉన్నది. మారే లక్షణాన్ని తటస్థలక్షణం అంటాము. మారని లక్షణాన్ని స్వరూపలక్షణం అంటాం. స్వరూపలక్షణమే పరమార్థం. తటస్థ లక్షణం వ్యావహారికం. ఇవి పరస్పరం వ్యతిరేకములుకావు. వీనిని సాపేక్షికము లంటే అనవచ్చు. ఎందుచేతనంటే, మార్పులేనిది అనేభావమే నీలో లేకపోతే మార్పు అనే భావమే నీకు మనోగతం కాజాలదు. నీబుద్ధికి ఈ రెండూ గోచరిస్తున్నాయి రెండు దిక్కులులాగు—ఒకటి మారేది, ఒకటి మారనిది, ఒకటి అనిత్యం, ఇంకొకటి నిత్యం నిత్యానిత్యములు నీ జ్ఞానంయొక్క రెండు దిక్కులు. నీ జ్ఞానంలో ఏ యొకదిక్కు లేకపోయినా, నీ జ్ఞానం సమగ్రంకాదన్నమాట. ఎప్పుడు నిత్యానిత్యములను సమంగా, సాపేక్షికంగా, అనుభవగతం చేసుకొంటూఉంటావో, అప్పుడే నీ అనుభవం సంపూర్ణమగుతుంది.

బయటకు స్థూలంగా కనబడే లక్షణాలేమిటి ?—అనేకం, భేదం, క్షరం. ఈ లక్షణాలు వేనినిబట్టి అవగతంచేసుకోగలుగుతున్నావు—నీలో వీనికి సాపేక్షికములైన ఏకం, అభేదం, అక్షరమనేజ్ఞానం లేకపోతే ? తటస్థలక్షణాలనుబట్టి ప్రయోజ

నాలను నిర్ణయించుకొంటున్నాము. స్వరూపలక్షణాలనుబట్టి వాని మూల్యాన్ని, ఐక్యాన్ని, పరమార్థాన్ని అవగతం చేసుకొంటున్నాం. ఈ రెండూ వేరువేరుగ, ఒకదానిబయట నొకటి లేవు. ఒకదానివెంట నొకటి అవినాభావంగా ఉంటూనే ఉన్నాయి. ఈ మర్మాన్ని అనుభవగతం చేసుకోవడంవల్ల, విశ్వం మరింత యథార్థమగుతుందికాని, ఉఠ్ళక్కి కాదు. నగల విలువ స్వర్ణజ్ఞానంవల్ల గలిగేటట్లే, నీ జీవితంయొక్క మూల్యాం అందలి పరమార్థంవల్ల ఎక్కువగా బోధపడుతుంది. నీలోని మూలవస్తువు ఒక్కటని తెలుసుకొంటేనేకాని, నీ జీవితంలో గూడా ఐక్యతను, క్రమాన్ని, పద్ధతిని తెలుసుకోలేవు నీవు రసస్వరూపుడవని అనుభవగతం చేసుకొన్నప్పుడే, నీ జీవితం కూడా రసమయమగుతుంది. నీవు శివస్వరూపుడవని తెలుసుకో నీ జీవితంకూడా మంగళప్రదమనే విషయం హృద్గత మగుతుంది కాబట్టి సోదరా, ఆత్మజ్ఞానంవల్ల, నీ బ్రతుకు శూన్యమగుతుందని అనుకోవడంతప్పు. ఆత్మజ్ఞానంవల్ల, నీ జీవితం చిద్విలాసంగా, రససమృద్ధంగా, అనుభవం చేసుకోగల్గుతావు. నీ జీవితానికి వెలుగిచ్చేది, బలమిచ్చేది, పుష్టినిచ్చేది. ఆనందమిచ్చేది, ఆత్మజ్ఞానం — కాబట్టి సోదరా, పరమార్థాన్ని తెలుసుకొంటూ, నీ జీవితాన్ని సఫలపరచుకో—నీవు ధన్యుడవగుతావు.

ఈవిశ్వం మిథ్యయని మెట్టవేదాంతులు చెప్పే మాటను విశ్వసించకు. దీనిని మిథ్య అన్నావా, నీ సత్తానే నీవు మిథ్య

చేసుకొంటావు. విశ్వంలో ఏది ప్రకాశిస్తున్నదో, అదే నీలోనూ వెలుగుతున్నది. ఏది నీలో భాసిస్తున్నదో, అదే విశ్వంలోనూ భాసమానమగుతున్నది. ఏదది? అది పరంజ్యోతి. ఆ పరం జ్యోతి నీ సుస్వరూపం. దానివెలుగే ఈ జగత్తు. జ్యోతి వేరు, వెలుగువేరు అని కుతర్కం చేయక వెలుగుయొక్క ఘన స్వరూపం జ్యోతి. జ్యోతియొక్క పరివ్యాప్తి వెలగు. నీలోని పరంజ్యోతే దాని పరివ్యాప్తిలో ఇన్ని ప్రకారాలుగ, ఇన్ని తళుకులతో, ఇన్ని కళలతో విరాజమానమగుతూంటే, విశ్వం మిధ్య అని ఎట్లా అనగలవు సోదరా! అట్టి చింత నీకు కలి గిందా, నీ కళ్ళు పోతాయి. ఎప్పుడూ అట్టి భ్రమలో పడకు. నీవుకూడా నీ కర్మక్షేత్రంలో నిలవబడి గీతాకారునివలె ఇలా ఉద్ఘోషించు—

"పశ్యమే పార్థ రూపాణి శతశోధ సహస్రశః
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ."

# మాయ కాదు, లీల

సోదరా, ఎందుకు నవ్వుతున్నావు ? నా సాహసం జూచేనా ?

ఈ జగత్తు మిథ్యఅని శ్రీశంకరాదులవంటి మతకర్తలు ఘోషిస్తూంటే, ఈ జగత్తు మిథ్యకాదు, సత్యమేనని నేను జంకూ గొంకూలేకుండా చెప్పానా ? నీకది సాహసంగా కనబడడంలో ఆశ్చర్యంలేదు. ఎందుకంటావా, ఈ వాదం మన దేశంలో అస్థిగతమైపోయింది. బిచ్చగాండ్రుకూడా "ఈ లోకమంతా మాయరా" అంటూ పాడుతూ ఉంటారు మనదేశంలో. వేదాంతమంటే మాయావాదమనే లెక్కక్రిందకు వచ్చింది. ఇట్టి సందర్భంలో నే నా వాదాన్ని చులకనచేశానంటే, నీకు నవ్వేకాదు, కోపంకూడ వచ్చినా రావచ్చు. కాని కొంచెం యోచనచెయ్యి నిర్మలచిత్తంతో.

మన జ్ఞానమంతా భ్రమప్రమాదాలతో కూడుకొని ఉన్నమాట నిశ్చయమే. ఒక వస్తువునుజూచి ఇంకోవస్తువు అని పొరబడుతూ ఉంటాం. ఒక దృశ్యం స్థూలంగా ఒక విధంగా కనబడుతుంది, సూక్ష్మంగాచూస్తే ఇంకోవిధంగా కనబడు

తుంది. మన ఇంద్రియాలను పూర్తిగ నమ్మకూడనిమాట నిజమే. అవి మనలను ఒక్కొక్కప్పుడు మోసగిస్తూ ఉంటాయి. సత్యాన్ని వెల్లడించడానికి బదులు మరుగు చేస్తాయికూడాను. ఇంద్రియ గోచరమయ్యేదంతా నిజమని నమ్మడానికి వీలు లేకుండా పోతున్నది.

ఎన్నిమార్లు మనం తాడును జూచి పామని, పామును జూచి తాడనీ అనుకోలేదు ? అది మనం సరిగా చూడకపోవడంవల్ల, ఆ భ్రమ కలిగిందనుకొంటే, ఈ భూమి నెంతసేపు ఎంత జాగ్రత్తగ చూచినా బల్లపరుపుగానే కనబడుతుంది. కాని సైంటిస్టులు ఈ భూమి గుండ్రంగా ఉన్నదని రుజువు చేస్తారు వారెంత రుజువుచేసి మనలను నమ్మించినా, భూమి ఇంకా మనకు బల్లపరుపుగానే కనబడుతుంది. సూర్యుడు తిరుగుతున్నాడని మనమంటాం. కాదు, భూమే సూర్యుని చుట్టూ తిరుగుతున్నదని సైంటిస్టులంటారు — మనలను ఒప్పిస్తారు గూడాను. అట్లా ఒప్పుకొని చూచినా, సూర్యుడు తిరుగుతున్నట్లే కనబడుతుంది మన కండ్లకు. సైంటిస్టు మాత్రం ప్రొద్దు పొడిచింది, ప్రొద్దు గ్రుంకింది అని అనడూ ?

చూడు, ఎడారిలో ఎండవేళ ఎండమావులు కనబడుతాయి. వానిని జలాశయాలనుకొని పొరబడుతాం. తృష్ణతో బాధపడే మృగాలేకాదు, సైంటిస్టులు కూడా పొరబడుతారు. వాయుతరంగాలమీద సూర్యకిరణాలు పడ్డప్పుడు, నీటి అలలు

వలె గనబడుతాయని సైంటిస్టులు సమాధానం చెప్పుతారు. సైంటిస్టులకు గూడా దూరపుకొండలు నునుపుగానే కనబడుతాయి. అదేమిపాపమో.

ఇదంతా భ్రమఅంటావా ? భ్రమవీడిన తర్వాతైనా, యథార్థం గోచరించాల్సిందేగా ? తాడును పామను కొన్నామంటే అది భ్రమ కావచ్చు. ఎందుకంటే, అది తాడనే యథార్థం తెలుసుకొన్న తర్వాత, అది తాడుగానే కనబడుతుంది కాని పాముగా కనబడదు. కొండ నున్నగా ఉండదని తెలుసుకొన్న తర్వాతగూడా, దూరానికది నున్నగానే కనబడుతుందే. ఒక పొడుగు రైలురోడ్డును చూస్తున్నావనుకో. ఎట్లా కనబడుతుంది ? పోను పోను, రైలుపట్టా లంత కంతకు దగ్గరకు వస్తున్నట్లు కనబడుతాయి. ఇంకా కొంతదూరానికి కలుసుకొని పోయినట్లే కనబడుతాయి. అది నిజంగాదని మనకు తెలుసు. తెలిసినా మన కండ్లకట్లాగే కనబడుతుంది

ఒక ఇంద్రియాలేనా మనల నిట్లా తికమకలు పెట్టేవి? మన బుద్ధికూడా అట్టిదే. ఒకప్పు డొకవిధంగా తోస్తుంది. ఇంకొకప్పుడు ఇంకోవిధంగా తోస్తుంది. ఇంద్రియాలను, బుద్ధినీ నమ్ముకొని పరిశోధించే సైంటిస్టుల బుద్ధికూడా నిలకడగా ఉండదు. వారు తమ సిద్ధాంతాల నెన్ని మార్చుకోలేదు ? ఇంకా మార్చుకొంటూనే ఉన్నారు. ఫలానిసిద్ధాంతం స్థిరమని వారు కూడా చెప్పరు. పరిశోధనలనుబట్టి నేటికిట్లా తోస్తు

న్నది, రేపటి పరిశోధనలో ఇంకా క్రొత్త విషయాలు కన పడితే, ఈ సిద్ధాంతాన్ని మార్చుకోవలసి వస్తుంది, మార్చు కొంటాం అంటారు.

మన బుద్ధిఅయినా, దేనిమీద ఆధారపడి పనిచేస్తుంది ? అది స్వతంత్రంగా ఆలోచిస్తుందా ? ఇంద్రియానుభూతిని పురస్కరించుకొని బుద్ధి ఇంకా ముందుకు గొంతదూరం పోవ డానికి చూస్తుంది. అసలు వస్తువుల స్వరూపమేమిటో మనకు తెలుసా ? ఇంద్రియాలిచ్చే రిపోర్టులమీదే మనం ఆధారపడు తున్నాం. ఒక రాయి ఉన్నదంటే ఏమిటి? కళ్లు రూపాన్ని రంగునూ చెప్పుతాయి. చెయ్యి కాఠిన్యాన్ని తెలుపుతుంది. ఆకారాన్ని కాఠిన్యాన్ని కలుపుకొని, ఈ రెండుగుణాలు కల వస్తువును రాయి అని చెప్పుతున్నాం ఈ రెంటును మినహా యిస్తే. అసలదేమిటో ఎవరు చెప్పగలరు ?

ఇంద్రియానుభూతి అంటే ఏమిటి ? వస్తువుకు ఇంద్రి యాలకుగల జ్ఞానసంబంధం ఆ జ్ఞాన సంబంధం జ్ఞాతదికాని వస్తు వుదికాదు గదా ? కాబట్టి జ్ఞాత వస్తువులను పోల్చుకొనే విధా నాన్నే ఇంద్రియానుభూతి అంటున్నామన్నమాట. ఈ జగత్తు యొక్క జ్ఞానంకూడా మన అనుభూతి అన్నమాటే. ఈ అను భూతినిమించి ఈజగత్తు ఏమిటో మనకు తెలుసునా? సైంటిస్టులు జగత్పదార్థం ఒకటి ఉండిఉండాలని నిశ్చయం చేసుకొని, దాని స్వరూపం తెలుసుకోవడం కోసం పరిశోధనలు చేస్తున్నారు -

వారి పరిశోధనలింకా సాగుతూనే ఉన్నాయి—పూర్తి అయ్యే దెప్పటికో.

ఒకప్పుడన్నారు సైంటిస్టులు ఈ జగత్తంతా - చేతనా చేతనములన్నీ—పరమాణువుల కూడిక అని నిర్ధారణచేశారు. ఆ పరమాణువునే 'యాటం' అని అన్నారు. ఈ యాటం ఏమిటో చాలారోజులవరకూ తెలిసిందికాదు. అది ఒక సూక్ష్మ కణం—Particle అన్నారు. దాని నిక విభజించడానికి వీలు లేనంత సూక్ష్మాతిసూక్ష్మ మన్నారు ఈ సూక్ష్మకణాలన్నీ ఎట్లా కలుసుకొంటున్నాయో, వాని కలయికవల్ల ఇన్ని రకరకాలమూర్తు లెట్లా బయలుదేరుతున్నాయో బోధపడటం లేదన్నారు.

ఇట్లా కొంతకాలం తర్కించుకోగా, ఈ 'యాటం' ఒక్కటి కాదు. "ఎలెక్ట్రాన్" "ప్రోటాన్" అనే రెండురకాల విద్యుత్కణాలవల్ల ఏర్పడ్డదన్నారు. 'యాటం' ఒక్కొకప్పుడు బ్రద్దలగుతుందట—ఎప్పుడు ఏ యాటం, ఎందుకు బ్రద్దలగు తుందో తెలియదట—బద్దలైనప్పుడు "యాటం" ప్రోటాన్ అనే కణంగాను, ఎలెక్ట్రాన్లనే విద్యుత్తునుశ్లుగాను విడిపోతా యట. కాని, సూర్యునిచుట్టూ గ్రహాలు తిరుగుతున్నట్లు "ప్రోటాను" చుట్టూ ఎలెక్ట్రాన్లు తిరుగుతూ ఉంటాయట. ఇట్లా తిరుగుతూ తిరుగుతూ, కొన్ని ఎలెక్ట్రాన్లు ఎందుకో, అకస్మాత్తుగ తామాశ్రయించుకొన్న ప్రోటానును వదిలివేసి

ఇంకో ప్రోటాను పరిధిలోకి ఎగిరి, దానిచుట్టూ తిరగడం మొదలు పెట్టుతాయట.

ఇక ఏమిటీ "ప్రోటోను" కణం అంటే — పరిశోధన చేయగా ఇది విద్యుచ్ఛక్తియొక్క ఒక్క సంపుటం-ఒక పేకెట్టు-అని తెలుసుకోగల్గుతున్నారు. ఇక ఏమి తేలింది? జగత్తంటే అణువుల కూడిక—అణువు ప్రోటోను ఎలెక్ట్రోనుల కూటం. ఇవి నిరంతరం గ్రహకూటాలవలె చుట్టుకొంటూ, పరిధులను మార్చుకొంటూ తిరుగుతున్నాయి. ఎలెక్ట్రాన్లు, ప్రోటోన్లనే కణాలు తిరిగి విద్యుచ్ఛక్తి ప్రవాహంలో ఏర్పడే సుడిగుండాల వలె కనపడుతున్నాయి. సైంటిస్టుల పరిశోధన ఇంతవరకూ సాగింది. స్థూలంగా కనబడే ఈ జగత్తు ఒక్క శక్తియొక్క విశ్వతోముఖ సంచారమని సిద్ధాంతీకరించినట్లుగ కనబడుతున్నది,

జగత్తుయొక్క స్వరూపం శక్తే అయితే, ఈ శక్తి చేతనమా, అచేతనమా? మళ్ళీ తర్కం ప్రారంభమైంది. జగత్తులో శక్తి ఏమి చేస్తున్నది — నిలకడగా ఉండటంలేదు— కదులుతున్నది, త్రుళ్ళుకుంటూ పరుగెత్తుతున్నది, అలలు కట్టుతున్నది. నురుగులు గ్రక్కుతున్నది. ఈ జగత్తు ఒక శక్తియొక్క తాండవమా అన్నట్లు కనబడుతోంది. దేని నిమిత్తం ఈ ఆందోళనమంతా? ఇదంతా గ్రుడ్డి కదలికా,

ఈ కదలికలో ఏదైనా ఉద్దేశం, పద్ధతీ, లక్ష్యమూ, విధానం గోచరిస్తున్నదా ?

జగత్తుయొక్క మూలపదార్థం శక్తి అనే ఒప్పుకొందాం. ఆ శక్తి ఆందోళన పడి పడి, మొదట పృథివియందు రాసాయనిక శక్తిగ వెల్లడీ అయింది. రాసాయనికశక్తి మథనపడి మథనపడి చేతనములలో ప్రాణశక్తిగ బరిణమించింది. ప్రాణశక్తి వికాసం పొంది పొంది, జంగమాదులలో మేధగా, మనస్సుగా విలసిల్లింది. మనస్సు మానవునిలో బుద్ధిగా, చిత్తంగా, హృదయంగా, అహంకృతిగా బయలుదేరింది. కాబట్టి శక్తియొక్క సంచారమంతా తనలో గర్భితమైన స్వరూపాన్ని అభివ్యక్తం చేసుకోడానికే అయితే, ఆ శక్తిని అచేతనమని ఎట్లా అనగలం ?

ప్రకృతి శాస్త్రజ్ఞులు జగత్తు శక్తిమయమని తేల్చడమే కాకుండా, ఈ శక్తి సంచారంలో క్రమవికాసం—ఎవల్యూషను—ఉన్నదని సిద్ధాంతీకరించారు. ఎవల్యూషను అంటే వ్యక్తంకానిది క్రమంగా అభివ్యక్తం కావడమేకాని, మొదట్లో లేనిది ఒకటీ లవచ్చి. చేరడమనేది కాదన్నారు—కాబట్టి జగత్తు శక్తిమయం—ఆ శక్తి మొదట్లో రాసాయినికంగాను, తర్వాత సచేతనంగాను, పిమ్మట మనోమయంగాను, అనంతరం విజ్ఞానంగాను క్రమానుగతంగా వికసిస్తున్న సంగతి ప్రత్యక్ష విషయమని స్పష్టపడుతున్నది. కాబట్టి మన ఇంద్రియానుభూతి ఎంత

ప్రమాద భూయిష్ఠమైనదైనా, మనబుద్ధి ఎంత నిలకడలేక పోయినదైనా, మన వైజ్ఞానికుల పరిశోధనలవల్ల, ఈ జగత్తు శక్తియొక్క స్వరూప ప్రకాశమని నిర్ణయమగుతూంటే, ఇదంతా వట్టికల్ల అని ఎట్లాకొట్టివేస్తావు, సోదరా ?

మన ఋషులు యోగదృష్టితో జూచి, ఈ జగత్తు చిచ్ఛక్తియొక్క (Conscient Force) క్రియాకలాప మన్న దానినే, ఆధునిక వైజ్ఞానికులు పరిశోధనలుచేసి, ఈ జగత్తు శక్తియొక్క క్రీడ అని (Play of Energy) నిర్దేశిస్తున్నారు. సోదరా, ఏ చిచ్ఛక్తి నీలో జ్ఞానశక్తిగ, క్రియాశక్తిగ, ఇచ్ఛాశక్తిగ విలసిల్లుతున్నదో, ఆ శక్తే ప్రకృతిలో క్రమానుగతంగా భౌతిక, రాసాయనిక, ప్రాణ, మనోమయ శక్తులుగ అభివ్యక్తమగుతున్నది కాబట్టి జగత్తును తెలుసుకోవడమంటే, నిన్ను నీవు తెలుసుకోడం కాదూ ? నీవు మిధ్య అయితే జగత్తుకూడా మిధ్యే. జగత్తు మిధ్యఅయితే నీవుకూడా మిధ్యే. ఎందుచేతనంటే—నీవూ జగత్తూకూడా ఒక్క శక్తియొక్క మూర్తులే. చిత్తు తప్ప వేరువస్తువేమున్నది నీలోగాని, ఈజగత్తులోగాని?- చిత్తపః ! సర్వం చిన్మయం.

ఇంకా మిధ్యావాదానికి తావెక్కడ ? మనఋషులు ఈ జగత్తుయొక్క మూలతత్వం "యతః" దేనినుండి అని ప్రశ్నించి ఉపాదానకారణం బ్రహ్మమేనని తెలుసుకోమన్నారు జగత్తులో వ్యక్తమయ్యే అన్నమయ,ప్రాణమయ, మనోమయ,

విజ్ఞానమయ రూపాలన్నీ తరతమఃగా పరమపురుషుని చిద్విలాసాలే అని ఉపనిషత్తులు వర్ణించినాయి. గీతాకారుడు జగత్తు అపరాప్రకృతి అయితే, సచ్చిదానందం పరాప్రకృతి అని రెండూ బ్రహ్మముయొక్క ప్రకృతులుగ నుడివినాడు. తాంత్రికులు భూతయోనిని శక్తిస్వరూపిణీ, అని సంబోధించినారు. భాగవతోత్తములు ఈ జగత్తు హ్లాదినీ శక్తియొక్క లీలాభూమి అని కీర్తించినారు. భరతమునికి సృష్టి స్థితి లయములు నాట్యకళా ప్రదర్శనంగా గోచరించినవి. సోదరా, ఇకనైనా మిథ్యావాదాన్ని వీడి, నీకూ జగత్తుకూ గల ఐక్యస్వరూపాన్ని అనుభవగతం చేసుకో.

"సర్వమాత్మైవాభూత్, తత్కేన కం పశ్యేత్
కేన కం విజానీయాత్."

# శక్తి విలాసం

సోదరా, సర్వం శక్తిమయమని తెలుసుకొనికూడా, నీ వింత దుర్బలుడవై ఉండడానికి కారణమేమిటి ? శక్తి అన్నేది నీ వెంతవరకూ నీ బయటనున్నట్లు చూస్తున్నావే కాని, నీ లోపల ఉన్న శక్తిని గుర్తించుకోవటంలేదు. శక్తి మహాసాగరంలో నీవొక చిన్న లంక అని అనుకొంటున్నావు ఆ శక్తియొక్క తరంగాలువచ్చి నిరంతరంలేచి కొట్టుతూంటే. ఈ కాస్త లంకా ఎప్పుడు చితికి కరగి మునిగిపోతుందో అని నీకు భయం. ఆ భయంతో నీ చుట్టూ కట్టలు వేసుకొంటున్నావు. ఇంత భయ గ్రస్తుడవై ఉండడంవల్లనే నీవింత దుర్బలుడవుగ ఉండడం సంభవిస్తున్నది.

నీకు శక్తి కావలసివస్తే, దానిని బయటనుండి సంపాదించాలనే నీ ప్రయత్నం. నీకు వెలుగుకావలెనా, గ్రంథాలను పట్టుకొంటావు. బలంకావలెనా, యంత్రాల నాశ్రయిస్తావు. సుఖం కావలెనా, ధనం యాచిస్తావు. శాంతి కావలెనా, పానీ

యాలను గ్రోలుతావు. ఎంతసేపూ పరాశ్రయమేకదా? పరుల కొంపల్లో తలదాచుకొనే యాచకునకు బలమెక్కడ? గౌరవ మెక్కడ? సర్వశక్తిని నీలో బెట్టుకొని ఇట్లా భిక్షాటనం చేస్తా వేమిటి సోదరా?

నీవు జగత్తుమధ్య ఉన్నమాట నిశ్చయమే అది నీకు ప్రత్యక్షమైన విషయం గనుక అది నీ పుట్టుకనుండి నీ కనుభవ గతమైయున్నది. అది స్థూలజ్ఞానం. కాని నీవు కొంచెం యోచించి చూచుకొన్నావా, జగత్తు నీలో ఉన్నదని తెలుసు కొంటావు. అది సూక్ష్మజ్ఞానం. నీ జ్ఞానాని కివి రెండుదిక్కులు. కేవలం ఒక దిక్కునుండే చూస్తూ ఉండడంవల్ల, నీవు కేవలం జగత్తుయొక్క సృష్టి అనుకొని, దాని పాశాల్లో చిక్కు కొంటున్నావు. సూక్ష్మజ్ఞానం నీలో వికసిస్తే, జగత్తే నీ సృష్టి అని గ్రహించి, దీని పాశాల్లోనుండి తప్పించుకోగలవు.

జగత్తు శక్తిమయమంటున్నావే — ఆ శక్తియొక్క జ్ఞానం నిజంగా నీలో లేకపోతే, ఇది శక్తిమయమని ఎట్లా చెప్పగలవు, సోదరా? శక్తి అనేది ఏ కించిత్తైనా నీలో గోచ రించడంవల్లనే, ఈ జగత్తునుగూడా శక్తితో అన్వయించుకో గల్గుతున్నావు. నీలో ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి సంచా రం చేస్తున్నాయి. నీ దౌర్బల్యంలోగూడా అవి ఏ స్వల్పం గానో నీ కవబోధం అవుతూనే ఉన్నాయి. ఆ శక్తి భావమనే తాళం చెవితో, ఈ బ్రహ్మాండ భాండాన్ని తెరిస్తే, ఇందులో

కూడా ఆ శక్తే నీకు ప్రత్యక్షమై, ఇదంతా శక్తిమయమని బుద్ధి గతమగు మన్నది.

కాని నీలోది, ఈ జగత్తులోది శక్తే అని తెలుసుకొన్నా, నీలోని శక్తి స్వల్పమనీ, ఈ బయటిశక్తి అపారమనీ అనుకొని, నిన్ను నీ వాశ్రయించుకోకుండా, ఈ జగత్తు నాశ్రయించు కొంటున్నావు—అవునా, కాదా ? నీవు జగత్తు నాశ్రయించు కొన్నంతకాలం నీవు నీకే దూరమై పోతున్నావన్నమాట. నీవు నీకు దూరమై పోతూంటే, నీవు శక్తివంతుడవెట్లా అగుతావు ? దేశాల నాక్రమించుకొని రాజాధిరాజువు కావచ్చు. బంగారు గనులను సంపాదించుకొని కోటీశ్వరుడవు కావచ్చు. యంత్రాలను సమకూర్చుకొని, లోకాన్ని సంహరించగల వీరుడవు కావచ్చు. కాని అసలు నీ సత్తా ఎక్కడ ఉన్నది ? నీ రాజ్యం పోయినరోజున, నీ ధనం నష్టమైనప్పుడు, నీ యంత్రాలన్నీ భగ్నమైననాడు, నీ బలమెంత ఉన్నదో నీకు తెలుస్తుంది. నీవు వట్టిసున్నా అయి ఊరుకొంటావు. శక్తి అనేది నీలోనిదై అయివుంటే, అది నీకు శాశ్వతభుక్తంలో ఉంటుంది కాని, అరువుసొమ్ము బరువుచేటే అవుతుంది.

నీవు నిజంగా నీ వనుకొనేటంత దుర్బలుడవు కావు. నీలో అనంతశక్తి దాగి ఉన్నది. జగత్తునంతను ఆడించగల శక్తి అది. అది నీలో అప్రకటితంగా ఉండడంవల్ల, నీకది ప్రత్యక్షంగా కనబడటంలేదు. అజ్ఞానమనే ఆవరణ దానిని మరుగు

చేసి ఉంచింది. ఆ ఆవరణను పగులగొట్టావా, నీలోని అనంత శక్తి నీ స్వాధీనభుక్త మగుతుంది. అది తటస్థంగా ఉంటున్న దనుకొంటున్నావేమో, లేదు. అది ప్రబుద్ధం కావడానికి చూస్తూనే ఉన్నది. కాని నీవే దానిని అణచిపెట్టుతున్నావు.

సోదరా, నీ గర్భితశక్తిని ఉద్బోధం చేయడానికి ఉపాయ మేమిటంటావా? జగత్తును పరీక్షిస్తే, నీ కా రహస్యం తెలుస్తుంది. ఒక విత్తనాన్ని నాటావనుకో. మట్టి ఏమి చేస్తుంది? ఆ విత్తనాన్ని బయటకు రాకుండా అణచిపెట్టుతున్నట్టు కనబడుతుంది. కాని విత్తనంలోని ప్రాణం తన సహజశక్తి చేత పైనున్న మట్టిని పెకలించుకొని మొక్కగా బయలుదేరుతుంది. ప్రాణశక్తి ఎంత బలవంతమైనదంటావు? రాతితోగట్టిన దేవాలయాలనుగూడా భేదించి పెరిగే మొక్కలను నీవు చూచే ఉంటావు. కొండరాళ్ళనుగూడా ముక్కలు చేయగల చేతనాశక్తి అది. అట్లాగే ప్రాణశక్తి మనస్సును ప్రబలం కాకుండా చేస్తుంది. కాని మనస్సు తన సహజశక్తి చేత ఇంద్రియాలను కల్పించుకొని తన వ్యాపారాలను సాగిస్తుంది. మనస్సు బుద్ధిని నిరోధించి తన ఇంద్రియ ప్రాబల్యాన్ని నిలబెట్టుకోడానికి పెనగులాడుతూ ఉంటుంది. కాని బుద్ధి ఇంద్రియపాశాలను త్రెంపుకొని అతీంద్రియజగత్తును జేరచూస్తుంది. ఈ విధంగా భౌతికశక్తి ప్రాణాన్ని, ప్రాణశక్తి మనస్సును, మనస్సు బుద్ధిని

బుద్ధి విజ్ఞానాన్ని నిరోధిస్తున్నా, ప్రకృతియొక్క ఊర్ధ్వగమనిక నిలచిపోతున్నదా ? లేదు.

శక్తి అంతా ఒక్కటైనా, అది భిన్నభూములను గల్పించుకొని, ఆ యా భూములలో విశిష్టరూపాలతో వ్యక్తమగుతున్నది, భూలోకంలో భౌతికరూపాలు, భువర్లోకంలో చేతనారూపాలు, స్వర్లోకంలో మానసికరూపాలు, ప్రబలంగా రాజ్యం చేస్తూఉంటాయి. కాని మట్టిలోబడ్డ విత్తనమెట్లా మట్టిని జీల్చుకొని, మొక్కగా మొలకెత్తుతుందో, అట్లాగే నీలోని విజ్ఞానం మహర్లోకంగాను, సచ్చిదానందాలు సత్య తపోజన లోకాలుగాను వర్ధిల్లుతాయి. ఈ లోకాలన్నీ నీ బయటవికావు. అవి అన్నీ నీలోనివే. భూ, ర్భువ, స్సువర్లోకాలు నీ దేహ ప్రాణ మనములు. వీనినే ఎల్లప్పుడు ఆశ్రయించుకొని ఉన్నావా, నీలోని సచ్చిదానందం మరుగై ఊర్ధ్వలోకాలు వ్యక్తం కానేరవు. అది నీ సంపూర్ణతకు లోపం. నీలో ప్రస్తుతం భూర్భువస్సువర్లోకాలు ప్రబలంగా రాజ్యం చేస్తున్నాయి. వీనిని నీవు విడనాడనక్కరలేదు. పైకి పోవాలంటే, మొక్కమట్టిని విడనాడుతుందా ? అది దానిని పాదుగ జేసుకొంటుంది. అట్లాగే నీవీ క్రిందిలోకాలను వదిలిపెట్టకుండానే నీ విజ్ఞానశక్తిచేత, ఊర్ధ్వలోకాలలో ప్రవేశించి నీ సంపూర్ణశక్తిని ప్రతిష్ఠించుకోవచ్చు.

నీకు సాధనమార్గం తెలుపడంకోసం గీతాకారుడు క్రింది లోకాలలో వ్యక్తమయ్యే శక్తిని అసురసంపద అనీ, పైలోకాలలోని శక్తిని దైవీసంపద అనీ సూచించాడు. ఈ విభాగం సాధకునికొరకు చేయబడ్డదే కాని తత్వతః నిజంకాదు. ఎందుకంటే శక్తి అంతా చిచ్ఛక్తి—సర్వం దైవసంపదే. కాని ఆ చిచ్ఛక్తి తనకు తాను అనులోమంగా మరుగై, విలోమంగా ముసుగులను విప్పుకొంటూ స్వరూపాన్ని ప్రకాశింపజేసుకొంటున్నది. ప్రకృతిలో జరిగే లీలా రహస్యమిది. స్వరూపం బాగా మరుగైన చీకటి భూములను అసురములనీ, స్వరూపం వెల్లడి అయిన వెలుగు భూములను దైవీసంపదలనీ నీ ఆత్మోన్నతిని బురికొల్పడానికి గీతాకారుడన్నాడే కాని, ఈ చీకటి వెలుగులు రెండుకూడా చిచ్ఛక్తియొక్క చిద్విలాసాలే సుమీ. నీవు చీకటిలోకాల్లోనుండి — "అసూర్యానామ తే లోకాః అంధేన తమసావృతాః" అని ఉపనిషత్తులుకూడా అన్నాయిగా— వెలుగులోకాల్లోకి ఎగబ్రాకితేనే తప్ప, నీ సుస్వరూపమైన ఆత్మశక్తి నీ కనుభుక్తం కాదు. ఆ ఆత్మశక్తి నీయందు ఇచ్ఛా, జ్ఞాన క్రియాశక్తిగ వెల్లడి కావడంకోసం పెనగులాడుతున్నా, క్రిందిలోకాల చీకట్లు వానిని నిరోధిస్తూ ఉండడంవల్ల, అవి వృద్ధిలోకి రావటంలేదు.

సోదరా, నీలోని ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు సూర్యకిరణాలవలె చీకటిమబ్బులను జీల్చుకొని బయటకు రావాలంటే, నీ విజ్ఞానాన్ని నిరంతరం రాపిడిచెయ్యాలి. రాపిడి

చేసినకొద్దీ, దానిలో వెష్టపుష్టి, వానిని గప్పుచున్న మబ్బులను ఛేదించివేయగలదు. నీ శక్తిని నీవే మేలుకొలుపుకోవాలి కాని, ఇతరులెవరూ ఏమీ చేయలేరు. దానిని మేలుకొల్పే ప్రియత్నాన్నే తపస్సు (Self energising) అన్నారు మన పూర్వులు. తపస్సు అంటే నీలో గడ్డకట్టుకొనిపోయిన విజ్ఞాన శక్తికి వేడెక్కించి వెలుగుగా బ్రసరింపజేయడం – ఆ ఉద్దీపన వలన నీలో గర్భితమైన సంపదలన్నీ బహిర్గతము లగుతాయి. నీవు నీ స్వప్రకాశంతో బహిర్గతం కావడమే సృష్టియొక్క సఫలత.

సృష్టి అంటే ఏమిటి? అలీకకల్పనా? కాదు. మహేంద్రజాలమా ? కాదు. కలలు కనడమా ? కాదు. సృష్టి అంటే వదలడం – దేనిని ? నీలో అవ్యక్తంగా ఉన్న శక్తిని బయటకు వదలడం, నీ ఆత్మసంపదను బహిరంగపరచుకోడం, నిన్ను నీవు నానాప్రకారాలుగా జూచుకోవడం. అంతేనే కాని భయభ్రాంతులను గల్పించడం కాదు. కవి తన కవితాశక్తిని ప్రదర్శించు కొంటాడు – శిల్పి తన కళానైపుణ్యాన్ని రూపొందించుకొంటాడు – గాయకుడు తన స్వరమాధుర్యాన్ని శ్రుతపరచుకొంటాడు - అందుకనే కళావిదులు స్రష్టలు, బ్రహ్మలు. నీలో లేనిది నీ సృష్టిలో ఉండదు. సృష్టి నీ ఉల్లాసంయొక్క పొంగు, నీ శక్తియొక్క క్రీడ. కాబట్టి సోదరా, నీశక్తిని గుర్తించుకొని దానిని వ్యక్తపరచుకో. నీరూపసంపదను వెలుగు

లోకి దీసికొనిరా. నీ శక్తిని నీవు దాచుకొంటావా, నీవు చీకటి లోకాల్లోకి పడిపోతావు. నీ లోభిత్వమే నిన్ను చెరుపుతుంది.

శక్తి అంటే బలాత్కారప్రయోగమని అనుకోక. అది ప్రాణశక్తియొక్క క్రీడలో ప్రథమదశ. పెద్దచేప చిన్న చేపను తింటుంది. వన్యమృగాలువేటాడి, తమ ఆధిపత్యాన్ని ప్రతిష్ఠించు కొంటాయి. (Survival of the fittest) బలంగల జంతువులకే ఈ లోకంలో ఉనికి ఉన్నట్లు ప్రాణం మొదట్లో ఘోషిస్తుంది. ప్రాణం ఎంతవరకూ పోరాటం కోరుతూ ఉంటుంది. వైరం దానిధర్మం—అది రజోగుణప్రధానం. దానిని విశృంఖలంగా వదిలావా, అది నిన్ను సంహారంలోకి ఈడ్చుకొనిపోయి నిన్ను మృత్యుముఖంలో బడవేస్తుంది. నీ శక్తిని నీవు దాచుకొంటావా, నీ శక్తి నిన్ను విడనాడుతుంది. ఆత్మవిస్మృతి చెందుతావు. నీలో నీవు మునుకొనిపోయి, పాషాణమవుతావు. అట్టి కటికచీకటి—తమోలోకం - కేవలం అంధత్వము, ఆత్మహననం.

సోదరా, నీవు తన్ను తాను తెలుసుకోలేని రాయివి కావు. నీవు తన్ను తాను భక్షించుకొనే మృగానివి కావు. నీవు మానవుడవు—సత్వగుణప్రధానుడవు. సత్వం చీకట్లను బారద్రోలుతుంది. వైరాన్ని నిరసిస్తుంది. సామరస్యాన్ని సమకూరుస్తుంది. సత్వం నిన్ను విజ్ఞానమయమైన మహాలోకంలోకి ప్రవేశపెట్టుతుంది. నీ దివ్యశక్తిని నీవు దర్శించి ప్రదర్శించుకొనే అవస్థ నీ కలవడుతుంది. నీకు వెలుగులోకాలన్నీ వెల్లడి అగు

తాయి ఇక నీ శక్తిని నీవు దాచుకోలేవు. పర్వతశిఖరంమీద నుండి గంభీరఘోషతోబడే మహాజలపాతంవలె నీ శక్తి వినిస్సృతమై లోకాలోకాలను ముంచివేస్తుంది. నీ శక్తి అక్షయమని తెలుసుకొంటావు. నీవు దానిని దాచిపెట్టాలన్నా, అది దాగదు. వితరణం చేసుకోవడమే దానిధర్మం. తన్ను తానిచ్చివేసుకోవడమే దానిక్రీడ. సృష్టిరహస్యమప్పుడే నీకు హృద్గోచరమగుతుంది. సోదరా, సృష్టి అంటే ఆత్మవితరణం, ఆత్మయజ్ఞం—పూర్ణాహుతి. సృష్టి యజ్ఞంలో పుట్టింది, యజ్ఞమే సృష్టిని పోషిస్తున్నది, యజ్ఞమే సృష్టిని సఫలపరుస్తుంది. సోదరా, తపస్సుచేత నీలోని అగ్నిని ప్రజ్వలింప జేసుకొని, అందు నీ జీవితాన్ని ఆజ్యంగా ధారపోయి.

"స తపో తప్యత—
స తపస్తప్త్వా
ఇదగ్ం సర్వ మసృజత."

# వ్యష్టి, సమష్టి

సోదరా, ఈ ప్రపంచాన్నంతా ఈ గోళాలను, ఈ సముద్రాలను, ఈ సమస్తభూతకోటిని బ్రద్దలుకొట్టి, ముక్కలుకోసి, పొడుంచేసి వేస్తావనుకో—ఆ పొడుంలో ఎన్నికోట్ల రేణువులు ఉంటాయంటావు ? వానిని లెక్కపెట్టగలవా ? ఆ రేణువుల నెట్లాగో పరమాణువులుగ విడదీశా వనుకో—వాని సంఖ్య ఊహాతీతంకదా ! పరమాణువంటే—అది దేనికది వేరే అని గదా ? పోనీ, ఆధునిక వైజ్ఞానికులు చెప్పినట్లుగ, ప్రతి పరమాణువు ప్రోటోన్. ఎలెక్ట్రోను, న్యూట్రోన్ అనే విద్యుత్కణాలకూటమనే ఒప్పుకొందాం. ఇట్లా సూక్ష్మాతిసూక్ష్మంగా విశ్లేషం చేసుకొంటూపోయినా, తుదకెక్కడ చేరుతాం ? ఈ విశ్వం అనంతకోటి విద్యుత్కణాల సంఘాతమనే సిద్ధాంతానికి వస్తాం.

నీవు ప్రాచీనసాంఖ్యుల సిద్ధాంతమంగీకరించినా, లేక ఆధునిక వైజ్ఞానికుల నిర్ణయాన్ని ఆమోదించినా, ఈ పృథివి యొక్క పుట్టుక ఈ పరమాణువులనుండి అనేవిషయం నీకు

మనోగతమగుతుంది. ఇందులో ఏమి చిత్రముందో కనిపెట్టావు? వానిని పరమాణువులను, విద్యుత్కణాలను—అవి వేనికవిగానే ఉండి, వాని స్వరూపాన్ని నష్టపరచుకోకుండా, అనేకరీతులుగ, అనేక పరిమాణాలుగ గూడుకొని, మనకు గోచరించే ఈ చరాచరాత్మకమైన జగత్తుగ కూర్పు కూర్చుకొంటున్నాయని కాదూ ? ధాతువులను పగులగొట్టిచూడు, లోహాలను కరగించి చూడు, క్షారాలను పరిశీలించి చూడు—అవి ఘనరూపాలుగ ఉన్నా, ద్రవరూపాలుగ ఉన్నా, వాయురూపాలుగ ఉన్నా, అవన్నీకూడా అసంఖ్యాకములైన పరమాణువుల కూడిక అని తెలుసుకొంటావు.

కొన్నింటిలో రెండేసి పరమాణువులు, కొన్నింటిలో పదేసి, మరికొన్నింటిలో ఇరువదేసి చేరుకోగాక. ఆ కణాల యొక్క ప్రత్యేకతమాత్రం నశించదు. పరమాణువుదాకా పోకపోయినా, ఇంగ్లీషులో సూచించే "మాలిక్యూల్సు"ను చూడు. ప్రతి మాలిక్యూలూ ఒక కూడికే కాదూ ? ఏది ఈ విడిపరమాణువులను ఒక మాలిక్యూలుగ గూర్చేది ? ఇంకో విషయం కనిపెట్టు ఏ మాలిక్యూలు లక్షణం దానిదే అగునా, కాదా ? ముందుగ విడివిడి పరమాణువులు తమ వ్యక్తిత్వాన్ని కోలుపోకుండా, మాలిక్యూల్సుగ కూర్చుకోవడం, ఈ మాలిక్యూల్సు తిరిగి తమ విశిష్టలక్షణాలను గోలుపోకుండా ఇంకో కూర్పులో చేరడం—ఏమి టంటావు ? ఈ రహస్యాన్ని నీ బుద్ధికి గోచరంచేసుకోవాలంటే, ఈ విధంగా ఊహించుకో

వచ్చు—రెండు సున్నాలున్నాయనుకో ఒక దానిప్రక్క నొకటి. దేని పరిధి, దేని కేంద్రం దానిదేగా? మళ్ళీ ఈ రెండు సున్నాలు తిరిగి తమచుట్టూ ఒక పెద్ద సున్నాను గీసుకొన్నా యనుకో. ఈ పెద్దసున్నా ఏమిచేస్తుంది? చిన్నసున్నాలను చెరపదు. వానిని విడివిడిగ ఉంచుతూ, ఆ రెంటిని ఆవరించి, వానిని శాసించేటట్టుగ చుట్టు తిరిగివస్తుంది.

ధాతువులుకాని, లోహాలుకాని, తారాలుకాని విడివిడి సున్నాలు చుట్టూచుట్టుకొన్న పెద్దసున్నాల కూడికలే. ఈ విధంగా సున్నాలచుట్టూ సున్నాలు, ఆ సున్నాలచుట్టూ మరి కొన్ని సున్నాలు—ఎంత విచిత్రంగా ఈ సున్నాలు విస్తరించి బ్రహ్మాండాన్నంతా ఇముడ్చుకో గలుగుతున్నాయో చూచావు? సూక్ష్మరూపాలమాట అటుంచు. చూడీ గోళా లెట్లా, వాని అక్షములమీద తిరుగుతూ, వాని పరిధులను దాట కుండా, ఇంకోగోళాన్ని కేంద్రంగా చేసుకొని గిరగిర భ్రమిస్తు న్నాయో! చంద్రుడు తనచుట్టు, తిరిగి భూమిచుట్టూ, భూమి తనచుట్టూ, చంద్రసహితంగా సూర్యుని చుట్టూ ఇట్లా సూర్య మండలం ఇంకోమండలంచుట్టూ, ఒకటే తిరగడమాయె ఇట్లా సున్నాపైన సున్నా ఆపైన ఇంకో సున్నా, వీని కంతెక్కడ? అంతా వలయమయం—ఒక చిక్కం.

చేతన పదార్థాలనుచూడు. "మాలిక్యూల్సు" చేరి గదు లుగ, అరలుగ, "సెల్సు"గ ఏర్పడతాయి. ఏ సెల్లు కా సెల్లే

అయినా, అన్ని సెల్సూగలసి, అన్యోన్య సహకారంతో చెట్టు కట్టుతాయి. చెట్టు సమష్టిమీద ఈ సెల్సునన్నిటిని ఒకకూటంగా ఒక అవయవిగ, ఒక "ఆర్గనిజము"గ కూర్చుకొంటుంది. చెట్టుకు వేళ్ళున్నాయి, బెరడుంది, కొమ్మలున్నాయి, ఆకులున్నాయి. పువ్వులు కాయలూ ఉన్నాయి. ఇవన్నీ చెట్టులో భాగాలైనా వేని లక్షణం వానిదేగదా! వాని విధులను అవి నిర్వర్తించుకొంటూ, మొత్తంమీద చెట్టులో యథోచితస్థానం ఆక్రమించుకొంటున్నాయి. చెట్టులో అనేకములైన సెల్సు — ఆ సెల్సు వేరుగ, బెరడుగ, కొమ్మలుగ, ఆకులుగ, పూవులుగ వ్యక్తమై, మొత్తంగా వృక్షావయవిని పోషించి, తాము సాఫల్యం పొందుతున్నాయన్న మాటకాదు.

ఒక జంతువునుచూడు. జంతువులో మాంసం, ఎముకలు నరాలు, ఇంద్రియాలు, చర్మం, అవయవాలు ఎన్ని ఏర్పడుతున్నాయో. ఈ వివిధభాగాలన్నీ విశిష్టధర్మాలు, లక్షణాలు కలవే. అవన్నీ వాని విశిష్టస్వరూపాలను కోలుపోకుండానే, జంతువనే అంగికి — Organism కు అంగాలై జంతువుయొక్క సమగ్ర జీవనంలో ఐక్యత నొందుతున్నాయి. కన్నుకన్నుగానే పనిచేస్తున్నది, చెవి చెవిగానే పనిచేస్తున్నది. కన్నూ చెవీ కూడా జంతువుకు అంగీభూతము లగుతున్నాయి. జంతువులు మళ్ళీ వాని వాని జాతులప్రకారం గుంపులుగ ఏర్పడుతున్నాయి, వాని వ్యక్తిత్వాన్ని కోలుపోకుండా, కొంగలన్నీ ఒక గుంపుగ గలసి ఎగిరిపోతూంటాయి. ఏనుగులు సమూ

హంగా తిరుగుతూ ఉంటాయి. పశువులు మందలు మందలుగ గూడుతాయి. ఇట్లా వ్యష్టిసమష్టులు ఛాయాతపన్యాయంగా అంచెలంచెలుగ పెరుగుతూ పోతూనే ఉన్నాయి.

సోదరా, ఈ దృష్టాంతాలనుబట్టి నీవేమి తెలుసుకొంటున్నావు? నీకు నీవు ఒంటరివాడవైనా, జగత్తుతో నీ వంతర్భుక్తుడవై, పోతున్నట్లు తోచటం లేదూ ? నీవు నీ స్వార్థాన్ని చూచుకొంటున్నా, ఒక కుటుంబాన్ని కూర్చుకొని, నీ కుటుంబంతో ఐక్యం పొందుతున్నావు. నీ కుటుంబం కుటుంబంగానే ఉండి, ఒక కులంలోనో, సంఘంలోనో జేరి దానితో ఐక్యమగుతోంది. నీ సంఘం గ్రామ జీవనంలో భుక్తమగుతోంది. ఈ విధంగా నీవు, నీ కుటుంబం, నీ సంఘం, నీ గ్రామం, నీ మండలం నీ రాజ్యం, ఒక సున్నా చుట్టూ ఇంకోసున్నా, దాని చుట్టూ ఇంకో పెద్దసున్నా, క్రమానుగతంగా పెద్ద పెద్ద వలయాలుగ విపులమై, విస్తరిల్లి, పోయి పోయి, విశ్వమానవుడవుగ వ్యాపిస్తున్నావు.

పృథివి మూలంలోకి పోయినావా, అసంఖ్యాకములైన ప్రత్యేక ప్రత్యేక పరమాణువులు. అక్కడనుండి బయలుదేరి ప్రపంచ పరిణామాన్ని చూచుకొంటూపోయినావా, పరమాణువులు వాని నానాత్వాన్ని, భిన్నత్వాన్ని గోలుపోకుండా, కూటాలుగ గూడుకొంటూ, పరిధులను విస్తరింపజేసుకొంటూ అన్నిటినీ ఐక్యపరచే ఒక్క కేంద్రాన్ని కనుక్కోడానికి ప్రయా

ణం సాగిస్తున్నట్లు కనబడటం లేదు ? మూలంలో నానాత్వం అనగా అనైక్యత - కొసలో ఏకత్వం, ఐక్యత. ఎంత విచిత్ర మంటావు ఈ పరిణామరహస్యం ? అనేకత్వం అనేకంగానే ఉంటూ ఏకత్వంలోకి - భేదం, భేదాన్ని గాపాడుకొంటూ ఆ భేదానికి - క్షుద్ర బ్రహ్మాండం తన విశిష్టత్వాన్ని గోలు పోకుండా అఖండబ్రహ్మాండంలోకి ప్రపంచించడంలో గల పర మార్థం ఏమిటో మనోగతం చేసుకొంటున్నావు ?

నీవు నీవుగ స్వరాట్టువు, నీవు జగత్తుగ విరాట్టువు. నీవు అనంతకోటి జీవరాసులలో ఒకడవు. నీవు సమష్టిలో సర్వస్వము అణువులో అణువువు, మహత్తులో మహత్తువు. ఇక అణువుకూ బ్రహ్మాండానికి భేదం దేనిలో సోదరా? అణువులో బ్రహ్మాండం ఉండకపోతే, ఆ అణువు బ్రహ్మాండంకోసం ఎందుకు వెదకడం? బ్రహ్మాండంలో అణువు లేకపోతే, బ్రహ్మాండం అణువు లను జేరదీయడం దేనికి? ఏకం - అనేకం అనేది నీకు మొదలు అంకగణితంగా గోచరించి, ఒకటి అనేకమెట్లా అగుతుంది ?- అనేకం ఒకటి ఎట్లా అగుతుంది — ఖండంలో అఖండం ఎట్లా ఇముడుతుంది? - అఖండం చీలిపోకుండా ఖండాలెట్లా అయిందీ- అని నీబుద్ధి తికమకలు పడింది.

కాబట్టి నానాత్వం ఏకత్వం బయటలేదు. ఏకత్వం నానాత్వం బయటలేదు, ఏకత్వంలో నానాత్వమున్నది. నానా త్వంలో ఏకత్వమున్నది. అంతే కాదు, ఏకత్వం నానాత్వం

ద్వారా, నానాత్వం ఏకత్వంద్వారా సార్థకత, సఫలత నొందు తున్నాయన్న మాట. మన మొకకంటితో నానాత్వం చూస్తు న్నాం - ఇంకో కంటితో ఏకత్వం చూస్తున్నాం. ఈ రెంటిని సమగ్రంగా చూడగలిగితే నీకు పరమార్థం హృద్గతమగుతుంది అందుకనే మన ఋషులు ఏకత్వాన్నిజూచి "ఏకమేవాద్వితీ యం బ్రహ్మ" అన్నారు. నానాత్వాన్ని జూచి, "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నారు. అంటే ఏమిటి? బ్రహ్మం ఏకమూ అగును, సర్వమూ అగును. "Single - Variable"! ఎంత సమగ్రదృష్టి అంటావు మన ఋషులది? మన ఋషులు సృష్టినంతనూ ఒక అశ్వత్థవృక్షంతో పోల్చారు - మూలంపైన, శాఖలుక్రిందా గల వృక్షం - లేకపోతే ఈ రహస్యాన్నట్లా ఉద్ఘాటనం చేయగలరా?

"ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయం"

# శక్త్యుపాసన

సోదరా, ఎన్నాళ్ళీ వేదాంతబోధలను చిలుక పలుకులవలె, నోట పట్టడం ? ఈ విద్యలో మనదేశం బాగా పేరు పొందింది. వేదాంతసూత్రాల నేకరవు పెట్టగలం. షడ్దర్శనాలను తర్జన భర్జన చేయగలం. గీతలకు వ్యాఖ్యానలపై వ్యాఖ్యానాలు వ్రాయగలం. భూమ్యాకాశాలను ముడిపెట్ట గలం. కాని ఏమిలాభం, సోదరా ? మాటలు కోటలు దాటుతాయి. కాని కాళ్ళు గటపదాటవు. ప్రాణమంటే తీపి మన నీడను జూచుకొనే మనం భయపడతాం. స్వార్థంలో కించిత్తయినా వదులుకోలేము. మన రాగద్వేషాలు గడ్డకట్టుకుని పోయినాయి. ఇరుగుపొరుగంటే గిట్టదు. ఆత్మ అంతా ఒకటే అంటాము. కాని మనకు పంటలను పండించిపెట్టే మాలలను ముట్టరానివాళ్ళనిగ చూస్తాం, ఆత్మ అనశ్వరం అంటాము. కాస్త రోగంవస్తే, ముడుపులుకట్టి ముక్కోటి దేవతలకు మొక్కుకొంటాం. ఎందుకువచ్చిన వేదాంతం సోదరా ?

మన జపతపాలన్నీ ఏమగుతున్నట్లు ? మన బుద్ధులు మారవాయె. చిత్తవృత్తులు యథాప్రకారం విషయలంపటం నుండి మరలవాయె. భయవ్యామోహాలు మనలను పీల్చుకొని తింటూండె. మన వేదాంతంతో ఎవరిని మోసపుచ్చుదామని ? కాయకష్టంతో యథార్థపు బ్రతుకు బ్రతికే పామరులనా ? రెండు వేదాంతపు ముక్కలు చెవిని బడితేనే మోక్షం వస్తుందని నమ్మే అమాయికులనా ? ఇంతా అయితే మనగొప్ప అంతా నోటినుండి ముత్యాలను రాల్చడం తప్పితే, ఇకఏమిటో చెప్పు సోదరా ? ఆకులో ఆకునై పూవులో పూవునై పోతానని పాటపాడుతావూ? తారాపథాలు దాటి పరంధామంలో ఐక్యమైపోతానని పద్యం వ్రాస్తావు ? ఇదంతా మాయా ప్రపంచంరా అని తత్వాలు వినిపిస్తావు ? సోదరా, మనం వట్టి ఆత్మవంచకులం సుమీ. ఎవరినో మోసపుచ్చుతున్నామని అనుకొంటున్నాము గాని, మనలను మనమే మోసపుచ్చుకొంటున్నాం.

పాశ్చాత్యులు వట్టి పశువులు, భారతీయులు బ్రహ్మజ్ఞానులు అని పైగా అహంకరిస్తాం. వాళ్లు పశువులు కనుకనే, వాళ్ళు తమ దేశంకోసం, తమ రాజ్యంకోసం, ప్రాణధనాలను నిశ్శేషంగా ధారపోస్తున్నారు. అగ్నిహోత్రాల్లోకి దుమికి, సోదర ప్రాణాలను రక్షించుకొంటున్నారు. స్వాతంత్ర్య లక్ష్యం కోసం, తమ జీవితాలను యజ్ఞగుండంలో ఆహుతిచేసుకొంటు

న్నారు. మనమో ? మనం బ్రహ్మజ్ఞానులం గనుక, దేశమే మైపోయినా, మనకు ప్రసక్తిలేదు. పరరాజులువచ్చి మనలను హింసించినా, ఉపేక్ష వహిస్తాం.కులభేదాలు, మతవైషమ్యాలు మనలను క్రుంగదీస్తున్నా, మనకు చీమకుట్టినట్లుగ గూడా ఉండదు. పైగ దైవం ఎట్లా వ్రాసిపెట్టి ఉంటే అట్లా జరుగుతుందని — మన స్వవిషయంలో మినహాగా — వైరాగ్యం సూచిస్తాం. ఎట్టి బ్రహ్మజ్ఞానమంటావు సోదరా ?

చాలా దుఃఖకరమైన స్థితి కాదూ, ఇదంతానూ ? మనమింక వేదాంతబోధలను కట్టిపెట్టి మౌనం దాల్చడం యుక్తం కాదూ ? వేదాంతం చదవడం, చెప్పడం, వినడం మనకొక ఆట, పాట, వినోదం, వ్యసనమైపోయింది. వట్టి వ్యసనమైతే అనుకోవచ్చు. అల్పసంతుష్టిని, ఆత్మవంచనాన్ని, అహంకారాన్ని కల్పించే రోగమైపోయింది. ఈ వేదాంతమే లేకపోతే, మనం బాగుపడేవాళ్ళం. మనం సర్వజ్ఞులమనే మాత్సర్యమేనా కలుగక పోయేది. మనస్థితిని మనం తెలుసుకొనే వాళ్ళం. మన అజ్ఞానమిట్టిది కదా అని నమ్రులమై పడిఉండేవారం. ప్రాణులకుండే సహజసత్వాలనైనా ప్రదర్శించుకొనేవాళ్ళం. పశువుకు వేదాంతం రాకపోబట్టేకదా, అది దాని స్వధర్మాన్ని యథావిధిగ నిర్వర్తించి, తన జీవితాన్ని సఫలపరచు కొంటోంది. మనం మనుష్యులమై వేదాంత పండితులం కావడంవల్ల, పశువుకున్న జవసత్వాలనుగూడా గోలుపోయినాం.

ఇదంతా నీవు జ్ఞానమనుకొంటున్నావు కాని, ఇది నిజమైన జ్ఞానం కాదు. ఇది వట్టి కాకిబంగారం, దీనిలో మెరుపు తప్పితే, నిజమైన వెలుగు లేదు. శక్తి అంతకంటే లేదు. వేదాంతం "నీవు శక్తి స్వరూపుడవు" అని చెప్పుతూంటే, నీలో నిజంగా ఎంత శక్తి ప్రబుద్ధమగుతున్నదో ఒక్కరోజైనా ఆత్మపరీక్ష చేసుకొన్నావు ? కారికలు చదువుతూంటే సరిపోతుందనుకొన్నావు ? ఎక్కడ నీలోని శక్తి ? శక్తి ఉన్నదంటే, అది సృష్టిలో కనబడాలె, లేక సంహారంలో కనబడాలె. అంతేనే కాని గుడ్డపీలికవలె వ్రేలాడే దానిలో శక్తి ఏమున్నది ? వాయువులో శక్తి ఉన్నది. అది ప్రచండంగా వీచిందాంటే అరణ్యాలపై అరణ్యాలను ఛేదించివేస్తుంది. నీటిలో శక్తి ఉన్నది. అది పొంగిందాంటే, బండలనుకూడా తొలచి దేశదేశాలను ముంచి లేవనెత్తుతుంది. అగ్నిలో శక్తి ఉంది. అది ప్రేలిందా అంటే, లోకాన్నంతా దగ్ధపటలం చేస్తుంది. కాని నీలోని శక్తి ఏమి చేస్తోంది ? ఏమి చేయగలదు ? యోచించుకొంటున్నావా ?

సోదరా, శక్తులకన్నిటికి మూలం ఆత్మ అనేగా నీవు చెప్పేది ? ఆ మూలంలో శక్తి కనబడదేమి ? నీవు ఒకటి సృష్టి చేయలేవు, సంహారమూ చేయలేవు. ఇక నీ వెట్లా శక్తి స్వరూపుడవు ? నీవే శక్తి స్వరూపుడవైతే, గాలిలో ఎగిరే దూసరానికికూడా శక్తి ఉన్నదనవచ్చు. నీ ఆత్మకు శక్తి ఎక్కడోయి ? నీ మనస్సు ఎట్లా ఈడ్చుకుపోతే, నీ ఆత్మ

అట్లాపోయె. నీ ఇంద్రియాలేవైపుకులాగితే నీ మనస్సు ఆ వైపుకు తిరిగె. విషయాలు నీ ఇంద్రియాల నెట్లా ఆడిస్తే, అవి అట్లా ఆడె. ఇట్లా ఈడ్వబడుతూ, "నేను శక్తి స్వరూపుడను" అని ఎట్లా అంటావు ?

"ఘటనాఘటన పటీయసి" కాదూ శక్తి? నీలో సంఘటనాశక్తి ఎక్కడ? స్వతంత్రంగా సంఘటన చేయలేక పోయినా, ప్రతి ఘటన అయినా చేయలేవే. రాతిని కొట్టి చూడు, దానిలోనుండి అగ్నికణాలు బయలుదేరుతాయి. మందు గుండుకు చిచ్చుపెట్టావనుకో—అది ఎట్లా ప్రేలి నిన్ను, నీ గృహాన్ని మంటల్లో బడవేస్తుంది ? ఒక ఎలెక్ట్రిక్ బొత్తాము ను ఒత్తావనుకో—చూడు ఎన్ని బల్బులొక్కమారు వెలుగులు గ్రక్కుతాయో ! నిన్ను ఒత్తినా తన్నినా, చంపినా, ఒక అగ్నికణంగాని, ఒక్క ప్రేలుడుగాని, ఒక్కజ్యోతిగాని ప్రకాశించదే ! మనం చచ్చుపెద్దమ్మల మన్నమాట. మనలో రాతికున్న భౌతికశక్తి లేదు, పశువులకున్న ప్రాణశక్తి లేదు, మానవునకుండదగిన త్యాగశక్తిలేదు. శక్తియొక్క అభావం మనలో గూడుకట్టుకొన్నది సోదరా.

యంత్రాలను కొలుస్తావు, వాని హార్స్‌పవర్ యింత అని. నీటిని కొలుస్తావు, దాని "హైడ్రాలిక్ పవర్" ఇంత అని. నీ 'పవర్'ని కొలవడానికి ఏమైనా సాధనముంటే బాగుండును. ఇప్పుడు యుద్ధాలు చేస్తున్నవారిని అడిగితే ఏమి

చెబుతారు ? ఇంగ్లాండుకు "నావల్ పవర్" ఉన్నదంటారు. అమెరికాకు "ఇండస్ట్రియల్ పవర్" ఉన్నదంటారు. రష్యాకూ చీనాకూ "మేన్ పవర్" ఉన్నదంటారు. అయితే నీకూ, నీ దేశానికీ ఉన్న పవరేమిటి ? మృత్యువంటే భయపడే పవర్ - స్వాతంత్ర్యమంటే వెనుకపడే పవర్ - ఐకమత్యమంటే కళ్లు మూసుకొనే పవర్. ఇంతేనా ?

ఇదంతా పట్టి తామసం, సోదరా ? నీ బుర్ర కొంచెం పని చేస్తున్నమాట నిజమే కాని, నీ ఒళ్ళు, నీ ప్రాణం, నీ మనస్సు, నీ చిత్తం, నీ హృదయం చచ్చుపడిపోయినాయి. పట్టి జాడ్య మావహించింది. అందుకనే నిన్ను చూచినా, నీ దేశాన్ని చూచినా, నీ ప్రజను చూచినా, లోకం నవ్వి పోతోంది. పైగా నిన్ను కాలిబంతినివలె తన్నుతున్నారు. ఆ తన్నులు తింటూనే, బంతి అనుకొంటుంది తానెట్లా పై కెగురుతున్నానో అని. ఎంత దైన్యంలో పడ్డాం సోదరా ! అందుకనే వివేకానందస్వామి అన్నాడు, భారతీయులు పట్టి దూదిపేళ్ళని. ఎంతమాట అన్నాడు-ఎంత కన్నీరు రాల్చాడో ఆ మాట అంటూ ?

సోదరా, ఈ మెట్టవేదాంతాలను కట్టిపెట్టి శక్తి ఉపాసకుడవు కా. నీలో అనంతశక్తి ఉన్నమాట నిజమే. కాని అది నీలో నిద్రపోతోంది. పుట్టలో పాము చుట్టచుట్టుకొని పడుకొన్నట్లుగ, నీ శక్తి అనులోమంగా మూలాధారంలో

దాగుకొని ఉన్నది. అది కుండలినీశక్తి—నిన్ను ఉద్ధరించగల ఊర్ధ్వకుండలిని, దానిని లేవగొట్టావా, అది చుట్టలను విప్పుకొని బుసలుకొట్టుకొంటూ పడిగ లాడించుకొంటూ లేచి నర్తిస్తుంది, నీ దేహం, నీ ప్రాణం, నీ మనస్సు, నీ బుద్ధి నీ ఆత్మ జ్వాలానరసింహమూర్తి అవతారాలవలె ప్రజ్వలించిపోతాయి. నీ వొక ఎలెక్ట్రిక్ డైనమో అయిపోవాలె. నీలోని షట్చక్రాలు గిరగిరమని తిరిగిపోవాలె. కుండలినీశక్తి ఓంకారం వలె ఎగబ్రాకుకుంటూ నీసహస్రదళపద్మాన్ని విచ్చుకొనేటట్లు చేస్తుంది. అప్పుడూ నీ వేదాంతం, నీ కారికలు, నీ ఉపదేశాలు యథార్థాలవుతాయి.

"ఉత్తిష్ఠ, జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత"

## బంధనం, విముక్తి

సోదరా, నీ వంట్లో బలమున్నదీ, లేనిదీ నీ వెప్పుడైనా పరీక్ష చేసుకొన్నావూ ? నేనింత లావున్నాను, నా తూకం రెండువందల పౌండ్లు, నాకు బలం తక్కువా అని అంటావా ? నిజమే, తలకు పక్కపాపిడితీసి, మొగానికి హిమానీ స్నో పూసి, పట్టులాల్చీ ధరించి, కాళ్ళకు బాటాషూస్ తగిలించి, చేతికి రిష్టువాచ్ చుట్టుకొని, సన్నని పేంబెత్తాన్ని త్రిప్పు కొంటూ, కులుకుతూ బీచిఒడ్డున షికారుచేస్తూంటే, నా బలానికి లోటేమిటనికాదూ, నీ ధీమాకు -? సోదరా, ఈ షోకంతా నీ నాజూకును, నీ మోజును తెలిపితే తెలుపవచ్చును గాని, నీ బలాన్నెట్లా తెలుపుతుంది ? ఒక పదిమణుగుల గుండు నెత్తమంటే, ఒక మైలు వరుగెత్తమంటే, ఒక గజంలోతు గోతిని త్రవ్వమంటే తెలుస్తుంది నీ బలమెంతో ! శ్రమపడగల శరీరపాటవం లేనప్పుడు, నీ వెంతచేసు ? నీ బలమెంతచేసు ? శ్రమించే శరీరపాటవమే నిజమైన బలం సోదరా.

ఒక గుండునెత్తడమంటే ఏమిటి ? భూమికి ఆకర్షణ శక్తి ఉన్నదనేగా సైన్సు నీకు మొదట నేర్పినపాఠం ? ప్రతి వస్తువు భూమిచేత ఆకర్షించబడడంవల్లనే, నీ వెత్తబోయే గుండుకూడా కదలకుండా మెదలకుండా నేలను కరుచుకొని ఉన్నది. నీవు దాని నెత్తుతున్నావంటే ఏమిటి ? భూమి యొక్క ఆకర్షణశక్తిని నిరోధిస్తున్నావన్న మాట కాదూ ? ఆ ఆకర్షణబలంకంటె, నీ నిరోధకశక్తి అధికమైనప్పుడే, ఆ గుండు పైకిలేస్తుంది. ఇంతేనా ? శ్రమంటే ఏమిటో ఇప్పుడు తెలిసిందా ? నీ బలంతో ప్రతిబలాన్నెదుర్కొనగలిగే ఓర్పు అన్నమాట కాదూ ?

రెండుపక్షా లెదుర్కొని, ఢీకొన్నప్పుడు కాని, వాని బలాబలాలు వ్యక్తంకావు. వ్యక్తం కావడంలోనే కాదు, బలం వృద్ధి పొందాలన్నా, ఢీకొనడ మవసరం. వ్యాయామ శిక్షణ మంటే అదేగా ? శరీరపరిశ్రమకు అలవాటుపడ్డకొద్దీ, నీ శరీరం బలిష్ఠమవుతుంది మొదటిరోజునే పదిమణుగులగుండు నెత్తగలవా ? ఎత్తడానికి తంటాలుపడతావు—ఎత లేవు - ఆయాసం వస్తుంది - శ్రమ తీర్చుకొంటావు - మరుసటిరోజున మళ్ళీ ప్రయత్నిస్తావు - ఎత్తి తీరాలని పంతంపట్టుతావు. ఉత్సాహాన్ని పూరించుకొంటావు. మనోబలాన్నంతా నీ శరీరంలోకి కేంద్రీకరించుకొంటావు. ఊపిరిని బిగపట్టుతావు. అవయవాలన్నీ కుంభించుకొని బిగువు, బిరుసు చూపుతాయి.

ఒక్క ఊపుతో ఆ గుండు నెత్తుతున్నావు, ఎత్తావు - గుండు పైకి లేచింది. నీ పంతం తీరింది - చూచావు సోదరా, పట్టుదల వచ్చేసరికి, నీ బలమెంత పెరిగిందో ? మొదట్లో కనబడనిబలం ఉగ్రం పెరిగినట్లు, పెరుగుకొంటూవస్తుంది. ఇది ఒక యోగం మాదిరిది. ఈ వ్యాయామయోగాన్ని రోజూ అభ్యసించావా, నీ శరీర మంతకంతకు ఉక్కు ఖడ్డివలె, బిరుసెక్కి, అట్టి గుండ్ల నవలీలగ ఎత్తగల్గుతావు. నీ బలంతో ఆ గుండుయొక్క భారాన్ని జయించావన్న మాట.

ఈ సందర్భంలో ఒక్కవిషయం ఆలోచించు. భూమికి ఆకర్షణశక్తి ఉండడంవల్లనే, వస్తువులకు భార మేర్పడుతున్నదని నీవు తెలుసుకొనేఉన్నావు. భూమికీ ఆకర్షణశక్తే లేకుండా ఉంటే, వస్తువులకు భారముండకుండా, నీకు శ్రమఇయ్యకుండా వాటంతటవే పైకి లేచేవి, ఈ భూభారమే నాకు ప్రతిబంధకంగా ఉన్నదని ఊహిస్తున్నావేమో. కాని ఒక సంగతి ఆలోచించు. వస్తువులకు భారముండబట్టేకదా నీవు ఈ నేలమీద కాళ్లు నిలవత్రొక్కుకొని ఉండగల్గడమే కాకుండా, ఆ భారాన్నెత్తుతూ ఉండడంవల్ల, నీలో దాగిఉన్న బలం బహిర్గతం కాగలుగుతున్నది. కాబట్టి భూమియొక్క ఆకర్షణశక్తి నీకు బయటకు అవరోధంగా కనబడ్డా. అదే నీలోనిశక్తిని ఉద్దీపన చేయడానికి కారణం కావటంలేదూ ? ఏది నీకు ప్రతిబంధకంగా గోచరిస్తూ ఉంటుందో, అదే నీ బలాభివృద్ధికి నీ ఉన్నతికి సహకారి అవుతున్నదని తెలుసుకో.

నీ శరీరబల విషయంలోనేకాదు ఈ రహస్యం నీవు అవగతం చేసుకోవలసింది. నీ మనోబల విషయంలో కూడా ఇంతే. నీ మనస్సును ప్రతిబంధించేవి ఎన్నో ఉన్నాయి. తమస్సు నీలోనికి వెలుగును రానీయకుండా చేస్తున్నది, అందుమూలంగా నీ వీ జగత్తులో దారి తెలియకుండా, చీకటిలో తడుముకొంటున్నట్లు మెలగుతున్నావు. నిజమే, కాని నీ మనస్సు వెలుగుకోసం ఎంత తంటాలు పడుతున్నదంటావు ? చెట్టుకూడా చూడు. దానికొమ్మలు వెలుగున్నవైపు కెట్లా వంగుతాయో. అట్లాగే నీ మనస్సుకూడా ఏ వైపునుండి అయినా, వెలుగు వస్తుందేమోనని, అన్నిదిక్కులు వెదుకుతూ ఉంటుంది. నీ చుట్టూ చీకట్లు దట్టమైన కొద్దీ, నీ అడుగు ముందుకుసాగదు. అడుగు సాగనికొద్దీ, వెలుగెక్కడ, వెలుగెక్కడ ? అంటూ ఆక్రందిస్తావు. మనస్సు తహతహాకొట్టుకొంటూ ఉంటుంది. ప్రశ్నిస్తుంది, తర్కిస్తుంది, జిజ్ఞాసపడుతుంది. చీకట్లను పారద్రోలాలనే శపథం పట్టుతుంది.

ఆందోళన ప్రారంభమవుతుంది. పరిశోధిస్తావు. నీకు వెలుగు రాకుండాచేస్తున్న ఈ ముసుగు ఏమిటనే సమస్య నిన్నెదుర్కొంటుంది. ఎట్లా బరువైన రాతి నెత్తడానికి నీవు ఊపిరిని బిగియబట్టి, నీ శరీరాన్నంతా ఏకముఖం చేస్తావో, అట్లాగే నీ మనస్సుకూడా వెలుగుకోసం ఏకాగ్రచిత్తంతో నీ సమస్య నెదుర్కొంటుంది. అప్పుడు నీ మనస్సుకూ ఈ ముసుగుకూ రాపిడీ, సంఘర్షణా బయలుదేరుతుంది. దానిలోనుండి వేడి పుట్టుతుంది. వేడి వృద్ధి అయినకొద్దీ, వెలుగుకూడా దీప

శిఖవలె ప్రకాశించడం మొదలు పెట్టుతుంది. ఎట్లా కట్టెనుండి పుట్టిన అగ్ని కట్టెనే దహించి, దానిని అగ్నిమయంగా చేస్తుందో, అట్లాగే మనస్సులోనుండి బయల్వెడలిన వెలుగు మనస్సునే తేజోమయంగా చేస్తుంది. చూచావూ, ఎట్టి పరిణామమో !

అంతకుపూర్వం నీ మనస్సు ఎట్లాఉండేది ? చీకట్లో ముడుచుకొని పడిఉండేది. జాడ్యమావహించినట్లుగ మందకొడిగ ఉండేది. చింతనచేయడమే తెలిసేది కాదు. నీ మనస్సు ఏ ఒక విషయంమీదా నిలిచేదికాదు. రాతిగోడలమధ్య బంధింపబడిన ఖయిదీవలె నైరాశ్యంలో చిక్కుకొనిఉండేది. ఇప్పుడట్లా కాదే. మనస్సు ప్రజ్వలిస్తోంది. చీకట్లను ఛేదించగల ఖడ్గమైపోయింది. ఎట్టి గహనవిషయాలనైనా ఆమూలాగ్రంగా వివేచించగల పటిమ సిద్ధించింది. ప్రకృతి తనమర్మాల నన్నిటిని తెరచిఉంచిందా అన్నట్లు సర్వంమనోగతమైపోతున్నది, ఎందుచేత ఈ పరిణామం సిద్ధించిందంటావు ?

ఏ తమస్సు నీ మనస్సును ఆవరించి, చీకటికొట్లో బంధించినట్లు చేసిందో, ఆ తమస్సే నీ మనస్సు నుద్దీపనచేసి, అందులోని గర్భితశక్తిని బయటకు లాగింది. ఆ ఆవరణే లేకపోతే, నీ మనస్సుకు జిజ్ఞాస పొడమేదేకాదు. జిజ్ఞాసే లేకపోతే, మనస్సులో జ్వాలే పుట్టేదికాదు, కాబట్టి నీకు ప్రతిబంధకమైనదేది ? బంధనంగా కనబడేదల్లా, నిన్ను మేల్కొలిపి శక్తివంతునిగ జ్ఞానవంతునిగ చేయడానికే ఉద్దేశింపబడినదని గ్రహించు.

తమస్సు అనేది వెలుగుయొక్క వట్టి అభావం, దానికి ఆస్తిత్వంలేదు, అని అనుకొంటున్నావా? కాదు. కాదు. తమస్సుకూడా వెలుగువలె ఒకశక్తే. వెలుగంటే ఏమిటి? తన్ను తాను ప్రకాశింపచేసుకొనేశక్తి. అట్లాగే తమస్సంటే, తన్ను తాను మరుగు చేసుకొనేశక్తి. రెండూశక్తే. తన్ను తాను ప్రకాశింపచేసుకొనేశక్తిని "చిచ్ఛక్తి" అన్నారు. తన్ను తాను మరుగు చేసుకొనేశక్తిని "మాయాశక్తి" అన్నారు. అట్లాగే మొదటిదానిని విద్యాశక్తి అన్నారు—రెండవదానిని అవిద్యాశక్తి అన్నారు. పేర్లభేదమేకాని, అసలు వస్తువు ఒక్కటే—అది శక్తి—"నిషేధ వ్యాపారరూపాశక్తిః" అని చెప్పలేదూ ఋషులు? నిషేధ వ్యాపారమంటే ఏమిటి? తన్ను తాను నిషేధించుకోవడం—అనగా తన స్వరూపాన్ని మరుగుచేసుకోవడం. నీ ఆత్మకెట్టి శక్తివున్నదో గ్రహించావూ? నిన్ను నీవు ప్రకాశింపజేసుకోనూ గలవు. మరుగు చేసుకోనూ గలవు.

ఈ రెండవస్థల కలయికే ఈ జగల్లీలంతా. ఇది ఒక దాగుడుమూతలాంటిది. దాగుకోవటం, బయటపడడం—విస్మరించడం, తిరిగి స్మృతినిబొందడం—నీవు నీకు వేరై పోవడం, తిరిగి నీవు నీవై పోవడం—నీ శక్తిని గోలుపోవడం, తిరిగి నీ శక్తిని పొందడం—ఇది జగత్తులో జరిగే ఆట— —విశ్వం యొక్క ప్రణాలిక—దీనినే తాంత్రికులు శక్తి వ్యాపారమన్నారు. వైష్ణవులు భగవల్లీల అన్నారు, వేదాంతులు మాయాజాలమన్నారు. ఎట్లా అంటేమి సోదరా? నీ శక్తినీ,

నీ స్వరూపాన్ని తిరిగి పొందడానికే, ఈ సృష్టియొక్క ప్రయో
జనమనే విషయం బోధపడటంలేదూ ? చీకటే నిన్ను వెలుగు
లోకి తీసుకొని వెళ్ళుతోంది. దుఃఖమే నీకు సుఖాన్ని అంది
స్తోంది. మృత్యువే నిన్ను అమృతపదవిని చేరుస్తోంది. ఇక
ప్రకృతి బందిఖానా అని ఎందుకు నిందిస్తావు, సోదరా. అయ్యది
నిన్ను వైకుంఠధామానికిచేర్చే గరుడవాహనం.

"విద్యాం చ అవిద్యాం చ
యస్తద్వేదోభయగుం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా
విద్యయా అమృత మశ్నుతే."

# చిత్తవికారాలు

సోదరా, మనలోపల క్షణక్షణం తలంపులపై తలంపులు పుట్టుతూ ఉంటాయి. వానిలో కొన్ని తీయటివి కావచ్చు. కొన్ని వెగటువి, చేదువి కావచ్చు. మన మేదో ఒకలక్ష్యం పెట్టుకొని, దానిదృష్ట్యా ఈ విభాగం చేసుకొంటాం. ఈ లక్ష్యమైనా మనం బుద్ధిపూర్వకంగా కోరితెచ్చుకొన్నదికాదు. మన అభ్యాసాలవల్లా, మన అభినివేశాలవల్లా, ఈ లక్ష్యాలు వాటంతట అవే రూపొంది, మన భావాలను శాసింపచూస్తాయి. పేరుకు లక్ష్యాలేకాని, వాస్తవాని కవి కూడా తలంపులే కాని అవి కొంచెం పైకి తలయెత్తి ఉండడంవల్ల వానిని లక్ష్యాలుగ, ఆదర్శాలుగ ఆదరిస్తాం.

ఈ తలంపులలో కొన్ని మారువేషాలతోవచ్చి, మనలనాడింపచూస్తాయి. వాటినిజూచి మనం మురిసిపోతాం. మనలను స్వర్గానికి చేర్చడానికి వచ్చిన దూతలా అనిపిస్తుంది. వాని వెంటబడి, అవి మనల నెక్కడకు ఈడ్చుకుపోతే, అక్కడకల్లా

ఎగిరిపోతూంటాం. అవి విధినిషేధాలను తారుమారుచేస్తాయి. మనం కవులమైపోతున్నట్లు భ్రమిస్తాం. భక్తి సామగ్రి చేకూరుతున్నట్లు ఉబ్బిపోతాం. ఎప్పుడూ ఏవో తలపోతలలో మునిగి బాహ్యాలోకంకూడా విస్మరించి ఉంటాం. మనం భావభరితులమైపోతున్నామనే ఉన్మాదం కలుగుతుంది.

సోదరా, ఎన్నడైనా ఆలోచించావు, నీలోని భావాందోళనాన్ని గూర్చి? నీ వెప్పుడైనా పాడుబడ్డ గుళ్ళను చూచావో లేదో—వానిలో అన్నివేళలా గబ్బిలాలు, పావురాలు కాపురం చేస్తూంటాయి. అట్లాగే మన బుద్ధికూడాను. ఎన్ని తలంపులు అందులో గూళ్లు కట్టుకొని కలకలలాడుతూంటాయంటావు? ఎప్పుడైనా వానిని పారద్రోలడానికి ప్రయత్నించావు? ఎందుకు ప్రయత్నిస్తావు?—అవన్నీ మన భాగ్యంగా యెంచుకొంటున్నప్పుడు? అవి ఉండబట్టే మన బుద్ధి సజీవంగా తేజోవంతంగా ఉంటున్నదని మన అభిప్రాయమాయె. వానిని పోనియ్యకుండా, గట్టిగా కాపాడుతాం కూడాను.

ముఖ్యంగా చదువుకొన్నవారి బుద్ధులిట్లా మరీ కాకి గూళ్ళయి పోతాయి. ఆ గ్రంథం చదివీ, ఈ గ్రంథం చదివీ, ఆ ఉపన్యాసం వినీ, ఈ ఉపన్యాసం వినీ, తమ బుద్ధులను మేపడానికి ఎన్నో వింత వింత భావాలను, చింతనలను, తలంపులను కోసితెచ్చి, గూళ్ళనిండా పేర్చుకొంటారు. వారిని కదిలిస్తే

చాలు, వాళ్ళట్లానాన్నారు. వీళ్ళిట్లానాన్నారు అంటూ, నాకిట్లా తట్టుతోంది, నాకట్లా తట్టుతోంది—అంటూ భావపరంపరలను విరజిమ్ముతూ ఉంటారు పిల్లలు బొమ్మలు పెట్టుకొని ఆడు కొంటారే. అట్లాగే ఈ భావుకులు కూడ భావాలనే పుత్తళిక లను బెట్టుకొని ఆడుకొంటూ ఉంటారు. ఇది కూడా ఒక వ్యస నమైపోతుంది సోదరా.

నీ వేమనుకొంటావూ, ఈభావాలన్నీ నీ బుద్ధికి సొమ్ము లనీ. అలంకారాలనీ, నీలో భావపుష్టి కలుగుతోందని ! ఎంత వెర్రివాడవు సోదరా ! ఈ తలంపులన్నీ నీబుద్ధిని ఎంత చిందర వందర చేస్తున్నాయో తెలుసుకోవడం లేదు. ఈ తలంపులతో ఆడుకోవడమే రసజ్ఞత అని పైగా గర్విస్తున్నావు. కొంత భాష నలవరచుకొని, వానిని దానిలో మెదిపి లోకంమీద విసురుతావు. నీలోనుండి క్రొత్తభావస్రోతం పొంగుకుంటూ బయలుదేరినట్లు చప్పట్లు చరుస్తావు.

సోదరా, లోకం నీ భావాల జిలుగులను జూచి మోస పోతే మోసపోవుగాక. కాని అవి మాత్రం నిజంగా నీ ఉన్న తికి సాధనాలుకావు సుమీ. అదంతా కాల్పనిక జగత్తు. అది భూమీకాదు, స్వర్గమూకాదు. మధ్య అంతరాళం. ఆ మబ్బు తునకలలో దాగుడుమూతలాడుతూ, ఊర్ధ్వలోకాలలో ఊరే గుతున్నానని భ్రమసిపోతావు. అదంతా గాలిలో రేగే దుమారం, చిత్తంలోలేచే వికారాలు, సత్యదూరమైన, ఆత్మాను భవశూన్యమైన కల్లరాజ్యం సుమా !

ఈ తలంపులు నిన్నెట్లా ఆడిస్తాయో తెలుసునా ? నిన్ను చిల్లర అంగడివానినిగ చేస్తాయి. నానారకాల భావా లను ప్రదర్శిస్తూ లోకాన్నరికట్టాలని చూస్తావు. బందరులో ఒక మస్తాను సాయిబు ఉండేవాడు—ఎప్పుడూ వీధుల్లో తిరు గుతూ ఉండేవాడు. ఒంటిమీద ఒక గాడిదె బరువుమోస్తూ— ఏమిటా బరువు ? పాతగుడ్డపీలికలు, చిత్తుకాగితపు ముక్కలు, పారవేసిన సీనారేకుడబ్బాలు, పింగాణీచిప్పలూ, చిరిగిపోయిన చెప్పులూను. పాపం ఆ పిచ్చివాడా సామాన్నంతా వంటిమీద వేసుకొని చాలా ఠీవిగ గంగిరెద్దువేషంతో తిరుగుతూండే వాడు.

అట్లాగే ఈ భావుకులుకూడాను. కొన్ని భావాలు, కల్పనలు, చమత్కారాలు, యుక్తులు, సంప్రదాయాలు, ప్రయోగాలు తలలోను, హృదయంలోను, పొట్టలోను అదుము కొని, నిషాలోఉన్న మనిషివలె, పై చూపులతో, పెదవులను విప్పుతూ మూస్తూ, లోకమంతా తమ సందేశంకోసం వేచి ఉన్నట్లు తలుస్తూ సంచరిస్తారు, ఆ మస్తాను సాయిబుకును, ఈ భావుకులకును భేదమేమిటి సోదరా ?

అయితే. తలలో ఎట్టి తలంపులు లేకుండా, ఖాళీ బుర్ర లతో ఉండమని అంటున్నాననికాదూ, నీవు నావంక కోర చూపులతో చూస్తున్నది ? నిజమే—నీ బుర్రను ఖాళీచెయ్యా మనే నేను చెప్పేది. ఏదీ—నీ వా పనిని ఎంతవరకు చెయ్యా

గలవో చూస్తాను ! అది నీతరంకాదు. నీ బుద్ధిమీద నీకు పెత్తనం ఉంటేగా, నీవు ఊహాలను రాకుండా చేసుకోగల్గేది ? సముద్రంలో తరంగాలనైనా ఆపవచ్చునుగాని, నీ చిత్తవృత్తు లను నీవు నిగ్రహించలేవు.

పైగా భావకుడవైనావా, లోకంలోని చెత్తా చెదార మంతా నీ బుద్ధిలోకి కొట్టుకొనివచ్చి, ఇంచుక ఖాళీస్థానం లేకుండా చేసివేస్తాయి. నీ మనోద్వారాలను బంధించి ఉంచే ఉపాయం నీకు తెలుసునా ? నీవొక క్షణమైనా భావాలతో ఆటలాడకుండా నిశ్చలంగా ఉండగలవా ? వట్టిమాట. అది నీకొక వ్యసనమైపోయింది. భావాల వ్యామోహంలోపడి కొట్టుకొని పోతున్నావు—బంగారు లేడి వెంటబడ్డ శ్రీరామ చంద్రునివలె.

అయితే నిగ్రహంచేత, భావాలు చెలరేగకుండా చేయ మంటున్నానని అనుకొంటున్నావేమో—అట్లా ఒకవేళ నిరో ధించగల్గినా, ఆ భావాలు మనస్సులోని లోపలి పొరలలోకి దూరిపోయి, లోలోపల గూళ్లు కట్టుకొంటాయి. పైగా అవి మనస్సులో జీర్ణించిపోయి (Complexes) గ మారుతాయి వాని మూలంగా నీ బుద్ధి వక్రిస్తుంది నీ వెంత ప్రయత్నించినా ఈ పురాణవికారాలు నశించవు.

ఆ "కాంప్లెక్సెను" ఆ కుసంస్కారాలు నీకు తెలియ కుండానే, నీ అభినివేశాలను, నీ అభ్యాసాలను, నీ అభిరుచు లను నీ నడవడులను వెనుకనుండి నడుపుతూ ఉంటాయి పైగ

అవి స్వభావసిద్ధములనే అపోహకూడా కలుగుతుంది. నీ సాధన లన్నీ ని చిత్తంయొక్క ఉపరిభాగాలను మాత్రం సంస్కరించ గలుగుతాయేమో కాని, అంతర్గతంగా జీర్ణించిపోయిన సంస్కారాలను ఊడబెరకలేవు. కాబట్టి నీ వవలంబించవలసింది నిరోధంకాదు. నిరోధంకూడా ఒక ప్రవృత్తే. సోదరా.

ఇక ఎట్టి చింతనలూ, ఆలోచనలూ నీలో ప్రవేశించి అల్లకల్లోలపరచకుండా చేసే ప్రయోగమేమిటి? సోదరా, విను.. నీవేమీ చేయక. నీలో తలంపులుపుట్టి తలపడుతూంటే, వానిని చూస్తూ వెనకకు పో. ఇంకా వెనక్కుపో. ఆ తలంపులలో ఏదీ నీదిగ భావించకు. ఆ తలంపులలో కొన్ని మంచివి కావచ్చును, కొన్ని చెడ్డవి కావచ్చును. ఆ రెంటినీ కూడా సమంగా చూస్తూ వుండు. అవి చిత్రవిచిత్రంగా నీలో ద్వంద్వయుద్ధం సాగిస్తూ వుంటాయి ఏ పక్షానికీ నీవు ఉపాకరియ్యక. సినిమా తెరమీద ఎన్నిదృశ్యాలు, రూపాలు వచ్చిపోతూండవు ? అట్లాగే నీ మనస్సనే తెరమీద చింతనలనే చిత్తరువులెన్నో వచ్చి ఆడి పోతూంటే, నీవు ముఖావంగా ఉండు. నీవు వాని కెట్టి దోహదం, సహాయం చేయకుండా ఉదాసీనంగా ఉన్నావా, సినిమాలో బొమ్మలు క్రమంగా 'Fade - out' - దృశ్యాదృశ్య మవుతూ తుదకు అంతర్ధానమైనట్లు, వాటంతట అవే మాయ మయిపోతాయి. సఫేదు తెర స్వచ్ఛంగా ఉండిపోతుంది, దాని మీద ఎట్టిపీడలు పడకుండా.

ఇంకా తెర ఎక్కడోయి సోదరా ? నీ మనస్సే తన బొమ్మల నెక్కించి ఆడించడానికి ఒక తెరను కల్పించుకొన్నది.

ఎప్పుడు, ఈ మానసిక చిత్రాలు అంతరించడం మొదలుపెట్టాయో అప్పుడే ఆ కాల్పానికమైన తెరకూడా క్రమంగా జారిపోతుంది. ఇక మిగిలిందేమిటి? వట్టి వెలుగు. ఇంతకాలం నీవు లోపల పెట్టుకొని ఆడుతున్న రంగు రంగుల బొమ్మలన్నీ ఏమిటి? ఆ వెలుగుయొక్క క్రీనీడలే. ఆ క్రీనీడలనే చూచుకొని దీపశిఖలనీ, వెలుగుజిలుగులనీ భ్రమించి తబ్బిబ్బులైనావు-సోదరా, అవి వట్టి నీడలు, వెలుగును మరుగుపరచే ఛాయలు ఇప్పుడా ఛాయలు విడిపోవడంవల్ల ఆ వెలుగు నిష్కళంకంగా, నిండు దీప్తితో ప్రకాశించి, నీ అంతరంగాన్ని నింపివేస్తుంది. నింపడమేమిటి?—నీ అంతరంగమనేదే వెలుగైపోయింది, ఎట్టి వెలుగంటావది? చల్లని వెలుగు, తీయని వెలుగు, శాంతరసం — ఆనందభోగం — నిరతిశయసుఖం.

"శుభాశుభ పరిత్యాగీ
భక్తిమాన్ యస్స మే ప్రియః."

# రసోదయం

సోదరా నీవు దేనినీ ఆశ్రయించకుండా, స్వతంత్రంగా రసా స్వాదన చేయడ మెట్లా అని ఆలోచిస్తున్నావు. ఎందుకీ ఆలోచన? కళల ద్వారా రసాస్వాదన చేయడం నీకు అభ్యాసమైంది. కాని వానిని వదిలివేసి, రసజ్ఞుడవు కమ్మంటే, నీరులేని కొలనులో ఈదమన్నట్లుగా భావిస్తున్నావు.

కళలు నీకెందుకు రసమును చూపుతున్నాయో, యోచించావు ? కళలు రసాత్మకములు కనుక, అని సమాధానం చెప్పుకుంటావు కాని కళలు రసాన్ని బయటనుండి తెచ్చి నీ ముందు పెట్టుతున్నాయా ? అది నీకు సంబంధించని బయటివస్తువే అయితే నీ కది ఎట్లా రుచ్యమగుతుంది ?

నీలో దాగియున్న రసాన్నే కళలు ఉత్తేజనం చేస్తాయి నీ నాలుకకు రుచి అనేదే లేకపోతే, ఎన్ని మధురపదార్థాలను నీ ముందు పెట్టినా, ఏమి ప్రయోజనం ? వానిని చెత్తగ త్రోసివేస్తావు. సంగీతం శ్రావ్యంగా ఉన్నదంటే, ఆ శ్రావ్యత నీది

కాని సంగీతానిది కాదు. చిత్తరువు సుందరంగా ఉన్నదంటే, ఆ సౌందర్యం నీది కాని, చిత్తరువుది కాదు. కావ్యం శృంగారంగా ఉన్నదంటే, ఆ శృంగారం నీది కాని, కావ్యానిది కాదు. నీలో ఏ ప్రశాంతత, ఏ సౌందర్యం, ఏ శృంగారం ఉన్నదో దానిని కళలు ఉద్దీపన చేయడానికి సమర్థములగు తున్నాయన్న మాట,

నీ వెక్కడ, దేనిద్వారా, అనుభవం పొందుతున్నా, నిజంగా అది నీ ఆత్మానుభవమే కాని మరొకటి కాదు. నీకు అన్యమైనది, నీకు అనుభవం కాజాలదు, నీ సమస్తజ్ఞానం నీ ఆత్మజ్ఞానం. నీ సమస్తభోగం నీ ఆత్మభోగం. నీ సమస్తకర్మ నీ ఆత్మకర్మ. జ్ఞానం, సుఖం, కర్మ నీ బయటివని, ఇతరులెవరో నీకు వానిని సమకూర్చి పెట్టుతున్నారని, నీవు భ్రమపడు తున్నావు. అది వట్టిమాట.

రసమనేది నిష్క్రియంగా ఉండే వట్టిస్థాణువుకాదు, అది నిరంతరం త్రొక్కిసలాడుతూ, పొంగుతూ, పొర్లుతూ సుళ్లు కొట్టుతూ ఉంటుంది, ఈ విశ్వ మేమిటి ? ఆ అనంతరసము యొక్క పొంగు, క్రీడ, నర్తనము. అది అనంతరం కనుక, అది నానాప్రకారాలుగ భంగిస్తూఉంటుంది. జడంగా ఆకర్షణాపకర్షణాలలో, సంక్షేప విక్షేపాలలో ఆడుతూ ఉంటుంది. సచేతనంగా వృద్ధిక్షయాలలో విలసిల్లుతుంది, జీవకోటిగ, క్షుత్పిపాసా నిద్రా మైథునాలలో నర్తిస్తుంది. మానవునిలో కామక్రోధాలలో

పొంగుతూ ఉంటుంది. దేహంలో, ప్రాణంలో, మనస్సులో జరిగే ఈ పరిణామమంతా రసలీలే అని గ్రహించు.

నీ లోపల, నీ బయటా, ఇట్లా చిదానందరసం పొంగి పొరలుతూ ఉంటే, ఇంకా నీకు రసోదయం కలుగకపోవడానికి కారణమేమి? విశ్వపరిణామమంతా నిర్జీవమైన యంత్రంవలె జరుగుతున్నదని భ్రమించడంవల్ల, నీజీవితం రసభరితం కావటం లేదు. ఎప్పుడు నీ దేహం, నీ ప్రాణం, నీ మనస్సు ఆ విశ్వ తరంగిణియొక్క లీలావిలాసములే అని తెలుసుకోగల్గుతావో, అప్పుడు నీ జీవితమంతా ఆత్మరతియై, రసభోగమై, క్షీరసాగర శయనుని వలె నిరతిశయానందాన్ని అనుభవిస్తావు.

# విరాడ్రూపం

సోదరా, భూతత్వానికి ఏ లక్షణాలైతే ఉన్నాయో ఆ తత్వాలన్నీ నీదేహానికీ ఉన్నాయి. ఈ భూమిలో ఉన్న సమస్త ధాతువులు లోహాలు, క్షారాలు, రసాయనిక పదార్థాలు-ఏదో ఒకపరిమాణంలో నీ దేహంలోనూ ఉన్నాయి. ఏ ఆకర్షణాపకర్షణలు, సంక్షేప విక్షేపాలు, ఘన, ద్రవ, వాయు అవస్థలు, ఉష్ణము, తేజము, విద్యుచ్ఛక్తి, మాగ్నెటిక్ శక్తి మొదలగు శక్తి రాకపోకలు—ఇవన్నీ భూమిలో ఉన్న రీతిగానే ప్రవర్తిస్తున్నాయి నీ దేహంలో కూడా.

ఈ ఐక్యతనుగూర్చి నీవెప్పుడైనా దీర్ఘంగా తలపోశావు నీ దేహంకూడా మట్టే, లక్షా కోటి గెడ్డల్లో ఇదీ ఒక గెడ్డే,అని అనుకొంటే అనుకొని ఉండవచ్చు. కాని ఈ భూలోకమంతా నీ దేహంలో ఇమిడిఉన్నది అని అనుకున్నావా?

సోదరా, ఇట్లా ఒకమారు చూడు, ఎక్కడి సూర్యుడు? నీ దేహం ఎక్కడ? సూర్యమండలంనుండి తేజస్సు, ఉష్ణము నీ చిన్ని నేత్రంమీద, నీ క్షుద్రశరీరంమీద ప్రసరించి, నీ శరీరాన్ని

నిరంతరంగ శుద్ధచేస్తున్నాయా లేదా! ఉత్తరధ్రువం ఎక్కడ, నీ వెక్కడ? వాయువంతటా వ్యాపించి నిన్ను వెదుక్కుంటూ నీ ఊపిరితిత్తులలో ప్రవేశించి ఎప్పుడూ నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాల నాడిస్తున్నదా?

ఇట్లాగే మేఘంలో ఉండే జలం, పొలంలో ఉండే పంట, చెట్లమీది పండ్లు—భూగర్భంలోని ధాతువులు—ఇవన్నీ నీ దేహంలో ప్రవేశించి పోషిస్తున్నాయా? ఇట్లా చూస్తే, భూమికి నీవు ఒక కేంద్రంగా, ఒక సెంటరుగా, ఉన్నట్లు తోచ టంలేదు? ప్రపంచం ఎంత విశాలమైనదైనా, నీ శరీరం దానిలో అణుమాత్రంగా ఉన్నట్లు కనబడ్డా, ఆ విశాల ప్రపంచ శక్తు లన్నీ నీ దేహంలో ప్రత్యక్షంగా కేంద్రీకరణం—ఫోకసు అవు తున్నాయి.

నిజమే, నీ దేహాలవంటివి ఇంకా లక్షాకోటి ఉండుగాక. అవికూడా నీ దేహంవలెనే భూలోకానికి కేంద్రాలే—సెంటర్లే. దీనినిబట్టి ఏమి తెలుస్తున్నది? భూమి అంతా ఒక్కటే—కాని దానికి కేంద్రాలు అసంఖ్యాకంగా ఉన్నాయనీ, భూలోకమంటే అనంతకేంద్రాలు గలది (multi-centered universe) అని.

నీ దేహానికి ఆధారమై, నీ దేహాన్ని ఒక కేంద్రంగా చేసుకొని, సమస్త కేంద్రాలతోను సంబంధం కల్పిస్తూ ఉన్న అఖిలభూలోకము ఒక్కటైతే, దానిలో నీవు గీసుకొన్న

గిరులూ, విభాగాలూ, హద్దులూ, ఆవరణలూ, ఇవన్నీ నిజంగా నీ కల్పనలేనా ?

నీ దేహానికి ఈ భూలోకానికిగల సంబంధం అంగాంగి సంబంధం. అంటే? ఎట్లా నీ అవయవాలకు నీ శరీరం ఎలా అంగో, అట్లాగే నీ దేహానికి ఈ భూలోకమంతా అంగి—శరీర మన్నమాట, నీ దేహం నిజంగా నక్షత్రవీధులదాకా వ్యాపించి ఉన్నది. భూగర్భంలోకి కూడా వేరు వేసుకొని ఉన్నది. వాయుమండలమంతా వ్యాపించిఉన్నది.

భూమిలో ప్రతిభూతమూ, జంతువు. పక్షి, క్రిమి, కీట కం, చెట్టు, పుట్ట - ఏమంటున్నాయో తెలుసా-నిన్ను సోదరా అని సంబోధిస్తూ — నీ దేహంవలెనే నా దేహం కూడా "విశ్వోహం" అని ఘోషిస్తున్నాయి.

సోదరా, "నా కాలిక్రిందబడిఉన్న, నిర్జీవమైన, ఈ రాయీ నేనూ సమానమా" అని కాదూ నీ గర్వము ? ఆ రాయే లేకపోతే. నీకీ దేహం ఎట్లావచ్చిందోయి ? నీ దేహాన్ని చూచుకొని మురిసిపోతూ ఉంటావే ! దీనిని సబ్బులువేసి తోముతావు. చీనిచీనాంబరాలతో అలంకరిస్తావు. అత్తర్లు రాచుకొంటావు. పంచభక్ష్యాలతో తృప్తిపరుస్తావు. శ్రమపడిపోతుందేమోనని, మోటారులో పెట్టి ఊరేగిస్తావు. రాత్రిళ్లు హంసతూలికలపై పరుండబెట్టి నిద్రపుచ్చుతావు. దేహాని కీవిధంగా ఉపచారాలుచేసి, ఆనందించుకొంటూ ఉంటావే—నీ దేహానికి ఆధారభూతమైన రాయి, రప్ప. నీళ్ళూ, గాలి, నిప్పూ ఆకాశం నీ దేహంకంటె నీచమైనవా ? అట్లా అయితే నీవు మాత్రం నీచసంజాతుడవుకాదూ ?

ఎవడీ విధంగా;లోకంతో నాకేమీ అని అనుకొంటాడో, వానిని లోకంకూడా వెలివేస్తే, వాడేమవుతాడు ? నీ దేహం పంచభూతాలకు ఎంత ఋణపడిఉన్నది ? అవన్నీ ఒక మారుగ

వచ్చి, మా బాకీ తీర్చమని అడిగితే, నీ వేమైపోతావు ? ఇంత మోహంతో పెంచుకొంటున్న నీదేహం కాస్తా "పంచత్వం" చెందదూ ?

ఇప్పుడు నీ కళ్ళు రంగు రంగు రూపాలతో ఉత్సవంచేసు కొంటున్నాయి. నీచెవులు మధురశబ్దాలను గోలుతూ పాట కచ్చేరీ చేసుకొంటున్నాయి. ఎన్ని సుగంధద్రవ్యాలను భోగిస్తు న్నది నీ భోగేంద్రియం! మందమందంగా వీచే ఆ శీతల మలయ మారుతాలకు నీ శరీరం చొక్కిపోతోంది. శాకాలన్నీ నీకు షడ్రుచులను కల్పించి నీ రసనేంద్రియానికి సంతర్పణచేసి పోతున్నాయి. నీ దేహం పంచత్వం పొందితే, ఇక ఈ శబ్దస్పర్శ రూపగంధరసానుభవా లెక్కడ ?

మట్టి ఉండబట్టికాదూ, దానిలోనుండి ప్రాణం వ్యక్తమై నిరింద్రియాన్ని సేంద్రియంగాచేసి, నీకు విషయప్రపంచాన్ని అమర్చిపెట్టింది ? ఆ మట్టియొక్క బలిదానమెట్టిదో గ్రహిం చావు ? ఆ మట్టి ఎండలో ఎండి, వానలో తడిసి, కాళ్ళక్రింద నలిగి, విచ్చి, తన ఒడిలో ఉన్న గింజను మొలకెత్తించి, ఆలవా లమై, తనలోని సత్తువను సారాన్ని ఎట్లా దానం చేసివేస్తోందో చూచావా ? ఇంత బలిదానం చేస్తున్న మట్టికంటె నీవు అధికు డవా ?

మట్టిలో ఎట్టి సౌందర్యం ఉన్నదో నీ కళ్ళు చూడగలి గాయి ? మట్టి ఎట్లా తనను తాను పదునుచేసుకొని, తనలోని

సౌందర్యరసాన్ని పిండి, పరిమళాన్ని మార్దవాన్ని పుష్పంలోకి ఎక్కించిందో ఆలోచించుకో. ఆ పూవురేకులలోని తళుకులు మట్టివికాకపోతే ఎక్కడివి ?

మట్టి ఎంత తపస్సుచేస్తే, నీ తలలో అతిసున్నితమై, మృదులమై, సూక్ష్మమై, మస్తిష్కమై, నీ భావలతికల కన్నిటికి నిలయమైందో తెలుసుకో ! ఎన్ని పుటాలు, ఎన్ని వడపోతలు, ఎన్ని శుద్ధులు—ఎందుకు ? ఎన్ని జన్మలెత్తిందో నిన్ను మనోమయ పురుషునిగ జేసుకోడానికి ? ఎట్టి ఘోరతపస్సు అది ! ఆ తపస్సు పార్వతీదేవి తపస్సు వంటిదికాదూ ? నీవు భోక్తవైతే, తాను భోగ్యమై తనజన్మను సార్థకపరచుకొంటున్నది. "అన్నం" పరబ్రహ్మ స్వరూపం. మట్టికి ప్రణమిల్లు, తమ్ముడా!

# త్రిగుణాత్మకం, త్రిగుణాతీతం

సోదరా, దేహము, ప్రాణము, మనము — ఈమూడు నీకు ప్రత్యక్షమైన విషయములు కాని, బయటి ప్రమాణాన్ననుసరించి, తెలుసుకొన్నవి కావు.

ఈ మూడు కలసిఉన్నా, ఒకదానిపై ఒకటి కొంతవరకైనా పెత్తనం వహించి శాసిస్తున్నట్లు నీవు కొంచెం యోచిస్తే బోధపడుతుంది.

చూడు, ప్రాణం దేహాన్ని సచేతనంగా చేస్తున్నది. నీ ప్రాణం నీ దేహంతో సంబంధం వదులుకొన్నదా, సజీవంగా ఉన్న నీ దేహంకాస్తా, అచేతనమై ఊరుకొంటుంది, కాబట్టి దేహం కరచరణాద్యవయవములతో పనిచేస్తున్నదంటే, ప్రాణం మోటారులో పెట్రోలువలె భగ్గు భగ్గుమని పేలుతూ కదిలేటట్టు చేస్తున్నదన్నమాట.

మోటారులో వట్టి పెట్రోలున్నా లాభంలేదు. దానిని అదుపాజ్ఞల్లో ఉంచే మనస్సు అనే డ్రయివరు ఉండాలె. అప్పుడే మోటారు భద్రంగా నీ ఇచ్ఛప్రకారం పోతుంది.

దీనినిబట్టి ఏమి తెలుస్తున్నది? మనస్సుకు లోబడి ప్రాణం, ప్రాణానికి లోబడి దేహం ఉన్నదన్నమాట. అంటే దేహంకంటే ప్రాణం ఎక్కువశక్తివంతమైనది, మనస్సు ప్రాణం కంటె ఎక్కువ బలంకలది అని అవగతం కావటంలేదు?

అయితే, అన్నమయ, ప్రాణమయ, మనోమయకోశాలు అన్యోన్యం కలసి పనిచేస్తున్నాయంటే, ఈ మూడు బయటకు వేరువేరు గుణకర్మలు కలిగివున్నా, మూలంలో ఒక్కటేమో అనే సందేహం కలుగుతుంది.

చూడు, భూతత్వం ఘనంగా (solids) ఉండవచ్చును. లేదా ద్రవరూపంలో (liquids) నూ ఉండవచ్చు. లేక వాయు రూపంలోనూ (gases) ఉండవచ్చు. అవునా? ఘన, ద్రవ, వాయురూపాల గుణకర్మలు (qualities and functions) వేరు వేరుగా ఉన్నా, మూలభూతత్వం matter ఒకటేగా?

అట్లాగే దేహ, ప్రాణ, మనస్తత్వాల గుణకర్మలు భిన్నంగా వ్యక్తమగుతున్నా, ఈ మూటికీ మౌలికపదార్థం ఒకటేమో ఆలోచించకో!

ఈ మూడూ ఒకదానికంటె ఒకటి అధికంగా కనబడుతూ ఉండడంవల్ల—ప్రాణశక్తి అనేది భూతత్వంలో అంతర్గతంగా ఉండి, ఇటీవల వ్యక్తమైనదేగా—అట్లాగే మనస్సు ప్రాణంలో అనభివ్యక్తంగా ఉండి, తర్వాత వ్యక్తమైనదేమో—కాబట్టి మన

స్తత్వం వంటిదే దేహ, ప్రాణ మనముల మూలపదార్థమే మో-
నెమ్మదిగా యోచించుకొంటే, సత్యం బోధపడుతుంది.

కాబట్టి దేహం. ప్రాణం, మనస్సు స్వతంత్రములు అని అనుకోక. అవి ఒక్క సత్యముయొక్క భిన్నరూపములు. దేహం సత్యముయొక్క తమోరూపమైతే, ప్రాణం రజో రూపం, మనస్సు సత్వము. వీనినే గుణాలు modes అన్నారు మన తత్వజ్ఞులు.

నీ ప్రకృతి—దేహ ప్రాణ మనములు, త్రిగుణాత్మకం. వీని కాధారభూతమైన మూలపదార్థం త్రిగుణాతీతం. ఈ రహస్యం నీకు బుద్ధిగతమైతే, నీ జీవిత పరమార్థం అనుభవ సాధ్యమగుతుంది.

# ఉపాధి ప్రశస్తి

సోదరా, నీచుట్టూ అనేక వస్తువులున్నాయి. కాని వాని విశేషం, స్వరూపం తెలియకపోతే వాని విలువ, ప్రయోజనం నీ కెట్లా బోధపడుతుంది ?

నీదొడ్లో ఒక మొక్క—అది పనికిరానిది కాదు, అది గొప్ప ఓషధి అని తెలిస్తే, దానిని జాగ్రత్తగ కాపాడి, దాని ఫలితం పొందకుండా ఉంటావా ?

నీ చవిటి పర్రలో గంధకం దొరుకుతుందని ఒక శాస్త్రజ్ఞుడు చెప్పాడనుకో, ఇంతకాలం నిరర్థకంగా ఉంచిన పర్రనిప్పుడు బంగారంగా చూచుకోవు ?

మామూలుగ ఏమనుకొంటున్నావు—దేహానికి ఆరోగ్యం కావాలె, ప్రాణం సుఖం కోరుతుంది, మనస్సు నెమ్మది వాంఛిస్తుంది-ఇవి సమకూడితే, నీ జీవితం చరితార్థమైనట్లు సంతోషిస్తావు.

అంతేనేకాని, ఈ మూటిలో ఏ మహాశక్తులు దాగి ఉన్నాయో, వాటిని బహిర్గతం చేసుకుంటే, నీవు ఎట్టి ఉన్నతిని పొందుతావో-ఆ లోతుపాతులను తరచిచూచావా ?

నిన్నాశ్రయించుకొని ఉన్న దేహప్రాణమనములు సామాన్యములైనవి కావు - అవి చిచ్ఛక్తియొక్క భిన్న రూపాలు. కొంచెం శ్రమపడితే, వానిలో దాగిఉన్న సత్పదార్థాన్ని పొంది, నీవు బలవంతుడవు, భాగ్యశాలివి, ప్రభువుకాగలవని బోధిస్తూఉంటే నీ కెందుకు నమ్మకం కుదరదు ?

అది బంగారమంటే, దానిని గీసిచూస్తావు. అక్కడ పాతాళగంగ పడుతుందంటే, గొట్టం దింపుతావు. అట్లాగే నీలో బంగారం, పాతాళగంగ, ఉన్నాయిరా బాబూ అంటే, ఏమిటో చూద్దామని కించిత్తయినా శ్రమపడవేమి ?

నీదేహానికి కావలసినది వట్టి ఆరోగ్యమేనా ? ప్రకృతి ఎంతకాలం, ఎన్నియుగాలు శ్రమపడితే నీదేహం అమరింది ? భౌతిక ప్రపంచంలో నీ దేహంబోలిన - అంత సుకుమారమైన, అంత సుందరమైన విగ్రహాన్ని చూపించు.

ఆ అనంతశక్తి ఎంతమురిసి, ఈ చక్కని దేహాన్ని సృష్టించుకొన్నదో-ఎట్టి భోగం పొందడానికో? ఎట్టి విలాసాన్ని ప్రదర్శించి చూచుకోడానికో !

నరవిగ్రహాన్ని జూచి గ్రీకు శిల్పశేఖరులు ముగ్ధులైపోయినారే-దేవతలు సహితం పరవశులైనారే. శ్రీమన్నారా

యణుడు కూడ తుదకు నరదేహాన్నే ఆశ్రయించి, తన దివ్య లీలలను ప్రదర్శించాడే. నీది ఎట్టి జగన్మోహనరూపమోయి, సోదరా !

దేహం తమః ప్రధానమైనదంటే, అది క్షుద్రమనికాదు. అది నీ చేతిలో కీలుబొమ్మకావడానికి, నీలో చొక్కిపోవడానికి, నీ ఆనందామృతంలో కరగిపోవడానికి, తన ఎరుకను మరుగు జేసుకొని నిద్రాణమైయున్నది.

శ్రీరామచంద్రుని స్పర్శకు పాషాణి తిరిగి అహల్యాదేవి అయినట్లు, నీ స్పర్శకు తిరిగి చైతన్యవంతం కావడానికి వేచి ఉన్నది.

ఒక్కమారు నీ దేహాన్ని కౌగలించుకొని, నీ ఆత్మస్పర్శ ఇయ్యి - అందు నిద్రాణమైన శక్తులన్నీ ప్రబుద్ధములై, నిన్ను బృందావనంలోకి గొంపోయి రాసక్రీడ చేయిస్తాయి. ఎంత పుణ్యం చేసుకొంటే నీకీ నరజన్మ లభించింది తమ్ముడా ?

# మృణ్మయం కాదు – చిన్మయం

సోదరా, శరీరం ఉపాధిమాత్రమే అంటారు వేదాంతులు.

ఎందునిమిత్తం ఈ ఉపాధి ? దానిని నిస్సారంగా వట్టి మట్టిముద్దగాచేసి, ఒకమూల దాచిపెట్టడానికా ?

అది మహాదోషముసుమీ! దేహాన్నీ విధంగా నిరాదరణ చేసావంటే, భ్రష్టమయ్యేది నీ శరీరంకాదు - నీవే ఈ నర జన్మను విఫలపరచుకొంటున్నావన్నమాట.

అదేదో నిన్ను అధోగతిలోకి ఈడ్చుకొనిపోతుందనీ, కాబట్టి దానిని తాళ్లుపెట్టి కట్టిఉంచితే నీకెట్టి ఉపద్రవంరాదనీ తలంచడం సరికాదు.

శరీరహింస చేశావంటే, నిజంగా నీవు హంతకుడవైనా వన్నమాటే.

నా శరీరంమీద నాకు సర్వాధికారంలేదా అని ప్రశ్నించడం కంటె అపరాధ మింకొకటిలేదు.

ఈ శరీరం నిజంగా నీ స్వంత ఆస్తికాదు. దానిమీద నీకు ప్రత్యేకంగా ఎట్టిహక్కులూ లేవు.

ప్రపంచశక్తులన్నీ కలసి నిర్మాణంచేసిన గొప్ప విగ్రహ మది. దానిలో స్పందించేది సర్వవ్యాపకమైన విశ్వప్రాణం. నీ శరీరానికి విశ్వమంతా అండయై నిలచియున్నదని తెలుసుకో.

పంచభూతములు, పంచప్రాణములు, పంచేంద్రియములు నిన్ను తరింపజేయడానికి ఈ విధంగా ఈ రూపంలో అమరి నాయి. నిన్ను స్వర్గాన్ని జేర్చగల పుష్పవిమానమది.

నిన్ను తరింపచేయడానికేకాదు ఈ దేహం నీకు వాహ నంగా, దివ్యసంస్థానంగ అమరింది.

దాని ముఖంమీద ఇంతఅన్నం, ఇంత బట్టా పడవేసి నీకిది చాలులే అని అంటే, అది పొందే దుఃఖం ఇంతా అంతా కాదు.

దానిని కేవలం డాక్టరు చేతిలోపెట్టి, దానిని పదిలపరచి నంతమాత్రాన అది సంతృప్తిచెందదు.

దానిని తరింపజేయడంలోనే నీవు కూడా తరిస్తావు. అది నిన్ను బందిఖానాలో పడవేయడానికి నీదరికిరాలేదు అని నిరంతరం హృదయస్థంచేసుకో.

అది గద్గదకంఠంతో యాచిస్తున్నది - ఏమని ? తనను తమస్సు అనే బందిఖానాలోనుండి విడిపించి, నీ ఆత్మతోబాటు హంసవాహనంగా ఆనందధామము చేర్చమని - నీ శరీరంలోని ప్రతి అణువు, ప్రతికణం యిట్లా ఆక్రందిస్తున్నది.

బొందితో కైలాసమా అని అడుగుతున్నావా సోదరా.

అన్నను నీవు తలచుకొంటే, నీ శరీరాన్ని నీ ఆత్మ పదార్థంలోకి కలిపి వేయగలవు. ఏది నీలో జ్ఞానజ్యోతియై ప్రకాశిస్తున్నదో ఆ చిద్రూపమే ఇది - ప్రస్తుతం తమసావృతమై యున్నది.

నీ ఆత్మకుగల తేజాన్ని. సౌందర్యాన్ని, ఆనందాన్ని నీ శరీరానికికూడా అందచేసావా అది తిరిగి సత్యమై వెలుగుతుంది.

దానిని నీవశంలో పెట్టుకో - ఎట్లా ? నీ నౌకరుగా కాదు, నీ సహధర్మచారిణిగ, నీతోడి యాత్రికురాలనుగ, నీ ఆత్మలో హత్తుకొని నీలో లీనంచేసుకొన్నావా, నీ శరీరం కూడా తమోరూపాన్ని విడిచి, నీ ఆత్మసౌందర్యంలో కరగిపోతుంది. సృష్టిలో చీలి రెండయినవి తిరిగి ఏకదీపశిఖగ, అఖండ జ్యోతిగ, ప్రకాశమాన మగుతుంది.

# నిర్మలచిత్తం

సోదరా, నీవనుకొంటున్నావు, నీ మనస్సు ఎంత వేగంగా పనిచేస్తే, నీ వంత మేధావివి అని.

అది చాలా పొరబాటు సుమీ! నీ మనస్సు అంత పలుచనై పోతోందన్నమాట. నీ మనస్సు ఎంత చిక్కనైతే నీవంత మేధావివి అగుతావనేమాట జ్ఞాపకం ఉంచుకో.

తుపానులోవీచే గాలిలో చిక్కతనం ఉంటుందో, లేక నిశ్చలంగా ఉండేవాయువు చిక్కగా ఉంటుందో ప్రకృతి శాస్త్రజ్ఞుల నడిగి తెలుసుకో - లేక బరామిటరులో చూచి కనుక్కో.

నీ వనుకొంటావు - తుపానుగాలి ఝుంఝూమారుతం వలె ప్రచండంగా వీస్తుంది, వృక్షాల నామూలాగ్రంగా పెకలించివేస్తుంది, మేడలను మిద్దెలను పడగొట్టుతుంది - అట్టి తుపానుగాలిలో బలం లేకపోతే, కదలకుండాఉండే గాలిలోనా బలం ఉండేది? - ఇది కాదూ నీ సంశయం ?

సంచారంచేసే గాలిలోని బలం ఎక్కడిది ? నిలకడగా ఉన్నప్పుడు తనలో దిట్టపరచుకొన్న బలం కాదూ?

అట్లాగే నీ మనస్సూను. మనస్సు సహజంగా, అప్రయత్నంగానే కదులుతూ ఉంటుంది. ఇంద్రియాల వెంబడి పరుగులు తీస్తూఉంటుంది. కోరికలమధ్య ఉరుకులెత్తుతుంది. ఈ పరుగులు, ఈ ఉరుకులు నీ మనోబలాన్ని వ్యయపరుస్తున్నాయన్నమాట.

మనస్సులోని చిత్తవృత్తులు సుడిగుండాలు తిరగకుండా చేసుకోగల్గావా, మనస్సును నిశ్చలంగా ఉంచుకొన్నావా, నీబుద్ధి తేజోవంతమై, నీ పరిశ్రమ లేకుండానే, సద్యస్ఫురణవల్ల, లోక రహస్యమంతా గోచరిస్తుంది. నీ మనస్సు నెప్పుడు మీమాంసలలోను, వాద ప్రతివాదాలలోను, తర్కవితర్కాలలోను, భిన్నభిన్న మతాలలోను పడవేసి, రాపాడావా, నీ మనస్సు అంత చీకాకుపడి, నిన్ను నిరంతరం డోలాయమాన మనస్కునిగ జేస్తుంది. నీ ఆలోచనలే సత్యాన్ని మరుగు చేస్తాయి. లోకమంతా నీకు అడ్డదిడ్డంగా కనబడుతుంది.

సోదరా, నీ మనస్సునట్లా చీకాకుపెట్టుకోక. నీ ఆలోచనలను తరిమివేయి. ద్వారాలను బంధించిఉంచు. నీ మనోసరోవరం నిస్తరంగమై నిర్మలం కానీ.

అప్పుడు చూడు నీ మనస్సు ఎంత ప్రకాశమానమగుతుందో. లోతులలోనుండి వెలుగులు ప్రసరిస్తాయి. సంశయాలు విడిపోతాయి. నీకు సత్యోపలబ్ధి సిద్ధిస్తుంది.

సూర్యబింబాన్ని నీ వెందుకు చూడలేకుండా ఉన్నావు? సూర్యకిరణాలవల్ల. అవి నీ కంటిచూపుకు అవరోధం కల్పిస్తు న్నాయి. ఆ సూర్యకిరణాల అడ్డం తీసివేసుకున్నావా, సూర్య బింబం అమృతకరునివలె నీకు గోచరమగుతుంది.

నీ చిత్తవృత్తులుకూడా సూర్యకిరణాలవలె, నీకు సత్య బింబాన్ని గోచరింపకుండా చేస్తున్నాయి. వానిని నిలిపి వేశావా, నీవే వెలుగై పోతావు. నీ వెలుగు జగత్ప్రకాశమూ, స్వయంప్రకాశమూను.

## ఖండజ్ఞానం

సోదరా, నీకెన్ని పర్యాయములో చెప్పాను, నీలో ఆలోచన చేసేది నీ మనస్సు కాదని.

నీ బుద్ధి కూడా ఒక ఇంద్రియం, చెవి, కన్ను, ముక్కు వలెనే నీ మనస్సుకూడా ఒక ఇంద్రియం – అవి పంచేంద్రియాలైతే, ఇది ఆరో ఇంద్రియం - అని తెలుసుకో.

ఇంద్రియాలంటే వట్టి ద్వారాలు. ద్వారాలుచూస్తాయా, వింటాయా, ఆలోచిస్తాయా ? లేదు. అవి వట్టి జడములు. నీ మనస్సు కూడా ఒక జడపదార్థమే. కండ్లకు అద్దాలు పెట్టుకొంటే చూచేది, కళ్ళా ? అద్దాలా ? అయితే నీలో తెలుసుకొనేది. సంకల్పించేది, ఆనందించేది ఏది అని అడుగుతావా ?

ఈ ద్వారాల నుపయోగించుకొనేది చైతన్యం. దానినే "మనస్య మనః" అన్నారు మన పెద్దలు. అదే విజ్ఞానం. నీ మనస్సులో దాగివుండే విజ్ఞానం నీలో జ్ఞానశక్తిగ క్రియాశక్తిగ, ఇచ్ఛాశక్తిగ ప్రవర్తిస్తోంది.

కాని విజ్ఞానం నీ ఇంద్రియములద్వారా పనిచేస్తూండడం వల్ల, నీ ఇంద్రియముల మలినం, సంకోచం, మాంద్యం నీ జ్ఞానానికి అంటుకొని అది వక్రిస్తోంది.

దీనినే ప్రకృతి శాస్త్రజ్ఞులు 'రిఫ్రాక్షన్' అంటారు. గాలి ద్వారాగాని, అద్దంద్వారాగాని, నీటిద్వారాగాని కనబడే వస్తువు ఆ పదార్థాల చిక్కతనాన్నిబట్టి వక్రంగా గోచరిస్తుంది. నీ చూపుకు, నీవు చూచే వస్తువుకు మధ్యగ ఏ పదార్థమూ అడ్డం లేకపోతే, ఆ వస్తువుకు 'రిఫ్రాక్షన్' ఉండదు. దాని సుస్వరూపం గోచరిస్తుంది.

అట్లాగే నీ చిన్ని మనస్సుద్వారా ఆ పెద్దమనస్సు పని చేస్తూండడంవల్ల, నీ జ్ఞానం క్షుద్రమై, వికీర్ణమై, ద్వంద్వ భూయిష్ఠమగుతోంది.

నీ బుద్ధిని అతిక్రమించినంతకాలం, చిత్తవృత్తులు నిన్ను పెనవేసుకొని, నీ జ్ఞానాన్ని చీకాకుపరుస్తూనే ఉంటాయి. నీ మనస్సు అవును - కాదూ అంటూ, ద్వంద్వాలమధ్య పెంగు లాడుతూ ఉంటుంది. జాలునివలె అంతనూ పదచ్ఛేదం చేసు కొంటూ చదువుతావు.

అందుకనే నీకు ప్రతిదీ ముక్కలు ముక్కలుగ కనబడు తుంది. నీవు సమన్వయంకోసం తంటాలుపడ్డా, సమన్వయం సరిగా కుదరదు. కలపనైనా కలుపుతావు, తీసివేతైనా

చేస్తావు. ఈ కలగలుపులు తీసివేతలు సమన్వయమెట్లా అగుతుంది?

రెండు ఒకటి ఎట్లా అవుతుంది? ఒకటి రెండు ఎట్లా అవుతుంది? ఇది నీ బుద్ధిచేసే తర్కం. ఈ తర్కం నిజంగా సత్యాన్ని మరుగుచేస్తుంది.

ఈ తర్కాన్ని, ఈ వాదాలను, ఈ బుద్ధిని దాటిచూస్తే కాని నీకు సత్యం పూర్ణంగా కనబడదు. నీబుద్ధికి గోచరించే సత్యాలు, ఖండసత్యాలు - సత్యంయొక్క భిన్నదిక్కులు.

పూర్ణసత్యం అపరిచ్ఛిన్నం. కాబట్టి చిత్తవృత్తి నిరోధం చేత, బుద్ధీంద్రియాన్ని అతిక్రమించడానికి ప్రయత్నించు. బుద్ధిని దాటావంటే, నీవు నిండు వెలుగులోపడతావు. సోదరా, నీవు యోగివి కావాలన్నమాట.

# కుసంస్కార నిర్మూలనం

సోదరా, మనస్సును దాటాలంటే, చిత్తవృత్తి నిరోధము సాధనమని చెప్పాను.

నిరోధమంటే ప్రతిఘటించడం. అయితే మనస్సులో చిత్తవృత్తులు తరంగాలువలె లేచిపడుతూంటే, అవి లేవకుండా అణచిపెట్టడమా నిరోధించడమంటే ?

అణచిపెట్టడమైతే, అణచిపెట్టడంకూడా ఒక చిత్తవృత్తి కాదూ ? లేవకొట్టినా, అణచిపెట్టినా - ఈ రెండూ క్రియలే- రెండూ ప్రవృత్తులే.

అంతేకాదు, అణచిపెట్టడం ఎంతమాత్రమూ మంచిది కాదు. అణచిపెట్టితే ఏమవుతుంది ?

ఏ కోరికను అణచిపెట్టుతామో, అది లోపలకుపోయి గూడుకట్టుకొని, సంస్కారరూపం దాల్చి, ఎప్పుడో ఒకప్పుడు పైకెగతన్నుతుంది.

మనలో ఎన్ని సంస్కారాలు దాగిలేవు ? మనస్సంటే సంస్కారాల గంప. వీనిలో చాలవరకు నిరోధింపబడిన కోరికలే.

కొన్ని పూర్వజన్మ వాసనలు. కొన్ని తలిదండ్రుల నుండి సంక్రమించినవి. కొన్ని మనచుట్టూ ఆవరించిన సంఘానివి.

ధారావాహికంగ సంక్రమించే జాతీయస్మృతి కొంత. మన బాల్యలీలలు, మన చదువులు, మన చేష్టలు, సహవాసాలు, వృత్తులు, అభ్యాసాలు — ఎన్నెన్నో సంస్కారరూపంగా మనలో చేరి నిరంతరం కెలకవేస్తూవుంటాయి. మన చిత్తవికారాలు చాలవరకు వీని ఫలితాలే.

కాబట్టి చిత్తవృత్తుల నరికట్టడమంటే, ఈ సంస్కారాలను, వాసనలను ముందుగ తొలగించడం. అవే నిజంగా మన మనస్సును పరిపరివిధాల పురికొల్పి రాగద్వేషాలలో పడవేసేవి.

ఎట్లా ఈ వాసనలను పారద్రోలడం ? వాసనలు నీ కంటికి కనబడవాయె. నీ బుద్ధికి గోచరించవు. అవి నీకు తెలియకుండానే, నీ మనస్సును వక్రింపజేస్తూ వుంటాయి. వాని బలాన్ని తగ్గించకుండా, పైపైన ఎన్ని పూతలు పూసి ప్రయోజనమేమి ?

నీకు జబ్బుచేస్తే, డాక్టరు ఏంచేస్తాడు? పైన నీ జ్వరాన్ని కొలిచి ఊరుకొంటాడా? లేదు నీ రక్తం పరీక్షచేస్తాడు. దానిలో "బాసిలీ" — విషబీజాలు ప్రవేశించాయేమో చూస్తాడు. వానిని చంపడానికి మందిస్తాడు. అవి చచ్చాయా, జ్వరం దానంతటదే తగ్గిపోతుంది.

అట్లాగే, చిత్తవృత్తి నిరోధానికి ముందు చిత్తశుద్ధి నలవరచుకోవాలె. చిత్తశుద్ధి అంటే వాసనలనే విషబీజాలను తుడిచివేయడం. వానిని తుడిచివేయగల్గావా, ఏ బలంతో వానిని నిర్మూలించావో, ఆ బలమే క్రొత్త చిత్తవృత్తులు బయలుదేరకుండా చేస్తుంది.

శరీరారోగ్యానికి రక్తశుద్ధి ఎంత అవసరమో, చిత్తవృత్తి నిరోధానికి చిత్తశుద్ధి అంత అవసరం. చిత్తశుద్ధి సిద్ధిస్తే, చిత్తవృత్తి నిరోధమంటే ఏమిటో బోధపడుతుంది. అప్పుడు నిరోధం నివృత్తి అగుతుంది, సోదరా.

# చిచ్ఛక్తి ఉద్దీపన

సోదరా, నీ కెన్ని పర్యాయములో చెప్పాను, నీ మనస్సు అనే పనిముట్టును పరిశుభ్రంగా ఉంచుకోకపోతే, అది నీకు చాలా చెరుపును చేస్తుంది సుమీ అని.

ఎంతపనివాడైనా పనిముట్లను ముందు సరియైన స్థితిలో ఉంచుకొంటేనే, వాని పనితనం ప్రకాశించేది. సర్జను ఏమి చేస్తాడో చూడు. ఆతడు ప్రయోగించే కత్తులను ద్రావకాల్లో కడుగుతాడు, ఉడుకునీళ్ళల్లో కాస్తాడు. అప్పుడే అవి విష బీజాలు లేకుండా పరిశుభ్రములై శస్త్రచికిత్సకు యోగ్యము లగుతాయి. ఈ శుద్ధినే "స్టరిలైజేషన్" అంటారు వైజ్ఞానికులు.

నీ చిత్తశుద్ధికూడా ఇట్టిదే. నీ మనస్సులో ఎన్నో విష సంస్కారాలు గూడుకట్టుకొని, నీకు తెలియకుండా, నిన్ను బాధిస్తున్నాయి. ముందు వానిని పారద్రోలాలంటే, నీ మనస్సును "స్టరిలైజు" చెయ్యాలె.

విషబీజా లెక్కడ పెరుగుతూ ఉంటాయో తెలుసా ? చీకటి కోణాల్లో, చెమ్మగల ప్రదేశాల్లో ఉంటాయి. ఆ కోణాల్లోకి వెలుగును, తాపాన్ని ప్రసరించేటట్టు చేశావా, ఆ కుసంస్కారాలన్నీ చచ్చి ఊరుకొంటాయి. ఇందుకొరకే మనస్సును "జ్ఞాన దగ్ధం" చేయమంటారు మనపెద్దలు.

మనస్సును "జ్ఞానదగ్ధం" చేసే విధమేమిటి ? మనస్సు జడం, దానిలో వెలుగూలేదు. తాపమూలేదు జ్ఞానకిరణమూ, తాపశక్తి ఆత్మప్రత్యయంలో ఉన్నాయి. ఆత్మ ఆదిత్యుని మాదిరిది. దానిలో వెలుగూ వేడిమీ ఉన్నాయి.

ఏకాగ్రతచేత ఆత్మయొక్క తేజస్సు బహిర్గతమగుతుంది తపస్సుచేత ఆత్మలోని అగ్ని ప్రజ్వలిస్తుంది. ఈ తేజస్సు, ఈ వేడిమి నీలోని వాసనలనన్నిటిని తుడిచివేసి, నీ చేతస్సు నిర్మలంగా చేసివేయగలవు.

"ఏకాగ్రిత" వల్ల నీ చిత్తం పరిపరివిధాల విక్షేపం చెందకుండా, ధ్యేయంమీద నిలిపి ఉంచుకొనే శక్తి అలవడుతుంది.

ఏమి ఆ ధ్యేయము ? ఆత్మ—చిద్రూపమైన వెలుగు. నీ మనస్సును ఆ వెలుగుమీద నిలిపి ఉంచినకొద్దీ, నీలో దాగివున్న చీకట్లన్నీ విచ్చిపోయి, చీకట్ల నాశ్రయించుకొన్న పిశాచాలుకూడ తొలగి, మనస్సు క్రమంగా ప్రజ్ఞాచక్రమై వెలుగుతుంది.

తపస్సుకు లక్ష్యమేమిటి?—చిచ్ఛక్తి. అది నీలో నివురుగప్పిన నిప్పువలె దాగివున్నది. నీ సంకల్ప శక్తిచేత నీవు దానిని ఉద్దీపనచేశావంటే, చిచ్ఛక్తి కణకణలాడుతూ ప్రజ్వరిల్లి ముండ్ల తీగలవలె అల్లుకొనిఉన్న కుసంస్కారాలను భస్మీపటలం చేసివేస్తుంది. అదే మూలాధార చక్రంలోని కుండలినీశక్తి.

బుద్ధిని దాటాలంటే, వేరుమార్గంలేదు. ఆత్మచేతనే ఆత్మోపలబ్ధి సిద్ధిస్తుంది. అదే నీ బుద్ధిని నిరంతరం మేలుకొలుపుతూనే ఉన్నది, అనేక విధాలుగ—పైనుండి, క్రిందనుండీని. ఎందు నిమిత్తం? బుద్ధి ద్వారాలను తెరచుకొని గర్భగుడిలో ప్రవేశించమని ప్రబోధిస్తున్నది. ఆ వెలుగే, ఆ అగ్నే నిన్ను లోనికి తీసుకొనిపోయి, ఆత్మస్థునిగ నొనర్చి ఆనందధామంలో చేరుస్తుంది.

# కొత్త చూపు

సోదరా! మనస్సును దాటితే, ఈ జగత్తు మిథ్య అయిపోతుం దనే నమ్మకం చాలామందిలో వ్యాపించిఉన్నది.

ఈ అపోహలో పడితే, నీకు చాలా చెరుపుగలుగుతుంది. నీ ఆత్మకే హానిచేసుకున్న వాడవవుతావు.

ఈ జగత్తు నీ మనఃకల్పితంకాదని నీకింకా తెలియదా? ఒకవేళ నీ మనస్సు నాశనమైపోతుందని భావించినా, ఈ జగత్తు ఎక్కడకు పోతుంది?

ఆత్మ యెంత నిత్యమో, ప్రకృతికూడా అంత నిత్యమే. ప్రకృతి ఆత్మపదార్థంయొక్క క్రియాకలాపం, చిదానంద సాగరములోని తరంగమాలిక, జ్ఞానజ్యోతియొక్క మరీచీ జాలము. జ్యోతి ఎప్పుడైనా ప్రకాశరహితముగ ఉంటుందా? అసంభవం.

నీలో ఎప్పుడు కుండలినీశక్తి ప్రజ్వలించి, ప్రజ్ఞాచక్రం దాకా వ్యాపిస్తుందో, అప్పుడు నీ మనస్సు విశుద్ధతేజముతో నిండి నీకపూర్వమైన అనుభవము సిద్ధిస్తుంది.

ఇంతకాలమూ నీ మనస్సు దుర్వాసనాభరితమైయుండ డంచేత, జ్ఞానద్వారాలన్నీ ముడుచుకొనిపోయియున్నాయి.

నీలో ప్రస్తుతము సుషుప్తమైయున్న ఆత్మశక్తి ప్రబుద్ధం కావడంతోడనే, నీ యందలి నాడీచక్రములన్నీ కదిలి నీ హృత్కమలము వికసించి, మధువు నలువైపుల విరజిమ్మును. నీ చూపు వజ్రభేదియై అతీంద్రియ జగత్తునుకూడా సాక్షాత్క రించుకోగల్గును.

నీ మనస్సు యింతకాలమూ సత్యముయొక్క ఒక దిక్కునే చూడగల్గుచున్నది, ఆ చూపైనను పరిచ్ఛిన్నమై చీలి కలై యున్నది రెండోదిక్కు నీకు కేవలం అనుమానపూర్వకం. పరోక్షం.

నీలో ప్రజ్ఞాచక్రం ప్రబుద్ధము కానీ—నీవు ఇంద్రునివలె సహస్రాక్షుడవు. అగ్నిదేవునివలె జాతవేదుడవు అగుతావు. జగత్తుయొక్క సుస్వరూపముతోబాటు, అతీంద్రియ జగత్తు యొక్క స్వరూపముకూడ అనుభవగతమగుతుంది.

సోదరా, నీ వింతకాలము ఈ జగత్తుమధ్యనుండికూడ, జగత్తులో అంధప్రవాసివలె తిరుగాడుతున్నావు. భూతజాల మంతా నీకు బాహ్యామైనట్లు, అందలి మధువును గ్రోలలేకు న్నావు. ఇంద్రియానుభూతికూడ క్షుద్రమై. సంకీర్ణమై, దుఃఖ హేతువగుతున్నది.

ఎప్పుడు జ్ఞానకిరణము నీలో ప్రసరించి, నీయందలి కుండలీకరించుకొన్న శక్తులన్నీ ప్రబుద్ధములగునో, అప్పుడు సర్వమూ నీకు ఆత్మవిలాసమై, దివ్యభోగము కాగలదు. అప్పుడు సత్యము కానిదేదీ యుండదు.

సృష్టిలో నీకు త్యాజ్యమైనదేదీ లేదు. దేహము, ప్రాణము, మనస్సు—సర్వమూ భోగ్యము. నీవు ఆత్మస్థుడవైనప్పుడే నీకట్టి భోగశక్తి సిద్ధిస్తుంది. చిత్తశుద్ధి దేనికి? బుద్ధిని దాటడ మెందు నిమిత్తం? నీవు మహాభోగివై విరాజిల్లడానికి, అతీంద్రియమైన సత్యాన్ని ఇంద్రియ జగత్తులో అనుభవించడానికి, నీవూ ప్రకృతీ అఖండ చిదానందరసంలో కరగిపోవడానికి.

# జగత్స్వరూపం

సోదరా, నీవు దేవుని నమ్ము, నమ్మకపో జగత్తు మిధ్య అని అన్నావా, నీకంటే పరమ నాస్తికు డింకొక రుండరు. ఎందుకంటావా, జగత్తుతోబాటు నీ అస్తిత్వంకూడా ఎగిరి పోతుంది. నీవూ లేవు జగత్తూ లేదు. సర్వం శూన్యం.

నీకు అన్యమైన దానిని నీవు ఎన్నడూ తెలుసుకోలేవు. నీవు జగత్తును తెలుసుకొంటున్నావంటే, అది నీకు అన్యంకాదు కనుకనే. ఏది నీలో ఉన్నదో, అదే బయటకూడ ఉన్న కారణం చేతనే అది నీకు జ్ఞేయమగుతున్నది—

మన ప్రాచీన ఋషులు ఈ సత్యాన్నే ఉద్ఘాటించారు. నిమిత్తోపాదాన కారణములు భిన్నములు కావు, ఒకటే అన్నారు—

“ఆత్మైవ అభూత్” ఆత్మే ఈ సమస్తములు అయింది- “పరిభూః” సమస్తమూ అయినదదే, “సర్వం ఖల్విదం బ్రహ్మ”

ఈ సమస్తమూ బ్రహ్మము. "నాన్యత్ కించిదస్తి" బ్రహ్మము కంటె భిన్నమైనది ఎచ్చటూ లేదు. కదిలేది కదలనిది అదే— "త దేజతి, త న్నైజతి."

మన పూర్వులే కాదీ సత్యాన్ని ఉద్ఘోషించింది. నవీన వైజ్ఞానికులు కూడ పదార్థతత్వ పరిశీలన మార్గంగుండా ఈ సత్యాన్నే చేరుకొంటున్నారు.

కదిలించేదీ శక్తి—కదిలింపబడేదీ జడము, అని వెనుకటి రోజుల్లో అనుకొనేవారు. ఇప్పుడీ ద్వైత సిద్ధాంతంపోయింది. "మ్యాటరు"కు "ఫోర్సు"కు భేదంలేదని సైంటిస్టు లిప్పుడు కనుపెట్టగలిగారు.

ఆ శక్తి వట్టి జడశక్తి అనేభావం కూడా పోయింది. జగదీశ చంద్రబోసుగారు చేతనా చేతనములకు భేదములేదు. ధాతువులలో, లోహాల్లోకూడ ప్రాణం వున్నదని ప్రత్యక్షంగా రుజువు చేశారు. సమస్తము ప్రాణమయమని బోధపడ్డది.

ఆ ప్రాణశక్తి అంధప్రాయమైన మూకశక్తికాదు. అది వెలుగుతో గూడిన ఇచ్ఛాశక్తి వంటిదని జీవశాస్త్రజ్ఞులు కనుపెట్టుతున్నారు. సర్వము చిన్మయమనే సిద్ధాంతం క్రమంగా వెల్లడి అగుతున్నది.

గణితశాస్త్రం ప్రకారం కూడా "క్వాలిటీ"కి "క్వాన్టిటీ"కి అభేదం. జగత్తు "(Single variable)" నానాప్రకారములుగ భాసిల్లే ఏకవస్తువు అని నిరూపించబడుతున్నది.

"ఏకరూపం బహుధా యః కరోతి"

పూర్వం మన ఋషులు అరణ్యాలలో, పర్వత గుహలలో తపస్సుచేసి కనిపెట్టిన "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే అద్వయతత్వాన్నే ఆధునిక తత్వజ్ఞులైన సైంటిష్టులు "లేబరేటరీస్"లో పదార్థ తత్వ పరిశోధనచేసి ప్రత్యక్ష మొనర్చుకొనుచున్నారు.

సోదరా, నీ జీవితలక్ష్యం జగత్తునుండి తప్పించుకొని పారిపోవడమా ? కాదు. విశ్వలీలామృతాన్ని క్రోలుతూ స్వాధర్మ్యన్ని పొందడమే నీ పరమ ప్రాప్యం—"సతప స్తప్త్వా సర్వ మసృజత్" తపః ఫలితం విశ్వరూపలాభం.

# వి శ్వ లీ ల

సోదరా. విశ్వలీల అనేమాట నీ చెవినిబడుటతోడనే, నీలో ఎట్టి మార్పు కలుగుతున్నది? నీ కంటికి క్రొత్తచూపు, నీ మనస్సుకు నూతనోల్లాసం కలగకపోతే, లీలఅంటే ఏమిటో నీవు అవగతం చేసుకోవటం లేదన్నమాట.

లీల అంటే ఏమనుకొంటున్నావు? వాస్తవికతలేని వట్టి కల మాదిరిదనా? లేక అద్దంలో ప్రతిఫలించే ప్రతి బింబం వంటిదనా? ఇట్టి అపార్థంచేసుకొంటూంటే, లీల అనేమాటను నీ నిఘంటువులోనుండి తుడిచి వేసుకోవడం మంచిది.

అది కల అంటావా? కల వట్టి కల్ల. జగత్తుకూడా కల్లే కావలసివస్తుంది. ప్రతిబింబమంటావా? అది వస్తుతంత్రంలేని వట్టి ఛాయామాత్రం. ఈ రెండు సామ్యాలు జగత్తును అసత్యం గానే తోపిస్తాయి. జగత్తు అసత్యమైతే, జగత్తునుండి పారిపోవ డమే నీ లక్ష్యమగుతుంది.

లీలఅంటే, ఆటోయి, సోదరా, క్రీడ, నాటకం-ఎవదిరి ? విశ్వలీల విశ్వపురుషునిదికాక మరెవరిది? "సకామో అజాయత బహుస్యాం ప్రజాజాయేతి" విశ్వపురుషుడు నిఖిల రసామృత మూర్తి. తన జ్ఞాన, చిత్తు, ఆనందరసముల ననుభవించడానికి జ్ఞాతగను జ్ఞేయముగను. కర్తగను కార్యముగను, భోక్తగను భోగ్యముగను—భేదాభేదములను బొందుతూ నర్తిస్తున్నాడు— ఈ నాట్యాన్ని నీ కన్నువిప్పిచూస్తే, నీవు చకితుడవు కాకుండా ఉండగలవా ?

అట్లా ఉండడమేనా ? ఈ విశ్వనాట్య సమ్మేళనంలో నిమగ్నుడవై పోవాలె. నీవు కూడా ఒక భూమికవే సుమీ. నీ పాత్రోచితమైన ఆహార్యవాచికాభినయాదులున్నాయి. అవి తెలుసుకొని వర్తించావా, నీ విట్లాఉండవు. నీ వానందరసంలో కరగిపోతావు—నీ హావభావచేష్టావిలాసాదులన్నీ రసభరితము లగుతాయి. ఇంతకంటె నీ జీవితసాఫల్య మెక్కడోయి ? ముక్తి అంటే ఇదే. ఈ ఆనందలహరిలో కరగిపోవడమే ముక్తి జీవన్ముక్తి. సాధర్మ్యముక్తి.

ఆనందం వట్టి స్థాణువు అనుకొంటున్నావు కాబోలు - ఆనందమంటే సృజనశక్తి. "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే." సృష్టిస్థితి లయములు ఆనంద రసంయొక్క క్రీడ. ఏ దిక్కునుండియైనా చూడు—సర్వం క్రీడగా కనబడటం లేదూ ? భౌతికంగా పరమాణువుల ఆట - ప్రాణ రీత్యా జనన

మరణముల ఆటు పోటు—మానసికంగా సంకల్ప వికల్పముల క్రీడ — ఆధ్యాత్మికంగా నిఖిల రసామృతమూర్తియొక్క చిద్విలాసము.

నీ దేహం ఆ జగత్పరమాణువుల భ్రమణంలో పాల్గొంటున్నది, నీ ప్రాణం విశ్వప్రాణంలో స్పందించుచున్నది. నీ మనస్సు విశ్వమానసంయొక్క సంకల్ప వికల్పాలతో బాటు ఊగుతున్నది. నీ ఆత్మ పరమపురుషుని చిద్విలాసంలో క్రీడిస్తున్నది. "తేనత్యక్తేన భుంజీథాః". విశ్వంలో లీనమైపోయి జగత్తును భోగించవోయి అని ఋషులు ముక్తకంఠంతో ప్రబోధిస్తున్నారు.

# స్రష్ట, సృష్టి

సోదరా, ఈ జగత్తుయొక్క స్వరూపమేమిటి అని ప్రశ్నించు. కాని, దీనిని సృష్టికర్త ఎందుకు సృష్టించాడు అనిప్రశ్నించవద్దు. ఎందుకు అని ప్రశ్నించడంలోనే సృష్టికర్త ఏదో ఒక ప్రయోజనంకోరే, ఆ కోరికను తీర్చుకోవడంకోసం దీనిని ఉత్పత్తిచేసినట్లు నీకు భావన కలుగుతున్నదన్నమాట.

నీ కాక కోరిక ఎప్పుడు కలుగుతుంది? నీలో ఒక కొరత ఉన్నప్పుడు, ఆ కొరతను తీర్చుకోడానికి కోరుతావు. సృష్టికర్త పరిపూర్ణుడైనప్పుడు, వానిలో ఉండే కొరత ఏమిటి? ప్రయోజనం అర్థించవలసిన అవసర మెక్కడ ?

అయితే, నీ కెందుకు ఈ భావన కలిగిందో చెప్పనా ? సృష్టికర్తవేరు, సృష్టివేరు అని అనుకోవడంవల్ల నీకీ సంశయం కలిగింది. కుమ్మరి ఎక్కడనుండో మట్టి తీసికొనివచ్చి, కుండను చేసినట్టుగ, సృష్టికర్త దీనిని చేశాడనా నీ భావము ?

అసలు తానుతప్ప వేరేవస్తువు లేనప్పుడు, కుంభకారుడు-మట్టి—కుండ; కర్త—కరణము—కార్యము - ఈ మూడూ తానై ఉండాలె. సర్వము తానైన తర్వాత వానికి కోరిక లుండడమనేది అసంగతం.

సూర్యునినుండి ప్రకాశం వస్తున్నది. ప్రకాశం ఎందుకు వచ్చిందని అడుగుతావా ? సూర్యుడు తేజోబింబం. ప్రకాశం తేజస్సుయొక్క స్వరూపలక్షణం. కమలం పరిమళిస్తుంది. ఎందుకు ? అది దాని సహజలక్షణం కనుక. అట్లాగే జగత్తు జగత్కర్తయొక్క సహజప్రకాశం, పరిమళం, విలాసం.

సూర్యునిలో తేజస్సు తప్ప ఇంకొకవస్తువులేదు. ఆ తేజోబింబము సర్వదా వెలుగులను గ్రక్కుతూ వుంటుంది. ఆ గ్రక్కడంవల్లనే, సూర్యుడు మనకు గోచరిస్తున్నాడు. ఆ ప్రకాశమే లేకపోతే సూర్యుడు వట్టి చీకటిముద్దగానే ఉండే వాడు.

జగత్కర్తయొక్క స్వరూపమేమి ? ఆనందం. ఆనందము నిర్గంధకుసుమమా ? నిస్తేజమైన వెలుగా ? నిస్తరంగమైన సాగరమా ? కాదు. అది అపారమైనది—అంతులేని అఖాతము. నిరంతరము తరంగితమగుతూ, ప్రకాశిస్తూ, పరిమళిస్తూ, శబ్దాయమాన మగుతూ ఉంటుంది. జగతు ఆనంద సాగరమునందు లేచిపడు ఉత్తుంగతరంగమాలిక — ఆనంద

జ్యోతియొక్క పరిభాషాపటలి — ఆనంద కుసుమముయొక్క మధుర పరిమళ మంజరి, ఆనంద సంచలనముయొక్క వేద ఘోష.

ఈజగత్తే లేకపోతే, దీనిమూలమైన ఆనందమే లేదు. క్రీడించని ఆనందము నిరానందముకాని ఆనందము కాదు. వెలుగులేని జ్యోతి అంటే ఏమిటి? శూన్య మన్నమాట.

జగత్తు ఉనికిని శంకించావంటే, నిన్ను నీవు సున్నా చుట్టుకొంటున్నట్లు. వేదము ఏమి ఘోషిస్తున్నది? "తత్వమసి" అనేకాదు. "విశ్వమసి" అని కూడ ఉద్ఘోషిస్తున్నది. ఇక విశ్వమే లేకపోతే నీ వెక్కడ ? ఆత్మహత్య మహాపాతకము సుమీ !

# కుతర్కాలు

సోదరా, శరీర సంబంధమైన అభ్యాసాలనైనా వదులుకో వచ్చునుగాని, మనబుద్ధి, అలవాటుపడ్డ రస్తాలనుండి సామాన్యంగా మరలలేదు. పెద్ద పెద్ద పండితులుకూడ ఈ బాధను తప్పించుకోలేరు. ఒక్క నిదర్శనం చూడు—'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే శ్రుతి వాక్యాన్ని అన్వయించుకోడానికి వారెంత తిప్పలు పడుతారో గమనించు.

ఆ వాక్యాన్ని తమ మతానుకూలంగా విరిచి, మణిచి తమ మతమనే కంతలోకి దూర్చడానికి పూనకొంటారు. "ఇది నామ రూపాత్మకమని మన అజ్ఞానంచేత భ్రమిస్తున్నాము. బ్రహ్మజ్ఞానికి జగద్భావమే నశిస్తుంది. కాబట్టి బ్రహ్మ మొక్కటే ఒక ముద్దగ మిగులుతుం"దని విపరీతార్థ మిచ్చుకొంటారు.

అయితే "యతోవా ఇమాని భూతాని జాయంతే" అని బ్రహ్మమును జగత్తుకు ఉపాదాన కారణంగా చెప్పు

ఢూంటే, కారణం సత్యమై, కార్యము అసత్యమగుతుందా అంటే, అది గౌణికం, మందాధికారులకోసం చెప్పిన వాక్యమని సమాధానం చెప్పుతారు.

నిజంగా ఋషులు ఉపనిషత్తులను తర్కప్రకరణాలక్రింద వ్రాయలేదు. వారు తమ దివ్యానుభవాలను దేవభాషలో వ్రాశుచ్చారు. ఆ వాక్యాలు తర్కానికి అందేవికావు సుమీ (Alogical) అని కూడా వారే సూచించారు. అనిర్వచనీయమైన దానిని మన శుష్కతర్కంతో నిర్వచించడమా ?

ఋషులది అపరోక్షానుభూతి, పూర్ణానుభవం. వారి దృష్టి మన బుద్ధివలె క్షరము—అక్షరము, సత్యము-అసత్యము అని పరిచ్ఛేదము చేయదు. వారి జ్ఞానము సమగ్రము ఏకవాక్యత దాని సహజలక్షణము.

మన బుద్ధి ఈ ద్వంద్వములను పరస్పరము వ్యతిరేకము లనుకొని, ఒకదానికి సున్నచుట్టి, మిగిలిన దానినే సత్యమని నిర్వచిస్తుంది. ఈ ద్వంద్వములు ప్రతియోగికములు, సాపేక్షికములు. స్ఫటికమెట్లా సూర్యకిరణాన్ని భిన్నవర్ణములుగ చీలుస్తుందో, అట్లా మన మనస్సు సత్యాన్ని రెండుగచీల్చి, భిన్నదిక్కులనుండి చూస్తుంది. కాని రెండు దిక్కులూ సమములే.

ఋషులు తురీయావస్థలో ద్వంద్వాతీతులు కావడంచేత వారికి ఏకము—సర్వము బ్రహ్మపదార్థంగా గోచరిస్తుంది. అంటే ముద్దకట్టుకొని పోతుందనికాదు. చట్టీ, కుండా మృణ్మయములంటే, చట్టి కుండ అగుతుందా ? కుండ చట్టి అగుతుందా ? వాని రూపములు, ప్రయోజనములు భిన్నములైనా, స్వరూపతః ఒక్కటే అని అర్థము. బ్రహ్మజ్ఞాని సర్వాన్ని బ్రహ్మమయంగా చూస్తున్నా, అగ్ని అగ్నే, జలము జలమే. ఈ భేదములు అభేదముయొక్క విలాసములు. "సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం". చిత్పదార్థము రూపము పొందలేని, శబ్దించలేని, పరిమళించలేని, స్వాద్యము కాని వట్టి స్థాణువుకాదు. అది ఏకమయ్యు సర్వము, నిరాకారమయ్యు సర్వాకారము, అశబ్దమయ్యు శబ్ద బ్రహ్మము. అట్టి నిఖిల రసామృతమూర్తిని అరసునిగ జేసి నీవు పాషాణమైపోకు.

# జీవనసూత్రం

సోదరా, నిన్నెదుర్కొన్న ప్రశ్న నీ ఒక్కనిదే కాదు. అది అందరిదీని. ప్రతివాడు దాని కేదో విధంగా సమాధానం చెప్పుకోక తప్పదు—మాటలతో కాదు, జీవితంతో. ఎందుకంటే అది నిజంగా జీవన సమస్య. ప్రతిప్రశ్నకు రెండు దిక్కులుంటాయి. ఒకటి ఒక వైపు చూస్తుంది. రెండవది ఇంకొక ప్రక్కచూస్తుంది. ఈ రెంటిమధ్య నీవు నిలబడి "ద్వైధీభవతి మే మనః" అని ఆందోళనపడతావు. నీ జీవనసమస్యలోని ఆ రెండు దిక్కులేవి ?

నీ వెట్లాగో ఈ ప్రపంచంలో పడ్డావు. ఈ ప్రపంచం నిలకడలేకుండా, నిరంతరం, క్షణక్షణం, మార్పుచెందుతున్నది— ఒక ప్రవాహంలాగ సుళ్లుచుట్టుకొంటూ, ఘూర్ణిల్లుతూ, నిన్ను లెక్కపెట్టకుండా, నిన్నీడ్చుకొని పోతోంది.

బయట మార్పులపై మార్పులు, పరివర్తనాలు, సంవర్తనా లిట్లా సంఘటిస్తూంటే, నీ హృదయంమాత్రం ఈ ప్రపం

చాన్ని ప్రతిఘటించడానికి చూస్తున్నది. ఈ ప్రపంచం ఇయ్య లేని శాంతిసౌఖ్యాల నభిలషిస్తున్నది. ఎక్కడైనా గట్టుచేరి అలసటతీర్చుకొని విశ్రాంతి చెందగోరుతోంది.

ఈ ప్రవాహంలో నిశ్చింతగ కొట్టుకొనిపోయినా బాగుండును. లేక ఈ ప్రపంచంలోకి రాకుండా, శాశ్వతమైన శాంతి ననుభవిస్తున్నా బాగుండేది, అప్పు డెట్టి సమస్యా, చిక్కూ నిన్నెదుర్కొనేవి కాదు. నీకు బయట అశాంతి, లోపల శాంతిపిపాస ఈరెండూ ఒకమారుగ నీ జీవన రంగం మీద తారసిల్లే టప్పటికి, పోరాటం బయలుదేరి నిన్ను తిప్పలు పెట్టుతున్నవి. ఇక ఈ సమస్యను పరిష్కరించే విధ మేది ?

నీ జీవనమైనా ఒక సమతలంగా ఉంటే, ఒక్కటే పోరాటంగా ఉండేది. కాని నీ జీవనంలో అనేక రంగాలు, తెరలు, పొరలు అంచెలు అంచెలుగ ఉండడంవల్ల, ఈ పోరాటం అన్ని ప్రకరణాలలోనూ, అనేక రూపాలు దాల్చి భీకరసంకుల మైంది.

ఈ జీవన ప్రకరణాలనే మనపెద్దలు నాలుగుగ వర్గీకరించారు—ధర్మ. కామ, అర్థ, మోక్షములనే చతుర్విధ పురుషార్థములు. ఇప్పుడీపోరాటం ఈ నాలుగుప్రకరణాలలోను ప్రత్యక్షమై, నిన్ను సమాధానం కోరుతున్నది.

చతుర్ముఖంగా ఉండే ఈపోరాటానికి ఒక్కసమాధానం సరిపోతుందా, లేక విడివిడిగ సమాధానాలు కుదర్చవలెనా ?

ఈ నాలుగింటికి వేరువేరు పరిష్కారాలుచేసినా, తిరిగి వానిలో వానికి స్పర్ధలు కలిగితే, ప్రయోజనమేమున్నది ? అదే పెద్ద ఆంతరంగిక యుద్ధమగుతుంది. బయటి యుద్ధంతో బాటు, లోపల యుద్ధమొకటి సాగి నిన్ను మరింత తల్లడిల్ల చేస్తుంది. నీవొక జీవన సూత్రం కనుపెట్టగల్గాలి—ఏ సూత్రం లోపలకూ బయటకూ, చతుర్విధ పురుషార్ధములకూ అన్వయమై సామరస్యం సమకూర్చగల్గుతుందో, అదే నీకు లక్ష్యమై, కర్ణధారివలె నీ జీవన నౌకను పరమప్రాప్యానికి నడపగల్గుతుంది. అదేదో నీ బుద్ధిసూక్ష్మత చేతనే కాక, దైవప్రేరణవల్ల నీకు అనుభవగత మగుతున్నదా ?

# నిత్యానిత్యములు

సోదరా, నిత్యానిత్యములకు ఏకవాక్యతను కూర్చుకో గలి గితే, నీ జీవన సమస్య పరిష్కారమై, నీవు చరితార్థుడ వగుతావు.

ఈ సమన్వయం కుదుర్చుకోలేక, మిథ్యావాదులు జగత్తు అసత్యమనిచెప్పి, వ్యతిరేకపథంలో పడుతున్నారు. నిరీశ్వర వాదులు సర్వం క్షణభంగురముగ భావించి, ఆత్మవస్తువు నే నిరాకరిస్తున్నారు. ఈ రెండూ పెడత్రోవలు. సమస్య నీ విధంగా వికలించేస్తే, సమగ్రమైన ఆత్మోపలబ్ధి సిద్ధించదు.

జగత్తు అనుక్షణమూ మార్పుచెందుతున్నమాట నిజమే. అంతమాత్రంచేత దానిని అసత్యంగా త్రోసివేయ(ఱ)నదు,

మార్పు అనేదే లేకపోతే, నీవు పాషాణంగా అజ్ఞానంలో మూతపడి ఉండేవాడవు. మార్పులే నిన్ను జాగరితునిగజేసి, నీకు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదిస్తున్నవి.

ఎప్పుడూ పగలైతే, నీ దృష్టి ఈ భూమినివదిలి పైకి పోయేదికాదు. రాత్రి చీకట్లు ఆవరించినప్పుడు, అనంత నీలాకాశమున అసంఖ్యాకమైన తారాగణాలు నీ దృష్టిని విస్తరింపజేసి, బ్రహ్మాండముయొక్క అపారతను వెల్లడిస్తున్నవి.

అట్లే, నీకు ఎప్పుడూ సుఖముంటే, నీ జీవనము గడ్డకట్టుకొని సంకుచితమైపోయేది. మృత్యుచ్ఛాయే, చితానలధూమమే నిన్ను కాలంయొక్క అంచులకు తీసికొనిపోయి, కరుణాజ్యోతిని అందించగల్గుతున్నది. సంగీతమునందలి ఆరోహణావరోహణములు, నాట్యమునందలి హావభావ లీలావిలాసములు, చిత్రరచనలోని వర్ణికాభంగములు నిన్ను తన్మయునిగనొనర్చి, రసవారిధిలో ముంచుతూంటే, వానిని మార్పులు, వికారములు అని నిరాకరిస్తావా ?

ప్రకృతి ముహుర్ముహు ర్భిన్నత్వ నూత్న వేషములను ధరించి వెలుగునీడలతో, ఋతుపరిక్రమములతో, జననమరణ ఛాందస్సుతో నీ జీవనానికి నిత్యనూతనత్వాన్ని, రససమృద్ధిని కల్పిస్తున్న విషయము నీకు అనుభూత మగుటలేదా ?

బ్రహ్మానందము కళారహితమైన విలయముకాదు. అది సుఖదుఃఖములను అంతర్భుక్తం చేసుకొన్న తరంగితసాగరము.

శాంతి అభావాత్మకమైన నిస్తబ్ధతకాదు. అయ్యది శృంగార, వీర, కరుణ, హాస్య, రౌద్ర, భీభత్సాది రసములను

అమృతమయముగ నొనర్పగల అంతర్వాహిని. నిత్యము దేశ కాల నిమిత్తములను నిరాకరించు శూన్యము కాదు. అయ్యది ఆత్మయొక్క ఆపాతరామణీయకమైన శాశ్వత నూతనత్వము. ముక్తి నిర్వికల్పమైన నివృత్తికాదు. ధర్మార్థకామములను అంగీభూతము చేసికొను ఆత్మోపలబ్ధి. "అసంభూత్యా మృత్యుం తీర్త్వా సంభూత్యా అమృత మశ్నుతే" అని మన ఋషులు ఉద్బోధించలేదా ?

నిత్యానిత్యములు సత్యముయొక్క భిన్నదిక్కులే కాని పరస్పర విరుద్ధములుకావు. యుద్ధరంగమునుండి శ్రీకృష్ణభగవానుడు "కాలోస్మి" అని పాంచజన్యం పూరించినప్పుడు నీకు విశ్వరూప దర్శనం కలగలేదా ? సోదరా, కృపణుడవు కావలదు. మాశుచ, ఉత్తిష్ఠ. యోగారూఢుడవై ఋజుపథమున నడువుము.

# ముక్తిసాధన

సోదరా, మోక్షమంటే కర్మక్షేత్రంనుండి పారిపోవడం కాదు. పురుషార్థములను త్యజించడం కాదు. ఇవి కాదు నిన్ను క్రిందికి దిగజేసి, నిన్ను బాధించుచున్నవి.

నిన్ను నీవే బంధించుకొని లోకాన్ని నిందిస్తున్నావు. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని గీతాకారుడు ఎందుకు చెప్పాడో, యోచించుకో.

బంధనమనేది, విడుదల అనేది, నీ చేతిలో ఉన్నవని వాని అర్థము. నీలో తీవ్రమైన సంకల్పముదయిస్తే, మరుసటిక్షణంలో విముక్తుడవు కాగలవు.

నీ విప్పుడు పరతంత్రుడవు. విషయప్రవాహంలోబడి, కాలు నిలవత్రొక్కుకోలేక కొట్టుకొని పోతున్నావు. నీవు విషయాల వశంలో ఉన్నావు కాని, అవి నీ వశంలో లేవు. వానిని నీ అధీనం చేసుకోవడమే విమోచనము.

లోకమనేది ఒక మహాయంత్రం. నీవు దానిలో ఒక చక్రమై, అది త్రిప్పినట్లెల్ల తిరుగుతున్నావు. ఇక నీ వెట్లా ఈ యంత్రాన్నుండి పారిపోగలవు ? నీ విమోచనం పారిపోవడంలో లేదు. నీవు చక్రంకావు, యంత్రాన్ని నడపగల స్వతంత్ర పురుషుడవు అని తెలిసికొంటే, ఈ త్రిప్పులుండవు. నీవు స్వరూపతః స్వతంత్రుడవు. ఆత్మ నిత్యముక్తబుద్ధము. అనులోమశక్తి (Involution) నిన్ను అజ్ఞానంతో కప్పివేసి, నీ స్వరూపాన్ని మరుగుపరచింది.

కాని నీ స్వరూపము అట్లా మరుగై యుండేది కాదు. ప్రకృతిలో విలోమశక్తి (evolution) కూడా పనిచేస్తూ నీ స్వాతంత్ర్యాన్ని జాగరిత మొనర్చుచున్నది, అందుకనే, నీ జీవితము పారతంత్ర్య స్వాతంత్ర్యములకు కురుక్షేత్రమై రణరంగమైనది.

అనులోమ మనగా అవిద్య. దానికి అలవాటుపడి ఉండడంవల్ల దానివశంలో ఉన్నావు. విలోమం అనగా విద్య-నిన్ను ఆ పారతంత్ర్యంనుండి తప్పించి, నీ సుస్వరూపాన్ని ప్రకాశింపజేయడానికి చూస్తున్నది. ప్రస్తుతం నీలోనుండి బహిర్గతమగుతున్న ప్రవృత్తులు, కోరికలు, ఆశలు, అభిలాషలు, ఆదర్శాలు ధూమావృతమైన వెలుగులవలె విద్యావిద్యల మిశ్రమములు. నీలో "విద్య" ప్రబలినకొద్దీ, ధూమములు తగ్గి, వెలుగు

లింకను ప్రకాశవంతములు కాగలవు. ఇవి నీ స్వాతంత్ర్య తేజము యొక్క దివ్యరేఖలు.

విముక్తి అనేది నీ చరమదశ అని తలంపకుము. అది నీ స్వరూపమగుటచేత, అదే నీ జీవితానికి అది, మధ్య, అంతము. దానిని నీ జీవితంమధ్య ప్రతిష్ఠించుకొనేవరకు, నీవు స్వతంత్రుడవై లోకయాత్రను సరిగ నడుపుకోలేవు. నీవు స్వతంత్రుడవైతే, పరశాసనానికి లోబడి దాస్యంచేస్తావా ? చేయవు. స్వాతంత్ర్యయోధుడవై, విజయమును గాంచెదవు. మోక్షము కోరేవాడు స్వాతంత్ర్యవీరుడు. ముక్తునకు ధర్మము సత్యమై, ఋతమై, లోకాన్ని ప్రకాశింపజేస్తుంది. కామము ప్రేమవితరణమై లోకదుఃఖనివృత్తి సాధకమగుతుంది. అర్థము కర్మకౌశలమై లోకాన్ని కర్మభూమిగ జేస్తుంది. సోదరా, ముందు ముక్తిని సాధించుకొనుము,

# జిజ్ఞాసకు ప్రేరణ

సోదరా, మోక్షమంటే విషయాలవశంలో బద్ధుడైయున్న వాడు స్వతంత్రుడు కావడమని తెలుసుకొన్నావు. కాని స్వతంత్రంలోని "స్వ" అంటే ఏ మిటో బోధపరచు కొన్నావా ?

ఆత్మ ప్రత్యయానికే "స్వ" అంటాము, కాని ఏ లక్ష ణాలను బట్టి ఆత్మప్రత్యయం అవగతమగుతుందో యోచిం చుకో.

ప్రస్తుతం మనం దేనిని తెలుసుకొన్నా, మనం బుద్ధీం ద్రియం ద్వారానే కదా ! బుద్ధి తెలుసుకోవలననే కోరిక కలది. దానినే జిజ్ఞాస అంటాము. నిశ్చయజ్ఞానం పొందడానికి బుద్ధి ఎప్పుడూ అన్వేషిస్తూ ఉంటుంది, ఈ అన్వేషణంలో బుద్ధి కొన్ని భావాలద్వారా తన జ్ఞానాన్ని నిశ్చయం చేసుకొం టుంది. నేడు నిశ్చయం చేసుకొన్నది, రేపు అనిశ్చయం కావచ్చు. కాని నిశ్చయజ్ఞానంకోసమే బుద్ధిపడే శ్రమఅంతాను.

ఈ నిశ్చయజ్ఞానానికే సత్యమని పేరుపెట్టుకొన్నాము. ప్రకృతి శాస్త్రజ్ఞు డీ సత్యంకొరకే పదార్థాల అంతర్యాన్ని పరిశోధన చేస్తున్నాడు. చరిత్రకారుడు దేశకాలాలలో జరిగే పరిణామ స్వరూపాన్ని తెలుసుకోడానికి చరిత్రాంశాలను పరీక్షిస్తు న్నాడు,

తత్వశాస్త్రజ్ఞుడు ఆత్మప్రత్యయముయొక్క స్వరూప లక్షణాలను అవగతం చేసుకోడానికి దృశ్యాదృశ్య ప్రపంచాల నన్నిటిని పర్యాలోచిస్తున్నాడు.

ఏ పర్యాలోచనానికైనా, ఏ జ్ఞానానికైనా, సత్యమే పరమప్రాప్యం. ఏది సత్యమో మనం సరిగ గుర్తించలేక, మనం తరుచు సిద్ధాంతాలను మార్చుకొంటూ ఉండవచ్చు. కాని తత్వ జిజ్ఞాస మాత్రం మన బుద్ధికి సహజం.

ఎందు కీ కోరిక కలుగుతున్నది ? వెలుగు ఎప్పుడూ దాగి ఉండేదికాదు. అది ప్రస్తుతం ఆవరణశక్తివల్ల మరుగై ఉన్నది. కాని ఆ తేజము ఈ ఆవరణను తొలగించుకొని తిరిగి తనబింబాన్ని పూర్ణంగా ప్రకాశింపజేసుకోడానికి మనబుద్ధిని నిరంతరం "ద్వారాలను తెరువుము" అంటూ తట్టుతున్నది. ఆ ప్రేరణే జిజ్ఞాసకు కారణము.

మనకు ప్రత్యక్షంగా కనబడే దృశ్యప్రపంచంమీదకూడ వెలుగు పడుతున్నది. ఇది ఎక్కడిది అనికూడా ప్రశ్న—

బయటిది లో వెలుగు యొక్క ప్రతిఫలంకాని, అసలు తేజో బింబం కాదు. "తస్యభాసా సర్వమిదం విభాతి" అని ఋషులు చెప్పలేదూ ?

మన బుద్ధిలోపల పరోక్షంగా వెలుగు పొడుస్తూ ఉండడం, బయట ప్రత్యక్షంగా వెలుగు ప్రతిఫలిస్తూ ఉండడం ఈ తత్వజిజ్ఞాసను మరీ పురికొల్పుతున్నది. ఈ వెలుగుల రాసినే తత్వజ్ఞులు పరమసత్యమంటారు. "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ —"

ఈ వెలుగులు ఏమి చేస్తున్నాయి ? లోపల మనబుద్ధిని ప్రబుద్ధమొనరుస్తున్నాయి. బయట దృశ్యప్రపంచాన్ని ఎరుకపరుస్తున్నాయి. ఏది నీ బుద్ధికి జ్ఞానాన్నిస్తూ, తద్వారా ప్రపంచాన్ని ఎరుకపరుస్తున్నదో అదే పరతత్వము,, అదే స్వాతంత్ర్యంలోని "స్వ". అదే సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ.

# సత్యోపాసన

సోదరా, ముందు సత్యోపాసకుడవైతేనే, నీకు పరమపదం లభించేది. నీకు లోపలా బయటా కూడా, సత్యం సాక్షాత్కారమైనగాని నీకు సత్యోపలబ్ధి కాదు.

సత్యం నీ బుద్ధి వెనుక అమరజ్యోతివలె ప్రకాశమానమై వెలుగుతోంది. బుద్ధి ద్వారాలను తెరిచావా, ఆ వెలుగులు నీ లోపలా బయటా ఆవరించి, సత్యలోకంలోకి దారి చూపుతాయి.

నీవు మార్పులను కనిపెట్టుతున్నావు. కాని నీవుకూడ ఆ మార్పులలో ఒక మార్పు అయితే, నీవు వానిని కనిపెట్టగలవా ? కనిపెట్టలేవు.

నీలో మార్పులేని, అక్షరమైన సత్యం వెలుగుతున్నది కనుకనే, నీ వా మారని స్థానమునందుండి మార్పులను చూడ

గలుగుతున్నావు. సత్యం తాను మారకుండా, నీకు మార్పులను ద్యోతకం చేస్తున్నది.

నీవు దేశకాలాలను కొలుస్తున్నావు. దేశకాలాలను మించిన నిత్యమైన సత్యం నీలో లేకపోతే, దేశకాలాల నెట్లా కొలవగలవు ? సత్యం నీలో దేశకాలాల నతిక్రమించి, వానిని అవగతం చేస్తున్నది.

నీవు నామరూపాలను గుర్తించి, వానిని వర్గీకరిస్తున్నావు. నీలో అపరిచ్ఛేద్యమైన సత్యం లేకపోతే, నీవు నామరూపాల నెట్లా గుర్తించగల్గుతున్నావు ? సత్యం నామరూపరహితమై, నీకు నామరూప పరిజ్ఞానాన్ని ప్రసాదిస్తున్నది.

సత్యమంటే, ఏదో ఆవల తటస్థంగా ఉంటున్నదనుకొంటున్నావు. కాని అదే నీ నిజస్వరూపము. సత్యమే నీకు మార్పులను, దేశకాలాలను, నామరూపాలను అనుభూతం చేస్తూ నీ జీవనాన్ని కళావంతంగా ఐశ్వర్యవంతంగా చేస్తున్నది.

అంతేకాదు. నీ కన్ను చూడగల్గుతున్నదన్నా, నీ చెవి వినగల్గుతున్నదన్నా, నీ మనస్సులో సంకల్పవికల్పాలు కలుగుతున్నాయన్నా ఎందుచేత ? సత్యమే నీ స్వరూపం కావడంవల్ల. సత్యాన్ని "నయనస్య నయనం శ్రోత్రస్య శ్రోత్రం, ప్రాణస్య ప్రాణః, మనస్య మనః" అని ఋషులు ప్రకటించలేదూ ?

సత్యలోకమనేది ఎక్కడో, దూరంలో నీకు అందనిచోట ఉన్నదని నిస్పృహచెందకు. నీ విప్పు డున్నది, సంచరిస్తున్నది, చూస్తున్నది, వింటున్నది, ఆనందిస్తున్నది సత్యలోకమే సుమీ.

కాని నీకు కళ్ళు ఉన్నా, కళ్లు మూసుకొని చూస్తున్నావు. చెవులున్నా. చెవులకు బిరడాలు వేసుకొని వింటున్నావు. బుద్ధిఉన్నా బుద్ధిని వక్రింప జేసుకొని తెలుసుకొంటున్నావు. కాబట్టే ఇదంతా అసత్యంగా గోచరిస్తున్నది.

కాని ఉన్నదంతా సత్యప్రకాశమే అని త్రికరణశుద్ధిగ హృదయస్థమైనదా. నీ కన్నులకు క్రొత్తచూపు, నీ చెవులకు క్రొత్తశ్రవణం, నీ ప్రాణానికి క్రొత్త చైతన్యం, నీ బుద్ధికి క్రొత్త తేజస్సు కలిగి, సత్యోపలబ్ధి అగుతుంది. సోదరా నేటినుండి సత్యపరాక్రముడవు కమ్ము. ముక్తి నీకు కరతలామలకము.

# సత్యస్వరూపం

సోదరా, నీలో ప్రత్యేకంగా ఆత్మతత్వాన్ని తెలుసుకొన్నంత మాత్రాన, నీకు సత్యోపలబ్ధి అయినట్లు కాదు. దేనిని సత్యమంటాము ? ఉన్నది సత్యము, లేనిది అసత్యము. ఉన్నది ఒక్కటే—ఏకం సత్; సత్యం తప్ప వేరొకటిలేదు—నాన్యత్ కించిత్ అస్తి.

నీ వొక్కడవేనా ఉన్నది? నీ చుట్టూ ఎన్ని జీవరాసులు లేవు ? నీకు జగత్తు గోచరించుటలేదా ? నీకు దేహము ప్రాణము, మనస్సు అనవరతము అనుభూతమగుటలేదా ? ఇదంతా అసత్యమైతే, నీ కెట్లా గోచరమగుతున్నది ?

లేనివస్తువు నీ కెప్పుడూ కలలోగూడ కన్పట్టదు. నీకు గోచరమయ్యేది ఇంద్రియ ప్రత్యక్షమైనా కావాలె, లేదా నీ బుద్ధిద్వారా తెలుసుకొన్నదైనా కావాలె. కాని ఒక దానిని చూచి ఇంకొకటిగ పొరబడవచ్చు. ఆ పొరబాటుకూడ నీ అనుభవ సంబంధమైనదే కాని, లేనిది కాదు. అట్లాగే నీకు జగత్తు

గోచరిస్తున్నది. కాని నీ స్థూలదృష్టికి అది అన్యంగా గోచరిస్తున్నది. నీ అనుభవాన్ని తరచి సూక్ష్మంగా తిలకిస్తే, నీ కది అన్యంకాదని తెలుస్తుంది. అన్యమైనది ఎప్పటికీ నీ కేవిధంగాను అనుభూతం కాజాలదు.

ఈ జగత్తు స్థూలంగానైన నీ కనుభూతమగుతున్నదంటే, అది నీకు అన్యంకాదు కనుకనే. నీ జ్ఞానం భేదాలను చూస్తున్నది. అభేదాన్నీ కనిపెట్టుతున్నది. భేదాభేదాలు రెండూ నీ కనుభవగతములే ఉన్నది ఒక్కటి అంటే, భేదాభేదములు లేవనికాదు. ఆ ఒక్కటి ఎట్టిదంటే, భేదాభేదముల నంతర్భూతము చేసుకోగల ఒక్కటి అది—సర్వాత్మకమైన ఏకం.

భౌతికపదార్థమంతా ఒక్కటి అంటున్నాము—అయినా అది ఘన ద్రవ వాయు రూపములలో నీకు గోచరిస్తున్నది. ఘన ద్రవ వాయువులు విలక్షణములుగలవే అయినా, భూతత్వము ఒక్కటే అని తెలుసుకొంటున్నాము కాదా ?

ఉష్ణము, తేజస్సు, విద్యుచ్ఛక్తి, మాగ్నెటిజం విశిష్ట లక్షణములుగలవి అయినా, అవన్నీ (Modes of energy) స్వరూపంలో ఒక్కశక్తే అని తెలుసుకొనటం లేదా ?

అట్లాగే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందభూమికలమధ్య పార్థక్యమున్నా, అవి తత్వతః

ఒక్కటే పదార్థమని నీ కనుభూతమైనప్పుడే నీకు సత్యోపలబ్ధి అయినట్లు—ఏకత్వ మనువశ్యతః.

ఏకం సత్యము, సర్వం సత్యము. భేదము సత్యము, అభేదము సత్యము. పరాపర ప్రకృతులు, క్షరాక్షరములు సత్యము సగుణనిర్గుణములు సత్యము. ఎందుకంటే ఉన్నదంతా సత్యము సత్యముకానిది లేదు.

సత్యము—సర్వాతీతము, సర్వగతము, సర్వాంతర్భావుకము, సర్వము—సంపూర్ణము, ఎప్పుడు సత్యము నీకు విశ్వతోముఖముగ, అనంతరూపాలతో, లోపలా బయటా, సర్వావస్థలలోను సమస్త భూమికలలోను ఆత్మస్వరూపమున సాక్షాత్కారమగుతుందో అప్పుడే నీకు సత్యలోకప్రాప్తి.

సోదరా, నీ బుద్ధి ఎప్పుడూ ఒక్క తత్వజిజ్ఞాసలోనే ఉండదు. నీ నడవడికి—నీ కర్మాకర్మలకు, నీ సకల ప్రవృత్తులకు బుద్ధి ప్రయోగమగుతూనే ఉన్నది.

నీ బుద్ధి ఒకమూాల సత్యనిష్ఠలో, ఇంకొక ప్రక్కను వ్యవహారకాండలో ఉండడంవల్ల, నిరంతరం నీ మనస్సు వైరుద్ధ్యాల మధ్య చిక్కుకొని బాధపడుతున్నది. కాని సత్యము వ్యావహారిక జగత్తుకుకూడ అధిష్ఠానమైనదని తెలుసుకొంటే, పరమార్థానికి ప్రపంచానికీ వైరుద్ధ్యంలేకుండా చేసుకోగలవు.

దేనిని జ్ఞానదృష్ట్యా సత్యమని తెలుసుకొంటున్నావో, దానినే కర్మదృష్ట్యా శివమని గ్రహించగలవు. ఎందుకంటే సత్యమే శివము శివమే సత్యము.

సత్యనిష్ఠకు అజ్ఞానము నిన్ను భంగపరుస్తున్నట్లే, శివధ్యానమును అధర్మము నిరోధిస్తూ ఉంటుంది.

అజ్ఞానము అధర్మము తత్వతః ఒక్కటే. సత్యాన్ని మరుగుపరిచేది అజ్ఞానమైతే, శివస్వరూపాన్ని మరుగుపరిచేది అధర్మము.

శివమంటే ఏమిటి? ఏది శుభమో, మంగళమో, కల్యాణతమమో అదే శివము. శుభంకరమైనది ధర్మము, తద్వ్యతిరేకమైనది అధర్మము సత్యా సత్యములను వివేచించడానికి నీ బుద్ధి ఎంత నిశితము గావలయునో, ధర్మాధర్మములను విచక్షణచేయడానికి గూడ నీ వివేకమంత జాగరితము కావలయును.

నీ అనధికారావస్థయందు శాస్త్రమే అనగా మహాపురుషుల సదాచారమే నీకుగూడా మార్గదర్శకమై నీ ధర్మవివేకమును ప్రబుద్ధమొనర్పవచ్చును.

కాని ఎప్పటికైనా నీ శుద్ధాంతఃకరణముమీదనే నీవు ఆధారపడక తప్పదు. నీ కేది మంగళకరమో, శివప్రదమో, నీవే నీ విచక్షణమున గుర్తించి ప్రవర్తించగలిగినప్పుడే నీ ఉన్నతి సుసాధ్యము.

శివము వ్యావహారిక జగత్తును అనగా కర్మకాండను క్రమానుగతంగా ఆత్మోన్నతి సాధనంగా చేస్తుంది. సత్యము బాహ్యాకక్షలను దాటిస్తూ ఆత్మోపలబ్ధిని గలిగిస్తుంది.

సత్యమూ శివమూ ఆత్మప్రత్యయము యొక్క స్వరూప లక్షణములే కనుక సాధనాసాధ్యములు రెండును ఏకముఖము దాల్చును.

సత్యము వెలుగునిచ్చునట్లే, శివము శక్తిని, ఓజస్సును ఇచ్చును. బలములేని వెలుగు నిష్ప్రయోజనము. వెలుగులేని బలమూ అనర్థకము.

ధర్మము జ్ఞానచోదితమైనప్పుడే, అది కల్యాణప్రదమై ఆత్మోపలబ్ధి సాధకమగును. జ్ఞానము క్రియాశక్తి సమన్వితమైనప్పుడే, అది ఆత్మయొక్క నిండుదీప్తిని ప్రకాశింపజేయును.

కాబట్టి సోదరా, నీ చిత్తమునందు సర్వదా సత్యశివములను నిలిపి తత్వజిజ్ఞాసతోబాటు ధర్మజిజ్ఞాసనుగూడ కొనసాగించుచుందుము.

"తేజోసి—బలమసి"

# కర్మ యోగం

సోదరా, నీవెంత జ్ఞానయోగివని అనుకొన్నా, నీవు కర్మను విడనాడినావా, నీలోని జ్ఞానజ్యోతి క్రాస్తా క్రమంగా కొడి గట్టి ఆరిపోతుంది.

అగ్ని కాల్చనూకలదు, వెలగనూకలదు. దాని తేజో గుణాన్ని మాత్రం ఉంచి, తాపకశక్తిని తీసివేస్తానంటే సాధ్యమా ? అగ్నిలో ఉష్ణమెప్పుడు చల్లారుతుందో, అప్పుడు తేజస్సుకూడా తగ్గి ఆరిపోక తప్పదు.

తాపము, తేజము—ఇవి నీకు భిన్నములుగ కనబడ్డా, తత్వతః రెండూ ఒక్కటే—మన జ్ఞానద్వారాలు చీలి ఉండ డంవల్ల, విడివిడిగ అనుభవిస్తున్నాము.

స్పర్శేంద్రియంవల్ల వేడిమిని తెలుసుకొంటున్నాము. నయనేంద్రియమువలన వెలుగును చూస్తున్నాము. కాని ఈ రెంటి ఉనికీ ఒక్కటే.

బ్రహ్మోద్భవం కర్మ అని ఎందుకు చెప్పాడు గీతాకారుడు? కర్మ గౌణికం, ముఖ్యంకాదు అని చెప్పే ప్రజ్ఞావాదులు బయలుదేరి కర్మ భ్రష్టులు కావడం మొదలుపెట్టారు. అందుకని దేనినుండి జ్ఞానం ప్రకాశిస్తున్నదో, దానినుండే కర్మ కూడ వెలువడుతున్నదని తెలిపాడు.

బ్రహ్మోద్భతమైన కర్మజ్ఞానహేతువు కాకుండా ఎట్లా ఉంటుంది? కర్మ చిత్తశుద్ధి సాధకమనుమాట నిశ్చయమే. కాని చిత్తశుద్ధి వట్టి శుష్కకర్మ మాత్రంచేతనే కలుగదు. జ్ఞానదగ్ధమైన కర్మే చిత్తశుద్ధి సాధకమగుతుంది.

జ్ఞానసిద్ధి కలగడంతోడనే, కర్మప్రసక్తి ఉండదనుకోవడం వట్టి పొరబాటు. శ్రీకృష్ణపరమాత్మ డేమి చెప్పినాడు? నేను పొందవలసినదేమీ లేకపోయినా, నేను కర్మచేయటంలేదు కనుకనా, నీవు కూడా నాచే ప్రవర్తితమగుతున్న కర్మచక్రాన్నను సరించు అని అర్జునుని హెచ్చరించినాడు.

జ్ఞానం తనలో తాను ఇమిడి ఉండేదికాదు. అది సృజనశక్తిగ బహిర్గతమై, విశ్వరూపం దాలుస్తుంది. నీకు జ్ఞానసిద్ధి కలిగిందని ఎట్లా? అది లోకసంగ్రహంగా సాధర్మ్యరూపం పొంది, సత్యశివముల ఐక్యం సాక్షాత్కారమైనప్పుడే, నీకు సమగ్రమైన జ్ఞానం సిద్ధించినట్లు.

సత్యశివములు ఆత్మప్రత్యయముయొక్క భిన్నదిక్కులు. సత్యము భేదముల వెనుక అభేదమును ప్రతిష్ఠించును. శివము అభేదముపై భేదములను నెలకొల్పును. వీనిలో ఏది అధికము అని ప్రశ్నించకుము. ఆధిక్య న్యూనతలు నీ మానసిక కల్పనలు. పూర్ణతత్వమునందు హెచ్చుతగ్గులులేవు—సమం బ్రహ్మ.

నీవు సాధకుడవైతే, నీ జ్ఞానాన్ని కర్మదృష్టితోను, కర్మను జ్ఞానదృష్టితోను చూచి, ఉభయములను మోక్షసాధకములుగ జేసికోగలవు. అందుకనే "యోగస్థః కురు కర్మాణి" అని గీతా ప్రబోధము.

## మానవ ధర్మనిరూపణ

సోదరా, జ్ఞానంయొక్క లోతులకైనా జొరవచ్చునేమో కాని, కర్మ వైచిత్ర్యాన్ని తెలుసుకోవడం మాత్రం దుస్తరం. ఎందుచేత ? కర్మ అంటే నీవు చేసే నాలుగు క్రొత్తాలేకాదు—అసలు సృష్టే మహాకర్మ. ప్రకృతి కర్మలో పుట్టింది, కర్మచేతనే సిద్ధి పొందుతున్నది. ప్రకృతి అనాది, కర్మ కూడా అనాదే. కేవలం కర్మ పూర్వజన్మ ఫలితమనుకొంటు న్నావా ? కాదు. అనాదికి పూర్వమెక్కడ ? కాలానికి తుదీ లేదు, మొదలూలేదు.

"స్వభావనియతం కర్మ" అన్నాడు గీతాకారుడు. ఈ స్వభావం ఎప్పటిది ? అనాదిది. సృష్టి మూలంలోనే ఉన్నది స్వభావసిద్ధమైన ఈ నానాత్వం. అక్కడలేనిది, ఇక్కడకు ఎట్లా వచ్చింది ? "యాథాతథ్యతో అర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః" - ఏయే వస్తువుల కేయే విశిష్టాగుణకర్మ లుండ వలెనో అవి శాశ్వతంగా విభజింపబడినాయని ఋషులు చెప్ప లేదూ ?

అచేతనముల ధర్మంవేరు, చేతనముల ధర్మంవేరు, జంతు ధర్మంవేరు, జీవుల ధర్మంవేరు, దేవతల ధర్మంవేరు-ఈ ధర్మాలు ఆయావస్తువుల తత్వాన్ని అవస్థనుబట్టి నానాప్రకారాలుగా విరాజిల్లుతున్నాయి. అందులో మానవధర్మం మరీ గహనమైనది. ఎందుకంటే బ్రహ్మాండముయొక్క వైచిత్ర్యమంతా మానవునియందు మూర్తీభవించియున్నది. అందుకనే మానవుని క్షుద్రబ్రహ్మాండ మన్నారు. మానవుడు భూమిదగ్గరనుండి స్వర్గందాకా వ్యాపించి యున్నాడు—దేవాలయ శిఖరంవలె, ఎన్నో అంతస్తులతో.

కాబట్టి మానవధర్మాన్ని నిరూపణచేయాలంటే శరీర తత్వము, చేతనయొక్క స్వరూపము, మనోబుద్ధ్యహంకార ములయొక్క తత్వము, ఆత్మవిజ్ఞానము—ఇన్నిటి స్వరూపాన్నీ గ్రహిస్తే కాని విశ్వవ్యాప్తమైన మానవధర్మరహస్యం నీ కవగతం కాదు. ఈ భిన్నతత్వములను వేరువేరుగ తెలుసుకొంటే ప్రయోజనంలేదు. ఇది ఏ విధంగా వాని వాని లక్షణాలను పోషించుకొంటూ, ఒకదాని కొకటి అంగీభూతమై, ఏ చరమలక్ష్యాన్ని సాధించగల్గుతున్నదే — ఆ పరిణామ సూత్రాన్ని అనుక్రమణికగ అవగాహనం చేసుకోవాలె. సమస్త కర్మభూమికిని పరమలక్ష్యమై, ఆయాతత్వముల అంగాంగీ సహాకారముతో, దేశకాలములగుండా పరిణామరీతులను నిర్ణయిస్తూ తన దరికి క్రమంగా చేర్చుకొంటున్నది శివమని వెనుకనే గమనించాము. మానవధర్మ నిరూపణమంటే నిజంగా ప్రపంచ

సమస్యా పరిష్కారమన్నమాట కాదూ ? సకల విజ్ఞానములు, సమస్తకళలు, సర్వ నీతిసారములు, అఖిల సాధనాప్రణాలికలు, ఆర్థిక, ఐతిహాసిక, రాజ్యాంగ, సామాజిక వ్యవస్థా పర్యాలోచనలు ఈ మానవధర్మ నిరూపణమునకే బాటలు తీయుటలేదా ? మానవధర్మమంటే, వ్యష్టిగతంగా ఆత్మోపలబ్ధి, సమష్టిరూపంలో లోకకల్యాణం, తత్వరీత్యా విశ్వలీలా విలాసము.

అందుకనే శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు కర్మయొక్క ఆంతర్యాన్ని బోధపరచుటకు, సమస్తతత్వ సమన్వయముతోబాటు విశ్వరూప సాక్షాత్కారమునుగూడ ప్రసాదించవలసివచ్చింది.

# విశ్వంతో తాదాత్మ్యం

సోదరా, నీవు ప్రత్యేకంగా ఒక వ్యక్తివన్నమాట నిజమే. కాని నీవు విశ్వానికి విడివడిలేవు. నీ లోపలా బయటా కూడా విశ్వం నిండివున్నది. నీవు నీవే—నీవు విశ్వంకూడాను—"విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయుః" అంటూ రోజూ సంధ్యావందనం చేయుట లేదా ?

నీవు వ్యష్టివి అగును. వ్యష్టిగ నీకు స్వభావ స్వధర్మములున్నాయి—నీ గుణకర్మలువేరు. సమష్టిగ విశ్వభావ విశ్వధర్మములున్నాయి. విశ్వాన్ని విడిచి నీవు లేవు. నిన్ను విడిచి విశ్వంలేదు. నీవు క్షేత్రజ్ఞుడవు, విశ్వం క్షేత్రం. రెంటికీ అవినాభావ సంబంధమున్నది. ఎందుకంటే ఏది నీలో ఉన్నదో, అదే విశ్వంలోనూ ఉన్నది. "యోసావసౌ పురుషః సోహమస్మి."

విశ్వము ఏకతలంకాదు. అందు భూః, భువః, స్వర్లోకములున్నాయి. నీ దేహము భూలోకములోనిది. నీ ప్రాణము భువర్లోకములోనిది. నీ మనస్సు స్వర్లోకములోనిది. ఈ ముల్లోకములు ఒకదానిలో ఒకటి ఇమిడిఉన్నాయి కాని వేరువేరుగ లేవు. భూతత్వమునుండి భువము అనగా ప్రాణము అభివ్యక్తమగుతున్నది. భువమునుండి స్వః అనగా మనస్సు అభివ్యక్త

మగుతున్నది. ఇది ఒక ఆరోహణక్రమము. నీవీ ముల్లోకములలో వ్యాపించి ఉన్నావు, దేహివిగ, ప్రాణివిగ, మనుష్యునిగ,

ఈ ముల్లోకాలు సమానబలము కలవికావు. దేహము కంటె ప్రాణం బలవత్తరమైనశక్తి. మనస్సు ప్రాణంకంటె గూడ అధికమైనది. దేహము తమః ప్రధానము. ప్రాణము రజః ప్రధానము. మనస్సు సత్వము.నీదేహానికే ప్రాధాన్యమిచ్చావా నీ జీవితం తమోగుణ ప్రధానమగుతుంది. ప్రాణానికే ఆధిక్యమిచ్చావా, రజోగుణ ప్రధానమగుతుంది. మనస్సుకే పట్టం గట్టావా, సత్వప్రధానుడ వగుతావు.

ఈ మూడు గుణాలు విడివిడిగ ఉండవు. మిశ్రమములై ఉంటాయి. ఏది ప్రధానమనేదే ప్రశ్న. నీవు సత్వాన్నే ప్రధానంగా చేసుకొంటే, నీలో తమోరజములున్నా అవి సత్వమునకు ఉపాంగములుగ ఉంటాయేకాని విశృంఖలంగా, చెల రేగవు. ఎప్పుడు నీమనస్సును సత్వప్రధానంగా జేసుకొన్నావో అది అత్యంత శక్తిగలదగుటచేత, నీ ప్రాణము, దేహముకూడా సత్వప్రధానము లగుటయేకాక, సత్వగుణంద్వారా విశ్వ భావాన్ని విశ్వధర్మాన్ని అందుకోగల్గుతావు.

సత్వప్రధానుడవైతే విశ్వము నీలోను, నీవు విశ్వము లోను ఏకాత్మతను పొందగల బ్రాహ్మీస్థితి సిద్ధిస్తుంది. విశ్వంలో అణువు అణువుమధ్య, శక్తి శక్తిలోపల, జీవ జీవునకు ఆదాన ప్రదాన కర్మ నిరంతరం సాగుతున్నది. నీవా అదాన ప్రదాన లీలామృతమును గ్రోలుతూ నీవు విశ్వములోను, విశ్వము నీలోను లీనమై ఆత్మ సామ్రాజ్యాన్ననుభవించగలవు.

"తత్వమసి—విశ్వమసి"

# నివృత్తి, ప్రవృత్తి

సోదరా, నీ చిత్తము తాబేటివలె లోపలకు ముడుచుకొని పోగలదు. సర్వాంగములను విప్పుకొని బయటకూ రాగలదు. మొదటిది సంక్షేపశక్తి. రెండవది విక్షేపశక్తి. వీనినే వేదాంతులు, నివృత్తి అని ప్రవృత్తి అని అంటారు.

ఎందుకు నీ చిత్తమిట్లా రెండు ముఖములు దాలుస్తుందో నీ వెప్పుడైనా ఆలోచించావా? నీలో రాగద్వేషాలున్నాయి. ఒక దానియందనురక్తి కలిగిందా దానిని పొందడానికి నీ చిత్తము ప్రవర్తిస్తుంది. దేనియందైనా విరక్తి కలిగిందా, దాని నుండి నివృత్తిపూర్వకంగా మరలుతుంది.

నీ చిత్తము ధర్మప్రవిష్టమైనప్పుడు కూడ రెండువిధాల నడుస్తుంది. విధి విషయంలో నీ చిత్తము ముందుకు ప్రసరిస్తుంది. నిషేధ విషయంలో నీ చిత్తము వెనుకకు మరలుతుంది.

నీ చిత్తానికి రెండు నడక లెందు కేర్పడ్డాయో తెలుసునా? నీ గతికి రెండుముఖాలు. ఒకగతి ఊర్ధ్వముఖము. రెండవది విశ్వముఖము. ఊర్ధ్వానికి పోవాలంటే చిత్తము నివృత్తి మార్గం త్రొక్కుతుంది. విశ్వముఖంలో ప్రవృత్తి నవలంబిస్తుంది.

నీలో రెండు ప్రబోధా లేకకాలమందు కలుగుతూఉండడం నీ కనుభవగతమై ఉంది. ఒక ప్రబోధము "తత్వమసి"—

దేహం, ప్రాణం, మనస్సు—ఈ మూటిని దాటి సచ్చిదానంద మును అనుసంధానించు అను ప్రబోధమిది. రెండన ప్రబోధము, "విశ్వమసి"—నీ దేహాన్ని, ప్రాణాన్ని, నీ మనస్సును విశ్వాని కర్పించి, విశ్వధర్మాన్ని నిర్వర్తించు అను ప్రబోధమిది.

ఈ రెండు ప్రబోధాలు పరస్పర విరుద్ధములుగ గోచరించి, కొందరు సాధకులు నివృత్తిపూర్వకమైన కర్మ సన్యాసాన్ని అవలంబిస్తారు. కొందరు సాధకులు తమ సర్వస్వాన్ని విశ్వపురుషున కర్పించి, లోకసంగ్రహార్థము కర్మయోగాన్ననుష్ఠిస్తారు.

ఈ ఉభయ నిష్ఠలు నిజంగా పరస్పర విరుద్ధములు కావు. ఎందుకంటే, సర్వాతీతమైన పరబ్రహ్మమే సర్వాంతర్యామి అయిన విశ్వపురుషుడు కూడాను. "సర్వాతీతం పరబ్రహ్మ - సర్వాంతర్యామీ పరమాత్మా" అని భాగవతకారుడు నిర్వచించ లేదూ ?

ఈ రెంటిలో ప్రత్యేకంగా ఏ ఒకదానిని అవలంబించినా, నీ వర్ధపురుషుడ వగుతావు. ఆత్మ సర్వాతీతమగును, సర్వాంతర్యామి అగును. కాబట్టి, ఈ రెండు నిష్ఠలను స్వీకరించగలిగి నప్పుడే నీ సాధన సమగ్రమై నీవు పూర్ణపురుషుడవు కాగలవు.

అందుకనే గీతాకారుడు నివృత్తి ప్రవృత్తులను నిష్కామ కర్మ పేరున అనాసక్తియోగమునందు సమన్వయపరచినాడు. ఆత్మస్థుడవై, లోకకల్యాణార్థము స్వభావనియతమైన స్వధర్మాన్ననుష్ఠింపుమని అర్జునునకు ప్రబోధించలేదూ ? నివృత్తి ప్రవృత్తుల నంతర్భుక్తము చేసుకొన్నదే నిష్కామకర్మ — లేక సాధర్మ్యము.

# జ్ఞానకర్మల సమన్వయం

సోదరా అనంతమైన సత్యాన్ని పొందడానికి ఒకటే మార్గమా?

నదులన్నీ సాగరంలో గలియునట్లే, లోకంలో ప్రవర్తిల్లే సాధనలన్నీ తుదకు సత్యానికి గొంపోయేవే అన్నారు మమకారంలేని బ్రహ్మజ్ఞానులు. "ఏకంసత్, విప్రా బహుధా వదన్తి" అని అనలేదూ ?

కాని అన్ని సాధనల నవలంబించగల్గుట నీ తరమా ? నీకనువైన సాధనలనే నీవు నిర్ణయించుకోవలె. స్వభావాన్నిబట్టి, నీ సంస్కారాన్నిబట్టి, నీ అభినివేశాన్నిబట్టి, నీ మార్గాలను నీవు త్రొక్కక తప్పదు.

నీవు నిర్ణయించుకొనేటప్పుడు, ఏ త్రోవ లన్యోన్యం సహకారములై, నీ లక్ష్యాన్ని సుసాధ్యం చేస్తాయో, వానిని ప్రత్యేక ప్రత్యేకంగా గాక, యుగపత్తుగానే అవలింబించడం కూడా యుక్తమూ—అవసరమూను.

ఇప్పుడు సత్యము శివము నీ ధ్యేయములుగ ఉన్నాయి. ఇవి రెండు పరస్పరం సహాయభూతములైతే, వానిని ఏకకాల

మందే అనుష్ఠింపుము. లేకపోతే, నీ ధర్మజీవనం పుష్టివంతం కాజాలదు. సత్యనిష్ఠ జ్ఞానసాధకము. శివదీక్ష ధర్మమూలకము. జ్ఞానంలేని ధర్మము, ధర్మంలేని జ్ఞానము నిరర్ధకములని నీకు తెలియదూ? నీ జీవనానికి వెలుగూ కావాలె, సుగమంగా ఉండే బాటా కావాలె. సత్యం నీ బాటకు వెలుగు నిస్తుంది. ధర్మం నీబాటను ఋజుపథంగా చేస్తుంది. కాబట్టి జ్ఞానకర్మలను ఏక కాలమునందే అనుష్ఠించడం అవసరం.

జ్ఞానమనేది నీబుద్ధియొక్క క్రియకాదు. అది ఆత్మయొక్క వెలుగు. ఆ వెలుగే నీవు ప్రస్తుతం నీ బుద్ధిద్వారా తెలుసుకొంటున్నావు. కాని నీ బుద్ధి ఎంత నిర్మలం, ఎంత నిశితం అయితే, జ్ఞానం నీ బుద్ధిలో అంత విశుద్ధంగా అంత నిండుగా ప్రకాశిస్తుంది.

ధర్మమనేది నీ మనఃకల్పితంకాదు. అది సత్యం విశ్వంలో నడిచే నడక. అన్న, ప్రాణ, మనో, విజ్ఞాన ఆనంద భూమికలలో ఒక ఆరోహణ. క్రమంగా సత్యం ప్రవర్తించే సరళ ధర్మపథము. అందుకనే, ఋషులు సత్యమును "ఋతం" "బృహత్" (సరళము పెద్దది) అని సూచించారు.

బుద్ధి జ్ఞానానికి ద్వారమైనట్లు, చిత్తం కర్మాభిముఖమై ధర్మాన్ని అనువర్తిస్తూ ఉంటుంది. చిత్తం ఎంత విశుద్ధమై, ఎంత నిర్మలం, నిశ్చలం అయితే, విశ్వగతమైన ధర్మసూత్రం

కూడా నీ చిత్తమునకు అంత సుస్పష్టంగా ద్యోతకమగుతూ ఉంటుంది.

ఏది నీలోపల ప్రకాశిస్తుందో, అదే నీ బయట ధర్మంగా రూపొందినప్పుడు, నీ అంతరంగికానుభూతిని బహిరంగానుభవము దృఢపరచినట్లు కాదా ? కను మూసితే వెలుగు— కనువిప్పితే ధర్మము.

సత్యశివములు నీ జీవనానికి దోహదమిస్తున్నప్పుడు నీ జీవనము నవనవోన్మేషమై, వెలుగుబాటై, పూలతోటై, లోక కల్యాణ గీతికయై విరాజిల్లగలదు. ఇక లెమ్ము, సోదరా, సత్యవ్రతుడవు శివదీక్షాపరుడవు కమ్ము.

# సాధన సమగ్రత

సోదరా, నీవు వెనుకనే తెలుసుకొన్నావు—మానవుని కోరికలను ముఖ్యంగా మూట్రికింద వర్గీకరింపవచ్చునని.

అవి—తెలుసుకోవలెననే కోరిక జిజ్ఞాస; ఏదో కార్యం సాధించవలెననే కోరిక—కర్మలిప్స; ఆనందించవలెననే కోరిక - రసపిపాస. నీ ఆత్మ ప్రత్యయమునందలి సత్యం, శివం, సుందరం అను మూడు ప్రధాన లక్షణములును-నీ జీవనంలో ఈ మూడు కోరికలను రేకెత్తించి తద్వారా నీలో జ్ఞాన, కర్మ, భక్తులను ఉత్తేజన మొనర్చుచున్నవి. ఈమూటికిని నీలో మూడుద్వారా లేర్పడియున్నవి. జ్ఞానానికి బుద్ధి ద్వారము; కర్మకు నీ చిత్తం ద్వారము; భక్తికి నీ హృదయం ద్వారము.

ఈ మూడుద్వారాలు సమానంగా తెరుచుకొని జ్ఞానం, కర్మ, భక్తులు పెంపొందినగాని నీ జీవనము సర్వతోముఖమై, ఆత్మ ప్రత్యయముయొక్క సమగ్రత నీ కనుభూతముగాదు.

వీనిలో నేది లోపించినను, నీ జీవనము కుంటుపడడమే కాక, ఏది నీలో ప్రత్యేకంగా ఎదిగినదో అది వక్రిస్తుంది. ఈ మూడు సమానంగా బలపడితేనే.అవి సరళంగా ప్రకాశించగలవు.

నీలో ఒక జ్ఞానమే ప్రకాశించిందా, అది క్రియాశక్తి రహితమై, అరసమై వెలవెలబోతుంది. నీ శరీరంలో అన్ని అవయవములు శుష్కించిపోయి, ఒక్క తలే పెరిగితే నీ విగ్రహం ఎంత అందంగా ఉంటుందో ఊహించుకో.

అట్లాగే, నీలో ఒక క్రియాశక్తే ప్రకోపిస్తే అది అశాంతికరమైన కార్యజ్వరమగుతుంది. కాని, అది ధర్మనిష్ఠ కాజాలదు కర్మ సత్యప్రతిష్ఠితమై, అనన్యభక్తితో నాచరింపబడినప్పుడే, అది నిన్ను శక్తివంతునిగ, కర్మ కుశలునిగ జేయగల్గుతుంది.

ఒక్క భక్తే నీలో పొంగితే, అది వట్టి నురుగు, గాలి మూట. అది తుదకు విషయలంపటత్వంగా పరిణమించి దుర్బలునిగజేసి వేస్తుంది. సత్యానురక్తితో గూడి, లోకకల్యాణార్థము కర్మతంత్రత ఏర్పడినప్పుడే, నీ భక్తిశబలత నిరతిశయానందము నొందించగలదు. సత్యము నీకు వెలుగునిస్తుంది శివము ఆ వెలుగు సహాయముతో నీకు ఋజుపథంలో నడవగల శక్తి నిస్తుంది. సుందరము కాంతిమంతమైన, శక్తియుతమైన నీ జీవనానికి లావణ్యము, విలాసము, మాధుర్యము యిస్తుంది. ఆత్మ అఖండమైన వస్తువు—దానిని సత్యం, శివం, సుందరం అని వ్యావహారికంలో పదచ్ఛేదం చేసుకొన్నా స్వరూపతః ఆ మూడును ఒకటే.

శివము కానిది సత్యం కానిది, సుందరముకాదు. సత్యము యొక్క శక్తి శివము. శివముయొక్క విలాసము సుందరము. నీ జీవనస్రవంతి భక్తి, జ్ఞాన, కర్మలకు త్రివేణీ సంగమమై లోకపావనియగు జాహ్నవివలె వెలయుగాక !

# త్రివేణీ సంగమం

సోదరా, ఒకటి హెచ్చుగఉన్నా, ఇంకొకటి తక్కువగ ఉన్నా ప్రతివానికీ జ్ఞానం, శక్తి, ప్రేమ—ఈ మూడూ ఉన్నాయి. ఇవి మూలంలో ఆత్మ ప్రత్యయంయొక్క స్వరూపలక్షణములు కాకపోతే, మానవజీవితంలో ఎట్లా ప్రతిభాసిస్తున్నాయి?

ఇవి మన భేదబుద్ధికి భిన్నంగా కనబడ్డా మూలంలో ఒక్కటే. వీని ఐక్యత నవగతం చేసుకోలేక, భేదబుద్ధి ననుసరించి, వీనిని ప్రత్యేకంగా అవలంబించి, భిన్నమార్గాలు తొక్కారు. ఇందుమూలంగా జ్ఞానయోగమనీ, కర్మయోగమనీ, భక్తియోగమనీ వేరు పంథా లేర్పడ్డాయి.

జ్ఞానులు కర్మనూ, భక్తినీ గౌణికమని, నిమ్నాధికారుల కేర్పడినవని నిరసించడం మొదలు పెట్టారు. అట్లాగే భక్తియోగులూ, కర్మయోగులూ జ్ఞానులను సోమరులని, తమ కైవల్యాన్నే చూచుకొనే స్వార్థపరులని నిందింపసాగారు.

నీవు సూక్ష్మబుద్ధితో లోతులను తరచిచూస్తే-జ్ఞానంలో శక్తి, శక్తిలో సౌందర్యం అవబోధమై, ఆత్మయొక్క సమగ్రత సంపూర్ణత గోచరిస్తుంది.

జ్ఞానమంటే పరాయివస్తువును తెలుసుకోవడంకాదు. ఆత్మే జ్ఞాత, ఆత్మే జ్ఞేయము. కర్మఅంటే ఏదో బయట ఒక కార్యాన్ని

చేయడంకాదు-ఆత్మే కారణం, ఆత్మే కార్యము. ప్రేమ అంటే అన్యుని ప్రేమించడంకాదు - ఆత్మే భోక్త, ఆత్మే భోగ్యము. జ్ఞానం—ఆత్మజ్ఞానం, కర్మ—ఆత్మశక్తి ప్రేమ—ఆత్మరతి.

జ్ఞానంలో శక్తిఉన్నది. జ్ఞానము తాను మరుగుచేసుకోగలదు, వెల్లడి చేసుకోగలదు. "నిషేధవ్యాపారా శక్తిః" అని చెప్పలేదూ ఋషులు? సత్యం జ్ఞానం అనంతం—తనను తాను భిన్నదృక్కోణాలనుండి చూచుకొని తన అనంతత్వాన్ని వెల్లడి పరచుకొంటుంది. అల్లే శక్తి తనను తాను సంక్షేపించుకోనూ గలదు, విక్షేపించుకోనూగలదు—అది అక్షరము-ఇది క్షరము. అది Static — ఇది Dynamic. అది రెండూ కాగల్గింది కనుకనే సర్వశక్తి.

ప్రేమకూడా అంతే-తానే భోక్త, తానే భోగ్యం—వియోగంలో దూరమై రసపిపాసను జూపుతుంది. సంయోగంలో రససిద్ధిని బొందుతుంది.ఏకరసమయ్యీ,నవరసస్ఫూర్తిలో విలసిల్లగలదు. సూర్యకిరణం వెలుగైతే, ఇంద్రచాపంలో విరజిమ్మే వర్ణప్రభలు దాని చిన్నివన్నెలుకావా? నాదాన్ని ఉపాసిస్తూ, అది ఊపే రాగంపుటుయ్యాలలో నీవు తన్మయుడవు కాలేవా? నీవు సౌందర్యాన్ని గ్రోలుతూ అంగోపాంగముల రామణీయకము నెట్లా తిలకించకుండా ఉండగలవు?

ఆత్మయొక్క స్వరూపం ఆనందం-దాని వెలుగే జ్ఞానం; దానిక్రీడే శక్తి; దాని రసమే ప్రేమమాధుర్యము. నీ జ్ఞాన, శక్తి ప్రేమలు సమముగ సమ్మేళనములై సర్వాంగసుందరముగ శోభిల్లినప్పుడే, నీవు ఆనందరసామృతమూర్తివయ్యేదవు.

# రసస్వరూపం

సోదరా, సౌందర్యోపాసకులు నీతినియమములను పాటించని భోగులనే ప్రతీతి ఉన్నది లోకంలో. కాని ఇది నిజంకాదు. నియమమనేది ఎక్కడైనా ఉంటే, అది సౌందర్యోపాసనలోనే విశేషంగా పరాకాష్ఠ చెందుతుంది.కళకు నియమమే మూలము విశృంఖలత కళకు విరుద్ధము. రసజ్ఞత కొద్దీ నియమము లంత కంతకు సూక్ష్మాతి సూక్ష్మము లగుచుండును. నీతివాది నియమములకును. కళాభిజ్ఞుని నియమములకును విశేషవ్యత్యాసము కలదు. నీతివాదికి ప్రమాణము లోకాచారము, సంఘమర్యాద శాస్త్రవిహితములైన విధినిషేధములు. కళాభిజ్ఞుని నియమములు బాహ్యములుకావు ఏ నియమము రసనిష్పత్తికి ఆధారమో, ఏ విధులు రసజ్ఞతకు సహకారములో వానిని కళాభిజ్ఞుడవశ్యము పాటించును.

నీతిపరుడు బయటి ప్రమాణాలనుబట్టి ప్రవర్తిస్తాడు.సౌందర్యోపాసకుని శీలము వాని సహృదయము ననుసరిస్తూఉంటుంది.

నీతివాది విధులకు ఒక శిక్షణగ లోబడుతాడు. కళాభిజ్ఞుడు సుఖంకోసం నియమములను కోరి తెచ్చుకొంటాడు.

సౌందర్యోపాసకుని హృదయము బహుసుకుమారము. కోమలము. ఏ అణుమాత్రం రసాభాస కలిగినా వాని

హృదయం బాధపడుతుంది. రసవ్యంజకములైన భావములే వానికి ఆలంబనములు.

తంబురా తీగెలు వదులియ్యరాదు. చిత్తరువులోని రేఖలు వక్రించరాదు. గీతంలో ఒక అపశబ్దము కూడ పలుకరాదు. నృత్యములో తాళము తప్పరాదు-కళా ప్రపంచములో-స్వాం తూకం-తూనిక-కొలత-మాత్ర-మానం-ప్రమాణం.

సౌందర్యోపాసకుడు జ్ఞానయోగికాక తప్పదు—వాని నేత్రము జ్ఞానాంజన శలాకముచే ఉన్మీలితమైనప్పుడే, వాని చూపు వజ్రభేదియైన సుందరమూర్తిని గాంచును—శ్రీ శంకర భగవత్పాదులవంటి జ్ఞానులే "సౌందర్యలహరి"లో ఓలలాడ గల్గుదురు.

జ్ఞాని కర్మయోగి కాకపోవచ్చును. కాని సౌందర్యో పాసకుడు కర్మ కుశలుడు కాకతప్పదు. వాని హస్తము పరుస వేది వంటిది. వాని స్పర్శకు శబ్దము కవితయై ప్రవహించును. దారుశిలా లోహములు మధురరసమును విరజిమ్ము కుసుమము లగును. శిల్పభాగ్యము వాని సహజ సంపద.

సౌందర్యోపాసకుడు స్వరూపతః భక్తియోగి. సౌంద ర్యము ప్రేమయొక్క శోభ కాంతి, లావణ్యము, మాధుర్యము దాని సహజలక్షణములు.

వేయేల సౌందర్యోపాసకునియందు జ్ఞాన భక్తి కర్మలు సమ్మేళనము చెంది - రససిద్ధియందు పరిపూర్ణతచెందును. ఈ మూడును Knowledge-Power-Beauty ఆత్మ జ్యోతి యొక్క భిన్నకళలు. సోదరా, సౌందర్యోపాసన నవలంబిం చుము - నీ జీవనరంగము త్రిలోకసుందరికి నాట్యభూమియై, జగమును సమ్మోహింపజేయును.

# రసజ్ఞత

సోదరా, సౌందర్యం బాహ్యావస్తువుల లక్షణంకాదు. అది నీ లోపలది. అది బయటిదే అయితే, అందరినీ సమానంగా రంజింపచేయాలి. చేయదు. ఒకరి కంటికి అందంగా ఉన్నది, ఇంకొకరికి వికారంగా కనబడుతుంది. రసజ్ఞతే సౌందర్యానికి ప్రమాణం

సౌందర్యం జ్ఞానంవలె ఆత్మయొక్క స్వరూపలక్షణం - సత్యం, శివం, సుందరం. జ్ఞానం స్వయంప్రకాశం, జగత్ప్రకాశకమూ అయినట్లే, సుందరం స్వయంమధురం, సర్వం మధురమయంగా జేసే ఆత్మశోభ, నీలో ఆత్మశోభ అనుభూతమైన కొద్దీ, నీ రసాస్వాదనపటిమకూడ వృద్ధిచెందుతుంది, ఆత్మశోభ హృద్గతం కావడానికి, ఆత్మ నిష్ఠ చాలా అవసరం,

నీ జీవనంలో అనేక పొరలు, తెరలు, అరలు ఉన్నాయి. ఎన్ని దశాంతరాలో రంగాలుగ గడచాయి ఇంకా గడవనున్నాయి. వీనిలో వీనికి నిరంతరం స్పర్థ,సంఘర్షణ కలుగుతూ

ఉండడంవల్ల, నీకు చిత్తవిక్షేపం కలిగి శాంత్యానందములు మృగ్యములగుచున్నవి. శాంతియందు కాని సౌందర్యశోభ ప్రకాశించదు.

సంగీతవిద్య శాంతిసౌఖ్యముల నెందు కియ్యగలుగుతున్నదో యోచించుము. సంగీతముకూడ నీ జీవనంవలెనే సంచలన వేగములతోగూడినది. అందునా ఆరోహణావరోహణములు కలవు. స్వరభేదములు కలవు. విరుపులు విశ్రామములు కలవు. కాని అవన్నియు ఒక శ్రుతికి మేళవమై, రాగోన్ముఖమై, తాళయుతముగ ప్రస్తారితమగుచుండుటచే గేయము మధుర మొనర్పగలుగుచున్నది. అట్లే నీ జీవనంలో అనేక అవస్థలు, దశలు, తిరుగుళ్లు సంఘటిస్తున్నా, వానికి సామరస్యముగూర్చి, ఏకలక్ష్యమున కనుసంధానము చేయగలిగితే, నీ జీవనంకూడా భావాత్మకమైన గేయమువలెను ఛందోబద్ధమైన ఋక్సామలవలెను, ఆనంద సంధాయకము కాగలదు. సర్వాంగోపాంగ సామరస్యమే సౌందర్యమని మన అలంకారికులు నిర్వచించలేదూ?

నీ జీవనంలో రసస్ఫూర్తి కలుగవలె కాని, అది నీ లోపల దాగి ఉండక, నిన్ను సర్వాంగశోభితునిగ జేసి వేస్తుంది. ఇంద్రియముల కతీంద్రియపుష్టి కలుగుతుంది, చిత్తము నిర్మలమై రసోజ్జ్వల మగుతుంది. హృదయాబ్జము వికసించి పరిమళములను విరజిమ్ముతుంది. ప్రేమ, సౌందర్యం, మాధుర్యం,

శోభ—ఈ నాలుగూ ఒక్కటే. హృదయం కరిగితే ప్రేమ. చూపులు సుళ్ళు తిరిగితే సౌందర్యము. రుచి మత్తెక్కితే మాధుర్యము. విలాసము అలంకారభూయిష్ఠమైతే శోభ. ఎట్టి భాగ్యభోగములోయి, రసిక శేఖరునివి? మానవుడు స్వరూపతః ఆనందపురుషుడు. లోకమును అందచందాలతో దిద్దగల విశ్వ శిల్పి. దుఃఖుల, దీనుల జీవనమును సహితము దయారసముతో నింపి, అమృతరసపానమును చేయించగల నిఖలరసామృత మూర్తి—శ్యామసుందర మదనమోహనుడు, మురళీధరుడు, గోపీవల్లభుడు, బృందావన విహారి—సోదరా, నీలోని ఈ లీలామానుషవిగ్రహము నుపాసించి రససిద్ధుడవు కమ్ము.

# సౌందర్యసృష్టి

సోదరా, సౌందర్యబోధకలిగితే, నీలో ఒక విధమైన రసజ్ఞత బయలుదేరి, నిన్ను నిరంతర జాగరితునిగా చేస్తుంది. నీలోనే కాకుండా, నీ పరిసరాల్లోగూడా ఏమాత్రం రసభంగమైన సందర్భం ఉన్నా, సహించక దానిని రసస్నిగ్ధంగ సంస్కరిస్తుంది

రసజ్ఞతలో తన్ను తాను పోషించుకొనే శక్తి ఉన్నది. ఎట్లా ఒక లత తన ఆశ్రియాన్నంతా అల్లుకొని, పెనవేసుకుపోతుందో, అట్లే రసజ్ఞతకూడా నీ జీవితాన్ని, నీ ఇరుగు పొరుగును ఆవరించి, తన సౌందర్యరాజ్యాన్ని విస్తరింపజేసుకొంటుంది.

ఒక వ్యాప్తిలోనేకాదు దాని ప్రయాస. గంభీరతలో కూడా లోతు పాతులలోకి జొరుకొనిపోతుంది. ఆ రసపిపాసకు తనివితీరడమనేది లేదు—రసపానం చేసినకొద్దీ పిపాస హెచ్చుతుందేకాని తరగదు. రసపిపాస నీకు శ్రమా విసుగూ కలిగించేదికాదు. సౌందర్యాన్ని చూచినకొద్దీ చూస్తావు—గానాన్ని విన్నకొద్దీ వింటావు—మాధుర్యాన్ని గ్రోలినకొద్దీ గ్రోలుతావు—శిల్పాన్ని సృష్టించినకొద్దీ సృష్టిస్తావు. సౌందర్యం అనంతమైనది—దానికి అంతు అనేదిలేదు. మౌక్తికం నిరంతరం క్రొత్తక్రొత్త తళుకులను, కాంతులను ఈనుతున్నట్లుగ,

లావణ్యం అవిచ్ఛిన్నంగా క్రొత్తక్రొత్త శోభలను విర జిమ్ముతూ, నీ ఆనందాన్ని అపారంగా చేస్తూవుంటుంది. అందు కనే A thing of beauty is a joy for ever అన్నాడు ఒక ఆంగ్లకవి.

ప్రకృతి ఎప్పటికైనా ప్రాతగిలుతుందా? ప్రతి సూర్యో దయమూ క్రొత్త ప్రభాపటలి. ప్రతిచంద్రికా పులకిత యామిని. వసంతఋతు సమాగమానికి, మోడువడిన చెట్టు కూడ ఎట్లా చిగిర్చి పుష్పించి, నూతనవేషం ధరిస్తుందో చూడు ఆనందరస సముద్భూతమైన ప్రకృతి నవనవోన్మేషశాలిని కాకుండా ఎట్లా ఉంటుంది ? నీలో సౌందర్యబోధ కలగాలే కాని, అది నిన్ను ప్రపంచంతో ఐక్యంచేసి, సామరస్యం కలి గించే వరకూ ఊరుకోదు. లోకాన్ని ముట్టుకుంటే, నీ సౌందర్యం మాసిపోతుందేమోనని భయపడకు. ఆ భయంతో నీలో నీవు ముడుచుకొనిపోయావా, నీ లోని రసజ్ఞత కాస్తా ఆరిపోయి, నీ జీవితం మరుభూమి అయి ఊరుకొంటుంది.

లోకాన్ని స్పృశించిన మాత్రాన నీ శౌచం మైలపడే టట్టయితే, నీ శౌచంలో సత్తువలేదన్నమాట. నీ పరిసరా న్నంతా అశుచిగా ఉంచుకొంటే నీ శౌచంమాత్రం ఎంత కాలం నిలుస్తుంది ? నిన్ను, నీ జీవితాన్ని, నీ పరిసరాన్ని శుచిగ జేసుకోగల్గితేనే, నీ శౌచం సంరక్షింపబడుతుందికాని, బయట గాలిసోకకుండా దానిచుట్టూ మడిబట్ట కట్టితేకాదు.

నీ జీవితం ఒక సౌందర్య దీపికయై లోకాన్ని కళా జ్యోత్స్నతో నింపినకొద్దీ సమస్త వస్తుజాలము నీ చుట్టునుజేరి నీతో రాసక్రీడ సలుపుతుంది. విశ్వైక్యతకు ఆత్మోపలబ్ధికి సౌందర్యబోధకంటె సుఖసాధనము మరియొకటి లేదు.

# సాధకుని స్వాతిశయం

సోదరా నీ వింకా సాధకుడవేసుమీ-నీవు నాలుగు వేదాంతపు ముక్కలు నోటపట్టినంతమాత్రాన సిద్ధుడవైనట్లు తలంచక-అది చాల మోసము.

సాధకుని ముఖ్యంగా చెరిపేదేమిటో తెలుసునా ? అజ్ఞానం కాదు. హృదయదౌర్బల్యమూ కాదు. ఆత్మవంచనము-అనగా నిన్ను నీవు మోసం చేసుకోవడం.

చాలమంది సాధకులను ముందుగ భంగపరిచే దిదే - ఆత్మవంచనము. ఆత్మవంచనం స్వాతిశయాన్ని పెంచి, ముందుకు బోర్లదోస్తుంది. దానితో పతనం నిశ్చయం.

ధర్మగ్రంథాలెన్నో పఠిస్తావు - ఎన్నో ప్రమాణవాక్యాలను కంఠస్థం చేసుకొంటావు. అంతటితో నీవుపండితుడవైనట్లు గురూపదేశాలు మొదలు పెట్టుతావు.

నీవు కాషాయాంబరాలు ధరించు, ధరించకపో. నీ వితరులకంటె పవిత్రుడవైనట్లు భ్రమించావా, నీలో జ్ఞానదీపం ఆరిపోయిందన్నమాటే. గర్వం పతనహేతువు.

విద్యత్తును సంపాదించడం ఒక కష్టంలోనిదికాదు - వాక్యార్థాలు వ్యాఖ్యానాలుచేసే నిపుణతను సంపాదించవచ్చు. వచో విలాసంకూడా నీవు అమరిందా, అమాయకపుజనం నీ చుట్టూ జేరి ప్రణామాలుచేస్తూ పూజలు మొదలుపెట్టుతారు. ఎట్టి వంచనమోయి సోదరా !

నిజమైన జ్ఞాని ఇట్లా జాకా ఊదుకోడు. బయటకు జ్ఞానివలెనే గనబడడు. స్వాతిశయం పెరుగుతుందనేభయంతో వినయ సంపన్నుడై ఉంటాడు, వినయం సాధకుని సహజ శీలం.

నీ లక్ష్యమెక్కడ? నీ వెక్కడ ? అది చుక్కల్లోఉంది – నీవో? మట్టిలో ఉన్నావు - ఆచుక్క నీకంటిలో అప్పుడప్పుడు మినుకు మినుకు మన్నంతమాత్రాన, తారాపథంలోకి వెళ్ళినట్లే ఎంచుకొంటావా ?

నీవు రాత్రిళ్ళు నిదురకుబోయేటప్పుడు ఆత్మ పరీక్షచేసుకొంటూ ఉండు—నీ దినచర్య—బాహ్యాచేష్టలనే కాదు—నీ గూఢ ఆలోచనలను, నీ రహస్య సంకల్పాలను, లోపల దాగుమూతలాడుతూండే వాంఛలను బయటకు లాగి, పరిశీలించుకో,

అప్పుడు తెలుస్తుంది - నీవు సత్యానికి, శివానికి, సుంద రానికి ఎంతదూరంలో, ఎట్టి చీకటిమరుగుల్లో పడియున్నదీ నీకే బోధ అగుతుంది. సాధనమార్గం వైకుంఠపాళీవంటి ఆట. నిచ్చెన ఎక్కుతూ ఉంటావు - పదిమెట్లెక్కావు. ఇంతలో ఒక పాము కాటువేసి, నిన్నమాంతంగా మొదట్లోకి తీసుకు వస్తుంది. సాధన దినదినగండం. కఠోరమైన తపశ్చర్య - అసి ధారావ్రతం.

స్వాతిశయం కూడదంటే, అసలు ఉత్సాహామే ఉండ కూడదని కాదు. కృపణత్వం ఉత్సాహాన్ని మందగింపజేస్తుంది. స్వాతిశయం ఉత్సాహాన్ని క్రియాశూన్యంగా జేస్తుంది. వినయ శౌశీల్యములతో గూడిన ఉత్సాహశక్తే నీ సాధనను సఫల పరుస్తుంది.

# లక్ష్య ప్రేరణ

సోదరా, నీ లక్ష్యం నీకు చాలాదూరంలో వున్నదని నిరుత్సాహ పడకుము. నీకూ, నీ లక్ష్యానికి చాల ఎడమున్నట్లు బయటకు కనబడుతున్నదే కాని, అది నిజంకాదు. లక్ష్యమనేది నీకు విజాతీయమైన బాహ్యావస్తువైతే, దానిని నీ వెన్నడూ ఏమి చేసినా పొందలేవు నీవు పొందదగినది, పొందగలిగినది, ఎప్పటికైనా పొందకతీరనిదీ - నీలోనిదే, నీ సుస్వరూపమే, నీ ఆత్మవస్తువే అని బాగా హృదయస్థం చేసుకో.

బీజానికి వృక్షానికి ఎట్టి సంబంధమో నీకు, నీ లక్ష్యానికి అట్టి సంబంధమున్నది. వృక్షము బీజానికి భిన్నముకాదు. ఏది బీజంలో గర్భితంగా అప్రకటితంగా ఉన్నదో అదే వృక్షంగా అభివ్యక్తమైనదే కాని మరియొకటి కాదు.

అట్లాగే నీ లక్ష్యము కూడాను. సత్యం-శివం-సుందరం నీ ప్రాప్యమంటే ఏమిటి? అదే నీలో ప్రస్తుతం బీజరూపంలో అనభివ్యక్తంగా ఉన్నదన్న మాట. నీ ఎరుకలోకి దానిని వ్యక్త పరచుకొనే ప్రయత్నమే నీ సాధన సామగ్రి అంతాను.

బీజం స్థాణువువలె నిద్రపోతున్నదనుకోక. అది మేలుకొనే ఉన్నది. అది వ్యక్తంకావడానికి. పరిణతి పొందడానికి నిన్ను నిరంతరం తొందరపెట్టుతూనే ఉన్నది. ఎట్లా?

నీవు వెలుగు కోరుతున్నావన్నా, శక్తి నభిలషిస్తున్నావన్నా, సుఖంకోసం పరితపిస్తున్నావన్నా నీ లక్ష్యంయొక్క ప్రబోధంచేతనే.

సత్యం బయటపడడానికి నీవు వెలుగు నభిలషించేటట్టు పురికొల్పుతున్నది. శివమే నిన్ను శక్తి నర్థించేటట్టు చేస్తున్నది. సుందరమే నిన్ను సుఖపిపాసినిగ కలవరపెట్టుతున్నది.

లక్ష్యము నీకు రెండు విధాల సహాయంచేస్తున్న దన్నమాట. దూరంగ ఉన్నట్లుండి నిన్ను ఊర్ధ్వముఖంగా త్రిప్పి, తనవైపుకు ఆకర్షిస్తున్నది. అదే నీలోపల అంతర్గతంగా ఉండి వెనుకనుండి తోస్తున్నది. నీ వెప్పుడూ ఊటీ ప్రయాణం చేయలేదా ? ఊటీ రైలుకు రెండు ఇంజినులుంటాయి. ఒకటి ముందుండి కొండపైకి ఈడ్చుకుపోతుంది. ఇంకొక ఇంజిను వెనుకనుండి పైకితోస్తూ ఉంటుంది. అట్లాగే నీ లక్ష్యమూను. ఆదర్శంగా నిన్ను దూరంనుండి ఆకర్షిస్తున్నది, బీజంగా లోపల నుండి ఉద్దీపన చేస్తున్నది. ఏది లక్ష్యంలో ఉన్నదో అదే బీజంలోనూ ఉన్నది.

నీవు చేయవలసిన దేమీ లేదు - బయటి ఆహ్వానాన్ని ఆలకిస్తూ ఉత్సాహం చెందుతూవుండు. లోపలి ప్రేరణను గమనిస్తూ దాని నడ్డగించకుండా దారి విడుస్తూ ఉండు.

నీ లక్ష్యాన్ని నీవు నిజంగా పొందే ఉన్నావు - నీవు ఇప్పుడు క్రొత్తగా పొందేది కాదది. తెలుసుకోక పోవడంవల్ల అది నీకు లక్ష్యము. తెలుసుకొంటే అది నిత్యసిద్ధము - అందుకనే ఋషులు "విజిజ్ఞాసస్వ" అని వేదశిఖరంమీదనుండి శృంగధ్వని చేస్తున్నారు.

# సాధనమర్మం

సోదరా, నీవు కర్షకుడవే, సాధనాక్షేత్రంలో, కర్షకునివలె, నీవూ శ్రమపడితేకాని, నీకు సిద్ధికలుగదు.

కర్షకుడు తన చింతనానుభవంచేత కనిపెట్టిన రహస్య మేమిటి? విత్తనానికీ, నేలకూగల సజీవసంబంధం.

కర్షకుడు విత్తనం ప్రాణవంతమైనదో లేదో ముందుగ పరిశీలిస్తాడు. తదుపరి విత్తనం మొలకెత్తడానికి అనుగుణంగా నేల, నీరు, గాలి, సూర్యరశ్మి మొదలగు పరిసరాలను కల్పిస్తాడు.

విత్తనం సరియైనది కాకపోతే, నేల నెంత పదును చేసినా ప్రయోజనంలేదు. కాని నీవు కర్షకునివలె విత్తనాన్ని ఎచ్చటనుండో వెదకి తీసుకొని రానక్కరలేదు—విత్తనాలు నీలో స్వతస్సిద్ధంగా చైతన్యంగా ఉన్నాయి. నీవల్లా చేయవలసి నది తగిన దోహదం.

నీవుకోరే పంట ఏమిటి ? జ్ఞానం—శక్తి—సుఖం. ప్రతిజీవీ కోరేది ఈ మూడే. ఈ మూడు నీలో అంకురంగా

ఉన్నాయి. తగిన దోహదంచేస్తే, అవి వృద్ధియగుతాయనే నమ్మకం నీలో లేకపోతే, నీ సాధనమంతా వ్యర్థం—విశ్వాసో ధర్మమూలం హి.

ఋషులలో ఏ అఖండజ్ఞానజ్యోతి వెలిగిందో, ధర్మ వీరులలో ఎట్టి ఆత్మశక్తి ప్రజ్వలించిందో, భక్తులలో ఎట్టి నిరతిశయానందం పొంగి పొరలినదో—ఆ జ్ఞానం, ఆ శక్తి, ఆ ఆనందం నీలోగూడా గర్భితంగా ఉన్నాయి. దీనికి దగిన పరిస రాలుకూడ నీ చుట్టును గతానుగతికంగా అమరిఉన్నాయి - వానిని ఉపయోగించుకోవడంలో ఉన్నది నీ సాధన అంతాను. శాస్త్రాలు, ధర్మగ్రంథాలు, గురుపీఠాలు, సత్కాలక్షేపాలు, అధ్యయనాలు, పూజలు మొదలైనవన్నీ నీలోని, జ్ఞాన, శక్తి, ప్రేమల నుద్దీపనచేసి, నిన్ను జ్ఞానినిగ, కర్మవీరునిగ, భక్తునిగ జేయడానికి సంఘం పరిసరాలను కల్పించివున్నది.

కర్షకునకు నేల ఎట్టిదో, సమష్టిజీవనం నీకు అట్టిదె.కాని నీవు కేవలం ఈ బాహ్య పరిసరాలపై ఆధారపడి లాభంలేదు - నీలో ఆంతరంగికసాధన మవశ్య మాచరణీయం.

నీవు జ్ఞాని కాదలచుకొన్నావా ? శాస్త్రాధ్యయన ముతోబాటు, మనన, ధ్యాన, ధారణ, నిదిధ్యాసాది స్వశక్తి పూర్వకములైన అంతరంగిక సాధనల నవలంబించక తీరదు.

నీవు కర్మవీరుడవు కాదలచుకొన్నావా - పరంపరాను గతములైన కార్యదీక్షలు, నియమములు, నీతులు, తంత్రి

ప్రయోగములు చాలవు. వానితోపాటు శమదమాది షట్క సంపత్తిని సాధించి, జితేంద్రియుడవు కావాలి.

నీవు భక్తుడవు కాదలచుకొన్నావా, అనుసృతముగ వచ్చే భక్తి గ్రంథాలను, సుందరమూర్తులను, లలితకళలను, భజనలను మాత్రం ఆశ్రయించిన లాభములేదు. వానితోబాటు నీలో శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములను అనుభవగతం చేసుకోవాలి. నీవు నీ స్వరూపాన్ని నీ శక్తిని ఆలంబనముగ జేసుకొని, నీ పరివేష్టనాన్ని ఉద్దీపనసామగ్రిగా స్వీకరించావా, నీ గర్భితశక్తులన్నీ - జ్ఞాన, కర్మ, ప్రేమలు పరిపక్వములై, నీ జీవనం జాహ్నవివలె ముక్తిప్రదమగును.

# వ్యక్తిగతి విశిష్టత

సోదరా, నీకూ విశ్వానికీమధ్య ఒక అఖాతం ఉన్నట్లుగ భావిస్తూ ఉన్నావా, నీలో నీవు కుష్కించి కృశించిపోవడం తటస్థిస్తుంది.

విశ్వంలో ఏదీ విడిగలేదు - అచేతనప్రపంచంలో కూడా వస్తువుకు వస్తువుకూ మధ్య ఆదానప్రదాన (Exchange of Force) లీల నిరంతరం జరుగుతూనే ఉన్నది,

కాని ఈ లీల ఎల్లరకు ఒకటేరీతిగ వుండదు - ఎవరి లీల వారిదే—నీవు లోతుగ తరచిచూస్తే. ఎల్లరకు సమానంగా జరిగే విశేషలీలా ఉన్నమాట నిశ్చయమే. కాని ప్రత్యేకంగా నీలో జరిగే విశేషలీలా ఉన్నది. నిన్ను నీవు తెలుసుకోవడమంటే, నీలోఉండే శుద్ధచైతన్యాన్ని తెలుసుకోవడమే కాదు.

శుద్ధచైతన్యం నీలో ప్రత్యేకమైన ఉపాధులను, చిత్తస్రోతమును, ప్రవణతను, స్వభావస్వధర్మాలను కల్పించుకొని, నిన్ను విశ్వం మధ్య నిలిపి ఉంచింది.

ఆ శుద్ధచైతన్యం నీలో ఎట్టి విశిష్ట లక్షణములతో విరాజిల్లుతున్నదో, నీకూ విశ్వానికీ మధ్య ప్రత్యేకంగా ఎట్టి ఆదానప్రదానలీల జరుగుతున్నదో తెలుసుకొంటేనేకాని, నీజీవస్వరూపం నీకు బోధపడి, నీ సాధన సామగ్రిని సమకూర్చుకోలేవు.

శ్రీకృష్ణపరమాత్ముడు ఎల్లరగోపికలకూ వల్లభుడే కాని ఆ పరమాత్ముడు ఎల్లరతోనూ ఒకటే విధంగా క్రీడిస్తున్నాడా?

ఆయా గోపికలయొక్క లక్షణాలనుబట్టి, ఆయావిధంగా సమీపించి క్రీడిస్తున్నాడు. అట్లాగే గోపికలెల్లరూ పరమాత్ముని ఒకటే విధంగా చూచి ఆనందించడంలేదు.

ఆ పరమాత్ముడు తరుచు ఏ హావభావములతో ఎట్టి నాట్యవిలాసంతో తమను సమీపిస్తున్నదీ తెలుసుకొని, వాని కనుగుణంగానే పరమాత్ముని సమీపిస్తున్నారు.

పరమాత్ముని లీలావిలాసము అనంతములంటే ఏమిటి ? అనంతకోటి జీవరాసులతోను అనంతవిధాల అనంతరూపాలలో క్రీడించగల్గే నటనాచతురుడు కనుకనే అతడు జగన్నాటక సూత్రధారుడను బిరుదమును బొందియున్నాడు.

ఈ నాటకరంగంలో, ఆ సూత్రధారుడు నీకు ప్రత్యేకమైన భూమికనిచ్చి నిన్నెట్లా ఆడిస్తున్నదీ–నీ అనుభవం ద్వారా అవగతం చేసుకోలేకపోతే నీ సాధన ఇంకా ప్రారంభం కాలేదన్నమాట.

ఎప్పుడు విశ్వశక్తి సర్వగతమే కాకుండా నీలో ప్రత్యేకంగా గుడి గట్టుకొని ఎట్టిపూజలను గోరుతూ నీ యిష్టదైవము కానున్నదీ ప్రత్యక్షమైనప్పుడే నీసాధన వికాసం పొందగలదు.

నీ జీవనం త్రివేణీసంగమం వంటిది – ఒక స్రవంతి నీది, రెండవది, విశ్వానిది, మూడవది శుద్ధచైతన్యానిది. ఈ మూటి భేదాభేదములమధ్య నీ జీవనలీల విరాజిల్లుచున్నది. ఈ రహస్యానుభవమే నీ లక్ష్యసిద్ధి.

గ్రంగా చూస్తున్నదో, నిన్నొకరినిగూడ అంత సంపూర్ణంగా వేయి కళ్ళతోనూ కనిపెట్టుతూనే ఉన్నది.

విశ్వమంటే వస్తువుల కూడిక కాదు—జీవుల లెక్క కాదు. ఏది ప్రతి అణువునందూ, ప్రతి జీవియందూ, సంపూర్ణమో, అనంతమో, సర్వమునందు కూడా అంత సంపూర్ణము-అనంతము. నీవు విశ్వాన్ని లక్ష్యపెట్టకపోయినా, విశ్వంలో కెల్లా నీవొక్కడవే అయినట్లు, విశ్వం నిన్ను సంపూర్ణంగా లక్ష్యపెట్టుతూ, నీ భవితవ్యాన్ని సమానాదరణతో నిరూపిస్తూనే ఉన్నది.

ఈ విశ్వంలో ప్రతి అణువుకూ, ప్రతి జీవికి స్థానమున్నది. ప్రాముఖ్యమున్నది. లోకమనుకొనే హెచ్చుతగ్గులు, ఆధిక్యన్యూనతలు కృత్రిమములు. విశ్వదృష్టిలో సర్వము సమానము. సమస్త ధర్మములు విశ్వపోషకములు. జగత్తుకు అగ్ని ఎంత అవసరమో జలం, వాయువు అంత అవసరము-అయినా వాని ధర్మాలువేరు.

లోకం చరిచే చప్పట్లనుబట్టి ప్రాముఖ్యతలను నీవు నిర్ణయించకు. నీవు విశ్వాన్ని ఎంతవరకు ఉపలక్షించి, ఎట్టి బలిదానము చేయగల్గుతున్నావో—నీ ప్రాముఖ్యము అంత ప్రమాణాన పెరుగుతూ ఉంటుంది. ఈ లోకమే విశ్వమని భ్రమించక. ఈ లోకం నిన్నాదరించక పోవుగాక. నిన్ను బహిష్కరించి పీడించినను పీడించు గాక. కాని విశ్వజనని నిన్ను

విడనాడదు. తల్లి అంకమే నీ రంగిభూమి. ఆమె ప్రేమబాహువులనుండి నిన్నెవరు తప్పించగలరు ? లోకం గతానుగతికంగా నిర్దేశించే కొలతలను, ప్రమాణాలనుబట్టి, నీ జీవనానికి విలువకట్టుకోవడం సరికాదు. నీ ప్రాముఖ్యం నీది, నీ భవితవ్యం నీది. నీ వొక్కడవు లోపించినా, విశ్వమే తారుమారై ఊరుకొంటుంది. ఇక నీ ప్రాముఖ్యం ఎట్టిదో ఊహించుకో. విశ్వజనని సర్వాంగసుందరి, నీవు తల్లి అంగములలో ఒక అంగమే అగుగాక. ఆ ఒక్క అంగం లేకపోతే, నీ తల్లి వికలాంగి, కురూపి అయినట్లు కాదా ? నీ తల్లి పాదనఖములలో నీ వొక నఖాగ్రమై, ఆ నఖం నిండుదీప్తితో ప్రకాశిస్తే, తల్లి ఎంత ఆనందపడుతుంది ? వెలుగులు ఎంతమంది దుఃఖులకు శాంతి దాయకములగునో !

# నానాత్వంలోని మాధుర్యం

సోదరా, విశ్వముయొక్క నానాత్వము, మూలంలో నున్న ఐక్యమును మరుగుపరుస్తున్నదనే తలంపుతో, ఈ విశ్వాన్నుండి దూరం కావడానికి ఆలోచిస్తున్నావు. ఈ తలంపు సరియైనది కాదు సుమీ. నానాత్వం నిజంగా ఐక్యమును మరుగుపరచటంలేదు. పైగా దానిని శతకంఠాలతో ఉద్ఘాటిస్తున్నది. ఈ నానాత్వమే నీకు గోచరించకపోతే, ఐక్యముయొక్క సుస్వరూపాన్ని నీవు సరిగ అవగతం చేసుకోలేవు. ఐక్యము— నానాత్వం—ఈ రెండూ ఒక వస్తువుయొక్క లక్షణాలే. లక్షణాలను వేరుగ పేర్కొంటున్నాము కనుక, వస్తువుకూడా లక్షణాలనుబట్టి భిన్నం అనుకొంటున్నావు.

ఇట్లా ఒకమారు తలయెత్తిచూడు—నీ ఎదుటనున్న పూవు ఒకటా? రెండా? మూడా ? ఒకటని ఎట్లా అంటావు ? నీకది ఒకటిగ ఎట్లా గోచరిస్తున్నది ? అది ఒకటికాదు. అయిదు అని నీ వెందుకు అనకూడదు ?

నీకు పూవు అనే జ్ఞానం ఎట్లా కలుగుతున్నది? కంటికి గుండ్రంగా, పచ్చగా గనబడుతున్నది. ముక్కుకు సుగంధంగా ఉన్నది. స్పర్శకు మృదువుగ ఉన్నది. రుచికి వగరుగ ఉన్నది.

చెవికి నిశ్శబ్దంగాఉన్నది. ఈ లక్షణాలన్నీ ఒక పుష్పానివే అని నీవు గ్రహించి అది ఒకటే పువ్వు అని అంటున్నావు.

కాబట్టి, భిన్న ఇంద్రియాలద్వారా అనుభవిస్తున్నా, ఆ శబ్దస్పర్శ రూపరసగంధములు ఒక వస్తువు ఇచ్చేవే అని సమీకరణ చేసుకోగల్గుతున్నావు.

ఒక వస్తువును ప్రేమించావంటే-ఒక్క చూపు చాలదు, ఒక్క అనుభవం చాలదు. దానిని ఎన్నో విధాలుగ ఎన్నో రూపాలుగ అనుభవిస్తేనేకాని నీకు సంతృప్తికలుగదు. తల్లి శిశువును తొట్టెలోపెట్టి చూస్తూ ఊరుకోకూడదూ? కాని ఊరుకోదు—ఆమె ఎడదలో వాత్సల్యం పొంగిన కొద్దీ, శిశువును ఒడిలోకి తీసుకొంటుంది-ముఖంపై చూపులను గురిపిస్తుంది. ఆ పొట్ట బుగ్గలపై ముద్దుల నొలికిస్తుంది. పలకరించి నవ్విస్తుంది, ఏడిస్తే ఓదారుస్తూ పాటలు పాడుతుంది.

విశ్వంలోని నానాత్వం కూడా ఇంతే. నీవు విశ్వజనని యొక్క బిడ్డవు. తల్లి ఇన్నివిధాల నీతో ఆడుకొంటూంటే, ఈ ఆటలు తల్లిని దూరంచేస్తున్నాయి అంటావా ?

ఆ తల్లే నీకు దేహమిచ్చి పాలిస్తున్నది. ప్రాణమొసగి పుష్టి నిస్తున్నది. మనస్సును మేల్కొల్పి చిన్నె వన్నెలతో కూడిన నీ క్రీడారంగాన్ని చూపుతోంది. నీకు బుద్ధినిచ్చి, జ్ఞాన మహిమను వెల్లడిపరుస్తున్నది. నీలో ప్రేమ నుబికించి సౌందర్య రసాన్ని చవులూర రుచి చూపుతోంది. నీకు శక్తిని ప్రసాదించి నీ ఆటలకు మురిసిపోతోంది. సోదరా, నానాత్వము తల్లి యొక్క సమృద్ధి, సంపద, ఐశ్వర్యము, విలాసము, నీ తల్లి యొక్క అఖండభాగ్య వితరణానికి పొంగిపోక, ఏ ఎడారికో పారిపోతానంటావా ?

# జ్ఞానం-ప్రత్యక్షం, పరోక్షం

సోదరా, వెలుగు వెలుగు అంటూంటే—నీ బుద్ధిగతమైన జ్ఞానమని అనుకున్నావా. పెద్ద పొరబాటులో పడ్డావన్న మాట.

బుద్ధిగతజ్ఞానం నిర్మలమైన జ్ఞానంకాదు. బుద్ధికూడా ఒక ఇంద్రియము—జడము—అద్దంద్వారా ప్రసరించే వెలుగు మసకగా ఉంటుంది కాని నిర్మలంగా ఉండదు.

నీ బుద్ధిలో ఎన్నో కుసంస్కారాలు, శాస్త్రాలు గూళ్లు కట్టుకొని ఉన్నాయి. అవి వెలుగును సరిగ ప్రసరించనీయవు. మన చదువుల మూలంగా మనం పరప్రత్యయనేయబుద్ధులం కావడం తటస్థిస్తున్నది. నీ వనుకుంటావు—శాస్త్రాలు నేర్చిన కొద్దీ, నీ మేధాశక్తి, పాండిత్యం, జ్ఞానం వృద్ధిపొందుతున్నవని. కాని నీ కవి బయటకు సంతృప్తి ఇచ్చినా, అంతరంగంలో నీ బుద్ధి సత్యానికి దూరమై పోతోందని తెలిసికో.

వైజ్ఞానికులు, ప్రకృతిపరిశోధకులు ఇంద్రియ ప్రత్యక్షం మీద ఆధారపడి, సత్యంయొక్క వాస్తవరూపాన్ని తెలుసుకొంటున్నట్లు నీ వనుకొంటున్నావు. అది వట్టిమాట.

సత్యం మారేదికాదు. అది నిత్యం, నిర్వికల్పం. కాని వైజ్ఞానికుల సిద్ధాంతాలు తరుచు మారుతూ ఉంటాయి. మారేది సత్యమెట్లా అవుతుంది ? వారిది ప్రత్యక్షజ్ఞానం అను

కొంటున్నావు కాని, వారిది నిజంగా పరోక్షజ్ఞానం. పరోక్షమైన అనుమాన ప్రమాణ పూర్వకమైన జ్ఞానం. ఈ రహస్యం వైజ్ఞానికులకు తెలియకపోలేదు. కనుకనే వారు తమ పరిశోధనలను విరమించరు.

బుద్ధి జల్లెడవంటిది. దాని రంధ్రాల్లోనుండి పొల్లుతో బాటు గింజలుకూడా జారిపోతూ ఉంటాయి. అందుకనే వైజ్ఞానికులు తిరిగి తిరిగి జల్లెడపడుతూ ఉంటారు.

బుద్ధి నెంత నిర్మలించేసినా, దాని మసగ వదలదు. అది సరాసరి చూడలేక, వక్రంగా నడుస్తూ ఉంటుంది. వారి నడకను బట్టి వారి సత్యభావనకూడా వక్రిస్తూ ఉంటుంది—సత్యంకోసం తడుముకోవడమన్న మాట సత్యాన్వేషణమంటే.

మన వేదఋషులు సత్యాన్ని "ఋతం" అని వర్ణించారు. ఋతం అంటే సరళంగా ఋజుపథంలో గోచరించేది అని అర్థం. బుద్ధికి గోచరించేది "ఋతం" కాదు. దాని వికృతం refraction వల్ల కలిగే వికారం.

బుద్ధిని అతిక్రమించగల్గినప్పుడే—నీ పాండిత్యాలను, శాస్త్ర సిద్ధాంతాలను, తర్కమీమాంసలను, నీ నిర్వచనాలను అతిక్రమించగల్గినప్పుడే–సత్యము ఋతమై ఆత్మజ్యోతిగ సాక్షాత్కార మగుతుంది. దానినే పెద్దలు అపరోక్షానుభూతి అంటారు. అది కలిగితే—అంతకు పూర్వము ఆవరణలుగడుండే ఇంద్రియాలు, మనస్సు, బుద్ధికూడా నిర్మలములై తేజోవంతములై, సర్వమూ వెలుగుగ మారుతుంది. అందుకనే "సత్యధర్మాయ దృష్టయే"—సత్యస్వరూపం సాక్షాత్కారంకోసం - నీ బుద్ధిపై మూతగ బడిఉన్న హిరణ్మయపాత్రను తొలగించుమని ఋషులు ప్రార్థించారు.

## అవాఙ్మానసం

సోదరా, బుద్ధిచూపు మసకగా ఉంటుందని, అసలు బుద్ధినే వదిలితే, ఆ మసక చూపుకూడా పోదూ ?

నిజమే బుద్ధిని దాటలేనంతకాలం స్వబుద్ధిమీద ఆధార పడి ఉండకతప్పదు. కాని బుద్ధికి గోచరించేది సత్యంయొక్క అంశం మాత్రమే అని తెలిసికొని ఉంటే, చిక్కుల్లో పడం.

సత్యాన్ని సమగ్రంగా చూడగలశక్తి బుద్ధికిలేదు. బాలు డెట్లా పద్యాన్ని పదచ్ఛేదంచేసుకొంటూ అన్వయం చేసు కొంటాడో, అట్లాగే బుద్ధికూడా సత్యాన్ని ముక్కలు ముక్కలు క్రింద చీల్చి, సత్యాన్ని అనుగమిస్తుంది. ఈ ముక్కలనైనా అది సరిగ కలుపుకోలేదు. ఈ ముక్కల్లో కొన్ని తార్కిక బుద్ధికి పరస్పరవిరుద్ధంగా కనబడతాయి. సమన్వయంకోసం కొన్నిటిని వదిలివేస్తాడు—మిగిలిన వాటితో ఒక నిర్వచనం చేస్తాడు. కాబట్టే లోకంలో ఇన్ని నిర్వచనాలు, ఇన్ని మతా లేర్పడి అన్యోన్యం వివాదకారణా లగుతున్నాయి.

సత్యం-అనిర్వచనీయం, అనిర్దేశ్యం, అవాఙ్మానసగోచరం అని శ్రుతు లొకమూల ఘోషిస్తున్నా, శ్రుతి ప్రమాణాన్ని నమ్మేవారే సత్యాన్ని తమనిర్వచనాల్లో బంధింప జూస్తున్నారు.

ఈ నిర్వచనాలన్నీ ఖండసత్యాలు-సత్యంయొక్క భిన్న దిక్కులు. పూర్ణసత్యం వీనిని మించినది - అన్నిటిని అంత ర్భూతం చేసుకోగలది. అది స్వరూపతః అఖండం-అపరిచ్ఛేద్యం. బుద్ధిమీద ఆధారపడి ఉండే పండితు లీ రహస్యాన్ని అవగతం చేసుకోక, నా నిర్వచనం, నా మతం, నా సిద్ధాంతం అంటూ అహమహమిక కనబరుస్తారు.

వివేకానంద స్వాములవారన్నారు-మానవు లెంతమంది ఉన్నారో, మతాలుకూడా అన్ని ఉన్నాయని - there are as many theologies as there are human faces. దీనినే రామకృష్ణ పరమహంసుల వారిట్లాచెప్పారు - అన్ని మతాలు ఖండసత్యాలని.

సత్యం పలుముఖాలు కలది. అది విశ్వతోముఖం. ఎవరి సంస్కారాన్నిబట్టి వారు తమ మతాన్ని నిర్ణయించుకొంటారు. అన్ని మతాలు చివరకు నదులన్నీ సాగరంలో కలియునట్లు పరమతత్వంలో ఇమిడేవే. అందుకనే అరవిందుడు సత్యాన్ని పలుద్వారాలుగల మహాప్రాసాదంతో బోల్చాడు. ఒక ద్వారం పెద్దది కావచ్చు. ఇంకొకద్వారం చిన్నదికావచ్చు. ఎంత ఇరుకు సందులో నుండిపోయినా తుదకు ఆ భవనాంతరాళంలోకి పోక తప్పదు. సత్యం అతీతదృష్ట్యా ఏకం - విశ్వదృష్ట్యా సర్వం.

# పార్థక్యం, ఐక్యం

సోదరా, మానవునిబుద్ధి పదునుగల శస్త్రజ్ఞుని కత్తి వంటిది. ఎట్టి గహన విషయాన్నయినా, భేదించి, అంగ ప్రత్యంగ పరిశీలనం చేయగలదు—బుద్ధి నిజంగా వజ్రభేది. బుద్ధి నిశితమైన కొద్దీ, భేదాల నెక్కువగ తరచి పరీక్షించడంలో ఆసక్తి మెండ గుతూ ఉంటుంది. సామాన్యధర్మాలతో తృప్తిపొందక—విశేష ధర్మాలను, ధర్మాల తారతమ్యాలను, విశిష్టలక్షణాలను వ్యవ చ్ఛేదం చేసుకొంటూ పోతుంది.

నేటి జడవైజ్ఞానికులు చూడండి. ఎన్ని కొత్తకొత్త శాస్త్రాలను శాఖోపశాఖలుగ విస్తరింపజేస్తున్నారంటారు? Specialisation – నేటి వైజ్ఞానిక సంపదయొక్క కీలకం. వస్తువులమధ్య పార్థక్యాన్ని పరిశీలించడంవల్ల, భౌతిక విజ్ఞానం అభివృద్ధి పొందుతున్నది. భౌతిక ప్రపంచంలోనేకాదు, ఈ బుద్ధి ఇట్లా వ్యవచ్ఛేదనం చేసేది. భావజగత్తులో ఈ అంగప్రత్యంగ పరిశీలనం మరింతగ విలసిల్లుతున్నది. మానవ వాఙ్మయం వర్గీ కరణాత్మకం కాదూ? వ్యాకరణం అంటే ఏమిటి? గణిత శాస్త్రంలో సహజలక్షణంగా ప్రవర్తిల్లే విభజనసూత్రమే మానవ విజ్ఞానాన్నంతా శాసిస్తున్నదని కొంచెం పరిశీలిస్తే బోధపడు

తుంది. అందుకనే మానవుని బుద్ధిని Divisive consciousness అని ఒక తత్వజ్ఞుడు నిరూపించాడు.

ఈ భేదజ్ఞానాన్ని అనుభూతం చేసుకొంటున్నప్పుడు పార్థక్యం ఐక్యజ్ఞానానికి సాధనభూతమగుతుంది. శబ్దస్పర్శ రూపరసగంధాల్లో ఒక్క శబ్దాన్ని అనుభవగతం చేసుకొనే నాదోపాసకులను చూడండి.

నాదసుధారస నిమగ్నుడైన గాయకునకు నాదమే సర్వమై, విశ్వరూపంబాల్చినా, నాదంద్వారా బ్రహ్మ స్పర్శ సుఖాన్ననుభవిస్తాడు. అట్లాగే రూపోపాసకుడు సర్వం రూపాత్మకమైనకొద్దీ రూపాన్ని అమృతభాండంగా చిద్విలాసంగా చేసుకొంటాడు. అంశజ్ఞానం అనుభవంలో అంశంగా నిలవదు. నదులన్నీ మహాసాగరంలో కలియునట్లు ప్రతిఅంశము పూర్ణత్వానికి దారితీస్తుంది.

గౌతమశాక్యముని లోకంయొక్క దుఃఖంలో లీనమై కరుణ రసామృతాన్ని గ్రోలాడు. ఏసునాధుడు జనకజన్య భావంద్వారా, వాత్సల్య రసానుభూతిని పొందాడు. గౌరాంగ స్వామి మధుర మహాభావాల్లో ఈదుకొంటూపోయి, ఆనంద వారిధిలో కరిగిపోయినాడు. బుద్ధి కల్పించుకొనే అంశజ్ఞానానికి పరమార్థమున్నది. అనేకం ఏకంలోకి, పార్థక్యం ఐక్యంలోకి, భేదం అభేదంలోకి, సాకారం నిరాకారంలోకి, అవిద్య విద్యలోకి, చీకటి వెలుగులోకి తీసుకొనిపోయే ద్వారాలుకాని అవరోధాలు కావు—ఈ అంశలు.

ఎందుచేత ? జ్ఞానం నిజంగా విద్యావిద్యలకతీతం—అనగా జ్ఞానానికి విద్యా విద్యలు రెండూ అంగములు, అంతర్భూతములు. అవిద్యయా మృత్యుంతీర్త్వా, విద్యయా అమృతమశ్నుతే—అనలేదూ మన బ్రహ్మజ్ఞానులు ?

# సాంతంలో అనంతం

సోదరా, బుద్ధి స్ఫటికం వంటిది. దానిని నిర్మలం చేసినకొద్దీ స్వచ్ఛమగుతుంది. ఎంత స్వచ్ఛమయినా, తెల్లకిరణాన్ని సప్తవర్ణములుగ చీల్చే గుణం దానికిపోదు.

అట్లాగే నీ చిత్తం ఎంత స్వచ్ఛమైతే ఏమి, దానికి భేద జ్ఞానం వదలదు. భేదాలను కనిపెట్టడంలోనే ఉన్నది దాని శబలతా, విలాసమూను.

ఈ భేదజ్ఞానమే లేకపోతే, సృష్టేలేదు. "సకామో అజాయత బహుస్యాం ప్రజాయేయేతి" అని కాదూ మన ఋషులు సృష్టి రహస్యాన్ని ఉద్ఘాటించింది ?

తన్నుతాను బహురూపాల్లో చూచుకోవడంలోనే ఆత్మ తన శక్తిని తాను కొలుచుకొంటున్నదన్నమాట.

అదే మాయాశక్తి. మాయ అంటే ఆళీక కల్పనకాదు. "మా" ధాతువుకు కొల్చుకోవడం అని అర్థం. మానం, మాత అనే పదాలులేవు ? అమేయమైన దానిని కొల్చుకోవడమేమిటి అని శంకా ? ఆ కొల్చుకోవడానికి ఒక అంతమనేది ఉంటే నీ శంక బాధిస్తుంది. దీనికి తరుగులు విరుగులు లేవు. అది అక్షయం, అనంతం. ఆత్మయొక్కమానం బ్రహ్మమానం. దేశ కాలాలను మ్రింగివేసేమానం. తన్ను తాను అతిక్రమించే

మానం. అందుకనే అది "విభక్తమివ" విభక్తంవలె కనబడుతుంది, కాని నిజంగా అవిభక్తమన్నాడు గీతాకారుడు. మన బుద్ధికి రహస్యం అగమ్యంగా ఉండవచ్చు. కాని ఇది ప్రత్యక్షంగా గోచరించే సత్యంకూడాను.

ప్రకృతిలో ఏ అణువు విడిగ, ఇతర అణువులతో సంబంధంలేకుండా ఉంటున్నది? ఏ అణువు కా అణువైనా, అన్ని అణువులు ఒకదానిచుట్టూ ఒకటి తిరుగుతూ, కలిసిమెలిసి క్రీడలో పాల్గొంటున్నాయి.

ఇంకా లోతుగ చూస్తే ప్రతిఅణువూ ప్రక్క అణువును గుర్తిస్తూ ఒక ఆటలో, ఒకపాటలో తెలిసి పాల్గొంటున్నాయా అని తోస్తుంది. ప్రతి అణువు సర్వంలో ఉండడమేకాదు, సర్వమూ ప్రతి అణువులోను ఇమిడి ఉండకపోతే, ఈ కలయిక సంభవంకాదు. ఎక్కడ నానాత్వమున్నదో, దానిమూలంలో ఏకత్వం లేకపోతే, నానాత్వం ఒక కూటంలో, ఒక విశ్వంగా. ఒక ప్రణాలికలో ఎట్లా ఇమిడివుంటుంది ?

నీ బుద్ధి భేదజ్ఞానంలో వ్యవహరిస్తున్నదంటే, ఆ జ్ఞానం వెనుక అభేదజ్ఞానం కూడా అవినాభావంగా ప్రకాశిస్తున్నదన్న మాట. నీ అంతరంగంలో అభేదజ్ఞానం ప్రకాశించకపోతే, భేదజ్ఞానంకూడా నీకు అనుభూతమయ్యేదికాదు.

కాబట్టి భేదజ్ఞానం అభేదాన్ని నశింపజేయటం లేదు. అభేదము భేదాన్ని నిరాకరించటంలేదు. భేదాభేదములు రెండూ సత్యముయొక్క భిన్నదిక్కులు కావడంవల్ల, ఒకదానిని విడిచి ఇంకొకటిలేదు. సత్యం భేదాభేదములను సమంగా అంతర్భుక్తం చేసుకొనే మహాభావం.

# సంశయ విచ్ఛిత్తి

సోదరా, ఇంకా ఎంతకాలం సంశయాల్లోపడి కొట్టుకోవడం ? సంశయాత్మా వినశ్యతి అని పెద్దలవాక్యం జ్ఞాపకం తెచ్చుకో.

ఆరంభదశలో సంశయాలు కలగడం మంచిదే. సంశయమే కలగకపోతే తత్త్వవిచారమే లేదు. సంగతి—విరోధం—సమన్వయమన్నారు నైయాయికులు. దీనినే (Thesis—Antithesis—Synthesis) అన్నాడు హెగెల్ పండితుడు. అసలు బుద్ధి ముందుకుసాగించే నడకే అది. ముందు నీ బుద్ధి ఒక అంశాన్ని ముట్టుకొంటుంది. అది సంగతి. కాని కొంతకాలానికి దానికి భిన్నమైన అంశము కంటబడుతుంది. అంతటితో నీ బుద్ధి విరోధంలో చిక్కుకొని అది సత్యమా ఇది సత్యమా అని ఆందోళనపడుతుంది.

మనకందరకు భూమి కదలనట్లే కనబడుతుంది. కాని ప్రకృతివైజ్ఞానికులంటారు భూమి తనచుట్టూ తిరుగుతూ ఉండడమేకాకుండా, సూర్యుడు చుట్టూకూడా తిరుగుతున్నదని.

దీనిలో దేనిని స్వీకరించాలో చెప్పు ? మన వ్యావహారికానుభవం భూమి స్థిరంగా ఉన్నదనే - Terra firma అన్నది ఆంగ్లభాష. కాని భూమి తిరుగుతున్నట్లు నమ్మితేనే కాని, ఉదయాస్తమయాలు, ఋతుక్రమాలు, గ్రహణాలు, గ్రహతారల

యాత్రలు బోధపడవు. ఒక అనుభవం అది. ఇంకొక అనుభవం ఇది.

ఎంత వైజ్ఞానికుడైనా, వ్యవహారంలో భూమి నిలకడగా ఉన్నట్లే ప్రవర్తిస్తాడు. పంచాంగ గణితాల్లో మాత్రం భూమి బొంగరంలాగ తిరుగుచున్నట్లు ప్రత్యక్షపరచుకొంటూ ఉంటాడు.

కాబట్టి వైజ్ఞానికుడు సంశయాత్ముడు కాదు. రెంటినీ అంగీకరించి, వానికి సమన్వయం కుదుర్చుకొంటాడు. రైలులో ప్రయాణించేటప్పుడు రైలు కదులుతున్నట్లే ఉండదు. బయట ఉన్న చెట్లు కొండలు వెనక్కు పరుగెత్తుకు పోతున్నట్లు మాత్రం కనబడుతుంది. ఈ దృష్టాంతంతో నిన్ను సమాధాన పరుస్తాడు వైజ్ఞానికుడు.

నీకు బయట కనబడేదృశ్యాలు నిజంగా స్వతంత్ర దృశ్యాలు కావు అన్ని నీ అనుభవాలు. నిన్ను విడిచి అవి లేవు. జ్ఞానంలోనే ఉన్నది జ్ఞేయం. విషయి ఆధారం. విషయం ఆధేయం. ఈ రెండూ సత్యంయొక్క భిన్నదిక్కులు.

భేదాభేదాలు కూడా ఇట్టి అనుభవాలే. వ్యావహారిక జగత్తులో భేదం పారమార్థికంగా అభేదం. ఇహ పరములు రెండూ నీ అనుభవాలే. నీలో ఈ రెండు అనుభవాలు సమన్వయమైనప్పుడే నీ జ్ఞానం పక్వమై శాంత్యానందముల కాకరమగుతున్నది.

ఎంత సిద్ధుడైనా వ్యవహారంలో భేదజ్ఞానాన్ని అనుసరించక తప్పదు. కాని భేదం అభేదదృష్టికి విరుద్ధంకాక, అభేదంయొక్క విలాసంగా, క్రీడగా, నాట్యంగా గోచరించి రసానుభవం కలిగిస్తుంది. రసంలో భేదాభేదాలు తరంగిత సాగరంలో వలె ఒక్కటైపోతాయి. ఇక శుష్కతర్కాలలో చిక్కుకోక, రసానుభూతి ద్వారా జ్ఞానసిద్ధిని పొందు.

# ఊర్ధ్వ గతి

సోదరా, ఎందుకీ తటాపటాయింపు ? నేలమీద ఎన్ని పరుగులైనా తీయగలవు, ఎన్నిగంతులైనా వేయగలవు. కాని భావ ప్రపంచంలోకి వచ్చేసరికి, గాలి పీల్పలేనట్లు ఉక్కిరిబిక్కిరై భయగ్రస్తుడవగుతావు.

నీవు మనుష్యుడవు, మనోమయ పురుషుడవు. భావ ప్రపంచంలో స్వేచ్ఛగ ఆనందంగ విహరించడానికి కూడా, నీకు ఊహాలనే రెక్కలిచ్చింది ? నీవును విహంగమవై భావశిఖరాలను దాటి ఎగరవేమి ?

భావజగత్తు అయథార్థము, కాల్పనికము అని తలంపకుము భౌతికశక్తికంటె మనోమయశక్తి వేయిరెట్లు బలవత్తరమైనది. వైశాల్యంలో ఎన్నిరెట్లు విస్తీర్ణమో చెప్పనలవికాదు. దేశకాలముల అంచులనుగూడ దాటిపోగలదు.

ప్రాణశక్తి భౌతిక జగత్తునుండి ఉద్భూతమైనను అచేతనము నంతను శాసించి ఆధిపత్యమును ప్రతిష్ఠించుకొనుచున్నది. ప్రాణశక్తిని నీవు ప్రత్యక్షముగ చూచుటలేదా? అయ్యది అచేతనమును సహితము చేతనముగ మార్చివేయగల్గుచున్నది.

అట్లే మానసికశక్తి ప్రాణముకంటె గూడ అధికమై ప్రబలమై, విస్తీర్ణమై తన అధిరాజ్యాన్ని స్థాపించుకొంటున్నది.

నీలో బుద్ధి ప్రస్తుతము సంకుచితమై, దుర్బలమై చంచలమై నిన్ను భయవిహ్వాలునిగ చేయుటచేత భావప్రపంచంలోకి అడుగిడడానికి జంకుతున్నావు.

నీకున్న బుద్ధిని కాస్త, నేలమీద సాముకే ఉపయోగించగల్గుచున్నావు కాని, భూమిపై ఉన్న ఊర్ధ్వలోకాలకు పోవడానికి ప్రయోగించుకోలేక నీ జీవితాన్ని కూపస్థమండూకంలాగు తుద్రపరచుకొంటున్నావు. ఎంత విచారకరము ?

సోదరా, బుద్ధి వ్యవసాయానికి గడంగుము. దానిని రాపిడి చేసినకొద్దీ అయ్యది విజ్ఞానమై, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి త్రివేణివలె తరంగితపరచుచూ నిన్ను మహాలోకమునకు జేర్పగలదు.

నీ జ్ఞానశక్తి సత్యలోక ద్వారాలను తెరచి, ఆత్మజ్యోతి నుండి వెలువడు రోచిస్సులను గోచరింపజేయును. క్రియాశక్తి నిన్ను కర్మవీరునిగ నొనర్చి, తపోలోకమునకు గొంపోవును. ఇచ్ఛాశక్తి నిన్ను ప్రేమమయునిగ నుల్లసింపజేసి జనలోకమున ఆనందరస నిమగ్నునిగ గావించును.

లెమ్ము-ఊర్ధ్వలోకాలన్నీ ద్వారాలను తెరచుకొని నీ రాక కెదురు చూచుచున్నవి. మార్గమధ్యమున నిలచిపోకుము. నీ దేహము, నీ ప్రాణము, మనస్సు నిన్ను వదలిపోవునేమో యని బాధపడుచున్నావు—భయమువలదు. అవికూడ నీకు సోదర యాత్రికులై, నీతోబాటు అమృతమును గ్రోలి, అమరత్వమును పొందగోరుచున్నవి.

# ఆత్మ ప్రతిబింబం

సోదరా, భావజగత్తులో ప్రవేశించడమంటే, ఈ భూమిని వదిలి, గాలిలో ఎగరడంకాదు.

దేహం, ప్రాణం, మనస్సు వేరువేరుగ పొరలు పొరలు వలె, అంటీ అంటకుండా ఉన్నాయని అనుకొంటున్నావేమో? అట్లా లేవు.

ఈ మూటిని మనం విడదీసి చూచుకోవడంవల్ల మనకు వాని మధ్య అంతరం, పార్థక్యం కనబడుతున్నది. సృష్టిలో ఏ వస్తువుకూడా ఎడముగా ఒంటరిగ ఉండదు.

అంతా ఒక్కటే వస్తువు ఆవస్తువే భిన్నరీతులుగ, భిన్న అవస్థలలో, తన ఆంతర్యాన్ని వ్యక్తపరచుకొంటున్నది.

నర్తకిని జూడు—ఎట్లా, ఎన్నివిధాల ఎన్నిరూపాలలో తన హావభావాలను ప్రకాశింపజేసి కొంటుందో! పాదాలతో లయవేస్తూ, చిందులు త్రొక్కుతుంది. హస్తాలతో ముద్రలు ప్రదర్శిస్తుంది. కంఠంతో గీతాన్ని పాడుతుంది. నేత్రాలతో చూపులను కురిపిస్తుంది. ఈ చేష్టలన్నీ ఒక్క నర్తకివి కావా?

చేష్టలను విడివిడిగ చూచి, నర్తకికూడా ఒకటికాక, వేరువేరు నటులని భావించడం ఎంత పొరబాటు?

జగత్తుకూడా ఒకటే శక్తి, ఒక్కటే ప్రకృతి, ఒకటే ఆట-వేరువేరు జగత్తులులేవు—వేరువేరు శక్తులులేవు.

మనము అంతను ఒక్కమారుగ చూడలేక, ఒక్కొక్క భంగిమాన్ని ప్రత్యేకంగా జూచి, జగత్తుకు నానాత్వం ఆరోపిస్తున్నాము. చేష్టావిలాసాల్లో నానాత్వమున్నమాట నిశ్చయమే. ఆ నానాత్వం ఏకత్వంయొక్క భిన్నశయ్యాలు, భిన్న రేఖలు, భిన్న వర్ణములు. నీవు ధరించిన దేహమైనా అదే, నీలో ఉబుకుతున్న ప్రాణమైనా అదే. నీలో పరుగులుతీస్తున్న మనస్సయినా అదే.

ఈ మూడూ ఒక్కటి కనుకనే, ఒక క్రీడలో ఐక్యంగా పాల్గొని, సృష్టిక్రమాన్ని యథాతథంగా నడుపుతున్నాయి.

నీ మనస్సు చూచుకో. ఈ భౌతిక జగత్తు మానసవిలాసం కాకపోతే, నీవు దానిని ఎట్లా అర్థం చేసుకోగల్గుతున్నావు?

నీకు భౌతికవిజ్ఞానం కలుగుతున్నదంటే, నీ మనస్సు విశ్వమానసంలోకి తొంగి చూస్తున్నదన్నమాట. లేకపోతే అది విజ్ఞానమే కాదు. అట్లాగే సచేతన ప్రపంచాన్ని పరిశీలించి, జీవశాస్త్రం రచిస్తున్నావంటే, ఏ క్రమం, ఏ విలసనం, ఏ సౌందర్యం నీలో ఉన్నదో, దాని ప్రకాశమే ప్రాణక్రీడలో నీకు గోచరిస్తున్నదన్నమాట. సమస్తజ్ఞానం ఆత్మజ్ఞానం. నీవు కాని దానిని నీవు తెలుసుకోలేవు. పదార్థవిజ్ఞానం, జీవశాస్త్రం, మానసికశాస్త్రం—సర్వం నిన్ను నీవు తెలుసుకోవడం.

జగత్తు—దేహంగాగాని, ప్రాణంగాగాని. మనస్సుగాగాని-నీవెట్లా అనువర్తిస్తున్నా, అది నీ ప్రతిబింబము నీ ప్రభాపటలి, నీ ఆత్మ విలసనము. నీ ఆత్మ సర్వగతము—సర్వాణి భూతాని ఆత్మైవాభూత్ అని ఋషులు చాటటం లేదూ?

సోదరా, వేదాంతులు తత్త్వబోధకోసం పారిభాషిక పదాలను కల్పిస్తే, అవే మన చిత్తవిభ్రమణానికి కారణభూతములై వాద ప్రతివాదాల్లోకి దింపుతున్నాయి.పరమతత్త్వాన్ని ప్రకృతి పురుషులనుగ నిరూపించడంవల్ల వానికి భేదం కల్పించుకొని, మూలంలో రెండుఉన్నట్లు ఎందరు భ్రమించడంలేదు ?

"ఏక మిదమగ్ర ఆసీత్, నాన్యత్ కించిదస్తి" మూల తత్త్వం ఒకటే, ఇంకొకటిలేదు అని వేదం ఘోషిస్తూంటే, వీరికి రెండెట్లా వచ్చాయండీ? ఉన్నది ఒక్కటే అయినప్పుడు ప్రకృతి అన్నా పురుషుడన్నా అదే కావద్దూ ?

అయితే ఎందుకు రెండు పదాలు పుట్టాయంటావా? మూలపదార్థాన్ని రెండు దిక్కులనుండి చూడవచ్చు - ఒకటి, సృష్టిద్వారా చూస్తే ప్రకృతి, సృష్టికి అతీతంగా చూస్తే పురుషుడు ఏ దిక్కునుండి చూచినా మూలం ఒక్కటే.

పురుషుడు కానిదేమున్నది? అన్నమయ పురుషుడు, ప్రాణమయ పురుషుడు, మనోమయ పురుషుడు, విజ్ఞానమయ పురుషుడు, ఆనందమయ పురుషుడు అంటూ సర్వాన్ని పురుషమయంగా భావించలేదు ఉపనిషత్తులు ?

గీతాకారుడు మాత్ర మేమన్నాడు ?—దేహప్రాణ మనములను క్షరపురుషుడుగను, సచ్చిదానందాన్ని అక్షరపురుషుడుగను భావించాడే. ప్రకృతి పురుషుల కభేదం అని తెలపడానికి సచ్చిదానందాన్ని పరాప్రకృతి అన్నాడీ గీతాకారుడే. సృష్టిలోది అపరాప్రకృతి అయితే, పురుషునిది పరాప్రకృతి అయింది.

నీరు కరగి ప్రవహించవచ్చు. లేక గడ్డకట్టుకొని నిలచిపోవచ్చు. ఏ అవస్థలోనున్నా అది నీరే ! అట్లాగే మూలతత్త్వం విక్షేపమైతే క్షరమైంది. సంక్షేపమైతే అక్షరమైంది. ఒకటి dynamic రెండవది Static అన్నారు పాశ్చాత్య వైజ్ఞానికులు. దీనినే మనపూర్వులు చిచ్ఛక్తి అని, చిద్ఘనమని నిరూపించారు.

ఇక ఎందుకండీ ఈ కుతర్కాలు—ప్రకృతి పురుషులు రెండా, ఒకటా, అని? ఈ సంఖ్యావాచకంతో మూలతత్త్వాన్ని నిర్వచించడం యుక్తంకాదు. అద్వయమంటే గణితంలోని మొదటిసంఖ్య అని తలంచకుము. అన్నిసంఖ్యల నిముడ్చుకొన్న సాంఖ్యమది. దానిని మినహాయిస్తే, ఇక మిగిలేదేమీలేదు,

మూలతత్త్వం క్షరమే అన్నావా, అది కదలికకు లోబడ్డదన్నమాట. అక్షరమన్నావా,అది కదలలేని స్థాణువన్నమాట. రెండూ బద్ధావస్థలే—కాబట్టే నేను క్షరపురుషుడనూ కాను, అక్షర పురుషుడనూ కాను, రెంటిని అంతర్భుక్తంచేసుకొన్న పురుషోత్తముడిని అన్నాడు శ్రీకృష్ణభగవానుడు.

# అనుష్ఠానం

సోదరా, నీ జీవితము సత్యశివసుందరముల ఐక్యత, భక్తిజ్ఞాన కర్మలనే త్రివేణికి సంగమము.

వీనిలో ఏది కొరవడ్డా, నీ జీవితము సమగ్రముకాదు. పైగా సమరసస్థితి ఏర్పడని కారణమున అయ్యది వక్రగతులు త్రొక్కును. నీకు కావలసినది మతాలకు సంబంధించిన శుష్క వాదాలు కావు. అవి నిన్ను మెట్టవేదాంతాలలో కీడ్చుకొని పోయి, నీ జీవితమును వ్యర్థపరచును.

మతకర్తలు తత్వనిరూపణ విషయములో కొన్ని వాదాలను లేవదీసినమాట నిజము. కాని వారే తమ వాదాలకంటె మతానుష్ఠానానికే ఎక్కువ ప్రాముఖ్యము నొసగిరి.

గౌతమబుద్ధుని చూడుడు. ఆయన పారమార్థికసత్తాను కూడ అసత్యమన్నాడనే కారణమున, వానిని శూన్యవాది అని అధిక్షేపిస్తున్నాము. బుద్ధుడు నిరీశ్వరవాదియే అగుగాక ! కాని ఆయన లోకమున కరుణారససముద్రుడై వెలసి,అహింసా ధర్మసంస్థాపనాచార్యుడయ్యెను. ఎట్టి దివ్యజ్యోతి !

అట్లే శ్రీ శంకరుడు మిథ్యావాది అగునా కాదా యని తలపట్లు పట్టుకొంటున్నాము. కాని శంకరుడు తన జ్ఞానాన్నంతా బ్రహ్మసత్యమనే సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించుటకు ధారపోశాడు.

బ్రహ్మతత్వ ప్రతిపాదనకు భాష్యత్రయము రచించినాడు. రసపిపాసువులకు భక్తిరస భరితములైన అష్టస్తవములను వ్రాసినాడు. సాధకులను ముముక్షువులనుగ నొనర్చుటకు సౌందర్యలహరిని రచించి, అందు యోగరహస్యము నుద్ఘాటించినాడు.

శంకరుడు జగత్తు మాయ యని చెప్పి, లోకమును విడనాడలేదు. లోక సంగ్రహార్థము దేశ సంచారముచేసి, తన స్వల్ప జీవితములోనే అపూర్వమైన సంఘటనాపటిమను ప్రదర్శించినాడు.

మన ఋషులో ? వాదజాలములో జిక్కుకొనిరా ? లేదు. లోక కల్యాణమే వారి పరమ లక్ష్యము.

వాల్మీకి శ్రీరామచంద్రుని కల్యాణ గుణాభివర్ణనము పేరట, మానవునిలో నిహితములై యున్న శాంతి దాస్య సఖ్యవాత్సల్య మధుర భావములను అపూర్వరీతిని చిత్రించినాడు.

వ్యాసుడు శ్రీమద్భాగవతమున భగవత్తత్వమును వ్యక్తీకరిస్తూ, మధురభావమునుగూడ నందుకొనలేని మహాభావసంధాయకమైన బృందావనలీలామృతమును విరజిమ్మెను.

మరికొందరు మానవజీవితమును రమ్యోద్యానముగ మార్చుటకు చతుష్షష్టి కళలను పుష్పింపజేసినారు.

ఇంకా కొందరు మమతాగంధవర్జితులయ్యు రాజులకు సహితము పురోహితులై రాజ్యాల నేలినారు.

ఈ ఋషి సంప్రదాయాన్ని చూస్తే, వారు మానవ జీవన ప్రకరణముల నన్నిటిని సమదృష్టితో తిలకించి, వానిరస పోషణకు తోడ్పడినట్లు నీకు గోచరించగలదు.

సోదరా, నీవును వినమ్రుడవై వారి అడుగుజాడలను నడచి, నీ జీవితమును సమగ్రమును సంపూర్ణమును ఒనర్చు కొనుము.

# ఆత్మ పరీక్ష

సోదరా, పరమతత్వం అనిర్వాచ్యం, అనిర్దేశ్యం అతర్క్యం - నవిద్మో ! నవిజానీమో—అంటూ మనఋషులు ఉద్ఘోషిస్తూంటే, నీ వెందుకు వివాదాలలో చిక్కుకొని, అహమహమికను అసహనాన్ని పెంచుకొంటావు ? మనబుద్ధి మనలను కొంతవరకే తీసుకుపోతుంది. పరమతత్వాన్ని సమగ్రంగా చూడలేక, దానిని అంశఅంశగా విడదీసి విమర్శించుకొంటుంది.

కొందరొక అంశానికి ప్రాముఖ్యమిస్తే, మరికొంద రింకో అంశానికి ప్రాముఖ్యమిస్తారు వారివారి బుద్ధిసూక్ష్మతనుబట్టి. కాని ఏ అంశము పరిపూర్ణముకాదు. పూర్ణాన్ని అవగాహనం చేసుకొనే శక్తి బుద్ధీంద్రియానికి లేదు.

ఈ సందర్భాన్ని తెలుసుకొనిఉంటే, మతాలమధ్య వైరం, అసహనం పెరగదు. అన్నినదులు సముద్రంలో కలియునట్లు, అన్నిమతాలు తుదకు పరమతత్వానికే చేరుస్తాయని మన పెద్దలు చెప్పలేదా ? సిద్ధాంతభాగంలో చూపే చొరవను ఆసక్తిని ఆచరణకాండలో చూపగలిగితే, నీకు వినమ్రత వెంటనే అలవడి, చిత్తసంస్కారం కలుగుతుంది.

ఏ మతం శమదమాదులను, వివేకాన్ని, భూతదయను, లోకమైత్రిని బోధించలేదు ? ఈ బోధలో సహస్రాంశమైనా

మనం అనుష్ఠించగలిగితే, మనజీవితం ఇంత దుఃఖభూయిష్ఠమగు తుందా? మానవలోకం ఇంత రక్తప్లావితమగుతుందా?

సత్యదయాశౌచాలను పెంచలేని పాండిత్యాలు, తర్కాలు, సిద్ధాంతాలు దేనికి సోదరా? నీ బుద్ధి వెలుగు అతి సూక్ష్మమైనది. నీ మార్గాన్నంతా ప్రకాశవంతం చేయలేదు. నీ వొక అడుగు ముందు వేసినకొద్దీ, నీ పథమింకో అడుగు వెలుగగుతుంది.

ఈ వెలుగు నీలోనిది కాని బయటిదికాదు. నీచదువులు, నీ వాక్యార్థాలు ఇచ్చే వెలుగు కాదది. నీ వెన్ని గ్రంథాలను పారాయణం చేసినా, నీ వెన్ని మహోపదేశాలు విన్నా— అవన్నీ మరుసటి క్షణంలో గాలి కెగిరిపోతాయి.

ఒక కష్టాన్ని ఎదుర్కోలేవు. ఏ విషయంలోను నిగ్రహం చూపలేవు. నీలో బయలుదేరే తాపం వెలుగులేని వేడిమి— కంటికి మంటపెట్టే చీకటిపొగ.

సోదరా, నీ సిద్ధాంతాల నొకమారు కట్టిపెట్టి ఆత్మ పరీక్ష చేసుకో - పండితుడవని అనుకోక. నీవు సాధకుడవని నిరంతరం జ్ఞప్తియందుంచుకో. నీ వెంత వినమ్రుడవైతే, దైవానుగ్రహం కూడ నీ కంత అనుకూలిస్తుంది. నీవు నిన్ను ఖాళీచేసుకొంటేనే, దైవం నీ దరిజేరి నిన్ను నడుపుతుంది. దైవాన్ని నీ మతపాశాలతో బంధించడానికి చూడక. లోకాతీతుని నీవు ఖైదీగ చేసుకొంటావా? ఈ అహమే నిన్ను సత్యదూరునిగ జేస్తున్నది. "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" ఎట్టి ఆదేశమిది!

# తత్త్వజ్ఞానం

సోదరా, వేదాంతచతుర సంభాషణలను కొంతకాలం కట్టిపెట్ట మని అడగడంవల్ల, నీకేదో చిత్తసంక్షోభం కలిగినట్లు కన బడుతున్నావు. ఎందుకీ సంక్షోభం? వేదాంతగోష్ఠి నీకొక వ్యసనమై పోయింది, అది లేకపోతే, నీకేమీ తోచక, దిక్కులు శూన్యములైనట్లు భావించుకొంటున్నావు.

ఆ దోషం వేదాంతంలో లేదు-నీలో ఉన్నది. అది నీకు నిజంగా చిత్తసంస్కారం కలిగిస్తూ, నీ ఆత్మోన్నతికి సాధన భూతమగుతూంటే, దానిని వదిలిపెట్టమంటానా ?

వేదాంతం నీకు కేవలం బుద్ధితో సాముచేయడంలోకి దిగింది. యుక్తిచమత్కృతి నిన్ను శబ్దజాలంలో బడవేసి, మరు భూముల్లోకి ఈడ్చుకుపోతోంది బుద్ధిబలాన్ని జూచుకొనే మురిసిపోతున్నావు. పండితుడనై పోతున్నానని గర్విస్తున్నావు.

జ్ఞానమంటే కేవలం బుద్ధిబలంచేత సిద్ధించేదికాదు. జ్ఞానం ఒక దివ్యజ్యోతి - ఆత్మయొక్క ప్రకాశం - నీ అంతరంగాన్ని బహిరంగాన్ని అంతా తేజోవంతంగా చేస్తుంది.

జ్ఞాని చూపే వేరు. మనం స్థూలంగా పైపైమెరుపులనే చూచి భ్రమిస్తూ వుంటాము. కాని జ్ఞాని అట్లా కాదు. ప్రతి భూతంలోని అంతరంలో జొరి దాని సుస్వరూపాన్ని తెలుసు

కొంటాడు. మనం నాలుగు వేదాంతపు ముక్కలను నోటబట్టు కొని ఇది నామమని రూపమని, వీనికి నిత్యత్వం లేదని, అనాత్మ అని నిరాకరిస్తాము. జ్ఞానిచూపులో సమస్తం చిన్మయం, ఆత్మవస్తువుతప్ప అన్యమేమీ లేదు. నిర్మల స్ఫటికము నుండి వెలువడే భిన్నవర్ణములవలె నామరూపములన్నియు చిన్మయములే - స్వర్ణకాంతులే.

నామరూపాలు మనదృష్టికి చీకటిగుళికలు-కాని జ్ఞాని చూపు కవి దివ్యలోకాలను చూపు గవాక్షములు, స్వర్గవీథుల్లో ఊరేగించే దేవతల వాహనాలు.

నీ వేదాంతగోష్ఠివల్ల, అన్నివేళల కాకపోయినా, ఏ శుభోదయ వేళలోనైనా మెరుపుతీగ భాసించినట్లయినా, ఆ జ్ఞానం నీ కంటిలో ఆడుతుందా? నీలో భక్తి ప్రేమలుండవచ్చు కాని అవికూడా తేజోవంతములై, "రసోవైసః" అనే మహా వాక్యం అనుభూతమగుతున్నదా? నీ ఇంద్రియములకు మంచి పటుత్వముండవచ్చు. వానికి పరిశీలనాశక్తి అలవడి యుండ వచ్చు. కాని అవి అతీంద్రియ జగత్తును చూపించలేకపోతే ఏమి లాభం! నీ ఇంద్రియములు అతీంద్రియ జగత్తు బయటలేవు. నీ కంటివెనుకాల ఒక కన్ను ఉన్నది. నీ చెవి వెనుకాల ఒక చెవి వున్నది. నీ చర్మచక్షువు నీ కర్ణము ఆ లో కంటిని ఆ లో చెవిని, ఉన్మీలితం చేయడానికే ఏర్పడ్డాయి. నాదోపాసన ఆ లోచెవిని తెరిపిస్తుంది. రూపోపాసన ఆ లోకంటిని విప్పు తుంది. ఇంద్రియాతీంద్రియముల నొక అమృతవాహినిలో గరగించివేసేదే నిజమైన జ్ఞానం.

వులతో సంబంధం పెట్టుకొంటుంది. దానిచుట్టూ తిరుగుతూ అన్నివైపులనుండి చూస్తుంది. పంచేంద్రియాలతోనూ,అంతేనా? వానిద్వారాలు తెరచి, అంతరంగంలోకిగూడా ప్రవేశిస్తుంది. వానిని సంబోధించి, సహవాసం చేస్తుంది. నేస్తంచేసి, వాని రహస్యాల నన్నిటిని కనుగొంటుంది. నీ హృదయాన్ని, వాని కందిచ్చి, వాని హృదయాన్ని అందిపుచ్చుకొంటుంది. మధుపం పుష్పగర్భంలో ప్రవేశించి, వాని మకరందం గ్రోలేటట్టు, నీ చిత్తంకూడా వానిలోని మధువును గ్రోలుతుంది. ఎంత ఆశ్చర్యం !

నీ చిత్తంలో ఎట్టి రంజనీవృత్తి ఉన్నదో చూచావు ? ఆ రంజనీవృత్తే నిన్ను భోక్తగను, నీచుట్టూనున్న వస్తువులను భోగ్యాలుగను జేయగలుగుతున్నది. అవి నిన్నాకర్షిస్తాయి. నీవు వాని నాకర్షిస్తావు. అంటే ఉభయులమధ్య ఆదాన ప్రదాన లీల జరుగుతోందన్నమాట. పంచేంద్రియాలతో వాని ననుభవిస్తావు. నీ మనస్సుతో, నీ బుద్ధితో, నీ హృదయంతో, నీ చిత్తంతో క్రీడిస్తావు. నీవు ప్రేమికుడవు. నీ చుట్టూ ఉండే భూతకోటిఅంతా నీ ప్రేమకు ఆలంబనాలు. ఎంత అదృష్ట వంతుడవోయి సోదరా ?

నీకీ ఆలంబనాలే లేకపోతే, నీ ప్రేమపిపాస ఏమి అయి పోయేది ? ఎడారిలోబడ్డ పిపాసార్తునివలె విలపిస్తూ ఉండే వాడవు. తీగెకు ననలువేయడంతోనే, అదేమి చేస్తుంది ?